ఆచార్య బి. రామరాజు,
ఎం. ఏ, పిహెచ్. డి,
ఆంధ్రశాఖాధ్యక్షులు :
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు - 500 007.

# మంగళాశంసనం

పసిపాపల స్పర్శతో కలిగే ఆనందాన్ని "ధన్యాస్తదంగ రజసా మలినీ భవన్తి" అని మహాకవి కాళిదాసు చమత్కారంగా చెప్పినాడు. పాపల స్పర్శయే యింత ఆహ్లాదకరమైతే వాళ్ళ లొక్కు పలుకులు, వాళ్ళ భాష, వాళ్ళ మాటలు, వాళ్ళ పాటలు, వాళ్ళ భావాలు, వాళ్ళ ఊహలు, వాళ్ళ మనసులు స్పందించే తీరులు ఇంకెంత ఆనందప్రదంగా ఉంటాయో వేరే చెప్పనక్కరలేదు. మనకు స్వాతంత్ర్యం వచ్చి ఇంత కాలమైనా మన బాల బాలికల మాటలు ఇంకా పరిపూర్ణంగా రాశికీ, రంగానికీ రాలేదు. మన పిల్లల శారీరకారోగ్యంతోపాటు మానసికారోగ్యం గురించి కూడా మనం తగిన శ్రద్ధాసక్తులు కనబరచడంలేదు. సహజము, పుష్టికరము, సులభంగా జీర్ణమయ్యే ఆహారం పిల్లలకు అందీయలేక పోయినట్లే, వాళ్ళ మనసులు ఎదిగే సాహిత్యం కూడా అందీయలేక పోతున్నాము. రాజకీయ రంగంలో వలెనే బాలసాహిత్య రంగంలో కూడా అధికారం చాలని వాళ్ళు స్వైర విహారం చేస్తున్నారు. ఫలితంగా వడ్లు పెరుగు పిసికినట్లు కృత్రిమం అనారోగ్యకరం అయిన సాహిత్యం పిల్లలకు అందుతున్నది. అందుకే పిల్లలకు అజీర్ణ వ్యాధులెక్కువ. ఈ వ్యవసాయంలో ఆత్మవంచన పరప్రతారణ పూటిగా పండిస్తున్నాము. మనకు తెలియకుండా మనపిల్లలకు మనమే అపకారం చేసుకొంటున్నాము. కల్తీసరుకులు పేరంటసేవాళ్లు తమలాభమే చూసుకుంటారు కాని తమ బిడ్డలు కూడ ఆ పదార్థాలే తిని చెడిపోతారని గ్రహించరు. మన కర్మ ఫలమే మనం అనుభవిస్తాము.

మన సాహిత్యంలోని తదితర ప్రక్రియల గురించి అంతో ఇంతో చెప్పుకో దగిన పరిశ్రమ పరిశోధన జరిగినవి కాని బాలసాహిత్యం గురించి మాత్రం చాలా తక్కువ పరిశ్రమ అంతకంటె మరీతక్కువ పరిశోధనలు జరిగినవి. ఈ రంగంలో బహుశః డా॥ దేవకిగారిదే మొదటి సిద్ధాంత గ్రంధం అనుకుంటాను. దేవకిగారి థీసిస్ ప్రథమం కావటమే గాక వాసిలోను వన్నెలోను ప్రథమశ్రేణికి చెందినది కావటం సంతోషించదగిన విషయం. ఈ గ్రంథంలోని వివిధ ప్రకరణాల్లో బాల సాహిత్య స్వరూప స్వభావాలు, దాని పరిణామ వికాసాలు, జానపద బాలగేయ సాహిత్యం, ఆధునిక బాలగేయ సాహిత్యం, బాల గేయాల్లోని భాషా ఛందోలంకార విశేషాలు, సంతృప్తికరంగా చక్కగా పరిష్కరించి, వివరించి రచయిత్రి తన పరిశోధనపు విలువను సంతరించుకున్నది. సేకరించిన వస్తువు, దాని అవగాహన, వింగడింపు, విశ్లేషణం, సమన్వయం, వివేచనం, వివరణం అన్నీ క్రమపద్ధతిలో సాగినవి. సిద్ధాంత గ్రంథాలలో పరిశ్రమ పరిశోధన పుష్కలంగా ఉన్నా ప్రవచించే పద్ధతి ఆకర్షకంగా లేకపోతే పాఠకులు ఆదరించరు. ఈ గ్రంథం దానికి అపవాదం ఇందులో విషయ వివేచనంతోపాటు ప్రపంచనం కూడ బాగున్నది. బాలసాహిత్యం వలెనే రచయిత్రి భాషాశైలి, రచనావిధానం లలితంగాను, సుందరంగాను ఉన్నవి. పాఠకులను ఆకట్టుకునే విధంగా కూడ తన సిద్ధాంత గ్రంథాన్ని రచించినందుకు డాక్టర్ దేవకిని అభినందిస్తున్నాను. మునుముందు చి॥ దేవకి ఈ రంగంలోనే ఇతోధికంగా పరిశ్రమించ వలెనని కోరుతున్నాను పరాత్పరుడు రచయిత్రికి తగిన అవకాశములు ప్రసాదించవలెనని ప్రార్థిస్తున్నాను.

పుట్టపర్తి
గురు పూర్ణిమ 24-7-1983

బి. రామరాజు.

ఆచార్య జి. యస్. రెడ్డి,
ఎం ఏ, పిహెచ్ డి,
ఆంధ్రశాఖాధ్యక్షులు :
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి - 517 50'.

# శుభాశీస్సులు

రెండు మూడు దశాబ్దాలుగా మన విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన బాగా పుంజుకుంది పరిశోధక విద్యార్థులకు అపూర్వమైన అంశాల మీద దృష్టి ఏర్పడుతూ వుంది. పరిశోధక పర్యవేక్షకులు కూడా తమ తమ అభిరుచుల్ని అభినివేశాల్ని బట్టి జిజ్ఞాసువులైన విద్యార్థుల్ని నూతన విషయాల మీద పరిశోధనకు ప్రోత్సహిస్తున్నారు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయన శాఖలో అపూర్వ మనదగిన అనేకాంశాలమీద సామాజిక ప్రయోజనాలున్న విషయాల మీద పరిశోధనకు ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది సాహిత్య రంగంలోను, విద్యా రంగంలోను బాలసాహిత్యాన్ని సీరియస్‌గా తీసుకోని దశలోనే తెలుగు బాలసాహిత్య పరిశోధన ప్రాధాన్యాన్ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం గుర్తించింది. బాల సాహిత్యం గూడా విస్తృతమై వైవిధ్యమున్న సాహిత్యమె అందులో ఒక శాఖ అయిన తెలుగు బాలగేయ సాహిత్యాన్ని పరిశోధనాంశంగా గ్రహించి, ఉత్తమ సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించి 1979 లోనే డాక్టరేట్ డిగ్రీపొందిన కుమారి దేవకి అభినందనీయురాలు. ఇప్పుడు తన సిద్దాంత వ్యాసాన్ని ప్రకటించడం గూడా ముదావహం.

తెలుగునాట బాలల పత్రికలు ప్రచారంలో చాలా వున్నాయి మన దేశంలో బహు భాషల్లో వెలువడే చందమామ పత్రికా స్థాపకులు, నిర్వాహకులు తెలుగువారే

కావడం కూడా గర్వించదగ్గ విషయం ప్రభుత్వ పోషణలో ఒక బాలల అకాడమీకి అస్తిత్వం గలగడం కూడా తెలుగువారి ప్రత్యేకతే బాల వాఙ్మయ వికాశానికి, పరిశోధనకు సాహిత్య అకాడమీ కూడా తగిన దోహదం చేస్తున్నది. ఇవన్నీ తెలుగులో బాల వాఙ్మయ బహుముఖ వికాసానికీ శుభసూచకాలు.

బాల వాఙ్మయ పరిశోధనలో డా॥ దేవకి రచన తొలి గ్రంథం కాబట్టి కొంత వరకు స్థూల దృష్టితోనే ఈ రచన సాగింది అయినా విషయ విశ్లేషణలో, వర్గీకరణలో బాలగేయ స్వరూప తత్వ ప్రదర్శనలో అనేకాంశాలను ఈ రచయిత్రి అపూర్వంగా చర్చించడం ప్రశంసనీయం. పైగా తెలుగు బాల వాఙ్మయ భావి పరిశోధనకు ఇది మార్గదర్శకంగా కూడా ఉండడం ఎన్నదగ్గ విశేషం.

బాల వాఙ్మయ రచయితల కుండవలసిన ప్రతిభా వ్యుత్పత్తులు ఇతర సాహిత్య స్రష్టల కన్న భిన్నమైనవి బాలల మాట, మనసు, ఊహ, కల్పనాశక్తి, భావన, వయో భేద నిర్ణీతమైన అవగాహన మొదలైన వాటి ప్రత్యేక పరిజ్ఞానం బాల వాఙ్మయ రచయితల కుంచే తప్ప వారి రచనలు ప్రయోజనాత్మకాలు కావు. జానపదుల బాలగేయాల్లోను, శిష్టులు రచించిన ఆధునిక బాలగేయాల్లోను బహుళ ప్రచారం పొందిన వాటిని పరిశీలిస్తే బాలగేయ తత్వం బోధపడుతుంది ఇట్టి దృష్టితో బాల వాఙ్మయ పరిశోధన తెలుగులో ఇంకా ప్రారంభం కావలసి ఉంది అట్టి పరిశోధన కూడా డా॥ దేవకి నిర్వహించాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

తిరుపతి. **జి. యస్. రెడ్డి.**
10-8-83

**ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు,**
ఎం. ఎ, పిహెచ్. డి,

ఆంధ్ర భారతి అధ్యక్షులు :
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము,
శ్రీ వేంకటేశ్వరపురం (P.O.)
అనంతపురం - 515 003

# దాయి దాయి చందమామ

మనిషి శిలాయుగం నాటికే జగన్మాతృరూపం శిల్పించి అర్చించటం నేర్చుకున్నాడు. దాన్ని వీనస్‌గా కళా విమర్శకులు పేర్కొన్నారు. ఆ శిల్పం విశాలోదరం కలది అది గర్భ ఫల (fertility) ప్రతీక.

క్రీ. పూ. 2, 3, శతాబ్దాల్లో భారతీయుడు అదే బొమ్మను శిల్పించాడు. క్రీ. పూ 4 వ శతకంలో ప్రాక్సిటెలెస్ - అన్న గ్రీకు మహా శిల్పి **Hernes with Infront Dionysis** అన్న బొమ్మ చెక్కాడు.

క్రీ. పూ 1, 2, శతాబ్దులనాడు శాతవాహనశిల్పి సాంచీ తోరణంమీద ఒక అందమైన శిలా ఫలకాన్ని మలిచాడు. తల్లి చంకనెత్తుకున్న పిల్లవాడితో తండ్రి పంచె చెంగును పట్టుకున్న పిల్లవాడితో దూరానవున్న ముని సాన్నిధ్యానికి పోతున్నట్లున్న కుటుంబ జీవిత చిత్రణ చేశాడు.

ఆదికావ్యం బాలకాండతో - పుత్రకామేష్టితో ప్రారంభమౌతున్నది పుత్ర వాంఛ మానవానుభవ పరమార్థం. తనను తాను విస్తరించుకోవటం పుత్రకామేష్టి. పుత్రుడు అవతరించడంతో జీవితానికి నిండుదనం వస్తున్నది కుటుంబ మేర్పడుతున్నది. ఇది లేకుండా జీవితం - నాగరికతా లేదు ఇందుకే సృష్టికి కుమారసర్గమని పేరు.

పురుషుడు (ఆత్మ) అంగుష్ఠమాత్రుడన్న సూక్తికి వ్యాఖ్యానమే. The Self must become the 'Thumbling in the heart' — The thumbling in the heart is an illusion of the Child like nature of divinity.

(The Myth of Meaning—P 81)

'The Self as the essence of individuality is Unitemporal, and unique as an archetypal Symbol — it is a God - image and therefore Universal and eternal "

(The development of personality - Jung )

ఈ మనస్తత్వ శాస్త్రోక్తి

ఇదే మత దృష్ట్యా వటపత్రశాయి, బాల కృష్ణుడు

ఇక్కడకు వచ్చేటప్పటికి బాలసాహిత్యం గేయమైంది-

చిత్రలేఖనం ద్వారా - శిల్పం ద్వారా - సాహిత్యం ద్వారా-

రాజస్థాన్ చిత్రకళలో బాలకృష్ణుని లీలలు - భాగవతంలో బాలకృష్ణుని లీలలు- అది ఆధారంగా వచ్చిన శ్రీకృష్ణ లీలాతరంగిణి - కళాసాహిత్య సౌందర్యాస్వాదనప పరమార్థాలైనాయి

దేవాలయాల్లో సోమస్కంద శివమూర్తి విగ్రహం విశ్వకుటుంబ ప్రతీక.

ఈ తాత్త్విక పరమార్థ భూతుడు బాలుడు

దీని నాశ్రయించి పుట్టిన రసమె వత్సలరసం

దీనికి తాత్త్విక కథనమె కఠోపనిషత్తు చెప్పిన ఈ మాట

"అతడు తపస్సు కంటె - ఆపస్సుల కంటె పూర్వమె జన్మించి
గుహను ప్రవేశమంది సుస్థితుడై భూతాల ద్వారా చూచాడు "

"దేవతామయి అదితి ప్రాణాలతో పాటు పుట్టి గుహను ప్రవేశ
మంది సుస్థిరయై భూతాల ద్వారా జన్మించింది."

"గర్భిణులచే చక్కగా ధరింపబడే గర్భంలాగా-అరణుల్లో గుప్తంగావున్న జాత వేదుడు-అగ్ని ప్రతిదినం-జాగ్రుతులైన హవిష్మంతులచె స్తుత్యుడవుతున్నాడు." (కఠ. 2-1-6, 7, 8) తండ్రీ-తల్లీ-కొడుకు - ఈ కుటుంబం పేద సృష్టి ఈ అగ్నే బాలగేయాల్లో చందమామ-బాలప్రతీక-ఆనందరాశి-తేజః పుంజం.

ఇది ప్రతి వ్యక్తిలో-పెద్దవారో - కూడా-సుప్తంగా ఉన్న హృదయం ఇందుకే శిశువు ఆనంద-ఆస్వాద-మూర్తి అవుతున్నాడు ఆశైశవమూర్తి జీవితమన్న కాలానికి ఉషస్సంధ్య దీన్ని స్మరించుకోవటమే-గతబాల్యాన్ని స్మృతికి తెచ్చుకోవటమే జన్మదినోత్సవం

అందుకని బాలసాహిత్యం విస్మృతి కాని నిత్య సాహిత్యం ప్రతి సంఘంలో బాలుడికి స్థానమున్నది. ఆటలు పండుగలు ఇవి ఆనంద స్థానాలు కావటం వల్ల బాల క్రీడలు - బాల పర్వదినాలు వచ్చాయి. వినాయక చవితి-అట్లతద్దె-ఉండ్రాళ్ళ తద్దె - బతకమ్మ - పండగ వంటి వుదాహరణలు. పండగ అంటేనే క్రీడ క్రీడ అంటే దుఃఖ స్పర్శలేని నాట్యం - కళ.

కుమారి డా॥ దేవకి మా ఆంధ్ర భారతిలో బాల భారతి. లేక బాల సాహితీ భారతి. ఆమె పిహెచ్ డి పట్టం కోసం పడ్డ శ్రమ ఫలితం ప్రస్తుత గ్రంథం

ఇదొక బాల ప్రపంచం ఆ ప్రపంచాని కొక జావిలి పీటర్ బ్రగెల్ (1525-30) అని డచ్ చిత్రకారు డొక డున్నాడు ఆయన 'బాలక్రీడలు' అన్న బొమ్మ వకటి చిత్రించాడు అందులో చేసిన చమత్కారమేమంటే-అన్ని దేశీయాలైన ఆటల్ని - అన్ని కాలాల్లో ఆడే ఆటల్ని - దాదాపు 80 పైగా చిత్రించటం. ఆ బొమ్మ నాయన ఎందుకు గీసి వుంటాడు? - అన్నదొక పెద్దప్రశ్న విమర్శకులకు రాగా - కొందరన్నారు - బాల క్రీడా చిత్ర నిఘంటువు నిర్మించటం కోసమేనని- పెద్దల వ్యర్థ ప్రయత్నాలను - జీవితంలో ఏదో బావు - కొందామని ఏమేమో చేస్తూ జీవితాన్ని దుఃఖ భాజనం చేసుకొనే తెలివిగల జంతువుల్ని ఎగతాళి చేయటం కోసమని - ఇదంతా ఏమీలేదు ఊరికే గీసాడనీ-అన్నారు కాని అతనిలో వున్న బాలుడు స్వ-వినోదార్థం నిర్మించుకొన్న కళా వస్తువదని భావించుకోవచ్చు బహుశా అతడు పెద్దవాడైనాక - (ఆ బొమ్మ 1530 లో పుట్టింది అంటే అప్పటి కతని వయస్సు 30 లేక 35 ఏళ్ళు) పోయిన ఆనందాన్ని స్మరించుకోవటంగా చిత్రించి వుండవచ్చు ఇక్కడ కళాకారుడు మానవ జీవిత ప్రతిబింబమని విస్మరించరాదు

ఆ బొమ్మలాంటిదీ గ్రంథం. అంతా బాలల గోల. ఆ గోల అవ్యక్త మధురమైన పికకూజితం వసంత మాధుర్యం. శరత్తు వెన్నెల వేసవిలో పల్లెల్లో వెన్నెల్లో దాగుడు మూతలు-కోతి కొమ్మచ్చి - చెరపట్టీలు- (చూరపట్టీలేమో) ఆటల్లాంటి గోల.

యే గోలకోసం ఆధునిక కళాకారుడు తపించి-తన మనసంతా బాల్యావస్థకు తీసుకొని పోయి-తాను మనసా శిశువై అభిమనస్తత్వ కళను సృష్టించాడో అలాంటి బాగల్ - పాల్‌క్లీ - ల చిత్రాలవంటి శైశవ - అమాయక మాధుర్యం

"The concern of our age with deep layers of motivation in human activity has found expression in Art at various levels. Dr. Chirico and most of the Surrealists of the 1920s and '30 s assembled in their pictures strange and disquieting objects of dream like Character - - - klee-was more concerned with a dream like process of creation in which lines forms and colours were allowed to combine into significant images.

Art treasures of the world - P 256.

ఈ క్లీ బొమ్మలన్నీ పిల్లలమీద పిల్లలు - గీసినట్లుంటాయి కాని అవొక చందమామ అందాల్ని అందించేవి. అలాగే బాగల్ బొమ్మలు-కేవలం చంద్రలోకం లాంటివి అందుకే అతని బొమ్మల్లో ఎక్కువ పాళ్ళు - పల్లీ వాతావరణం- ఆవులూ-తల్లీ పిల్లా - దూరాన చంద్రబింబం - ఇదేవస్తువు (అధివాస్తవికతావాదం చిరికో - బాగల్‌తోనే మొదలు).

బాలగేయాల్లో కాళ్ళాగజ్జీ - కంకాళమ్మా వంటి పాటల్లో అర్థాల కోసం వెతకటమున్నా అందనట్లే బాలభాష - భావన - మానవ మనస్తత్వపు పొరల్లో ఏక్కడో వుంది అది చందమామ. దానికోసం దాయి దాయి - అనుకోవటంతో జీవితం ప్రారంభిస్తున్నది అంటే చంక బిడ్డవచ్చాడు వాడికీ లోకం ఒక జంతు వస్తు ప్రదర్శనశాల - ఒక వృక్షలతా వాటిక. ప్రతిదీ వింతే ఇంకా మనస్సు లేదు కనుక - హృదయంతోటే సృష్టి ననుభవిస్తున్నాడు. మనోరహితానుభవాన్ని మానవుడు పారవేసుకున్నది. దానికోసం బాలసాహిత్యావసరమున్నది. దాని కోసం ఆధునిక కళపుట్టింది తర్క - హేతు ప్రధానమైన కాలంలో ఈ కళాకారుడన్న బాలుడు ఇందుకోసం పుట్టాడు. యాంత్రిక జీవిత సికతా సముద్రంలో తీపి నీటి కయ్యలాగా ఇందుకు ఈ గ్రంథం పుట్టింది. అదొక విశ్వజనీన ప్రేరణ దూరాన - మబ్బుల్లో అణగారి పోయిన జాబిల్లిని శుష్క తర్క మనస్కతలో పీయుషధారలు శ్రవింప చేసే చందమామను "దాయి దాయి" అనటం జీవితమంతా తదన్వేషణే, ఆనంద సుధా బిందువు కోసం తపించటమే జీవితం.

ఈ గ్రంథంలో ఉదహరింపబడ్డ మొదటి పాట - లాలనుచు ఊచేరు -గోపాల నిను( జాల - పు 13 ఇది ప్రాచీన సాహిత్యంలో బాలల క్రీడాదులున్న వివరణ లోనిది అసలు బాలగేయ విభజనలో మొదటి పాట.

లాలిజాలోయమ్మ - బాలకృష్ణమ్మ - పుట 86 ఇలా రెండు చోట్లా కృష్ణమ్మ పాటలే రసస్ఫూర్తికి తెలియకుండా - ఒక జాతి ఆత్మ ద్రవ్యమైన కృష్ణమ్మ - సర్వ శైశవ మాధుర్యమూర్తి - అవతరించటంతో బాలసాహిత్య చరితార్థత సిద్ధించినట్లు.

మహాత్ముడైన పెరియాళ్వారు కృష్ణశైశవాన్ని - వత్సల భక్త్యావత్సల రసాన్ని పాకలు కట్టించిన దివ్య ప్రబంధం - అందులో

శ్రీ కృష్ణావతారం - కృష్ణునికి లాలి పాటలు (పద్యాంతంలో 'తాలేలో' అని వస్తుంది) ఆయన స్నానానికి రాకుండా తల్లిని ఏడ్పించటం - తలదువ్వి అలంకరించటం-దృష్టి తీసివేయటం - ఇలా సాగుతుంది అనేక అద్భుత రచన. ఇదంతా యశోదమ్మ నోటిద్వారా కవి చెప్పటం.

ఈ కృష్ణుడే మానవుడు మర్చిపోయిన - వాడి జనన మరణాల కావలా ఈవలా వ్యాపించి వున్న మహా మాధుర్యం. అతడు బాలలకు బాలుడు. వృద్ధులకు వృద్ధుడు - అది శైశవం జన్మతో వచ్చేది - ఇది దివ్యజ్ఞానంతో లభించే ద్వితీయ శైశవం (నచికేతుడు) ఇందుకే అతని స్మరణ లేకుండా శిశుగేయం పుట్టలేదు,

ఇందుకే మనస్తత్వ శాస్త్ర వేత్త యూంగ్ **"Child symbolizes the pre concious and the post conciousness of man. His pre concious essence is the unconcious state of earliest Childhood; his post concious essence is an anticipation by analogy of life after death - - -"** కాబట్టి విష్ణుచిత్తుడు యశోదకావటం కృష్ణ - శిశు - చైతన్యంలో లీనం కావటం అక్కడ వచ్చే వెన్నెల, దుఃఖం కూడా ఆనందమే. ఏచేష్టకూడా జీవిత స్వార్థ స్పర్శ లేనిది విభజనాత్మక మనస్సు లేనిది

దీన్నే ఆధునిక మహాకవి (సమకాలీన ప్రజ్ఞాత్మక ఆలోచనా స్ఫూర్తికి ప్రతినిధి) గుంటూరు శేషేంద్ర శర్మగారన్నారు

"ఎక్కడ శిశువై మానవుడు ఏ రసాయన ద్రవాల తోలు సంచిలో ఉన్నాడో ఏ ఆదిమ ద్రవాల మూల పదార్థమైన ఆనందానికి ఉపనదులో ఆతీరాల్లో ఆడుకుంటూ

అక్కడే నిలిచిపోతా శిథిల నౌకలా అనంతత్వంలో ఆడుకుంటూ—" (2)—మబ్బు లెక్కి ఏడుస్తున్న చంద్రబాలుడు భారీ భూద్వీశ్యాలమీద వెన్నెలకుమ్మరించాడు" (5) (నీరై పారిపోయింది) ఇది కవి శిశువై చేసిన దర్శనం కవిత్వమంటే శైశవ క్రీడ ఇది సంకల్పంతో సిద్ధించేది కనక శిశు దర్శనంలో చంద్రుడే ఉన్నాడు అది వాడికి మాతృముఖ స్థానీయమో, క్షీరభాండమో, వక్షోజ స్థానీయమో లేక తాను వదలి వచ్చిన ఒక ఆనందలోక ప్రతిబింబమో మరి (యువకునకు ప్రియురాలి ముఖ బింబంలాగా – వృద్ధునకు జ్ఞానం ముద్దలాగా)

అందుకని కుమారి దేవకిగారి గ్రంథ ప్రారంభం అలా జరిగింది ఇది ఊహించి చేశారనవచ్చా ! ?

ఈ గ్రంథం వివేచనాత్మక విభాగసూత్రం మీద మొలిచింది 1) బాల్యా వస్థను – ప్రథమదశ – శ్రవ్య సాహిత్యం, ద్వితీయ దశ – దృశ్యసాహిత్యం, తృతీయ దశ – పఠన సాహిత్యం – అని వివరించారు ఇవి పునాదిగా తర్వాత బాలగేయాలను విభజించటం జరిగింది కనక ఆ అవస్థాత్రయం ప్రధానమన్న మాట అది త్రయం ఎందుకని ? ఇదీ పెద్దప్రశ్నే

2 అధ్యాయం – బాలసాహిత్యపరిణామంలో ఘట్టాలు ఇందులోనూ మూడు ఘట్టాలే

3 జానపద సాహిత్య స్వరూపం – ఇందులో బాలగేయాల వర్గీకరణ చాలా వివేచనాత్మకంగా వుంది. ఎందుకంటే శిశువు పుట్టినప్పటి నుండీ పెద్దవాడయ్యేదాకా వున్న గేయ సాహిత్యం విభజించి చూపబడింది కనక ఆటల పాటలూ – పండుగల పాటలూ – ఇందులో బాలబాలికలకు సంబంధించిన సర్వసాహిత్యమూ ఎంగడింప బడ్డది ఇది ఈ గ్రంథానికి తిలకం వంటిది

4. ఆధునిక గేయాల వర్గీకరణ – ఇందులో అంతర్విభాగాలు. దీంతో శిశువు పెద్దవాడై పోయాడు వీడు ఆధునిక బాలుడు. పై తృతీయాధ్యాయంలో 9 విభా గాలు (3 లో పెద్దలు పాడే పాటల విభాగాలు 4, పిల్లలు పాడు కొనేవిగా 5 విభా గాలు) వాడు ప్రాచీన బాలుడు అందులో కేవలానందంవుండగా – ఇందులో ఆధునిక వైజ్ఞానిక దృష్టి వుంది కనక.

5. భాషా ఛందోలంకారాలు ఇందులో 3 అంతర్విభాగాలు

## ఇది గ్రంథాకృతి

ఇందులో 3, 9 — విభాగాలు విస్తృత ప్రతికలు కనుక అవి విభాగ సూత్రాలుగా రావటం విచిత్రం.

## వి వ ర ణ

రచయిత్రిలో ప్రధానంగా వినయశీలత కొట్ట వచ్చినట్లు కన్పించే గుణం. అందుకని ఎక్కడా ఉత్తమ పురుష ప్రయుక్తం కాలేదు. ప్రథమ పురుషలోనే తనను తాను వ్యక్తీకరించుకోవటం మెచ్చదగ్గది

అలాగే భాషకూడా ఇవి జానపద గేయాలు కనుక వాటి వివరణ కూడా సుకుమారమైన వ్యావహారిక భాషలో వ్రాయటం వల్ల మనకత్యంత సన్నిహితమౌతున్నది దీనికి గ్రంథ మంతా వుదాహరణమె కనుక ప్రత్యేకంగా నిర్దేశించ నక్కరలేదు.

పిల్లలకు నేర్పించే పాటలున్న అధ్యాయంలో పాటల వివరణ చాలా బాగుంది (పు 118) "తొలి దశలో పిల్లలకు నేర్పించే పాటలు చాలా చిన్నవిగా వుంటాయి. వాటిలో అర్థానికన్నా శబ్దానికి ప్రాధాన్య మెక్కువ అర్థ దృష్టితో చూస్తే అవి ప్రాచీన భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే దైవప్రార్థనను, పురాణ పురుష ప్రశంసను, నీతి బోధకు సంబంధించి వుంటాయి" ఇత్యాది.
144 వ పుటలో

"ఆకాశమంతా అల్లుకు రాగా—"

అన్న పాట వివరణ "కజ్జగాను" గని చెప్పటం సొగసుగా వుంది. ఎందు కంటె ఆవివరణ లేకపోతె దాని కద అర్థమని చాలామందికి తెలియదు.

ఈపాట ఆటల వివరణలోనిది. ఈఆటల విషయం ప్రాచీన కవులు వర్ణించారు ఆవిషయం పు. 17–18 లో వున్నాయి. ఈ దృష్టితో కూడా పై ఆటల పాటల

కన్వయించి చూపిస్తే బాగుండేది దశావతార చరిత్రలో బాల క్రీడలను వర్ణించే పద్యముంది. అది పు: 18 లో ఇవ్వబడింది అందులోని 'తాటి చెట్లాట'— ఆకాశమంతా అన్న పాటలోని ఆటే నేమో!? పుట 144 లో చిట్ల పొట్లా కాయ ఆట నేయ మివ్వబడింది. ఇది వెన్నెలకంటి సూరన శ్రీకృష్ణ శైశవం సందర్భంగా వర్ణించిన క్రీడల పద్యంలో వుంది (పు 18) ఈపాటలో (144 పు) సీమ నెల్లికాయ—అన్న మాటను బట్టి అది రాయలసీమ పాటగా గుర్తించవచ్చు నెల్లికాయ అన్నమాట సర్కారు జిల్లాల్లో-బహుశా తెలంగాణంలోనూ వ్యవహారంలో లేనిమాట ఆపాట రచయిత్రి స్వీయ సేకరణ కనుక చిత్తూరు జిల్లా పాట కావచ్చు. ఈమె సేకరించిన పాటలు గ్రంథంలో చాలా వున్నాయి. రచయిత్రి వీటికోసం చాలా పాట్లుపడి ఉండాలి సేకరించడానికి.

ఉయ్యాలాట విషయంలో (131) అట్ల తద్దెనాడు ఉయ్యాలలూగటం తెలంగాణకు సంబంధించినదనటం సరికాదు అది సర్కారు జిల్లాలలోను వుంది కనక పు 173 లో ఒక పాటలో క్షేత్రవిషయం చెప్పి మొదటి పాటల్లో శివాజి కొండ వంటి మాటలు వివరించలేదు. వాటి వివరణ కూడా ఉంటే బాగుండేది అలాగే 166 వ పుటలో ఇచ్చిన రైలుబండి పాటలో నీలగిరి—పుంగనూరుల విషయముంది. ఈ రెంటికి పొంతనేమిటి? పుంగనూరు చిత్తూరు జిల్లాలోది నీలగిరి తమిళనాడులోనిది వేరే నీలగిరి చిత్తూరు జిల్లాలో వున్నదా? ఇలాంటివి కొన్ని చోట్ల వివరణ లేని వున్నాయి. వీటి వివరణ దేశ కాల నాగరికతలకు సంబంధించింది. ఈ దృష్టి ఈ గ్రంథంలో చోటు చేసుకోలేదు, " ఏ గాలేసిన దానిపైనా — కోగిలాడూతుందిరా" అన్న వాక్యంలో కోగిల అంటే కోయిల అని వివరణ లేకపోతె అర్థంకాదు

180వ పుటలో కప్పలకు సంబంధించిన పాటలున్నాయి అధర్వ వేదంలో భేకసూక్తాలున్నవి. వాటికీ వీటికీ సంబంధ బాంధవ్యాలు చర్చించుకోదగ్గవి, రచయిత్రి చెప్పలేదు.

చివరి అధ్యాయం ఛందోలంకార విషయం. బాలసాహిత్యంలో ఛందస్సు-అలంకారం ఎలావున్నాయో వివరించ బడింది.

గేయాల గతి – నడకను గూర్చి చేసిన వ్యాఖ్యానం చాలా ప్రధానమైన విషయం. ఏ వాక్యమైనా ఛందోరహితంగా వుండదు. ఏదో వక గతి – లయ – ప్రతిగీతిలోనూ – గీత పాదంలోనూ వుంటుంది లేక పోతే అది గీతం – గేయం కాదు అది కావాలని తెచ్చిపెట్టుకుంటే కృత్రిమంగా వుంటుంది సామాన్యంగా బాలగేయ సాహిత్యం అనాలోచితంగా వచ్చినది కాబట్టి అక్కడ ఛందోలంకారాలు సహజ విషయాలు తప్ప మరొకటి కావు ఇందుకే రచయిత్రి.

"కొంతమంది అంత్య ప్రాసలలో బాలబాలికలను ఉక్కిరి ఎక్కిరి చేశారు" (364) అని చెప్పటం పై విషయాన్ని గుర్తించిన మాటే అలంకారాధ్యాయంలో బాలగేయాల్లోనున్న – స్వభావోక్తి, ఉపమాలంకారాలు చర్చ చర్చించవలసింది అప్పుడు జానపద చిత్తవృత్తిలో – బాలల చిత్తవృత్తిలో వున్న తెలుగుదేశ గ్రామీణ వాతావరణ మెంత బలంగా వుందో చెప్పినట్లయ్యేది

మొత్తంమీద ఈ గ్రంథం బాలసాహిత్య లోకానికి ఒక చందమామ బ్రెగెర్ బొమ్మలాంటి నిఘంటువు.

ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు,
అధ్యక్షులు, ఆంధ్రభారతి
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

అనంతపురం
1-8-1983

శలాక రఘునాథశర్మ
రీడర్, ఆంధ్ర భారతి
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము.

అనంతపురం.
515 003.

# అ భి నం ద న

బాలగేయసాహిత్యాన్నిగూర్చి పరిశోధనచేయటం, పట్టం పొందటం నా దృష్టిలో అద్భుతమైన విషయం. ఎందుకంటే ఇందులో ఏముందీ', అని చప్పరించే వాళ్ళ సంఖ్య గణనీయంగానే ఉంది. ఇందులో ఏముందో అన్వేషించి, ఎంత ఉందో నిరూపించి, యింకెంత ఉందో అనే భావంతో పాఠకులు ఆశ్చర్యపడే తీరుగా థీసిస్సును తీర్చిన కుమారి దేవకి అభినందనీయ.

బాల సాహిత్యాన్ని అధ్యయనంచేసే వ్యక్తికి బాలల మనస్తత్వం వంటి నిర్మలమైన మనస్తత్వం ఉండాలి. పరిశోధనకు పరిణతి చెందిన మేధ కావాలి. ఈ రెంటికీ జోడు కుదరటం చాలా అరుదైన విషయం. గేయాలు వడ్డించిన విస్తరి వంటివి కావు. మధుకరంలా తెలుగు తోటంతా తిరిగి బొట్టు బొట్టుగా సమకూర్చి పెట్టుకోవటానికి ఎంతో ఓర్పు, మరెంతో దీక్షా కావాలి. అందులో ఆడ కూతురికి ఇది ఎంత దుష్కరమో ఊహించటం కూడా కష్టం. అయినా సాధించింది దేవకి! అందుకే తెలుగు పొలంలోని ఆబాలగోపాలానికీ కుమారి దేవకి అభినందనీయ.

ఈ సిద్ధాంత వ్యాసం ఒక మనోజ్ఞమైన మధుకోశం. ఇందులో బాలల శ్వేత హృదయాల ఆకర్షణా, గేయాలలోని ఆపాత మాధుర్యంలా, సాహిత్యంలోని ఆలోచనామృతత్వమూ త్రివేణిలా అల్లుకొని పోయాయి. తీసుకున్న అంశానికి జీవం పోసే భాషా విన్యాసం ప్రసన్న మధురంగా సాగింది. అందుకోసం కూడా డాక్టర్ దేవకి అభినందనీయ...

శ్రీ వేంకటేశ్వరపురం :
రుధిరోద్గారి ఆషాఢ శుద్ధ అష్టమి.

శలాక రఘునాథశర్మ

# తొలి పలుకులు

ఆధునికాంధ్ర వాఙ్మయంలో త్వరితగతిలో అభివృద్ధి చెందుతున్న ఒక ప్రక్రియ బాలసాహిత్యం. బాలలకు వినోదాన్ని, విజ్ఞానాన్ని, వికాసాన్ని కల్గించే సృజనాత్మక రచనలు — గేయాలు, కథాగేయాలు, కథలు, నవలికలు, నాటికలు మొదలైన ప్రక్రియల రూపంలో ఇటీవల విరివిగా వెలువడుతున్నాయి అయినా బాలసాహిత్య వ్యాప్తిని, వైశిష్ట్యాన్ని, ప్రాముఖ్యాన్ని తెలిపే సమగ్ర పరిశోధనగాని, పరిశీలనగాని జరగలేదు. ఆచార్య రామరాజుగారు తమ జానపదసాహిత్య పరిశోధనలో జానపద బాలగేయ సాహిత్య స్వరూపాన్ని గురించి ప్రస్తావించారు వేటూరి ప్రభాకర శాస్త్రి, చేకుమళ్ళ కామేశ్వరరావు, నేదునూరి గంగాధరం, ఏల్లోరా మొదలైనవాళ్ళు జానపద బాలగేయాలను సేకరించి, కొంత సమీక్షించి ఉన్నారు. బాలసాహిత్య పరమైన వ్యాసాలు, సమీక్షలు కొన్ని పత్రికల్లో వెలువడ్డాయి. కాని అవి కేవలం ప్రాస్తావిక ప్రసంగాలే తప్ప పరిశోధనాభరితాలు కావు. బాలసాహిత్య పరమైన పరిశోధనలో ఇది ప్రథమ ప్రయత్నం (1978) తరువాత ఈ దారిలో ప్రయాణం చేసిన శ్రీ వెలగా వెంకటప్పయ్యగారు బాలసాహిత్య పరిణామవికాసాలు (1981 అనే అంశంపై పరిశోధన చేయడం ఆనందదాయకం. అంతేగాక ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ తెలుగులో బాలసాహిత్యం అనే అంశానికి బహుమతిని ప్రకటించడంతో ఇతర సాహిత్య అంశాలతో బాలసాహిత్యానికీ సమానమైన ప్రాతినిధ్యం ఉందని చాటి చెప్పినట్లయింది దానితో బాలసాహిత్య పరిశోధనా పరిధి మరింత విస్తృతమైంది

తెలుగులోని బాలసాహిత్యం వివిధ ప్రక్రియలలో బహుముఖమైంది బాల సాహిత్య ప్రక్రియల్లో ప్రముఖమైంది గేయ ప్రక్రియ. ఈ పరిశోధనకు విషయాన్ని విశాలం చేసుకోకుండ బాలగేయ వాఙ్మయ పరిశీలనవరకే పరిమితం చేసుకోవడం జరిగింది. అయినా బాలసాహిత్యంలో భాగమైన బాలగేయ ప్రక్రియను గురించి చెప్పడానికి ముందు బాలలంటే ఎవరు ? బాలసాహిత్యమంటే ఏమిటి ? అది ఎప్పుడు పుట్టింది ? ఎలా పరిణమించింది ఏ విధంగా వికసించింది ? దానికి దోహదంచేసిన

పరిస్థితులెలాంటివి ? మొదలైన ప్రశ్నలకు సమాధానాల్ని అన్వేషించవలసి వచ్చింది అంటే బాలసాహిత్యపు పుట్టుక, పరిణామ వికాసాలకు సంబంధించిన అంశాలనుకూడా కొంత వరకు సమగ్రంగానే పరిశీలించడమైంది

ఈ సిద్ధాంత వ్యాసానికి ముడిపదార్థమనదగ్గ బాలగేయాలు దాదాపు పదివేలు (అవి నేను సేకరించినవి నా కంటికి కనపడనివి ఇంకా ఎలసంఖ్యలో ఉండిఉంటాయి రోజు రోజుకు ఎన్నో గేయాలు పుట్టుకొస్తున్నాయి ) ముద్రితమైన జానపదగేయాలు ఆధునికులు వ్రాసిన గేయాలేగాక చిత్తూరు జిల్లాకు చెందిన జానపద బాలగేయాలు (స్వీయ సేకరణ) రచయితలు వ్రాసిన వాటిలో అముద్రితంగా ఉన్నవి (కనుపర్తి వర లక్ష్మమ్మ బాలసాహిత్య మంజరి, న్యాయపతి రాఘవరావు బాలగేయమాల) కూడా స్వీకరించబడ్డాయి వాటిద్వారా బాలగేయవాఙ్మయ స్వరూప, తత్త్వాన్ని, ప్రాముఖ్యాన్ని ప్రదర్శించడమే ఈ గ్రంథంలోని ప్రయత్నం

బాలసాహిత్యంతో సన్నిహిత సంబంధమున్న ప్రముఖులతోను, రచయితల తోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి కొందరిని నేరుగా కలుసుకొని విషయసేకరణ జరిపి ఈ పరిశోధన వ్యాసంగాన్ని కొనసాగించడం జరిగింది

ఐక్యరాజ్యసమితి తీసుకున్న నిర్ణయాన్ని అన్ని దేశాలతోపాటు భారతదేశం కూడా హర్షించి, 1979 వ సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా పరిగణించింది ఆ సంవత్సరంలో బాల బాలికల మానసిక వైజ్ఞానిక వికాసానికి, సాంస్కృతిక అభ్యుదయానికి పురస్కరించబడింది. అదే సందర్భంలో అంటె డిసెంబరు 1978 న నేను నా పరిశోధనా వ్యాసాన్ని సమర్పించడం, 1979 లో పి హెచ్. డి. పట్టం పొందడం జరిగింది ఆ గ్రంథం ప్రస్తుతం వెలుగులోకి వచ్చింది

— —

# కృతజ్ఞతలు

నాకు ఈ పరిశోధనకు అవకాశాన్ని కల్పించి 'తెలుగు బాలగేయ సాహిత్యం' పరిశోధనాంశంగా సూచించి అడుగడుగున అమూల్యమైన సలహాలను అందించి ప్రతి అంశం పరిశీలించి సవరించిన ఆచార్య జి యస్ రెడ్డి గారికి ...

మొదట కొంతకాలం పరిశోధనా నిర్దేశకులుగా వ్యవహరించి విషయ సేకరణ దశలో సూచనలిచ్చిన డా॥ టి నిర్మలగారికి ......

వారు బదిలీ అయిన తర్వాత సహృదయతతో పర్యవేక్షత్వాన్ని వహించి ఒక ప్రణాళికను రూపొందించ నిర్మాణాత్మకమైన సూచనలిచ్చి నాపరిశోధనా వ్యాసంగాన్ని నిర్వహింప చేసిన గురువర్యులు డా॥ జి. నాగయ్య గారికి ......

పరిశోధన కాలంలో ముఖాముఖి చర్చలకు అవకాశమిచ్చి, ఉత్తరాల ద్వారా సూచనలిచ్చి, తమ రచనలను పంపించి సహాయ సహకారాలందించిన పెద్దలు ఎందరో– అందరికీ కృతజ్ఞతలు.

పరిశోధనకోసం కావలసిన గ్రంథాలు, పత్రికలు పరిశీలించడానికి అనుమతించిన శ్రీవెంకటేశ్వర, ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం (హైదరాబాదు), కన్నెమెరా లైబ్రరీ (మద్రాసు) సారస్వత నికేతనం (వేటపాలెం) శారదా గ్రంథాలయం (అనకాపల్లి) గౌతమి గ్రంథాలయం (రాజమండ్రి) సిబ్బందికి, అధిపతులకూ ......

శ్రమకోర్చి ఈ సిద్ధాంత వ్యాసానికి వ్రాత ప్రతులను తయారు చేసిన జాల కంటి బాల సుబ్రహ్మణ్యం గారికి–కృతజ్ఞతాభివందనాలు.

సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులుగా వ్యవహరించిన డా॥ బి. రామరాజుగారికి, డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారికి, డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారికి–మనః పూర్వక నమస్సులు.

సర్వ విషయాలలో సముచితసలహాల నిచ్చి పుస్తక ముద్రణకు ప్రోత్స హించిన ఆచార్య శ్రీ తుమ్మపూడి కోటేశ్వర రావుగారికి ......

ముద్రణకు సంబంధించి సర్వ భారాన్ని స్వీకరించిన శ్రీ శలాక రఘునాథ శర్మగారికీ, తమ సహాయ సహకారాల నందించిన ఆంధ్ర భారతి అధ్యాపక వర్గానికి ...

అనతి కాలంలో అందంగా పుస్తకాన్ని అచ్చువేసి ఇచ్చిన వెరైటీ ప్రింటర్స్ (ఏలూరు) వారికి ......

పుస్తకాన్ని చదివి అమూల్యమైన అభిప్రాయాలను అందించిన ఆచార్య శ్రీ జి యన్. రెడ్డిగారికి, శ్రీ బి రామరాజు గారికి, శ్రీ కోటేశ్వరరావు గారికి, శ్రీ రఘు నాథశర్మగారికి ......

ముఖ పత్రం కోసం పిల్లల ఆటలను అందంగా పొందుపరచిన శ్రీ రామాంజ నేయులు (నార్పల) గారికి ......

పరిశోధన చేయడానికి అనుమతించి యు జి సి ద్వారా ఉపకార వేతనాన్ని సమకూర్చిన శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ అధికార వర్గానికి ముద్రణ కోసం కొంత ధనసహాయం చేసిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి ......

హృదయ పూర్వకమైన కృతజ్ఞతలు.

**దేవకి.**

# విషయసూచిక

## అనుబంధం

# 1. బాలసాహిత్య స్వరూపతత్త్వం

## 1. 1. బాలసాహిత్య నిర్వచనము

బాల సాహిత్యాన్ని నిర్వచించడానికి ముందు బాల శబ్దాన్ని నిర్వచించుకో వలసి ఉంటుంది.

1. "వల సంచలనే – వలతి ఇతి బాలః"

   సంచలించే వాడు బాలుడు.

"ఆషోడశాద్భవేద్బాలః తతస్తరుణ ఉచ్యతే"

(మనువు)

పదహారేళ్ళ పర్యంతం బాలుడే; తర్వాత తరుణుడు.

2. "బల ప్రాణనే – బలతి అనాయాసేన బాలః"

(గురుబాల ప్రబోధిక)

అనాయాసంతో బ్రతికేవాడు బాలుడు.

ప్రథమనిర్వచనాన్ననుసరించి నిత్యచలన మనస్కుడు, నిలిచిన చోట నిలవని మనశ్శరీరాలు కలవాడు, క్రీడాసక్తుడని భావం. రెండవ నిర్వచనాన్ని బట్టి సుఖంగా, శాంతంగా, దిగులూ దీక్షా లేకుండా బ్రతికేవాడని తాత్పర్యం. ఇతరులపై ఆధారపడ్డ బ్రతుకు కాబట్టి, లోకదృష్టి లేనిది కాబట్టి 'అనాయాసేన' అని చెప్ప

బడింది దీనితో ప్రపంచనిర్వచనం అర్థవంతమవుతుంది ఆయాసం (బరువు బాధ్యత) లేని బ్రతుకు కనుక ఆడుతూ పాడుతూ కాలం గడుపుతాడు ఆటలలో, పాటలలో కాలం గడిపేవాడు బాలుడని అర్థం గ్రహణధారణపటువు బాలుడని పండితుల అభిప్రాయం[1] అంటే విషయాన్ని గ్రహించి జ్ఞాపకముంచుకొనేవాడు. చెప్పింది చక్కగా గ్రహించి మనస్సులో ధరించేవాడు

బాలశబ్దము వృద్ధశబ్దానికి వ్యతిరేకం వృద్ధుడంటే వయస్సులోనూ మనసు లోనూ పెద్దవాడు అందుకే ముసలివాడు, పండితుడు అనే అర్థంలో వాడుతున్నాం బాలుడంటె వయస్సులోనూ, మనస్సులోనూ చిన్నవాడు వృద్ధునిది పరిపూర్ణ వికాసాన్ని పొందిన మనసయితె అప్పుడే వికసిస్తున్న మనస్సు బాలునిది అది మలచబడేదే తప్ప మలచ బడింది కాదు, మలిచేదీకాదు శిశువు మనస్సు ఆర్ద్రంగా, సున్నితంగా ఉంటుంది అదే మలచబడే చిత్తవృత్తి

"బాలస్తావ త్క్రీడాసక్తః ........." అని భజగోవింద స్తోత్రంలోని ఒక శ్లోక పాఠం మానవుడు బాలుడుగా ఉన్నంతకాలం ఆటలందు ఆసక్తి కలిగి ఉంటాడు క్రీడ ఆనంద సంకేతం. హృదయ స్పందం బాలుడు నిత్యానంద స్వరూపుడు పెద్ద వాళ్ళకు క్రీడా బుద్ధి స్థానంలో లోకబుద్ధి ఏర్పడి బిగిసిన మట్టి ముద్దలై పోతున్నారు అందుకే అది శిల్పించబడదు మలచబడదు కాగా మలచడానికి అనువైన మానసిక చిత్తవృత్తి కలవాడు బాలుడు చెప్పిన విషయాలు అతని మనస్సులో అంతబాగా హత్తుకు పోతాయని అర్థం అలాంటి బాలమనస్సులను ఉన్నతంగా, ఉత్తమంగా తీర్చిదిద్దడానికి సాహిత్యం ఒక గొప్పసాధనం

బాల బాలికల శ్రవణపఠనాదులకు ఉద్దేశించబడిన రచనలు బాలసాహిత్యం. ఇది వారు నేర్చుకోదగిన లేదా చదువుకోదగిన లేదా వినదగిన సాహిత్యం. ఇది ప్రధానంగా బాలల ఉపయోగార్థం సృష్టింపబడినట్టిది వయోజనులకు సంబం

---

1. బాలవ్యాకరణము బాలవ్యాకరణ సారస్య సర్వస్వ పేటికయను టీకతో కూడినది టీకా ప్రణేత : విద్వాన్ మూసి రామమూర్తి శాస్త్రి.

భించిన ప్రౌఢసాహిత్య తత్వానికి, ప్రయోజనానికి భిన్నమైనది బాల సాహిత్యం. బాల సాహిత్య స్వరూపాన్ని నిర్ణయించడంలో బాలల వయః పరిమితుల్ని ప్రధానంగా స్మరించవలసి ఉంటుంది

## 1. 2. బాలల వయః పరిమితి

మానవ జీవితంలో ప్రథమదశ బాల్యం. ఇది వ్యక్తి జీవితంలో చీకూ చింతా లేని, తెలిసీ తెలియని దశ. అమాయకత్వానికి, మంచితనానికి బాల్యం మారుపేరు. అందుకే పిల్లల్ని పరబ్రహ్మ స్వరూపులుగా మనపెద్దలు భావిస్తారు. ఈ బాల్యదశ లేకుండా తర్వాతి దశలుండటం అసంభవం కదా! "బాల్యదశ ప్రభావం ఆ పిమ్మట దశలమీద ప్రసరించినపుడే ఆదశలలో జీవనాడి స్పందనం క్రమగతి వికాసం పరిణామం జరుగుతున్నట్లు నేటి ప్రౌఢకవితా రీతులకు బాల సాహిత్యమె ప్రాతిపదిక" అంటారు బి. వి. నరసింహారావుగారు[1] మానవుని నిండు జీవితానికి సరిపడే విజ్ఞానానికి, వికాసానికి ప్రాతిపదిక ఈ దశలోనే ఏర్పడాలి.

బాలల వయః పరిమితిని నిర్ణయించడంలో మనస్తత్వ శాస్త్రజ్ఞులకు, విద్యావేత్తలకు మధ్య కొంత అభిప్రాయభేద ముంది సాధారణంగా పద్దెనిమిదేండ్ల లోపు పిల్లలే బాలలుగా వ్యవహరింప బడతారని ఏడిద కామేశ్వరరావు,[2] జి. లలిత[3] మొదలైన వారి అభిప్రాయం. పిల్లలు నేడు పదిహేను సంవత్సరాల వయస్సుకే ఉన్నత

1 బాల సాహిత్యం, త్రివేణి, విద్యాపోషక శ్రీపాములపాటి బుచ్చి నాయుడుగారి స్మారక సంచిక 1971.

2 ఆధునిక బాల వాఙ్మయము. సుజాత మె 1953. ఆంధ్ర సారస్వతపరిషత్తు సప్తమ మహాసభ సంచిక పుట : 159.

3. బాలల సాహిత్యము. Andhra Balananda Sangham Silver Jubilee Souvenir 1973. పుట : 15.

పాఠశాలవిద్యను ముగించి, కళాశాలల్లో ప్రవేశించి, ఆంధ్రాంగ్ల భాషలలో ప్రౌఢకావ్య ప్రబంధ నాటకాదుల్ని పఠించగల్గుతున్నారు. కాబట్టి పదిహేను సంవత్సరాలు దాటిన వారిని పెద్దపిల్లలు **(Seniors)** గా గుర్తించడం సమంజసం. కాబట్టే "బాలల సాహిత్యం సంగతి వచ్చేసరికి మూడు సంవత్సరాల నుండి పదిహేను సంవత్సరాలని గ్రహించుట అవసరము" అని గొఱ్ఱెపాటి వెంకట సుబ్బయ్యగారును[1] "బాల్యము నుండి పదునాలుగు సంవత్సరముల ప్రాయమువరకు వారివారి కనువైన సాహిత్యమును బాలసాహిత్యమని చెప్పుకొన దగును"[2] అని ఎ. లక్ష్మీరమణగారును సూచించారు దీనిని బట్టి బాలల వయఃపరిమితి నిర్ణయంలో కొందరు పద్దెనిమిదేండ్లని మరికొందరు పధ్నాలుగు, పదిహేను సంవత్సరాలని అభిప్రాయ పడుతున్నట్లు తెలుస్తున్నది బాలల మానసిక వికాసాన్నిబట్టి, తత్వాన్నిబట్టి వారి వయస్సును నిర్ణయించ వచ్చును. ఆధునిక కాలంలో ప్రపంచమంతటా సంభవిస్తున్న వైజ్ఞానిక విప్లవ ప్రభావ కారణంగా బాల బాలికలు ఈనాడు తమ వయస్సుకు మించిన మనో వికాసాన్ని పొంద గలుగు తున్నారు పద్దెనిమిదేండ్లు నిండకముందే మానసికంగా పెద్దవాళ్ళవు తున్నారు. ఓటుచేసే వయఃపరిమితిని కూడా ఇరవై ఒకటినుండి పద్దెనిమిదేండ్లకు ఇటీవలనే తగ్గించారు. కాబట్టి పుట్టినప్పటినుండి పదిహేను సంవత్సరాల వరకే బాల్యదశగా పరిగ ణించడం సమంజసం, సహేతుకం కూడా. వాస్తవానికి పదిహేనేండ్ల బాల్యావస్థ నంతటినీ ఒకే దశగా కూడా భావించలేము. పిల్లల పెరుగుదలలో మనః ప్రవృత్తిలో కలిగే మార్పుల్నిబట్టి పదిహేనేండ్ల వరకుగల బాల్యావస్థను మూడు దశలుగా వర్గీక రించ వచ్చును. దీన్ని అనుసరించే బాల సాహిత్య స్వరూపం కూడా ఉంటుంది.

### 1. 2. 1. ప్రథమదశ - శ్రవ్యసాహిత్యము

పిల్లలు పుట్టినప్పటినుండి ఐదేండ్లవరకు ప్రథమదశగా గుర్తించవచ్చు. ఇందులో మూడేండ్లవరకు మరీ పసితనం. మూడేండ్ల తరువాతనే పరిసరాల ప్రభావానికి

---

1. బాల వాఙ్మయము కిన్నెర జనవరి 1954 పుట : 27.
2. బాలసాహిత్యం. మహతి 1972 భారత స్వాతంత్ర్య రజతోత్సవ ప్రచురణ. ప్రస్తారం. పుట : 34.

స్పందించే మానసిక పరిణతి పిల్లల్లో కనిపిస్తుంది. కాబట్టి మూడేండ్లనుండి ఐదేండ్ల వరకు ప్రథమ దశగా పేర్కొనవచ్చు

ఈ ప్రథమ దశలో పిల్లల జీవితం ఎక్కువగా ఇంట్లోను, ఇంటి పరిసరాలలోను గడుస్తుంది మొట్టమొదట వారు నేర్చుకొనే విద్య తల్లిదండ్రులతోనే ప్రారంభమవుతుంది అంటె పిల్లలకు ఇల్లే మొదటి పాఠశాల. తల్లిదండ్రులే వారి ప్రథమ గురువులు అందుకే **"Home is the first school for Children, mother and father are their first teachers"** అన్నారు. "మాతృదేవో భవ, పితృదేవో భవ" అనే సూక్తులతో ప్రాచీనులు తల్లిదండ్రులకు ప్రథమ ద్వితీయ స్థానాలు ఇవ్వడంలోని ఉద్దేశ్యం కూడా అదే. బాలల జీవితంలో తల్లిదండ్రులపాత్ర అనితర తుల్యమని ఈ సూక్తులు చాటుతాయి

భాగవతంలో ప్రహ్లాదుని విషయంలో "పంచవర్షవ్వయస్కుడవు బాలుడ వెంచుక గాని లేవు భాషించెదు" 1 అని చెప్పిన మాటలు విద్యార్థనకు అనువైన వయస్సు ఐదేండ్లని తెలుపుతుంది. కాని ఈనాడు మూడేండ్లకే పిల్లల్ని ప్రత్యేకమైన నర్సరీస్కూళ్లలో చేర్పించడం జరుగుతున్నది

ప్రథమ దశలోని బాలలకు చాలా ప్రీతికరమైంది శ్రవ్యసాహిత్యం అంటె పిల్లల నుద్దేశించి తల్లులుపాడే జోలపాటలు, లాలిపాటలు, చందమామపాటలు మొదలైనవి ఈ కోవకు చెందినవె శ్రవ్యసాహిత్యం ప్రధానంగా శాబ్దికమైనది వినటానికి ఇంపుగా ఉండే పాటలతో బాటు కథలకు కూడా ఈ శ్రవ్యసాహిత్యంలో ప్రాధాన్యం ఉంటుంది కథకంటేకూడ పాటకు తాళం, లయ, యతి, ప్రాస, గతి, శ్రుతి మొదలైన నియమాలుంటడంవల్ల, నాదాన్ని ఆశ్రయించడంవల్ల శ్రవణపేయంగా ఉంటుంది శ్రవ్యసాహిత్యంలో పాటలకు ప్రథమస్థానం ఉంది కనుకనే ప్రాచీన బాలసాహిత్యం అధికంగా గేయరూపంలో వెలువడింది పాటల్లోని భావాన్ని అర్థంచేసుకొనేశక్తి

---

1. పోతన శ్రీమదాంధ్రమహాభాగవతము. సప్తమస్కంధము, 152 వ పద్యము రామా అండ్ కో ప్రతి. 1952.

పసిపిల్లలనుండదు కాని వాటిలోని నాదం వారిని పరవశింప చేస్తుంది "శిశ ర్వేత్తి పశుర్వేత్తి వెత్తి గానరసంఫణిః" అన్నమాటలు నిరర్థకాలు కావు చిన్న చిన్న పదాలతో ఏ కల్లబొల్లి పాటపాడినా పసిపిల్లలు నిశ్చేష్టులై వింటారు. ఆపాటలు లయబద్ధమైన నాదంతో ఒప్పి ఉంటే చాలు పాటలు పాడుతుంటే వింటున్న పిల్లల లేతహృదయాల్లో కలిగే అనిర్వచనీయమైన అనుభూతికి వాళ్ల కళ్లల్లో వెలిగే కాంతి, ముఖంలో తాండవించే ఆనందం నిదర్శనాలు. పిల్లవాడు ఏడుస్తున్నప్పుడు ఏ జోలి పాటనో, చందమామపాటనో పాడినపుడు ఏడుపు మానేసి కళ్లప్పగించి చూస్తాడు ఆనందంతో చిరులాస్యం చేస్తాడు అదే నవ్వుతున్న పిల్లవాణ్ణి భయంకరమైన స్వరంతో బెదిరిస్తే గుక్కపట్టి ఏడ్వడం మొదలుపెట్టవచ్చు వీటివల్ల శబ్దానికి ఎంతటిశక్తి ఉందో అర్థమవుతుంది కాబట్టి బాల్యంలోని ప్రథమదశలో గేయరూపమైన శ్రవ్యసాహిత్యానికే ప్రాధాన్యం అట్టి శ్రవ్యసాహిత్యానికి బాలవాఙ్మయంలో ప్రత్యేక మైన స్థానం ఉంది

పాటలేగాక పిల్లలు ఆసక్తికరంగా వినే చిన్న చిన్న కథలుకూడా శ్రవ్యసాహిత్యంలోని భాగమే. భాష, భావం పూర్తిగా తెలియకపోయినా పిల్లల ప్రవృత్తికి చిన్న చిన్న కథలు కూడా ఆకర్షణీయాలే. ముఖ్యంగా పశుపక్ష్యాదులు పాత్రలుగా ఉన్న పిట్ట కథలంటే వారికి ఎంతో ఇష్టం. ఈ పిట్ట కథలద్వారా పెద్దలు పిల్లలకు మంచి చెడులను బోధిస్తుంటారు 'ఆవు – పులి' కథ విన్న పిల్లలకు ఆవు అంటే సాధు జంతువనీ, పులిఅంటే క్రూరజంతువనీ భావం మనసుల్లో ఏర్పడిపోతుంది పిట్ట కథల శ్రవణంవల్ల పిల్లల్లో ఉత్సాహం, ఊహాశక్తి పెరుగుతాయి

పిల్లలను అనుకరణ అభ్యాసాలవల్ల క్రమంగా భాష అలవడుతుంది పెద్దల ఉచ్చారణను అనుకరించి మాటల్ని నేర్చేదశలో పిల్లలు వచ్చీరాని మాటల్ని, అక్షరాల్ని కూర్చి పలుకుతూ తమభాషకు తామే సంతోషిస్తారు "పిచ్చి కొచ్చింది – పచ్చి మిరపకాయ తినింది" – ఇలాంటి ముద్దుమాటలు రెండుసంవత్సరాల తెలుగు పిల్లల నోట్లో వెలువడడం చూస్తుంటాం. దీన్నిబట్టి భాషేగాక లయాన్వితమైన మాటల పొందిక కూడా పిల్లలకు అలవడడం సహజమని తెలుస్తుంది

శైశవంలోని ప్రథమ దశలో బాలబాలికలలో శారీరకంగాను, మానసికంగాను కలిగే మార్పులు ప్రతి ఆరు నెలలకు సువ్యక్త మవుతాయి. మూడేండ్లు నిండిన వయస్సులో దైహికంగా ఏర్పడే శక్తినిబట్టి పిల్లలు ఉత్సాహంతో దుమకడం పరుగెత్తడం గంతులు వెయడం సహజం ఈ పరిణామదశలో దైహిక చలనాన్ని అధికంగా ప్రదర్శింపజేసే కథల్ని బాలల మనస్సులు ఆకర్షిస్తాయి మానసిక ఉద్వేగాన్ని పెంపుచేసే సంఘటనలతో నిండిన అద్భుత కథల్ని వినడం వల్ల పిల్లలకు ఎంతో సంతృప్తి కలుగుతుంది ఈ విధంగా ప్రథమ దశలోని పిల్లలకు శ్రవ్యసాహిత్యమే- అందులోను శాబ్దికమైన గేయసాహిత్యమే – ప్రధానంగా ఉపకరిస్తుంది శ్రవ్యసాహితీ ప్రధానమైన జానపద సాహిత్యములోని బాలసాహిత్యాన్ని అందలి పాటల సంఖ్యను గమనిస్తే బాల సాహిత్యంలో శ్రవ్యసాహిత్యానికి గల ప్రాధాన్యం బోధపడుతుంది.

దృశ్య సాహిత్యంలో బొమ్మలలోని రంగులు వింతవింత ఆకారాలు పిల్లల్ని కొంతవరకు ఆకర్షిస్తాయి. కాని వాటిని పరిశీలనాదృష్టితో అర్థంచేసికొనే శక్తి ఈదశ పిల్లల కుండదు. దృశ్యరూపమైన బొమ్మలవల్ల వస్తువుల ఆకారాలు, వాటి పేర్లు పిల్లలకు పరిచయ మవుతాయి కాని చూచే బొమ్మలన్నీ ఈ వయస్సులోని వారికి అర్థంకావు బొమ్మలకంటే వాటిలోని రంగులే పిల్లల్ని ఎక్కువగా ఆకర్షిస్తాయి. పువ్వులు, పండ్లు, జంతువులు, పక్షులు మొదలైన వాటికి సంబంధించిన పాటల్ని బొమ్మలతో చూపించి పాడితే పిల్లల ఆనందానికి అంతుండదు.

ప్రథమ దశలోని పిల్లలకు అక్షరజ్ఞానం పూర్తిగా లేకపోవడంవల్ల వారికి పఠన సాహిత్యంతో పనిలేదు.

పై పరిశీలననుబట్టి ఐదేండ్లలోపు పిల్లలకు ఆనందాన్నిచ్చే వాటిలో శ్రవ్య సాహిత్యానికే అగ్రస్థానం. దృశ్య రూపమైన రంగురంగుల బొమ్మలు వారికి ఆకర్ష ణీయాలు. పఠన సాహిత్యంతో వారికి పనిలేదు.

### 1. 2. 2. ద్వితీయదశ - దృశ్యసాహిత్యం

ఐదు పది సంవత్సరాల మధ్యగల బాల్యాన్ని ద్వితీయదశగా పరిగణించవచ్చు. ఐదేండ్లు నిండిన పిల్లల సంభాషణలో అభివృద్ధి కనిపిస్తుంది అక్షరాభ్యాసం తరువాత అక్షరాలు నేర్చుకొని భాషా జ్ఞానాన్ని పెంచుకొన్న ఈవయసు పిల్లలు క్రమంగా పాటల్ని, కథల్ని అర్థంచేసుకోవడమే గాక స్వయంగా సులభశైలిలోని వచన రచనల్ని చదివి విషయ గ్రహణ శక్తిని పెంపొందించుకో గలరు వింతవింత కథల్ని కల్పించే శక్తికూడ వారిలో గోచరిస్తుంది వారిప్రవర్తన ప్రధానంగా పరిసరాల ప్రభావంపై ఆధారపడి ఉంటుంది తన చుట్టుఉన్న మనుషుల్ని గురించి తెలుసు కోవాలనే ఆసక్తి కూడా వారిలో ఎక్కువగా కన్పిస్తుంది.

ఈ వయసు పిల్లలు గుడుగుడు, దడదడ, ట్రింగ్‌ట్రింగ్ మొదలైన ధ్వన్యను కరణ పదాలను ఉచ్చరిస్తూ ఆనందాన్ని పొందుతారు ఏమిటి ? ఎందుకు ? ఎట్లా ?- యిలాంటి ప్రశ్నలతో పెద్దవాళ్ళను తికమక పెడుతూ వధిస్తారు పిల్లల్లో ఇలాంటి జిజ్ఞాస కలగడం విజ్ఞానదాయకమే. ఈజిజ్ఞాస మానసికంగా వారిలోని అభివృద్ధిని సూచిస్తుంది.

ద్వితీయ దశలోని పిల్లలకు బొమ్మలతో కూడిన దృశ్యసాహిత్యం ఎక్కువగా ఉపకరిస్తుంది శ్రవ్య సాహిత్యంలో శబ్దం ప్రధానమైతే దృశ్యసాహిత్యంలో బొమ్మలు ప్రధానం రంగురంగుల బొమ్మలతో కూడిన పుస్తకాలు, నాటికలు, సినిమాలు, టెలి విజన్ మొదలైన వన్నీ దృశ్య సాహిత్యానికి సంబంధించినవే రంగు రంగుల బొమ్మ లతో పెద్ద పెద్ద అక్షరాలతో తేలిగ్గా పలకడానికి వీలైన పదాలతో చక్కని లయలో వినోదకరంగా ఉండే బొమ్మల పుస్తకాలు బాలబాలికల్ని విశేషంగా ఆకర్షిస్తాయి. భావోద్దీపన కలిగించడానికి దృశ్య సాహిత్యమే కాకుండా చమత్కారాన్ని, వినోదాన్ని, సాహసాన్ని ప్రదర్శించే ఆసక్తికరమైన శ్రవ్య సాహిత్యం కూడా ఈ ద్వితీయదశలోని పిల్లలకు ఉపకరిస్తుంది.

ఈ దశలోని పిల్లలకు ఆటపాటలంటే ఎంతోఇష్టం. పిల్లలలో తెలివితేటలను ఉత్సుకతను ప్రేరేపించే పాటలు ఆటల రూపంలో చాలా ఉన్నాయి ఆట పాటలలో

విజ్ఞానాన్ని వినోదాన్ని రంగరించి, పిల్లలకు అందించడం అనే ప్రయత్నం అనాది నుండి ఉంది. పాటలు హృదయానికి ఆనందాన్ని కలిగిస్తే ఆటలు శరీరానికి ఆరోగ్యాన్నికూడా సమకూర్చుతాయి. ఆడుకొనేస్వభావం ఉన్న పిల్లల ఆటలలో ముడిపడి ఉండే పాటలు తొందరగా పట్టుబడతాయి. ఆటపాటలలో కోలాటం పాటలు, గొబ్బి పాటలు, గుజ్జనగూళ్ళు, అన్నా పాటలు, చందమామపాటలు మొదలైనవి తాళ ప్రధానాలే గాక నాట్య ప్రధానాలు కూడా. సంవాద రూపంలో ఉన్న ఆటపాటలు పిల్లల్ని అమితంగా ఆకర్షిస్తాయి.

ద్వితీయదశలోని బాలలకు మూడు రకాలైన బాలసాహిత్యం బోధించవలసి ఉంటుంది. దృశ్య సాహిత్యం ప్రధానంగాను, శ్రవ్య పఠన సాహిత్యాలు ద్వితీయంగాను వారికి ఉపకరిస్తాయి. పలురకాల జంతువులు, చెట్లు, పక్షులు, వస్తువులు, వాహనాలు మొదలైన వాటి గురించి రంగు రంగుల బొమ్మల ద్వారా ఐదేండ్ల వయసు పిల్లలు సులభంగా నేర్చుకుంటారు. బొమ్మలతో విషయ బోధన చేస్తే వారికి సులభంగా అర్థమవడమే గాక విజ్ఞానదాయకంగాను ఉంటుంది.

ఎనిమిదేండ్ల వయసు పిల్లలకు సులభశైలితో వ్రాసిన శ్రవ్య పఠనసాహిత్యాలు ఎక్కువగా ఉపకరిస్తాయి. ముఖ్యంగా నీతికథలు, దేవతలు, మాంత్రికులు పాత్రలుగా గల అద్భుతకథలు, పశుపక్ష్యాదులు పాత్రలుగా గల కథలు పిల్లల్లో చదవాలనే ఆసక్తిని పెంచడమే గాక కుతూహలాన్ని రేకెత్తిస్తాయి. జీవిత వృత్తంలో సత్ప్రవర్తన, నీతులు మొదలైనవాటిని మిళితం చేసి కథలుగా అందిస్తే అవి పిల్లల మనసుల్లో చక్కగా హత్తుకుంటాయి. చిన్ననాడు మనసుల్లో నాటుకున్నవి. కలకాలం నిలిచి ఉంటాయి. కనుకనే కథల రూపంలో బాలలకు నీతివచనాలు బోధిస్తుంటారు. మూర్ఖులైన రాజకుమారులకు కేవలం కథలద్వారానే అనేక విధాలుగా ప్రాపంచిక జ్ఞానాన్ని అనతి కాలంలో కల్గించిన పంచతంత్ర కథలు బాలసాహిత్యంలో అపురూపమైనవని పాశ్చాత్యులు కూడా అంగీకరించారు. ఈ కథలు సుమారు 5000 ఏండ్లకు పూర్వం ఆర్యావర్తంలో పుట్టి పర్షియా, అరేబియా, సిరియా

---

ఆముఖము. ఈసపు నీతికథలు 1966 పుట XI

మొదలైన దేశాలకు వ్యాపించి దేశకాలానుగుణమైన మార్పు చేర్పులతో యూరప్ దేశాలలో వివిధ భాషల్లో సుస్థిరమైన స్థానాన్ని ఏర్పరచు కొన్నట్లు శ్రీ మరుపూడ కోదండరామి రెడ్డిగారు[1] పేర్కొన్నారు పంచతంత్ర హితోపదేశకథల్లోను, ఈ సప్త నీతికథల్లోను కాకులు, పావురాలు మొదలైన పక్షులు, నక్కలు, పిల్లులు, ఎడ్లు, సింహాలు మొదలైన జంతువులు మానవులతో కలసి మెలసి ఉండడం, సంభాషించడం హేతువాదదృష్టికి విరుద్ధంగా కన్పిస్తుంది కాని పిల్లల్ని ఆకట్టుకొనే కల్పనాశక్తి వాటిలో పుష్కలంగా ఉంది నిజానికి పిల్లలది కల్పనా ప్రవృత్తే ఆ కల్పిత కథల్లో కథలోని పాత్రలకంటె వాటినోటి నుండి వెలువడిన నీతులు ముఖ్యమైనవి సంస్కృతంలోని పంచ తంత్ర హితోపదేశ కథలకు రూపాంతరంగా చిన్నయసూరి రచించిన నీతి చంద్రికలోని కథలన్నీ పైకోవకు చెందినవె. హాస్య కథలు, అద్భుత కథలు, సాహసగాథలు మొదలైనవి పిల్లల్లో తాత్కాలిక ఆనందోత్సాహాల్ని కల్గిస్తాయి. అవి పిల్లలకు కేవలం వినోదాన్నేగాక విజ్ఞానాన్ని, 'నీతికుశలతను, ఉత్సాహాన్ని, ఊహాశక్తిని, జిజ్ఞాసను పెంపొందింప జెస్తాయి మానసికనైతికాభివృద్ధికి ఆకథ లెంతో తోడ్పడుతాయి

"ఐదు పదేండ్ల మధ్యవారికి దృశ్యసాహిత్యం ప్రథమంగాను శ్రవ్యసాహిత్యం రెండవదిగాను పఠనసాహిత్యం మూడవదిగాను ఉండాలి."[1] అన్న గొఱ్ఱెపాటి వెంకట సుబ్బయ్యగారి మాటలు గమనించదగినవి

## 1. 4. తృతీయదశ - పఠన సాహిత్యం

బాల్యంలో పదకొండు సంవత్సరాలనుండి పదిహేనేండ్ల వరకు తృతీయదశ, ఈ దశకు కౌమారమనికూడ వ్యవహారం సాధారణంగా పదకొండు సంవత్సరాల వయస్సు నుండి పిల్లల మనః ప్రవృత్తిలో ప్రత్యేకమైన మార్పులు గోచరిస్తాయని శాస్త్రజ్ఞుల నిర్ణయం.

---

1. బాల వాఙ్మయం కిన్నెర జనవరి 1954 పుట 27.

తృతీయ దశలో పఠనసాహిత్యం ప్రథమంగాను, దృశ్య శ్రావ్య సాహిత్యాలు ద్వితీయంగాను, వుంటాలని ఏడిద కామేశ్వరావు[1], గొర్తిపాటి వెంకటసుబ్బయ్య[2], జి. లలిత [3], గార్ల అభిప్రాయం.

పఠించి అర్థంచేసుకోగల సాహిత్యం పఠన సాహిత్యం. ఇది వివిధ సాహిత్య ప్రక్రియలతో కూడుకొని ఉంది. నీతి కథలు, అద్భుత కథలు, హాస్యకథలు, వీర గాథలు మొదలైనవి సాధారణంగా వచన రూపంలో వుంటాయి వందల సంవత్సరాలుగా అనుశ్రుతంగా వస్తున్న బాల జానపద కథలలో ముఖ్యమైనవి కాశీమజిలీ కథలు నలుగురు మంత్రుల కథలు, భట్టి విక్రమార్కుని కథలు, భేతాళ కథలు మొదలయినవి. ఈ కథలన్నీ ఈనాడు గ్రంథస్థమై ఉన్నాయి.

జ్ఞానంవల్ల సర్వకార్యాలను సక్రమంగా నిర్వర్తించ వచ్చుననే విషయం నలుగురు మంత్రుల కథలద్వారా బోధపడుతుంది భట్టివిక్రమార్కుని కథలు, భేతాళ కథలలో పట్టువిడవని విక్రమార్కుని కార్యశూరత్వం, అనుకున్న పనిని తప్పక సాధించి తీరాలనే పట్టుదల, పరిపాలనా విధానం మొదలైనవి ఆదర్శప్రాయాలవుతాయి. దేశింగురాజు కథ, కాంభోజరాజు కథ, పదకొండు రాత్రుల కథలు మొదలైన వాటిలోని వీరుల సాహసకృత్యాలు పిల్లల్ని అమితంగా ఆకర్షిస్తాయి వింతలు, విడ్డూరాలతో విచిత్రమైన సంఘటనలతో కూడిన సింధూబాద్ కథలు, అరేబియన్ నైట్సు కథలు లాంటి అద్భుత కథలు పిల్లలకు ఎక్కువ ఆనందాన్నిస్తాయి అద్భుత కథలు చదివి విస్మయం పొందినట్లే హాస్యకథలు చదివి పిల్లలు కడుపుబ్బ నవ్వుతారు. తెనాలి రామలింగని కథలు, పరమానందయ్య శిష్యులకథలు, మొగలాయి హాస్యకథలు మొద

---

1 ఆధునిక బాలవాఙ్మయము. సుజాత మే 1953. ఆంధ్ర సారస్వత పరిషత్తు సప్తమ మహాసభ సంచిక పుట : 160.

2 బాల వాఙ్మయం కిన్నెర. జనవరి 1954. పుట : 27

3. బాల సాహిత్యము **Andhra Balananda Sangham Silver Jubilee Souvenir.** 1973 పుట : 16

లైనవి హాస్యకథలలో ప్రధానమైనవి. చమత్కారం, ఆశ్చర్యం, వినోదం, విజ్ఞానం, సంతోషం మొదలైనవి కల్గించే ఇతివృత్తాలకు పఠనసాహిత్యంలో ప్రాధాన్యమెక్కువ

చిన్న వయసులో కల్పిత కథలంటే మక్కువచూపే పిల్లలు క్రమంగా చరిత్ర కథలు చదవడానికి ఇష్టపడతారు. వయసుతోబాటు వైజ్ఞానిక దృక్పథం పెరగడం వల్ల వారిదృష్టి వాస్తవిక సంఘటనలవైపు మరలుతుంది మహాపురుషుల జీవితాలకు సంబంధించిన కథలు వాస్తవమైనవి

మూడవ దశలోని పిల్లలకు ప్రతివిషయాన్ని తెలుసుకోవాలన్న కుతూహలం ఎక్కువ. అద్భుతం, హాస్యం, చమత్కారాలతో కూడిన గ్రంథాలు వారి కుతూహలాన్ని తీరుస్తాయి. ఏటువంటి విషయమైనా ఆకర్షణీయంగా కథా రూపంలో మాతృసమ్మితంగా బోధించడం అవసరం దేశచరిత్రలు, జీవితచరిత్రలు, పిల్లలకు వారి భవిష్య జ్జీవితాలలో బాటలు నిర్మించుకోవడానికి ఎక్కువగా తోడ్పడతాయి. పిల్లల మనస్సులలో చెరగని ముద్రలు వెయడమేగాక ఆ కథలు భావోద్దీపనను, ప్రేరణను, కల్గిస్తాయి దేశచరిత్రలు పిల్లల విజ్ఞానాన్ని విస్తృత పరుస్తాయి. విహార విజ్ఞాన యాత్రలు వారి మానసిక వికాసానికి తోడ్పడతాయి. వారిలోని నిగూఢ శక్తులు సమగ్ర వికాసం పొందడానికి పఠన సాహిత్యం దోహదం చేస్తుంది పిల్లల ఆలోచనాశక్తిని, కల్పనా శక్తిని పెంపుచేసే పఠనసాహిత్యాన్ని అందించి, వారి ఊహలను కోరికలను సమాదరిస్తూ, గౌరవిస్తూ, ఆచరణీయాలైన అంశాలను వారు గ్రహించే విధంగా పిల్లల్ని పెంపుచేయవలసి ఉంటుంది.

తృతీయ దశలోని బాలలకు నీతులు బోధించడానికి సుమతి శతకం, వేమన శతకం మొదలైన ప్రాచీన శతకాలు, కందుకూరి వీరేశలింగం పంతులు, వావిలికొలను సుబ్బారావు వంటి పెద్దలు బాలలకోసం వ్రాసిన నీతిగ్రంథాలు ఉపయోగకరం. కానీ ఈనాటి పిల్లల్ని అవి ఎక్కువగా ఆకర్షించి అలరింపలేవు. పదేండ్లు పైబడిన బాలలకు పాటలు, క్రీడావిషయాలు, కథలు, నాటికలు, శాస్త్ర విజ్ఞానం, నవలికలు, జీవిత చరిత్రలు, దేశచరిత్రలు, యాత్రాసాహిత్యం, క్లిష్టసమస్యలు, రాజ్యాంగ పరి

పాలనా విధానం మొదలైన విషయ వైవిధ్యంతో కూడుకున్న రచనలు ప్రీతికరంగా ఉంటాయి. ఈవయసు పిల్లలకు రేడియో కూడా ఎక్కువ ఉపయోగకరం. రేడియో ద్వారా చలన చిత్రాల ద్వారా ఎన్నో క్లిష్టమైన విషయాలను కూడ అవగాహన చేసుకోగలరు. కేవలం క్రొత్త విషయాలను తెలియజేయడం, తెలివితేటలను వృద్ధి పరచడమే కాదు, విస్మయానందాలతో నిండిన హృదయం మంచిచెడ్డలను గుర్తించ గలగాలి. నీతిని అలవరచుకొనే మనసుని కలుగజేసే సాహిత్యాన్ని చదివితే పిల్లలకు విజ్ఞానంతో బాటు మంచి వ్యక్తిత్వ సంస్కారం అలవడుతుంది.

శాస్త్ర విజ్ఞాన విషయాలను కథారూపంలో సరళమైన భాషలో పిల్లలకు బోధించడం, పిల్లల చేతనే వాటిని చెప్పించడం, బొమ్మలను చూపి వారి అభిప్రా యాలను వెలువరించడం వీటి ద్వారా పిల్లలలో శాస్త్రీయ దృక్పథాన్ని కల్గించవచ్చు ఈ విధంగా బాల విజ్ఞాన సాహిత్యం వృద్ధి పొందడానికి అవకాశం వుంటుంది.

మన జాతి సంస్కృతికి దర్పణాలైన రామాయణ, భారత భాగవతాదులు ఆధారంగా పిల్లలకు అర్థమయ్యే విధంగా సరళ శైలిలో బొమ్మలతోసహా బోధించడం జరుగుతున్నది. అవి పిల్లల సత్ప్రవర్తనకు మార్గదర్శకాలు కాగలవు.

వాక్యం చదివి అర్థం చేసుకోవడానికి సంభాషణలు తేలికగా ఉంటే పఠనీయ నాటికలు ఆదశలోని పిల్లలకు ఉపయుక్తంగా ఉంటాయి నాటికలు శ్రవణ పఠన యోగ్యాలు కావడంవల్ల వాటికి బాలసాహిత్యంలో ఎంతో ప్రాముఖ్యం ఉంది శ్రవ్యాలైన రేడియో నాటికలు సంభాషణా చాతుర్యం, ఉచ్చారణ దక్షతగల పిల్లలవల్ల రక్తికడతాయి నాటికలు వినోదాన్నేగాక విజ్ఞానాన్ని కూడ అందిస్తాయి.

బాలలు పూర్ణ ప్రతిభావంతులు కావడానికి పఠన సాహిత్యం ఎంతో తోడ్పడు తుంది. భాషాశిక్షణ విషయ విజ్ఞాన బోధనలేగాక భావశిక్షణ నైతిక శిక్షణలు కూడ ఆదశలోని బాలలకు అవశ్యం జరగాలి. పది పదిహేనేళ్ల మధ్యవారికి పఠన సాహిత్యం ప్రధానంగాను దృశ్య శ్రవ్య సాహిత్యాలు తదంగాలుగాను ఉంటాయి.

పై పరిశీలనను బట్టి పదిహేనేండ్ల ప్రాయం వరకు ఆయా దశలకు అనువుగా, ఆకర్షణీయంగా ఉన్న రచనల సముదాయాన్ని బాలసాహిత్యంగా గుర్తించవచ్చు

బాలసాహిత్యంలో గేయ ప్రధానమైన రచనలకు అసదృశమైన ప్రాధాన్యముంది. అనాదిగా బాలల కోసం ఒక సమాజంలో కర్తృత్వం తెలియని పాటలు, గేయాలు ఎన్నో ప్రచారంలో ఉంటాయి. అవి ఆ సమాజపు జానపద సాహిత్యంలో ఒక భాగం. ఆ పాటల కూర్పులో పద వాక్యపునరుక్తి, సరళశైలి, లయగతి గుర్తించదగిన లక్షణాలు కొన్నిపాటలు అసమగ్రంగా అలవోకగా కూర్చినట్లుంటాయి ఆధునిక బాలగేయ రచయితలు రచించిన పాటల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. ఒకటి జానపద బాలగేయాల వరుసలో వ్రాసినవి ఈ రకానికి చెందిన పాటల్లో అనుకరణ ఉన్న రచయిత భావానికి, కూర్పులో సమగ్రతకు ప్రాధాన్య మివ్వడం కన్పిస్తుంది స్వకపోల కల్పనలతో వ్రాసినవి రెండవ రకం. బాలల వయోభేదాన్ని అనుసరించి, మానసిక పరిణతిని బట్టి విషయ ప్రధానంగా నీతి, నడత, ఉత్తమ ఆదర్శాలు, విజ్ఞానం మొదలైన వాటిని ప్రతిపాదిస్తూ ఆకర్షణీయమైన శైలిలో ఆధునికులు వ్రాసిన పాటలు అనేకం. ఆధునిక తెలుగు బాలగేయ వాఙ్మయంలో ఈ రెండు రకాల గేయరచనలు పుష్కలంగా ఉన్నాయి. తెలుగు బాలసాహిత్య పరిణామ వికాస సంబంధమైన పరిశీలన ప్రకృత ప్రకరణంలోని ముఖ్య విషయం.

# 2. బాలసాహిత్య పరిణామం వికాసాలు.

## 2. 1. బాలసాహిత్య పరిణామం - వివిధ ఘట్టాలు.

తెలుగులో బాలసాహిత్య ప్రక్రియకు సంబంధించిన పరిణామ చరిత్రను మూడు ఘట్టాలుగా విభజించవచ్చు.

ప్రథమ ఘట్టం — ప్రాచీన బాలసాహిత్యం. (క్రీ. శ. 18 వ శతాబ్దాంతం వరకు వెలసినట్టిది.)

ద్వితీయ ఘట్టం — క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం లోనిది

తృతీయ ఘట్టం — ఆధునిక బాలసాహిత్యం. (వీరేశలింగం పంతులు కాలం నుండి ఈనాటి వరకు)

కాలక్రమ పద్ధతిని, బాల సాహితీ స్రష్టల దృక్పథాన్ని వారి రచనా రీతుల్ని, కొంత కథావస్తుతత్త్వాన్ని దృష్టిలో పెట్టుకొని చేయబడిన స్థూల విభజన యిది.

### 2 1. 1. ప్రథమ ఘట్టం - ప్రాచీన బాలసాహిత్యం (క్రీ. శ. 18 వ శతాబ్దాంతం వరకు వెలసినట్టిది.)

తెలుగులో బాలవాఙ్మయం ఎప్పుడు ప్రారంభమయిందో ఖచ్చితంగా నిర్ణయించి చెప్పలేము. కాని దాని పుట్టుక అతి ప్రాచీనకాలంలో గేయ రూపంలో జరిగి ఉంటుందని చెప్పవచ్చు. ప్రాచీన బాలగేయసాహిత్యం జానపద సాహిత్యంలో

ఒక విభాగం పద్యరచనకు పూర్వం తెలుగు వాఙ్మయమంతా గేయరూపంలోనే వుండి యుండ వచ్చునని విమర్శకుల అభిప్రాయం అసలు యే వాఙ్మయంలో అయినా కవితా పరిణామంలో గేయమే ప్రథమదశ. గేయరూపమైన తొలి కవిత ఆడుతూ పాడుతూ ఆనదింప దగిన ఆట–పాట (Ballad-dance) గా ఆరంభమై ఉంటుంది ఆట పాటి రూపమైన ఆ గేయకవిత ప్రారంభదశలో వ్యక్తిని లేదా బృందాన్ని ఆశ్రయించి వెలసి వుంటుంది. కాలక్రమంలో నాగరికత అభివృద్ధితో బాటు కథాగేయాలు, పద్య గద్యాది రచనలు, పరిణమించి ఉంటాయి తెలుగులో శిష్ట సాహిత్యసృష్టికి పూర్వం వెలసిన గేయరూపమైన పాటల, పదాల లక్షణ స్వరూపాల్ని వివరించడానికి తగిన ఆధారాలు లేవు అజ్ఞాత కర్తృకం అనే లక్షణంతో బాటు అనిర్ణీత కాలం కూడ జానపద గేయ లక్షణాల్లో ఒకటి. అవి ప్రతి, లయ, తాళ సహితమైన ఛందో లక్షణాలతో ఒప్పి ఉంటాయి.

ప్రాచీన బాలగేయ సాహిత్యంలో బాలలను ఉద్దేశించి పెద్దలుపాడే పాటలే అధికం దానికి కారణం ఆ సాహిత్యానికి మాతృహృదయం కర్తృత్వం వహించడమె తెలుగు తల్లులు తమ పిల్లలకు ఉగ్గుపాలతో బాటు సంగీత సాహిత్యాల్ని కూడ రంగరించి పోశారనడానికి తెలుగు సాహిత్యంలో ప్రాచీనకాలం నుండి వెలువడిన లాలిపాటలు, జోలపాటలు ముఖ్య నిదర్శనం పాల్కురికి సోమనాధుడు (1160–1240) "జోస ంచుచు సన్నుతిబాడు" జోల పాటలను పేర్కొన్నాడు [1] కాలం, కర్తృత్వం తెలియని ఇలాంటి జోలపాటలెన్నో పాల్కురికి సోమనకు పూర్వం తెలుగు దేశంలో జనసామాన్యంలో ఉండియుండవచ్చు. పాల్కురికి సోమనాధుడు తన కాలంలోని బాలలు ఆడుకొనే దాగుంజు, పోగుంజు లాట, కుందెవగుడి, గుడిగుంజంబు లాట, అత్సల వెందులాట, చప్పట్లు, సరిగుంజులాట, సేరబొంతలాట, సిట్లపొట్లాట, గోరంటలాట, దాగుడుమూతలాట, దిగుదిగు దిక్కనునాట మొదలైన ఆటల్ని పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు [2] నాచన సోముని (1344) ఉత్తర హరి

1 బసవ పురాణము. 3 వ ఆశ్వాసము. బెజ్జమహాదేవి కథ

2. సకలేశ్వర మాది రాజయ్యగారికథ.

వంశంలో ఉప్పెనపట్టి, గిల్లిదండ, మొదలైన ఆటల ప్రస్తావనవుంది.[1] శ్రీనాధుడు పల్నాటి వీరచరిత్రలో బాలచంద్రుడు గుమ్మడికాయలాట, పోకలాట, ముత్యాల మరు బంతులాట, రూకలకుప్పలాట మొదలైన ఆటలను ఆడినట్లు వర్ణించాడు.

ప్రాచీనాంధ్రకవులు కొందరు సందర్భాను సారంగా తమ గ్రంథాల్లో కొన్ని ఆటల పేర్లను పేర్కొన్నారు

వెన్నెలకంటి సూరన (16శ॥) విష్ణుపురాణంలో రామకృష్ణుల శైశవ క్రీడలను వర్ణించే సందర్భంలో పేర్కొన్న ఆటలివి.

"కోల కోతులు బిల్లగోళ్లు దూరసగోల
లందలంబులు మఱి కుందికాళ్లు
పుట్ట చెండ్లుప్పనపట్టె లాలింకులు
గుడు గుడు గుంచాలు గుంట చాళ్లు
చీకటి మొటికిళ్లు చిమ్మ బిల్లలు నెట్లు
బొట్టన గోలలు బొమ్మరాలు
కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్ల
దీవులు గొబ్బిళ్లి గూవనాలు

గుళ్లు దాగిలి ముచ్చులు గోడిపట్టె
వేలపాటలు సరిచేసు లీలకూగ
లాదిగా ............... " (2-202)

ధూర్జటి (16శ॥) శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యములోని తిన్నని కథలో పేర్కొన్న బాలల క్రీడా విశేషాలివి

1. ఉత్తర హరివంశం. 4-155.

"చిట్టి బొట్లా కాయ, సిరి సింగణావత్తి,
గుడు గుడు గుంచాలు, కుందెనగుడి,
దాఁగిలి ముచ్చులాటలు, గచ్చకాయలు,
వెన్నెల కుప్పలు, తన్ను బిల్ల,
తూరన తుంకాలు, గీరన గింజలు,
పిల్ల దీపాలంకి, బిల్ల గోడు,
చిడు గుడువ్వల పోటి, చెండు గట్టిన బోది,
యల్లి యుప్పనఁ బట్టె, లప్పళాలు,

చిక్కనా బిల్ల, లోటల్లు చింద ఆది
యైన శైశవ క్రీడా విహార సరణి"
........................ (3-33)

తెనాలి రామకృష్ణుని పాండురంగా మాహాత్మ్యం (3-178) లో దాగిలిమూత బంతిఆట, నాలుగుస్తంభాలాట, సోగటాలఆట, తన్నుబిళ్ళాట మొదలైన ఆటల ప్రస్తావన ఉంది. కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, అనంతా మాత్యుని భోజరాజీయం, పింగళి సూరన కళాపూర్ణోదయం, శేషం వెంకటపతి శశాంకవిజయం మొదలైన గ్రంథాల్లో బాలల ఆటలెన్నో సందర్భవశాత్తుగా ప్రస్తావించ బడ్డాయి.

ధరణి దేవుల రామయ మంత్రి (18శ॥) దశావతార చరిత్రలో బాలికల క్రీడలను ఇలా పేర్కొన్నాడు.

"అచ్చన గండ్లు దోయాలును దాఁగిలి
మూతలు నాలుగు మూలలాట
గుజ గుజ రేకులు గుజ్జన గూళ్లును
బొమ్మల పెండ్లిండ్లు నమ్మనములు

వత్త గోడలియాట నాలుమగని యాట
తాటి చెట్లాట కోలాటములును
పింపిళ్లు జెండు గోరింపులు వామన
గుంతలు వెన్నెల కుప్పలాది

మఱియుఁ బుడికిళ్లు మొదలుగా మనసువచ్చు
నాటలన్నియుఁ దోడి తొయ్యలులఁ గూడి
పడుచుదనమున వేడుక పడుచు నాడు
ముద్దరాం।డకు నల్లారు ముద్దుగాను."

అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి (5-155) లో కూడా ఆడపిల్లలాడుకొనే ఆటల ।పశంసఉంది పాల్కురికి సోమనాథాదులు పైనపేర్కొన్న ఆటలన్నింటికి పాటలను అనుమేలన మొనర్చుకొనే వారని ఊహించవచ్చు. పాటలు పాడుతూ ఆటలాడడం ।ప్రాచీన పద్ధతి పై ఆటల్లో ఏవో కొన్నితప్ప తక్కినవాటి స్వరూపాలీనాడు మనకు తెలియవు.

తాళ్ళపాక కవుల రచనలలో బాలగేయాల ।పస్తావన కనిపిస్తుంది, అన్నమాచార్యుల సంకీర్తనలలో లాలిపాటలు, జోలపాటలు, ఉగ్గుపాటలు, ఊయల పాటలు, మొదలయినవెన్నో ఉన్నాయి. వారు లాలిపాటల్ని జానపద గేయాల వరుసల్లో ।వాశారు. ఉదాహరణకు .

"లాలనుచు నూచేరు లలన లిరుగడల
బాలగండవరవు గోపాల నినుఁ జాల॥"

పసిబిడ్డల్ని ఊయల్లో పెట్టి ఊపుతూ పాడే లాలిపాటలను ఉయ్యాల పాటలని కూడా వ్యవహారం.

"ఉయ్యాల బాలునూచెదరు కడు
నొయ్య నొయ్య నొయ్యనుచు
... ... ... ... ...
లాలి లాలి లాలి లాలెమ్మ యెల్ల
లాలి లాలి లాలనుచు"

(ఆధ్యాత్మ సంకీర్తనలు సంపుటి 3-314.)

చంచలమై డోలాయమానమైన ఉయ్యాలనుబట్టి 'ఉయ్యాలా' అనే సంబుద్ధితో ఉన్న పాటను కూడా అన్నమాచార్యులు రచించి ఉన్నారు

"అలర చంచలమైన ఆత్మలందుండని
అలవాటు సేసే నీ వుయ్యాల
పలుమారు నుచ్ఛ్వాస పవనమందుండనీ
భావంబు దెలిపె నీ వుయ్యాలా
... ... ... ..."

(ఆధ్యాత్మ సంకీర్తనలు. సంపుటి 2-68.)

ఇది పారమార్థిక గేయం. ఉదయాస్తగిరులు స్తంభాలై నక్షత్ర మండలాన్ని మోసినట్లు వేదాలు గొలుసులై వెలసినట్లు ఇందు వర్ణితం ఉయ్యాలకే 'డోల' అని కూడా పేరు. తాళ్ళపాకవారి కాలంలో తిరుమలమీద శ్రీ వెంకటేశ్వరస్వామి వారికి డోలోత్సవం సాగేది ఆ సందర్భానికి సరిపోయే అన్నమాచార్యుల జోలపాట :

"డోలాయాంచల డోలాయాం హరే డోలాయాం
మీన కూర్మ వరాహ మృగపతి యవతారా
దానవారే గుణశౌరే ధరణీధర మరుజనకా

వామన రామ రామ వరకృష్ణ అవతారా
శ్యామలాంగా రంగా రంగా సామజ వరదా మురహరణా"
(ఆధ్యాత్మ సంకీర్తనలు. సంపుటి 7-140.)

ఇందులో దశావతారాల వర్ణన ఉంది. "డోలాయాంచల డోలాయాం" అనేపదమును బట్టి ఆపాటను 'డోలాపదం' గా వెటూరి ఆనందమూర్తిగారు పేర్కొన్నారు.[1]

అన్నమాచార్యులు పిల్లలకు సంబంధించి ఉగ్గుపాటలు కూడ వ్రాశారు. ఉగ్గు పెట్టిన తర్వాత తల్లులు పిల్లలకు చేసే సంప్రదాయగతమైన చేష్టలన్నీ అందులో చక్కగా వర్ణితమై ఉన్నాయి

ఉదాహరణకు :

"ఉగ్గు పెట్టరే వోయమ్మా - చె
య్యొగ్గివిదే శిశువోయమ్మా
కడుపులోని లోకమ్ములు కదలీ
నొడలొంచకురే వోయమ్మా
తొడికెడి సరగున దొలగ దియ్యరే
వుడికెడి పాలివి వోయమ్మా
చప్పలు గట్టుక సన్నపు బాలుని
నుప్పర మెత్తకు రోరమ్మ
అప్పడె సకలము నడిమీ వోరనె
వొప్పదు తియ్యరె వోయమ్మా"
(ఆధ్యాత్మ సంకీర్తనలు సంపుటి 3-483)

---

1 తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషాలు. (ద్వితీయ భాగము). 1976. పుట 332.

జానపద గేయాల వరుసల్లో అన్నమాచార్యులు కొన్ని పదాల్ని వ్రాశారు. ఉదాహరణకు :

"అబ్బురంపు శిశువు ఆకుమీఁది శిశువు
దొబ్బుడు రోలి శిశువు తప్పిపి తప్పిపి తప్పిపి"
(ఆధ్యాత్మ సంకీర్తనలు సంపుటి 3-288)

పైపాటలో 'త్రుప్పి త్రుప్పి త్రుప్పి' అనే శబ్ద చమత్కారం పిల్లల్ని ఆకర్షిస్తుంది

"బండి విరిచి పిన్న పాపలతో నాడి
దుండగీడు వచ్చె దోబూచి
... ... ... ... "

(సంపుటి 3-295)

అంటూ చిన్నపిల్లల్ని ఆడించడానికి కూడా వారు కొన్ని పాటల్ని వ్రాశారు తల్లులు సాధారణంగా తమకళ్లకు చేతులు అడ్డుగా పెట్టుకొని 'దోబూచీ' అంటూ గప్పున తెరచి పిల్లల్ని విస్మయపరుస్తుంటారు దొంగలి ముచ్చులాట కూడ ఇలాంటిదే ఈ ఆటలో పిల్లలు దొంగలు తల్లి ఒకరి కళ్లుమూస్తుంది మిగిలిన వాళ్ల దాక్కుంటారు. వాళ్లని వెదకి పట్టుకోవడం ఆటలోని విశేషం అన్నమాచార్యులు వ్రాసిన 'కూకూగుపదం' అలాంటి బాల క్రీడా విశేషాన్ని వర్ణించెదే

"గుఱుతెఱిగిన దొంగ కూకూగు - వీడె
గుడిలోన దాగీన కూకూగు
... ... ... ... "

(సంపుటి 4-56)

ఈ కూకూగు పదాన్నిగూర్చి వెటూరి ఆనందమూర్తిగారు కొంత వివరించారు[1] ఆటలో దొంగ ఇతరుల్ని పట్టుకోబోయేటప్పుడు తరిమి తరిమి "అగ్గో" అని చూపేటప్పుడు 'కూగూగు' అనే ఊత పదాన్ని ప్రయోగిస్తారట. పైపదంలో దొర దొంగ అయినవాడు గుడిలో దాక్కున్న బాలకృష్ణుని అడుగడుగో అని రెట్టించి పట్టబోవు సందర్భంలో పలికినట్టుగా 'కూకూగు' అనే ఊతపదం చేరిఉంది. 'దోబూచి' లాంటిదే ఈ 'కూకూగు' పదం కూడా తాళ్ళపాకవారు తమ కీర్తనల్లో ప్రస్తావించిన బాలల ఆటలను డా తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు ఇలా పేర్కొన్నారు [2]

"కొల్చిన బొడ్డు దమ్మిని గుంత పోకలాడెనట (వామన గుంటలు)
రచ్చనా చన్నులు బొమ్మరాలు తానాడెనంట (బొంగరాలాట)
అరసి నాపేరు దిద్దె ఆడె చక్రపు బిళ్ళంట (గిల్లెదండ)
గరిమం దొడలు ముట్టి కంబాలాట లాడెనంట (నాలుగుస్తంభాలాట)
అలనా కౌగిట సప్పలప్ప లాడెనంట (అప్పాలాట)
అలమి శ్రీ వేంకటేశుఁ డాలిమగ నాటలంట (పెండ్లియాట)"

ఇలాగే వ్రేపల్లెలోని బాలకృష్ణుని అల్లరి ఆటలను వర్ణిస్తూ బొమ్మపెండ్లి, గురుగుల ఆటలను (4-63) పేర్కొన్నారు. మాడుపూరి చెన్నకేశవస్వామి ఆడిన ఆటలను వివరిస్తూ పిల్లదీవులు, రాసక్రీడలు, చెట్టా పట్టాలు, దాగిలి ముచ్చులు, బండవిరి బాటలు (8–470) అనే ఆటలను ప్రస్తావించారు ఉద్దగిరి కృష్ణుని బాల్య క్రీడలను అభివర్ణిస్తూ పిల్లగొట్లాట, పుట్ట చెండ్లాట, సముద్ర బిళ్ళలాట, సిరి సింగన వత్తి, ఉద్దగచ్చన కాయలాట మొదలైన ఆటలను వివరించారు. సిరిసింగన వత్తిఆట చాలా శ్రమతో కూడుకున్న ఆటకాబోలు · "చెమటలు గారంగ సిరిసింగన వత్తి

---

1. జానపద సాహిత్యోద్ధారకులు పరిశోధన. ఆగష్టు 1954.

2. పూర్వ సాహిత్యంలో బాలల ఆటలు. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభల ప్రత్యేక సంచిక, 1977 పుట : 9

యాడేసు" అని తాళ్ళపాకవారు వర్ణించారు తాళ్లపాక పెద తిరుమలయ్య తన శృంగార దండకము (పుట . 90) లో గాలిపటాల ఆటను ప్రస్తావించారు ఇవన్నీ జానపదగేయాల వరుసల్లో రచింపబడిన బాలగేయాలు, త్యాగరాజు, రామదాసు, తూములక్ష్మి నరసింహదాసు మొదలైనవారి భజన పాటల్లో, కీర్తనల్లో, జానపద గేయాల వరుసల్లో ఉన్న కొన్ని లాలిపాటల్ని గుర్తించవచ్చు, సారంగపాణిపదాల్లో కూడ ఇలాంటివి చాలాఉన్నాయి.

ప్రాచీన బాలగేయాలు తల్లులు పాడుతుండగా పిల్లలు విని ఆనందించడానికి మాత్రమె తర తరాలుగా అవి తెలుగుదేశమంతా వ్యాప్తి పొందాయి ప్రాచీన బాలసాహిత్యం అధికంగా గేయరూపంలోనే జరిగిందని పై ప రి శీ ల న ను బట్టి గ్రహించవచ్చు

ప్రాచీన బాలసాహిత్యంలో మౌఖికమై అను స్రుతంగా వస్తున్న గేయాలేగాక అమ్మమ్మలు చెప్పే కాశిమజిలీ కథలు, పేదరాసి పెద్దమ్మకథలు, పిట్టకథలు, వినోదం కోసం వేసే చిక్కు ప్రశ్నలు మొదలైనవి కూడ ప్రాధాన్యం వహించినట్లు తెలుస్తు న్నది వాటిలో పోయినవి పోగా కొన్ని మాత్రమె మిగిలాయి అవికూడా చాలావరకు గ్రంథస్థం కాలేదు

## 2. 1. 2. ద్వితీయ ఘట్టం - క్రీ శ. 19 వ శతాబ్ది పూర్వార్ధంలో వెలసినవి.

అక్షరాభ్యాస కాలంలోనే పిల్లలకు సుమతి శతకం, వేమన పద్యాలు, భాస్కర శతకం, నృసింహ శతకం, కృష్ణశతకం, నారాయణ శతకం మొదలైన శతకాల్ని గజేంద్రమోక్షం, కుచేలోపాఖ్యానం, రుక్మిణీ కళ్యాణం, ప్రహ్లాద చరిత్ర, ధ్రువో పాఖ్యానము, మొదలైన భాగవతాది పురాణ గ్రంథాల్లోని గాథల్ని బాల సాహిత్యం క్రింద జమకట్టి పిల్లలచేత కంఠస్థం చేయించే సంప్రదాయం ఇటీవలి వరకుండేది

పందొమ్మిదో శతాబ్ది పూర్వార్ధంలో పాశ్చాత్యుల ప్రభావం కారణంగా తెలుగు రచయితలు కొద్దిగానో గొప్పగానో పాశ్చాత్య భాషా సంస్కృతులను గూర్చి తెలుసు

కున్నారు. ఆధునిక స్కూలువిద్య దేశంలో ప్రవేశ పెట్టబడింది. 1820 లో 'ఉపయుక్త గ్రంథకరణ సభ' (**The Madras School Text Book and Vernacular Society**) మద్రాసులో ఏర్పడింది. ఆసభ నవీన విద్యా పద్ధతిని అనుసరించి పాఠ్యగ్రంథాల్ని సిద్ధంచేసి దేశీయుల మనఃప్రవృత్తిలో మార్పువచ్చేటట్లు చేసింది. పందొమ్మిదో శతాబ్ది పూర్వార్థంలో విద్యార్థుల వయోభేధాల్ని అనుసరించి రచింపబడిన పాఠ్యగ్రంథాలు క్రమక్రమంగా ప్రచారానికి వచ్చాయి. తెలుగు రచయితల్లో నూతన దృక్పథం ఏర్పడటానికి అవి ఎంతగానో దోహదం చేశాయి.

పిల్లలకు ఉత్సాహాన్ని, లోకనీతిని, జ్ఞానాన్ని, ఊహాశక్తిని, పెంపొందింపజేసే పంచతంత్ర కథలు అతి ప్రాచీనమైనవి. క్రీ. పూ 200 సంవత్సరాల ప్రాంతంలో భారతదేశంలో మొదట సంస్కృత భాషలో పంచతంత్రం వెలువడిందని పరిశోధకుల నిర్ణయం సంస్కృతంలోని పంచతంత్ర కథల్ని రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు 1834 లో బాలలకోసం వ్యావహారికమైన తెలుగులోకి అనువదించారు. అవిగాక బాలబాలికల మానసిక నైతికాభివృద్ధికి తోడ్పడే నీతిదాయకమైన కథల్ని 19 వ శతాబ్ది పూర్వార్థంలో చాలామంది వ్రాశారు. కాశీమజిలీ కథలు, భట్టి విక్రమార్కుని కథలు, కాంభోజరాజు కథలు, తాలాచార్యుల కథలు, తెనాలి రామలింగని కథలు, శుకసప్తతి కథలు, భేతాళ పంచవింశతి, పలుకని పద్మాక్షి కథలు మొదలైన గ్రంథాల్లోని విషయం ఎక్కువగా పెద్దలకు సంబంధించినదే అయినా పదేండ్ల వయసు పిల్లలు ఆసక్తితో చదవడానికి వీలుగా రచితము లయ్యాయి అమరకోశం, బాలరామయణం మొదలైనవి కూడా పిల్లలకోసం వ్రాయబడిన గ్రంథాలే పుదూరి సీతారామ శాస్త్రి రచించిన పెద్దబాలశిక్ష (1845) కూడ బాలబాలికలకోసం వెలువడిన గ్రంథమే.

పైన పేర్కొన్న గ్రంథాల్లోని విషయాలు బాలబాలికల గ్రహణ శక్తికి అందుబాటులో ఉన్నా వాటిలోని భాష క్లిష్టంగా ఉండటంవల్ల అవి పెద్దలకు మాత్రమే పఠన యోగ్యంగా ఉండేవి రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు బాలబాలికలకోసమని వ్యావహారిక భాషలో వ్రాసి 1834 లో ముద్రించిన పంచతంత్రం 1870 వరకు

చాలా ముద్రణలతో అలాగేవుంది తర్వాతి ముద్రణలో గ్రాంథిక భాషలోనికి మారిపోయి అచ్చయింది అందువల్ల అది కేవలం పెద్దలకు మాత్రమె పనికివచ్చే గ్రంథంగానిలిచింది చిన్నయసూరి (1806–1862) పంచతంత్ర హితోపదేశకథల్ని ఆధారంగా చేసికొని మిత్రలాభము, మిత్రబేధము, అనే రెండు భాగాల్ని నీతిచంద్రిక (1853) పేరుతో రచించారు. వారు బాలల్లో భాషాజ్ఞానం, నీతి కుశలత పెంపొందే విధంగా నీతిచంద్రికను రూపొందించారనడంలో సందెహంలేదు కాని అది గ్రాంథిక భాషలో క్లిష్టమైన వచన రచనలో సాగడంవల్ల పెద్దల సాయం లేనదే పిల్లలు స్వయంగా చదువుకోలేరు. అవన్నీ వాస్తవానికి బాలలకు పనికివచ్చే రచనలుకావు. అవి పిల్లలకు కూడా ఉద్దేశింపబడిన రచనలనే భావంతో ప్రస్తావించడమైనది

బాలసాహిత్య పరిణామ చరిత్రలోని ద్వితీయ ఘట్టంలో చారిత్రక గాధలు, నీతికథలు, సాహసగాథలు మొదలైనవి స్త్రీలకు, బాలబాలికలకు ఉపయుక్తంగా వెలువడి నాయని చెప్పవచ్చు, ఆ కథా వాఙ్మయ కారులు అందరి గురించి మనకు తెలియ రాకున్నా వారి రచనలు మాత్రం పెద్దలకు, బాలలకు ప్రీతిపాత్రాలై నిలచాయి. మొత్తం మీద ప్రత్యేకమైన బాలసాహిత్య ప్రక్రియ 19వ శతాబ్ధికి పూర్వ వెలసి విస్తరించలేదని, అది ఆంగ్లసాహిత్య పరిచయంవల్లనే నూతనంగా అవతరించిందని చెప్పవచ్చు.

## 2. 1. 3. తృతీయ ఘట్టం - ఆధునిక బాలసాహిత్యం

(వీరేశలింగం పంతులు కాలమునుండి నేటివరకు)

క్రీ. శ. 19వ శతాబ్ది ఉత్తరార్థం నుండి నేటి వరకు వెలసిన బాలసాహిత్యాన్ని ఆధునిక బాలసాహిత్యంగా పేర్కొనవచ్చు అందులోను ఆరంభదశ, వికాసదశ అని రెండు దశల్ని గుర్తించవచ్చు.

### 2. 1. 3. 1. ఆధునిక బాలసాహిత్యారంభ దశ,

ఆంగ్ల భాషా ప్రభావ కారణంగాను, రచయితల మౌలిక ప్రయత్న మూలం గాను తెలుగులో 19వ శతాబ్ది ఉత్తరార్థంలో గద్య పద్య గేయ రూపంగా ఆధునిక

బాలసాహిత్యం ఆవిర్భవించి వ్యాప్తికి వచ్చింది ఆంధ్ర సాహిత్య చరిత్రలో లాగే తెలుగు బాలసాహిత్య చరిత్రలోను కందుకూరి వీరేశలింగం పంతులు గారితో నూతనశకం ఆరంభమయింది.

## 1. వీరేశలింగం పంతులు (1848-1919)

ఆధునిక తెలుగు వాఙ్మయ చరిత్రలో అనేక నూతన ప్రక్రియలకు ఆద్యులై బహుగ్రంథ కర్తలయిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు బాలలకు ఉపకరించే రచనలు కూడ చేశారు. వారు మొదట చిన్నయ సూరిని అనుకరించి క్లిష్టమైన వచనరచనలో సంధి విగ్రహాలను రచించారు అలాంటి శైలివల్ల పాఠకులకు శ్రమకు తగ్గ ఫలితం లేదన్న విషయాన్ని గ్రహించిన పంతులుగారు సులభశైలిలో రచనలు చేయడానికి పూనుకున్నారు ముఖ్యంగా బాలల కుద్దేశించిన రచనలు సులభశైలిలో ఉండాలన్న విషయాన్ని మొదట గ్రహించి పాటించిన వారు పంతులు గారే. ఆంగ్లంలోని ఈసపు కథల్ని (Aesop's Fables) నీతికథా మంజరి పేరుతో అనువదించి 1893 లో రెండు సంపుటాలుగా బొమ్మలతో సహా ప్రకటించారు. ఒక్కొక్క కథలో తెలియ దగిన నీతిని ఆకథచివర గీతపద్యంలో ఇవ్వడం జరిగింది. ఉదాహరణకు :

1 "వసుధ లోపల నరులను బాధచేయు
స్తోత్ర పాఠుల మించు శత్రువులు లేరు
లాభ మొంద ముఖస్తుతుల్సలుపు వారి
వలల దగులక కనుగల్గి మెలగ నలయు"

(8వ కథ కాకి - నక్క)

2. "అనుభ వంబును బట్టియే అవనియందు
జనులకును దెల్వియబ్బుట సహజగుణము

కాలుగాలి శ్రమంపడు గండుపిల్లి
నిప్పు యొద్దకు బోవునే యెప్పుడైన."
(43వ కథ పిల్లి — యెలుకలు.)

కందుకూరివారే 1872 లో పిల్లలకోసం నీతిదీపిక అనే శతకాన్ని, 1889 లో బాలికలకోసం స్త్రీ నీతి దీపిక అనే శతకాన్ని ప్రకటించారు అబద్ధాలాడడంవల్ల వచ్చే అనర్థాలను పిల్లలకు వివరించడానికి 1887 లో సత్యసంజీవని అనే పెద్దకథను వ్రాశారు చింతామణి (1890-1904) పత్రికలో వారు వ్రాసిన పరోపకారం, తియ్య మందులు, వెలలేని చిన్న మూలిక, బాదంకాయ, కణుదురీగ, వరికంకులు మొదలైన కథలెన్నో ప్రచురితమైనాయి ప్రాథమిక తరగతుల విద్యార్థులకు ఉపయోగపడే తెలుగువాచకాలను కూడా పంతులుగారు రూపొందించారు పాఠ్యపుస్తకాల్లో సంస్కరణాత్మకమైన మార్పుల్ని ప్రవేశపెట్టిన గౌరవంకూడా పంతులుగారికే దక్కింది. జానపదగాథల్ని విజ్ఞానశాస్త్ర విషయాల్ని సమన్వయించి వారు పిల్లలకోసం చక్కని తెలుగు వాచకాల్ని తయారుచేశారు. వాటిని మాక్మిలన్ కంపెనీ ప్రచురించింది అవి నేడలభ్యాలు వాటిలో పాఠాలేగాక బాలలకు ఆసక్తికరమైన చిన్న చిన్న పాటలుకూడా ప్రకటించబడ్డాయి ఉదాహరణకు గిడుగు సీతాపతిగారి 'ఎలుకా — పిల్లి'

"ఎలుక తోడ పిల్లి యొకటి చెలిమిచేసి వింతగాను
మంచి మాటలాడి దానిచెంత చేరెనూ.
... ... .. ... ... "

## 2. వావిలికొలను సుబ్బారావు. (1863 - 1939)

కందుకూరి వీరేశలింగం పంతులుగారి వచన రచనను అనుకరిస్తూ సుబ్బారావు గారు రామాయణ, భారత, భాగవత కథల్ని బాలక హితచర్య, కుమార హితచర్య మొదలయిన పుస్తకాల్ని బాలలకోసం రచించారు. అంతేగాక వారు ఆర్యసంస్కృతిని

చిన్నప్పటినుండి పిల్లల్లో ప్రవేశపెట్టడానికి అష్టాదశ పురాణాల్లోని కథల్ని తీసుకొని ఆర్యకథానిధి పేరుతో ప్రాథమిక తరగతులకు ఉపయోగపడే విధంగా రచించారు.

## 3. వేంకట పార్వతీశ కవులు.

బాలాంత్రపు వెంకటరావు (1880-1972) ఓలేటి పార్వతీశము (1882-1955) గార్లను కూడ బాలసాహిత్య స్రష్టలుగా పేర్కొనవచ్చు వారు రెండవ తరగతి నుండి ఐదవ తరగతి వరకు చదువుకొనే పిల్లలకు పాఠ్య భాగాలుగా ఉపయుక్తమయ్యే బాలగీతావళులు రచించారు, ఆ జంటకవులు రామాయణం, భారతం మొదలైన గ్రంథాల్ని కూడ బాలలకోసం సచిత్రంగా ప్రచురించారు సుమారు రెండు దశాబ్దాలవరకు వారి పుస్తకాలకు మంచి గిరాకీ ఉండేది. బాలగీతావళిలోని రచనలు భావగర్భితంగాను, సరళంగాను ఉన్నాయి ఉదాహరణకు :

> "ఎదుట కనబడుచున్న ఎల్లదాని
> కనుగొనగ నేర్చుకున్న కన్నుబోయి
> తన్ను కనుగొన జాలక యున్నదకట
> ఎవరి సంగతి వారల కెరుక పడునె॥

ఎవరి తప్పొప్పులు వారికి తెలియవనే విషయాన్ని చెప్పడానికి పై పద్యంలో చక్కని దృష్టాంతాన్ని చూపారు. [చీకటి నుద్దేశించి వారుచెప్పిన చమత్కారం గమనించదగింది.

> "దివ్వె గూడులకును దిగువ మిద్దెల మీద
> స్తంభములకు వెనుక దాగిదాగి
> ఇల్లు వదలదేమి యీ మొండి చీకటి
> తన్ను వెలుగులెంత తరుముచున్న."]

అదే విధంగా ఐదవ తరగతి బాలగీతావళిలో పుస్తకాన్ని గురించి వెంకట పార్వతీశ కవులు ఉత్ప్రేక్షించిన పద్ధతి అపూర్వం.

"మించు విజ్ఞాన జలధి తేలించు నావ
మంచి చెడ్డల గతు లేర్పరించు తోవ
మానసిక రోగముల నెల్ల మాన్పు మందు
పొగడ తగునిందు నీకెందు పుస్తకంబె"

పిల్లలు పాడు కోవడానికి వీలుగా మన సమాజంలో అప్రపతంగా వ్యాప్తిలో ఉన్న పాటల్ని సేకరించి ప్రకటించమని గిడుగు రామ్మూర్తి పంతులుగారు వెంకట పార్వతీశ కవులకు సలహా ఇచ్చారట[1]. వారి ఆదేశాల్ని అనుసరించి సంకలనం చేసి ప్రచురించినదే మొదటి తరగతి బాలగీతావళి సంపుటి. కాబట్టి తెలుగులో బాల సాహిత్యం ఒక వినూత్న రూపాన్ని సంతరించు కోవడానికి గిడుగు రామ్మూర్తి పంతులుగారి ప్రోత్సాహం ఉన్నదన్నది గమనించదగిన అంశం.

పైన పేర్కొన్న రచనలన్నీ ప్రాచీన భాషా లక్షణాలకు లోబడి రచింపబడినవే కాని పిల్లలకు సులభంగా బోధపడే జీవ ద్భాషలో వ్రాయబడినవి కావు.

## 4. గురజాడ అప్పారావు.

వీరేశలింగం పంతులుగారి తర్వాత బాలవాఙ్మయ వైతాళికులుగా పేర్కొనదగినవారు గురజాడ అప్పారావుగారు అసలు ఆధునిక బాలగేయ ప్రక్రియకు ఆద్యులుగా గురజాడ వారినే పేర్కొన వలసి ఉంటుంది వారు వ్రాసిన పూర్ణమ్మ కథ, కన్యక మొదలైనవి "పాత్యేగేయే చ మధుర" మైనవి. కథావస్తువును బట్టి అవి బాలసాహిత్య పరిధిలోకి రావనే సందేహం కొందరికి కలగింది దానికి సమాధానంగా సోమసుందర్ గారు ఇలా పేర్కొన్నారు. "గురజాడ పిల్లల మానసిక వికాసం కోసం లవణరాజుకల, కన్యక, పూర్ణమ్మ, డామన్ పితియన్ కథన కావ్యాలను హృదయంగమమైన శైలిలో ఉత్తమ కళా సంవిధానంలో విరచించారు ఈ నాలుగు కావ్యాలు పిల్లలకు ప్రయోగించే సాహిత్యంలో నాలుగు వజ్రాలని చెప్పాలి

---

1 సోమసుందర్ పిల్లల చిరునవ్వుల్లో తెలుగు వెలుగులు (ఒక పరిశీలన). కిన్నెర. నవంబరు. 1952

ఇవి ఆరవ తరగతి నుంచి ఎనిమిదవ తరగతి వరకు చదువుకొనే పది పదిహేను వర్షాల మధ్య పిల్లలకు మహత్తరమైన హృదయ సంస్కారాన్నిస్తాయి. ఈనాలుగు కావ్యాలను బాలసాహిత్యంలో జమకట్టడం కొంత వరకూ సాహసమే అయినా వీటి సంవిధానాన్ని బట్టి చూసినా కథనరీతిని బట్టి చూసినా యిది వాస్తవానికి దూరం కాదని స్పష్టపడుతుంది "1 అలపర్తి వెంకట సుబ్బారావుగారు కూడ "మొట్ట మొదట కీర్తిశేషులు గురజాడవారు వృషభగతి రగడకు దగ్గరగా వుండే సరిక్రొత్త మాత్రా ఛందస్సులో.

"మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
తల్లులగన్నా పిల్లల్లారా
విన్నారమ్మా యీకథను ?... "

అంటూ "పుత్తడిబొమ్మ పూర్ణమ్మ కథను వాడుకభాషలో గేయకథగా ఆలపించారు పూర్ణమ్మ పాఠకహృదయా కాశంలో పూర్ణిమలా నిలిచింది." 2 అని ప్రశంసించారు.

చిన్న పిల్లల్ని దృష్టిలో పెట్టుకొని గురజాడ వారు కమ్మని శైలిలో మరి కొన్ని గేయాల్ని కూడ వ్రాశారు. అవి వారి మరణానంతరం 1930 భారతిలో 'మిణుగురులు' అనే పేరుతో ప్రకటితమై విశేష ప్రచారాన్ని పొందాయి అందు లోని ఒక గేయం.

"అరటి కాయ బజ్జి
మినప్పప్పు సొజ్జి
కలసి మెలసి తిందాం
కథలు పొథలు విందాం

1. పిల్లల చిరునవ్వుల్లో తెలుగు వెలుగులు (ఒక పరిశీలన) కిన్నెర. నవంబరు 1952
2. బాలల కోసం గేయకథలు ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభల ప్రత్యేక సంచిక, 1977 పుట 123.

ఏనుగు ఎక్కి మనం
ఏవూరెళదాం ?
ఏనుగు ఎక్కి మనం
ఏలూరెళదాం !
... ... ... "

(గురజాడ రచనలు 6. ముత్యాల సరాలు 5వ ముద్రణ 1965 పుట 68)

## 5. నాళం కృష్ణారావు. (1880 - 1961)

వీరేశలింగంగారి శిష్యులూ, ఖండకావ్య రచనలో సిద్ధహస్తులూ అయిన నాళం కృష్ణారావుగారు స్వతంత్ర రచనలేగాక అనువాద రచనలుకూడా చేశారు సరళమైన భావాలతో, చిన్నచిన్న పదాలతో కూడిన ఆరచనలు ఆయనకు 'మధురకవి' అనే బిరుదును సంపాదించి పెట్టాయి. బాలబాలికల్లో పద్యపఠనోత్సాహాల్ని పురిగొల్ప గల వారి ఖండకావ్యాల్ని 1934 లో ప్రభుత్వం విద్యార్థులకోసం అచ్చువెసింది. పైడిలేడి, అపవాదము, గోగీతము, ముద్దు, విరిదండ, దీపావళి, గోరుముద్దలు, మీగడ తరకలు, వెన్న బుడగలు, పాలతరగలు, తేనెచినుకులు మొదలైన పేర్లతో వారి మధుర గీతికలు వెలువడ్డాయి

ఆధునిక బాలసాహిత్య ఆరంభదశలో బాలబాలికలకు సంబంధించిన రచనలు సులభశైలిలో రచితములైనా అవి ప్రాచీన భాషాలక్షణాలకు లోబడి రచింపబడినవే. బాలల వయస్సును బట్టి ప్రత్యేకింపబడిన బాలసాహిత్య రచనలు ఆరంభదశలో వెలువడలేదనే చెప్పవచ్చు బాలలే స్వయంగా చదివి అర్థం చేసుకోగల సాహిత్యం మాత్రమే అసలు సిసలైన బాలసాహిత్యమని భావిస్తే అటువంటి రచనలు బాల సాహిత్య ఆరంభ దశలో అంతగా వెలువడలేదనే చెప్పవచ్చు

## 2. 1. 3. 2. ఆధునిక బాలసాహిత్య వికాసదశ.

20 వ శతాబ్ది ప్రారంభంలో ఆధునిక తెలుగుసాహిత్యంలో వివిధ ప్రక్రియలు ఆంగ్లభాషాసాహిత్య ప్రభావ కారణంగా పరిణమించినట్లే బాలసాహిత్య ప్రక్రియకూడా

ఆంగ్లసాహిత్య ప్రభావంవల్ల రూపొంది పరిణమించింది. పెద్దలసాయం లేకుండ బాలలే చదివి అర్థంచేసుకోగల బాలసాహిత్యం ఈ వికాస దశలోనే వెలువడింది. వివిధ శాస్త్ర విషయాలకు సంబంధించిన రచనలు ఆయా శాస్త్రాల్లోని పాఠ్య గ్రంథాల్లాగా గాక బాలలకు వింత విషయాలుగాతోచి వాటిని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలన్న జిజ్ఞాస కలిగే విధంగా రచించబడ్డాయి. బాలల వయో భేధాన్ని బట్టి ప్రత్యేకించబడ్డ బాలసాహిత్యం కూడా ఈ వికాసదశలోనే వ్యాప్తికి వచ్చింది. బాలసాహిత్య రచయితలలో ప్రథములుగా, ప్రముఖులుగా ఇద్దరు కన్పిస్తారు. వారు గిడుగు సీతాపతి, చింతా దీక్షితులు.

## గిడుగు సీతాపతి (1889 - 1968)

సాహిత్యరంగంలో బహుముఖ ప్రజ్ఞావంతులైన గిడుగు సీతాపతిగారు తెలుగు బాలసాహిత్యంలో కూడ ప్రముఖ స్థానాన్ని గడించుకొన్నారు. బాలసాహిత్య రచనకు సీతాపతిగారిని ప్రేరేపించిన సన్నివేశం వారి మాటల్లోనే వినదగింది. 1897 లో విక్టోరియా రాణి వజ్రోత్సవము దేశమంతటను జరిగినది. మా పర్లా కిమడిలో జరిగిన ఉత్సవ బాలక్రీడలందు నేను పాల్గొంటిని అప్పుడు నేను పన్నెండేళ్ళ బాలుడను మూడవఫారము విద్యార్థిని విక్టోరియారాణిని గూర్చి నేను రచించిన కొన్ని పద్యములు, ఉత్సవ సభలో చదివినందుకు నాకు ఆంగ్లభాషలో రచితమైన "Boys own Annual" అనే గ్రంథము బహుమతిగా లభించింది ఆ గ్రంథములో ఆంగ్లేయ బాలురకు సులువుగా బోధపడగల పద్యములు, కథలు, ప్రసంగములు, మొదలైనవి అనేకముగా ఉన్నవి. వాటిలో నాకు బోధపడగలవన్నీ పెక్కుసార్లు చదివి కొన్నికంఠస్థముకూడా చేసినాను. అప్పుడు నాకు తెలుగులో ఇట్టి పుస్తకములు ఎందుకు రచితములు కాలేదో బోధపడలేదు పెద్దవారినడిగి తెలుసుకున్నాను. తెలుగు పిల్లలకు పాఠ్యగ్రంథములైన తెలుగు వాచకములు కొనుటకే తల్లిదండ్రులు కష్టపడుతూ ఉండగా ఇటువంటి కథల పుస్తకాలు కొనుటఎలా సాధ్యపడగలదు ? అన్నారు కొందరు కానీ నాకా సమాధానము తృప్తిపరచలేదు పెద్దవాడనై యీ "Boys own Annual" లోగల రచనలవంటి రచనలు తెలుగులో సాధించవలెనన్న

కోరిక అధికమైంది"[1] ఆకోరికే సీతాపతిగారిని బాల్యసాహిత్య రంగంలో ముందుకు నడిపించింది

మానవీయశాస్త్రంలో (Anthropology) డాక్టరేటు పట్టాన్ని పొంది, భాషా శాస్త్రంలో ప్రావీణ్యాన్ని సంపాదించి, ఛందోవ్యాకరణకోశ నిఘంటు రంగాల్లో నేర్పు చూపి తెలుగు విజ్ఞాన సర్వస్వానికి సంపాదకత్వాన్ని వహించిన గిడుగు సీతాపతిగారు బాలసాహిత్య రంగంలోను అందెవేసిన చేయిగా రాణించి ప్రభుత్వ బహుమానాన్ని కూడా అందుకోవడం ఎన్నదగిన విశేషం. బాలబాలికలకోసం వారు వ్రాసిన ఎలుకా-పిల్లి, రైలుబండి, చిలకమ్మ పెండ్లి, ఈగా-సాలీడు అనే శీర్షికలున్న పాటలు మొదట వివేకవతి పత్రికలో 1907-1909 మధ్య కాలంలో ప్రచురితాలై బాగా ప్రచారంలోకి వచ్చాయి. ఆపాటలన్నీ గుంటూరు వీధుల్లో పిల్లలు సరదాగా యధాలాపంగా పాడుకొని ఆనందిస్తున్నట్లు ఒక మిత్రుడు సీతాపతిగారికి లేఖ వ్రాశారట.[2] ఆలేఖ బాలసాహిత్య రచనావిషయంలో సీతాపతిగారికి రెట్టింపు ప్రోత్సాహాన్నిచ్చింది. పిల్లల వయస్సునుబట్టి ప్రత్యేకించబడిన బాలసాహిత్యం అంటే పెద్దలసాయం లేకనే పిల్లలే చదివి అర్థం చేసుకోగల సాహిత్యానికి తెలుగులో మొదట అంకురార్పణ చేసిన వారు సీతాపతిగారే. వారే ఆధునిక బాలసాహిత్యానికి మూలపురుషులు తన పాటలకు దేశంలో ప్రచారం కలగడం వల్ల గిడుగు సీతాపతిగారికి బాల సాహిత్యం మీద అభిమానం ఏర్పడింది. వారు వ్రాసిన గేయాలు తర్వాత కొన్ని మార్పు చేర్పులతో చిన్నపిల్లల తరగతుల వాచకాలలోకి ఎక్కాయి. సీతాపతిగారు భారతి పత్రికకు సంపాదకులైనప్పుడు ఆపత్రికలో 'బాలానందం' అనే ప్రత్యేక శీర్షికను ప్రారంభించి బాల సాహిత్య రచనలను ప్రోత్సహించారు. ఏప్రియల్ 1940 భారతిలో వారు వ్రాసిన 'మనవి' అనే గేయంతోనే ఆశీర్షిక ప్రారంభమయింది. ఆగేయంలో బాలల కోసం కవులు ఎలాంటి రచనలు చెయ్యాలో సూచించారు.

"బాల బాలికల కానందంగా

బాల హృదయములు విరియు నట్లుగా

---

1, 2. బాలసాహితీమాల. గ్రంథ పరిచయము. 1963. పుట : IX

బాల చిత్రములు చిగుర్చునట్లుగ
పాటలు పాడండో కవులారా !
అలమంధలను ఆకర్షించే
బాలకృష్ణుని మురళీ నాదమువలె
బాల బాలికల నాకర్షించే
పాటలు పాడండో కవు లారా !
పిల్లల ఊహాలు ప్రబలే రీతిని
పిల్లల మదిలో నిలిచే విధమున
పిల్లల కనువగు నీతులు చూపే
పిట్టకథలు రచించండయ్యా !
ఎచ్చరికలతో ఊ ఊ అంటూ
ముచ్చటపడి వినవచ్చే పిల్లల
కచ్చెరువును కల్గిస్తూ అందరు
మెచ్చే కథలను చెప్పండయ్యా !"

బాలబాలికల కోసం సీతాపతిగారు వ్రాసిన గేయాలు, కథలు 1955 లో బాలానందం అనే పుస్తకరూపంలో ప్రచురితమైంది 1958 లో బాలవినోదం అనే గేయ సంపుటాన్ని ప్రచురించారు. అంతేకాదు కేంద్రప్రభుత్వ సహాయంతో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పరచిన బాలసాహిత్య రచనాలయాల (Workhops for Children's literature) ను నిర్వహించి యువ రచయితలకు శిక్షణ కూడా ఇచ్చిన ప్రముఖులు సీతాపతిగారు

## చింతా దీక్షితులు (1891-1960)

ఆధునిక బాలసాహిత్యానికి గిడుగు సీతాపతిగారు ప్రథమాచార్యులైతే చింతాదీక్షితులు ద్వితీయాచార్యులు సీతాపతి చింతాదీక్షితు లిద్దరూ ఆధునిక

బాలసాహిత్య సృష్టిస్థితులకు కారకులు చింతాదీక్షితులు ప్రాథమిక విద్యావిధాన పర్యవేక్షణోద్యోగిగా జీవితం గడుపుతూ బాలల లేత మనస్సులపై రచనల ద్వారా ఎలాంటి ముద్రల్ని కల్పించాలో శ్రద్ధగా పరిశీలించారు. ఆంధ్ర సాహిత్యంలో ప్రముఖకథకులు కావడంవల్ల మానవ జీవితపు విలువల్ని కనుక్కోవడానికి ప్రయత్నించారు. ఆ ద్వంద్వాను భవ జన్యంగానే దీక్షితులుగారు ఉత్తమమైన బాల సాహిత్యాని సృష్టించారు వారిగేయాలు మొదట అనసూయ, భారతి, ఆంధ్ర పత్రిక, ప్రతిభ మొదలైన మాస పత్రికల్లో ప్రచురితాలై 1947 లో లక్కపిడతలు 'అనే పుస్తకరూపాన్ని దాల్చాయి ఆగేయసంపుటి బాలసాహిత్యంలో మణి పూసలాంటిది. చిన్నికృష్ణుని రూపురేఖల్ని, చేష్టల్ని, అల్లరిని, చిన్నపిల్లల ఆట పాటల్ని, చిలిపి చేష్టల్ని, భయభక్తుల్ని, ఆడపిల్లలు లక్కపిడతలతో ఆడుకొనే ఆటల్ని హృదయంగమమైన శైలిలో చింతాదీక్షితులు చిత్రించారు. రామాయణంలోని లంకాదహన ఘట్టాన్ని ఆధారంగా తీసుకొని వారు వ్రాసిన 'హనుమంతునితోక' అనే హాస్య ప్రధానమైన పెద్దగేయం లక్కపిడతలు సంపుటిలోనిదే బాలల సుకుమార హృదయాల్ని ఉత్రూత లూగించే చక్కని గేయాలెన్నో అందున్నాయి అవెగాక వారు వ్రాసిన పేరంటం, గజ్జనగూడు, భట్రాజు, పొడుపు కథలు మొదలైన శీర్షికలతో 'కూడిన సూరి – సీతి – వెంకి' అనే పిల్లల ఆటల్ని తెలియచేసే కథలు మొదట 1931 భారతిలో బాలానందం అనే పేరుతో సీరియల్‌గాను తర్వాత పుస్తక రూపంలోను ప్రకటితమైంది వారు వ్రాసిన లీలాసుందరి అనే అద్భుతకథ 1933లో ప్రచురితమైన గిడుగురామూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ సంచికలో మొదట ప్రచురించబడి 1949 లో పుస్తకరూపాన్ని దాల్చించి ఆకథ ఆంగ్లంలోని 'యాలిస్ ఇన్ వండర్ ల్యాండ్' లాంటిది, వారు వ్రాసిన 'ఎన్నోచేస్తాను' అనే కథలసంపుటి 1955 లో ప్రచురితమైంది గోపీమోహిని (1955), శంపాలత (1955) మొదలైన పిల్లల నవలలు కూడ వారు వ్రాసినవే, అన్ని ప్రక్రియల్లోను బాలల కనువైన రచనలుచేసి బాలసాహిత్య బ్రహ్మగా ప్రఖ్యాతిగాంచిన వారు చింతా దీక్షితులు.

పై పరిశీలననుబట్టి ఆధునిక బాలసాహిత్యం వీరేశలింగం పంతులుగారితో ప్రారంభమై గిడుగు రామ్మూర్తి పంతులుగారి ప్రోత్సాహంతో ఒక వినూత్న

రూపాన్ని దాల్చి గురజాడ అప్పారావు, గిడుగు సీతాపతిగార్ల చేతుల్లో రూపురేఖలను సంతరించుకొని చింతా దీక్షితులుగారి వల్ల పరిణతిచెందిందని చెప్పవచ్చు.

ఆధునిక దశలో తెలుగు బాలసాహిత్యం పొందిన వైవిధ్య వికాసాభివృద్ధుల స్వరూపాన్ని క్రింది విధంగా వింగడించి పరిశీలించవచ్చు

1 ఆధునిక బాలసాహితీ స్రష్టలు.
2. బాలల పత్రికలు
3. ఆకాశవాణిలో బాలల కార్యక్రమాలు.
4 బాలసాహిత్యానికి సంస్థల దోహదం,

## 1. ఆధునిక బాలసాహితీ స్రష్టలు

బాలసాహిత్యాన్ని సృష్టించడమె ప్రధాన ధ్యేయంగా పెట్టుకున్న రచయితలు చాలామంది ఆధునికయుగంలో ఉన్నారు. వారు బాలసాహిత్యపరమైన గేయాలు, కథాగేయాలు, కథలు, నాటికలు, నవలికలు బుర్రకథలు మొదలైనవి రచించి ఉన్నారు. ఆధునిక బాలసాహితీ స్రష్టలలో ప్రముఖులైన వారిని, వారి రచనలను స్థూలంగా తెలియజేయడం అప్రస్తుతం కాదు.

కవికొండల వెంకటరావుగారు (1892) పిల్లలకోసం కుమార శతకము, చదువుల పుట్ట మొదలైన రచనలు చేశారు

వేదుమళ్ల కామేశ్వరరావుగారి బాలసాహిత్య రచనల్లో ముఖ్యమైనవి పాల పిట్ట (1939), మిణుగురుపురుగు 1940) మొదలైన గేయ సంకలనాలు; తాతల నాటి కథలు, పాలబుగ్గలు (1951) విడుస్తున్న పువ్వులు, బంగారు బాలలు మొదలైన కథల సంపుటాలు

నార్ల చిరంజీవిగారు (1925–1971) 1945 లో బాలసాహిత్య రచన ప్రారంభించారు. బాలలకోసం వారు వ్రాసిన మొదటి రచన తెలుగు పూలు

శతకం. సులభ ఛందస్సులైన ఆటవెలది, తేటగీతి పద్యాల్లో వ్రాయబడ్డ ఆ శతకం చతుర్ధ ముద్రణా గౌరవాన్ని పొందింది. "తెలుగు పూలు కావ్యం బాలసాహిత్యంలో విశిష్టమైంది. నిత్యనైమిత్తిక జీవితంలోని విషయ సమస్యలకు పరిష్కార మార్గాల్ని ప్రబోధిస్తూ పిల్లలలో సాంఘిక చైతన్యాన్ని ప్రజ్వలింపజేస్తూ – వారితో సత్ప్రవర్తన నెలకొల్పుతూ సాగిన ఈ చిన్న పుస్తకం సార్ధకమూ సప్రయోజకమూ అయిందనడంలో సందేహం లేదు" అని సోమ సుందర్‌గారు తెలుగు పూలు శతకాన్ని ప్రశంసించారు[1] 1949 లో చిరంజీవి గారి కర్రా – చెప్పులు అనే కథకు బహుమతి వచ్చింది. 1952 లో వారు విశాలాంధ్ర పత్రికలో బాలలకోసం 'చిన్నారిలోకం' అనే శీర్షికను నిర్వహిస్తూ 'జాబిలిమామ' పేరుతో కొన్ని కథల్ని, గేయాల్ని వ్రాశారు. ఆ రచనలే తర్వాత పుస్తకాల రూంపలో వచ్చాయి ఆటపాటలు, జాబిల్లి పాటలు (1954), కొత్తపాటలు, పాటకథలు మొదలైన గేయ సంపుటాలు, ఎర్రగులాబి (1954), కర్రా చెప్పులు, నీతికథానిధి మొదలైన కథలు, మందారబాల (1956), కీలుబొమ్మ (1957) పేనూ – పెసరచేను (1955) మొదలైన నవలికలు చిరంజీవి గారి బాలసాహిత్య రచనలు.

రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్యలుగా సుప్రసిద్ధులైన న్యాయపతి రాఘవరావు (1905) న్యాయపతి కామేశ్వరి (1908–1980) గార్లు అన్నిరంగాల్లోను పిల్లల అభివృద్ధికోసం కృషి చేసినవారు. వారు పిల్లల విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించేందుకు సాగిస్తున్నకృషి ప్రసంసార్హమైంది. ఆంధ్రదేశంలో వారిని గురించి వినని తెలుగు పిల్లలు ఉండరంటే అతిశయోక్తికాదు. 1939 లో మద్రాసు ఆకాశవాణిలో పిల్లల కార్యక్రమాలను ప్రారంభించి బాలల విజ్ఞాన, వినోదాభివృద్ధికి నిర్విరామంగా కృషిచేశారు. 1947 లో ఆంధ్ర బాలానంద సంఘాన్ని స్థాపించి, అన్ని స్థాయిల్లో ఎన్నో అనుబంధ సంస్థలను నెలకొల్పి, బాల మహాసభలను నిర్వహించి 1964 లో తెలుగు పిల్లల సాంస్కృతిక సభలను జరిపి, నేటి బాలల అకాడమీ స్థాపనకు పునాదులు వేసినవారు వీరే. 1945 లో మొట్టమొదటి పిల్లల పత్రిక

---

1. పిల్లల చిరునవ్వుల్లో తెలుగు వెలుగులు (ఒక పరిశీలన) కిన్నెర. 1952

'బాల' ను స్థాపించారు. అనేక పత్రికలలో బుచ్చి, అన్నయ్య, న్యాయపతి రాఘవ రావు, అక్కయ్య, కామేశ్వరి అనే పేర్లతో వీరి రచనలు ప్రకటించబడ్డాయి.

"తెలుగు దేశపు
తెలుగు పిల్లలు
తెలుగు వెలుగు లండి
తెలుగు బాలురు
తెలుగు బాలికలు
తెలుగు సొమ్ములండి"

అని తెలుగుపిల్లల నుద్దేశించి గొప్పగా చెప్పుకున్న వీరు పిల్లలకోసం ఎన్నో రచనలు చేశారు. వారి గేయసంకలనం బడిగంట (1956). వినోద కార్యక్రమాలలో పిల్లల చేత ప్రదర్శింపజేయడానికి చాలా నాటికల్ని వ్రాశారు. బాల పౌరాణిక నాటికలు, (1951) బాలగమ్మత్తు నాటికలు (1952) మదతకుర్చీ, (1970) చిట్టినాటికలు, మూడు పెళ్ళిళ్ళు (1970) పుస్తకాలుగా ఆనాటికలు ప్రచురించబడ్డాయి. వారు పిల్లల ప్రత్యేక కార్యక్రమాలకోసం వ్రాసిన గేయాలు 'బాల గేయమాల' పేరుతో ప్రచురణకు సిద్దంగా ఉన్నాయి. ఈ సిద్ధాంత వ్యాసంలో వాటిని కూడా చేర్చి చర్చించడం జరిగింది.

బి. వి. నరసింహారావుగారు 1913 ఆంధ్ర దేశంలో నాట్య కళాకారులుగా ప్రఖ్యాతి గాంచడమే గాక ఉత్తమ బాలసాహిత్యాన్ని కూడా సృష్టించారు. తెలుగు బాలసాహిత్యానికి సంబంధించిన కొన్ని వ్యాసాలుకూడా వ్రాశారు.

"పిల్లల పాటలవి
కొల్లలుగ వ్రాస్తాను
ప్రేమతో వారికవి
పిలిచి వినిపిస్తాను"

అన్న నరసింహారావుగారు ఎక్కడ పిల్లలు కనిపించినా వారితో కలిసిపోయి ఆడి పాడుతుంటారు. విద్యాబోధనలో ప్రాథమికదశ బాలలకు గేయాలు ఎక్కువగా ఉపకరిస్తాయని వారికోసం లయాత్మకమైన గేయాలెన్నో వ్రాశారు బాలరసాలు (1958) పాలబడి పాటలు (1958) చిన్నారిలోకం (1960) ఆవూ-హరిశ్చంద్ర (1960) మొదలైన సంపుటాల్లో గేయాలున్నాయి అమ్మఒడి (1976) గేయ సంపుటిలో పిల్లలు. వారువేసే యక్షప్రశ్నలు మొదలైన విషయాలను చక్కగా చిత్రించారు ఐదేండ్ల బాలలకు అనువైన గేయాల (35) సంపుటి వారి వెన్నెలబడి (1976). వీరి గేయాలు కొన్ని తెలుగువాచకాల్లోకూడా చోటుచేసుకున్నాయి. కొన్ని రేడియో కార్యక్రమాల్లో ప్రసారమైనాయి గేయాల్ని వ్రాయడమే గాక ఆగేయాల్ని పాడవలసిన తీరును ఉపన్యాసాల ద్వారా వివరించేవారు. గేయాలే గాక నా కథలు (1958) అనే కథల సంపుటిని, పూలబాలలు, (1960) బాలలోకం (1960) దిరిశెనపూలు (1961) ఉత్తరాల రత్తయ్య, (1962) ఋతురాణి (1965) మొదలైన నాటికలను ప్రియదర్శిని అనే గేయనాటికను, పదవిపంచి (1971) **(Informal grammar)** అనె వ్యాకరణ గ్రంథాన్ని **Bala Bandhu Rhymes** (1977) అనే బాలల ఆంగ్ల గ్రంథాన్ని కూడ బాలలకోసం వ్రాశారు.

ఉత్పల సత్యనారాయణాచార్యులు (1928) శ్రీ ఏటుకూరి వెంకట నరసయ్య గారి ప్రోత్సాహంతోను, శ్రీ చింతా దీక్షితులుగారి ఆజ్ఞతోను, డా॥ గిడుగు సీతాపతి గారి శిక్షణతోను, బాలలకోసం 1949 లో అసంఖ్యాకమైన రచనలు చేశారు. అవన్నీ పత్రికల్లో ప్రచురితాలు 1958 లో గిడుగు సీతాపతిగారి అధ్యక్షతన ఏర్పడిన బాలశిక్షణాలయంలో శిక్షణ పొందుతున్నప్పుడు బాలలకోసం గంగావతరణం అనే గేయకావ్యాన్ని వ్రాశారు దాన్ని తెలుగులో మొట్టమొదటి బాలకావ్యమని గిడుగు సీతాపతి, దివాకర్ల వెంకటావధానిగార్లు ప్రశంసించారు ఆ కావ్యానికి 1958 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఐదువందల రూపాయల పారితోషికాన్నిచ్చింది. వారు వ్రాసిన క్షీరసాగర మథనము, శమంతకమణి, దక్షయజ్ఞము, పార్వతీ కళ్యాణము, కుమార సంభవము, దాస్య విముక్తి, మొదలైన గేయరచనలు మొదట చందమామ పత్రికలో సీరియల్స్‌గా వచ్చాయి తరువాత ఉత్పలమాల (1962),

కుమారీ సంభవం (1967) అనే పేర్లతో పుస్తకాలుగా ప్రచురించబడ్డాయి చిన్ని కృష్ణుడు, అర్జునుని తీర్థయాత్ర, మనుచరిత్ర అనే గేయకావ్యాల్ని కూడా వ్రాశారు. అవి కొన్ని బొమ్మరిల్లు పత్రికలో వెలువడ్డాయి ప్రాచీనకావ్య కథల్ని పిల్లలకు అర్థమయ్యే సులభశైలిలో గేయరూపంలో అందించినవారిలో ప్రథములు, ప్రముఖులు కూడా వీరేనని చెప్పవచ్చును.

కె. సభా (1923) గారు 1942 లో బాలల కోసం రచనలు చేయడం ప్రారంభించారు వారు ఇంచుమించు అన్ని ప్రక్రియల్లోను పిల్లల కోసం రచనలు చేశారు బాల, చందమామ, గృహలక్ష్మి, ఆంధ్రమహిళ, ఆంధ్రపత్రిక, ఆంధ్ర విద్యార్థి, ఆంధ్రజ్యోతి మొదలైన దిన 'వార' మాస పత్రికలలో వీరిగేయాలు ప్రచురించబడ్డాయి వీరిగేయసంపుటి గోమాత కథా సంపుటాలు సీసాచరిత్ర (ద్వితీయ ముద్రణ 1961) చిలుకమ్మ (ద్వి.ము 1961) ఐకమత్యం వుంటే (1960) అరగొండ (1962) ప్రథమ భారతవిప్లవ గాథలు (1962) మొదలైనవి. చంద్రం (ద్వి.ము 1965) సూర్యం, కపినాయకుడు (1961) మత్స్యకన్యలు (అనువాదం) పిల్లల నవలలు, పరీక్షాఫలితాలు, ఏటిగట్టున మొదలైనవి బాలల కోసం వ్రాసిన నాటికలు.

ఏడిద కామేశ్వరరావుగారు చాలాకాలంగా విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో పిల్లల కార్యక్రమాలను నిర్వహిస్తూ 'రేడియో అన్నయ్య'గా ప్రఖ్యాతి పొందారు వారు మృదు మధురమైన బాలగేయాలను సృష్టించి, వాటికి మధుర మంజులమైన రాగ భణితులను కూర్చి ఆకాశవాణిలో పిల్లల చేత పాడించేవారు పిల్లల అంతరాంతరాలను చదువు సంధ్యలతో ఉద్ధరమే కాకుండా వారి హృదయాలను సముజ్జ్వలం చేయడానికి భారతీయ సంస్కృతిని మేళవించి బాలభారతి (1973) అనే గేయ సంపుటిని ప్రచురించారు రంగ బాల అనే బాల నాటికను ఒప్పులకుప్ప (1976) అనే బాల నృత్యరూపకాన్ని కూడా వ్రాశారు పిల్లలకు కళలపట్ల అభిమానాన్ని,, అభినివేశాన్ని కల్గించాలనే ఉద్దేశంతో నృత్యనాటికలను వ్రాశారు వాటిలో ఒప్పుల కుప్ప, విశాల భారతి, పంటలచ్చి నృత్యప్రధానాలైనవి ఆవు – పులి, విశ్వవిద్యాలయం అనే నాటికలు భావాభినయ ప్రధానాలు.

కవుల ఆంజనేయ శర్మగారు (1932) ఉపాధ్యాయుడుగా పిల్లల్తో తన కున్న సంబంధాన్ని పురస్కరించుకొని పిల్లలస్థాయికి తగిన రచనలు అందించి సాహితీసేవ చేయాలన్న తలంపుతో 1957 నుంచి బాలసాహిత్య రచనలు చేస్తూ ఇంచుమించు 150 బాలగేయాలు 20 గేయకథలు, 10 బాలనాటికలు, 2 నవలలు, 3 బుర్రకథలు, వ్రాశారు. వాటిలో కొన్ని పత్రికలలోను, కొన్ని సంకలనాలుగా కొన్ని ప్రత్యేక పుస్తకాలుగా వెలువడ్డాయి. వారి పుస్తకాలలో భావి పౌరులు (1969) అనే గేయసంపుటిని 8-12 సంవత్సరాల మధ్య వయసు పిల్లల కోసం వ్రాసినట్లు చెప్పుకున్నారు అంతేగాక బడిపాపలు బొమ్మల పెళ్ళి, రంగులరాట్నం అనే గేయ సంపుటాలను కూడా వ్రాశారు. బలే బావ, స్వాతంత్ర్యం ఇవి రెండు వీరు వ్రాసిన హాస్యప్రధానమైన నాటికలు, మారినమనిషి, పురుషోత్తముడు (చారిత్రక నాటిక) అనేవి కూడా బాలల నాటికలే ధర్మ సంస్థాపనను, సత్యవ్రత సాధనను దేశభక్తిని, హైందవ నీతిని, చాటిచెప్పే వీరశివాజీ (1970) గాథను పది పన్నెండేండ్ల బాలలు ప్రదర్శించడానికి వీలుగా మధ్య మధ్య హాస్యాన్ని చొప్పించి బుర్రకథా రూపంలో వ్రాశారు. బాలల విజ్ఞాన వినోద వికాసాలకోసం పాటుపడే బాలానంద సంఘం పుట్టుపూర్వోత్తరాలను, వాటి నిర్మాణాన్ని ఆ సంఘాల కార్యక్రమాలను వివరిస్తూ వారు వ్రాసిన మరొక బుర్రకథ బాలానందం (1974). గాంధీజీ అనే మరో బుర్రకథనుకూడా రాశారు అనకాపల్లిలో రామాబాలానంద సంఘాన్ని స్థాపించి, పిల్లల్లో స జనాత్మక శక్తిని పెంచడానికి, ప్రయత్నిస్తున్న శర్మగారు పిల్లల కోసం రచనలు చేయడమే గాక వారిచేతనే రచనలు చేయిస్తున్నారు కూడా.

పిల్లలకోసం ఉత్తమమైన గేయాలను అందించిన వారిలో కవిరావుగారొకరు. బొమ్మరిల్లు (1953) గేయకథలు (1954) నెలవంక (1956) మొదలైనవి వీరి గేయ సంకలనాలు. వీరు బాల మనస్తత్వాన్ని చక్కగా అవగాహన చేసికొని, వాళ్ళ చిలిపి చేష్టల్ని, ముద్దుమాటల్ని, వాళ్ళ చిన్ని బుర్రల్లో మెదిలే ఊహల్ని చిత్రిస్తూ వ్రాసిన గేయాలవి.

పైడిపాటి సుబ్బరామ శాస్త్రిగారు పిల్లలకోసం వ్రాసిన గేయాలను నృత్య

భారతి (1955) విజయ భారతి (1959) బాలభారతి (1959) అనే పేర్లతో ప్రచురించారు.

అలపర్తి వెంకట సుబ్బారావుగారు (1934) పిల్లలకోసం లెక్కలేనన్ని కథలు, గేయాలు వ్రాశారు బాలానందం (1955 కలగూర గంప) ఆడుకున్నానే అబ్బాయి (1956) చిట్టికథలు (1956) పెద్ద చిన్న (1961) మబ్బుతెరపై మసక బొమ్మలు, (1961) గాలిపటం చెప్పింది (1964) మొదలైనవి వారి కథాసంపుటాలు, ఇందిర అలుకమానింది (1957) బొమ్మలకథ, పిల్లనగ్రోవి (1957) పండుగల పాటలు (1962) ఆటలపాటలు (1965) తాయం (1967) మొదలైనవి గేయ సంపుటాలు. బంగారుపాప (1956) పద్యరచన చివరకు మిగిలింది (1962) నాటిక, వారసత్వం (1965) గేయనాటిక, మాపూరివారు (1974) చిత్రగీతాలు. ఇవన్నీ కూడా బాలబాలికల మనసుకు నచ్చే చక్కని రచనలు.

వేజెండ్ల సాంబశివరావుగారు వ్రాసిన గేయాలు పాలపాటలు (1951) ముద్దు పాటలు (1956) బాలసిపాయి (1966) మొదలైన సంపుటాలుగా వచ్చాయి. వారు బాలలకోసం నీతిబోధకమైన, వినోద ప్రధానమైన, యుక్తిదాయకమైన కథల్ని కూడా వ్రాశారు. ఉడుతా హుషారా! అనే గేయకథ వ్యాపారి సంచారం అనే మిత్రబేధకథ, చిలిపి గోపి, బడిగంటలు, అనే బుర్రకథలు, వీరు బాలలకోసం వ్రాసినవి. పిల్లల మనస్తత్వాన్ని, ఆలోచల్ని అభిరుచుల్ని దృష్టిలో ఉంచుకొని వ్రాసిన వారిలో సాంబ శివరావుగారు ప్రముఖులు.

చావలి రామచంద్రరావుగారు (1926) సమతారావు అనే కలంపేరులో అభ్యుదయ భావాలతో బాలలకోసం రచనలు చేశారు. సమాజంలోని హెచ్చుతగ్గులకు దోపిడీకి బలం చేకూరుస్తున్న మూఢనమ్మకాలలో ప్రధానమైన దైవభావంపై అతని కున్న జుగుప్సే ఆ రచనలు చేయడానికి కారణమంటారు దైవభావముపై అనుమానాన్ని, అసంతృప్తిని కలుగజేసి పిల్లల్లో ఒక క్రొత్త ఆలోచనకు తావు కల్గించాలనే ఉద్దేశ్యంతో బాలలకోసం రచనలు చేయడానికి పూనుకొని ఎన్నోరచనలు చేశారు. "దోపిడీ వర్గాల తాలూకు సాహితీ వేత్తలు, కలం సైనికులు సాహిత్యంద్వారా సంయు

క్తంగా సాధించే దాడి ఫలితంగా నీచమైన కర్మ సిద్ధాంతానికి, నిరాధారమైన దైవ భావానికీ. ఇంకా పలురకాల మూఢనమ్మకాలకు ప్రత్యేకంగా బలం చేకూరుతుందని, అంతేగాక బాలసాహిత్యం ముసుగుక్రింద చాలామంది రచయితలు తమ సాహిత్య కృషిద్వారా సాగించే అంధ విశ్వాసాల చెత్తభావాల ప్రచారం, మత ఆధ్యాత్మిక భావాల సల్లమందును బాల్యంనుండే భావిపౌరుల మెదడు దట్టించి, సమాజంలోని పీడితవర్గాల విముక్తిని అడ్డుకొంటున్న ధోరణులను, ప్రయత్నాలను చూచి, తీరని వేదనతో అందుకు విరుగుడుగా పిల్లలస్థాయిని దృష్టిలో ఉంచుకొని వారిమనసుల్లో హేతువాద యుక్తమైన విప్లవాత్మక నీతిసూత్రాలను, సమతా భావాలను, విశాల మానవతా భావాలకు ప్రోది చెయాలన్న అభిప్రాయంతో బాలసాహిత్య రచనను ప్రారంభించాను" అంటారు ఆ భావాలకు సంకేతంగానే బాలసాహిత్యానికి సంబంధించినంత వరకు 'సమతారావు' అనే పేరును స్థిరపరచుకొన్నారు. వీరి గేయాలు ఆంధ్రపత్రిక, విశాలాంధ్ర, ఆంధ్రప్రభ, ఉపాధ్యాయ బాల పత్రికలలో ప్రచురితాలు. అవి తర్వాత పాపన్నారా : పాటలు-పాటకథలు (1957) గేయకథలు (1967) బాల గేయాలు ఒకటవభాగం (1967) బాలగేయాలు రెండవభాగం (1969) బాలగేయాలు మూడవ భాగం (1971) మొదలయిన సంపుటాలుగా వెలువడ్డాయి. 1967 లో పిల్లలకోసం ముత్యాల సరాల ఛందస్సులో వెలుగుపూలు అనే నీతిశతకాన్ని కూడా వ్రాశారు ముత్యాల సరాలలో వ్రాసిన మొదటి శతకం అదేకావటం దాని ప్రత్యేకత

అడ్సుమిల్లిగారు వ్రాసిన బుజ్జిబాబు అనే పాటలు – పాట కథల సంపుటి 1957 లో ప్రచురితమైంది. పది పన్నెండేండ్ల బాలలకు వినోదాన్నిచ్చే సింహ సేనుడు (1957) అనే కథం సంపుటిని కూడా అడ్సుమిల్లి బాలల కోసం వ్రాశారు.

సత్తిరాజు కృష్ణారావుగారు బంగారు కథలు అనే పేరుతో మొత్తం 12 భాగాల్ని 1959 లో ప్రచురించారు అందులో 5 సంవత్సరాల బాలలకు పయు క్తమైన కథలు – పకిపాటలు, చిట్టి కథలు, ఛాయవెన్నప్పుడు, గుట్టమీది గుడిసె అనేవి, 8 సంవత్సరాల బాలలకు – పాపాయిపాటలు, ఎలుగాయికథ, కమల – విమల, గమ్మత్తుకథ అనేవి, పాపడుపాయము, మూడు కోతులు, చిలుకమ్మ చుట్టలు, వీర రాఘవులు అనేవి 12 సంవత్సరాల బాలల కోసం వ్రాసినవి

మిరియాల రామకృష్ణగారు వ్రాసిన బాలాభిరామం అనే గేయసంపుటి 1965లో దక్షిణభాషా పుస్తక సంస్థవారి బహుమతిని అందుకొన్నది. ఇది 1966 లో ప్రచురితం. 1970 లో రంగులరత్న దీపాలు అనే పుస్తకానికి భారత ప్రభుత్వ బహుమతి లభించింది. వారు ముత్యాల గొడుగు (1978) అనే మరొక బాలగేయ గ్రంథాన్ని కూడా వ్రాశారు. సృష్టిలోని ప్రకృతికి సంబంధించిన ప్రతి అంశమూ ఈగేయాల్లో చోటు చేసుకుందంటే అతిశయోక్తి కాదు. మధురమైన ఊహలు ఉదాత్తమైన భావాలు అడుగడుగునా వీరిగేయాల్లో కన్పిస్తాయి.

వల్లభనేని కాశీవిశ్వనాథంగారు బాలల కోసం చేసిన రచనలు – అమ్మా కొడుకు (1961), తాతామనుమడు (1961), లోకజ్ఞానం (1961), పిల్లలపాట్లు (1961), దేశభక్తులు – దీపావళిజ్యోతులు (1964)

సండూరి రామమోహనరావు గారు బాలరాజు (1961), మయూరకన్య (1961), హరివిల్లు (1976) అనే మూడు గ్రంథాల్ని వ్రాశారు. బాలరాజు కథం సంపుటి 8–10 సంవత్సరాల మధ్య వయసు వారి కోసం వ్రాసినది. [హరివిల్లు' లోని పాటలు 1944–1954 మధ్యకాలంలో వ్రాసినవి. అవి మొదట 1975 లో 'బొమ్మరిల్లు' పత్రికలో వెలువడి ఆ తర్వాత 1976 లో పుస్తకంగా సంపుటీకరించబడింది]

వక్కలంక లక్ష్మీపతిరావుగారు 5–7 సంవత్సరాల బాలలకు అనువైన రీతిలో సులభశైలిలో బాలభారతి (1970) స్వతంత్ర భారతి (1970), ఎఱ్ఱగులాబీ అనే గేయ సంపుటాలను, రచించారు. ఆదర్శప్రాయమైన, దేశభక్తి ప్రబోధకాలైన ఆ గేయాల్లో చక్కని నీతులు – రీతులు దృష్టాంతాలతో సహా బాల బాలికల కందివ్వబడ్డాయి.

తెలుగులో సంఖ్యలో స్వల్పమైనా గుణంలో ఉత్తమశ్రేణికి చెందిన గేయాల్ని సృష్టించిన వారిలో బసవరాజు అప్పారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, రాయప్రోలు సుబ్బారావు, నండూరి సుబ్బారావు, కనుపర్తి వరలక్ష్మమ్మ, చావలి

బంగారమ్మ, నేమాని భారతి రత్నా కరాంబ మొదలైనవారు గణనీయులు. వారేగాక బాలల కోసం విరివిగా బాలగేయాలు సృష్టించి పుస్తకాల రూపంగాను, పత్రికల ద్వారాను ప్రకటించిన రచయితలెందరో ఉన్నారు. ఉదాత్తమైన వస్తుభావాలతో కూడుకున్న ఆ గేయాలు మూడవ దశ బాలలకు చక్కని సందేశాన్నిస్తాయనడంలో సందేహంలేదు. కొన్ని గేయాలు ప్రత్యేకించి పిల్లల కోసం వ్రాసినవి కాకపోయినా అవి వారికి కూడా ఉపయుక్తాలని భావించి పిల్లల సంకలనాల్లో చేర్చడం జరిగింది

తెలుగు సాహిత్యంలో భావనోద్దీపితమైన ప్రణయగీతాలను సృష్టించిన బసవరాజు వెంకట అప్పారావుగారు (1894-1933) బాలసాహిత్యాన్ని కూడా స్పృశించారు వారు వ్రాసిన

"కొల్లాయి గట్టితేనేమి
మా గాంధి కోమటై పుట్టితేనేమి
... ... ... ... "
"పోర్ బందర్ కోమటింట పుట్టినాడోయ్
పురుషోత్తముడు జగతి మెట్టినాడోయ్
... ... ... ... ... "

మొదలైన గేయాలు బాలలకు కూడా ప్రబోధాత్మకమైనవే. వారిబాల గేయాలు కొన్ని మొదట 'భారతి' పత్రికలో ప్రచురితాలు. 1930 భారతిలో వారి 'పాపా యిలీలలు' అనే గేయం ప్రచురితమైంది. పాపాయిని సాక్షాత్తు పరమాత్ముడుగా భావించి జేజేలు అనే గేయాన్ని వ్రాశారు పిల్లలు ఆడుకొనే బొమ్మలపెళ్లి ఆటను ఆధారంగా వారు 'ఉత్తుత్తపెళ్లి' అనే గేయం వ్రాశారు. ఆగేయం.

"పెళ్ళి పందిట్లో పెద్దలంతాను
వేంచేసి వున్నారు పెళ్ళికొడుకేడి

ముత్యాల ముంగిట్లో ముత్తైదులంతా
కూచునుండిరి పెళ్ళికూతు రేమాయె .
... ... ... ... "

(బసవరాజు అప్పారావు గీతాలు, ద్వితీయ ముద్రణ 1945 పుట 16).

వేపులపల్లి వెంకట కృష్ణశాస్త్రిగారు వ్రాసిన చిన్న పిల్లల పాటలు కొన్ని ప్రచురితమైనాయి.
ఉదాహరణకు :

"అన్న రావోయి ! నా
మన్న రావోయి ! నీ
కన్న తల్లి - చంకనెక్కి
చిన్ని పాపడా !
ఆడు కొందాము రారా !
పాడు కొందాము రారా !
మేడలెక్కి కొండ లెక్కి
చిన పాపడా !
... ... ... "

(అనసూయ, జూలై, ఆగష్టు సంచిక 1919)

పీరుచలన చిత్రాలకోసం వ్రాసిన పాటల్లో కూడా కొన్ని పిల్లలకు సంబంధించిన పాటలున్నాయి.

అడవి బాపిరాజుగారు (1895-1952) బాలల కోసం ఉత్తమ శ్రేణికి చెందిన కథలు, గేయాలు రచించి, వివిధ పత్రికలలో ప్రకటించారు, వీరి రచనలు ఎక్కువగా గృహలక్ష్మి 'బాలవిజ్ఞానశాఖ' శీర్షికలోను, భారతి పత్రికలోను ప్రచురితాలు. ఉదాహరణకు వీరు వ్రాసిన 'బూరా' అనే గేయం.

"అమ్మ - ఆ పిల్లం గోరొంకల్లే
నాకిమ్మా - నీ మెల్లోమ ల్లాలే
తల్లీ - బూరానునోట
మెల్లా - మెల్లాగ ఊది
పిచికీ - పిల్లాలు పలుకు
చల్లాని - పాటపాడ్తు - అమ్మా
నాకిస్తే - వేళ్లాను బట్టి
వవ్వా - కళ్లాను తిప్పి
తువ్వాయి - అవుచూపి -
అంబాను - అరుపులాడ్తు - అమ్మా
నీవమ్మా - బావికి పోతే
చెల్లీ - ఉయ్యాలచేరి
లాలి - లాలంచూను
జోలా - పాటలుపాడ్తు - అమ్మా"

(భారతి, 1924, సంపుటి1, సంఖ్య, ౭. పుట . 149)

రాయప్రోలు సుబ్బారావుగారి కన్నె పాటలలో బాలబాలికలకు ఉపయుక్తమైన చందమామ పాటలు, కోలాటం పాటలు, ఆట పాటలు, కొన్ని ఉన్నాయి వీన్ని ఆంధ్ర సారస్వత పరిషత్తువారు పుస్తకంగా ప్రచురించారు

పిల్లలకోసం గేయ రచనలు చేసిన వారిలో వీరేగాక పెద్దింటి మాణిక్యరావు, ఛందవల్లి లక్ష్మీరంజనం, త్రిపురనేని రామచంద్ర చౌదరి, శెట్టిపల్లి వెంకటరత్నము మొదలైనవారిని కూడ పేర్కొనవచ్చు.

బాలసాహిత్యానికి ఆదరణ లభించడంతో ఉత్తేజితులై కొంతమంది స్త్రీలుకూడ రచనలు చేశారు. కనుపర్తి వరలక్ష్మమ్మగారు (1896) ఆంధ్రసాహిత్య లోకానికి

సుపరి చితురాలు, స్త్రీ జనాభ్యుదయానికి ఉత్తమకృషి సల్పి, స్త్రీ హితైషిణీ మండలిని నెలకొల్పి 'శారదలేఖల' తో ఆంధ్ర దేశంలో శాశ్వతమైన కీర్తిని సంపాదించుకున్న వారు ఉత్తమ బాలసాహిత్యాన్ని కూడా అందించారు. బాలలకోసం రచనలు చేసిన స్త్రీలలో వీరే ప్రథములనవచ్చు వీరు మొదట బాలవినోద లాంటి హిందీ వాచకాల ననుసరించి తెలుగు పిల్లల కోసం బాలగీతావళి (1930) ని సులభశైలిలో (సరళ గ్రాంథికంలో) వ్రాశారు ఆ గీతాలన్నీ నీతిబోధకాలు. వీరిగేయాలు బాలసాహిత్య మంజరి అనే పేరుతో 1967 లో సంపుటీ కరించబడింది కాని ఆ గ్రంథం ఇంకా ప్రచురణకు నోచుకోలేదు "బాలసాహిత్యం ఎప్పుడూ బాలలకు సు ల భ ం గా తెలిసేదిగా, నోటికి సులభంగా వచ్చేదిగాను ఉండాలి. ఈ రెండు లక్షణాలు మన పిల్లల పాత పాటలకు ఉన్నాయి. కనుక ఆపద్ధతిలో వ్రాయవలెననే తలంపునాకు కల్గింది"[1] అన్న వరలక్ష్మమ్మగారు పాతపాటలశైలిలో ఎక్కువగా ద్విపద, అక్కడక్కడ ఆటవెలది, తేటగీతులలోను రచించారు. ఆవుదూడ, కుక్క, పిల్లి, గుర్రము చిలుక మొదలైన పశు పక్ష్యాదులను, గాలిపటము, లక్కగుర్రము, చెక్కగుర్రము, చెక్కబొమ్మ మొదలైన ఆటవసువుల్ని వర్ణిస్తూ వ్రాసిన గేయాలు, భజన పాటలు, భక్తి గీతాలేగాక, అమ్మమ్మ, తాతయ్య, నాన్న, అన్నయ్య, అక్కయ్య, అత్త, మామయ్య మొదలైన వాళ్ళని గూర్చి పిల్లల ఊహలెలా ఉంటాయో ఆగేయాల్లో చిత్రించారు. అంకెలు మొదలు ఆంధ్ర తెలంగాణా ఉద్యమాలవరకు అనేక విషయాలను బాలసాహిత్య మంజరిలోని గేయాలలో పొందుపరిచారు ఉదాహరణకు.

"బొజ్జలోని కాకిపిల్ల ఏమిఅన్నది
ఆకలేయని అమ్మ నడుగమన్నది.
పప్పు బువ్వ నెయ్యి కలిపి పెట్టమన్నది
నడుమ నడుమ కూరముక్క నంజమన్నది.

---

1. బాలసాహిత్యమంజరి. పరిచయవాక్యముల నుండి (అముద్రితం)

తీయ తీయని పెరుగు ముద్దలైతె తింటనన్నది
నీరు మజ్జిగయితె నేను ముట్టనన్నది.
ఊహూఁ నేముట్టనన్నది."

(బాలసాహిత్య మంజరి)

ఇలాంటి గేయాలెన్నో 'బాలసాహిత్య మంజరి' లో ఏడాదినిండిన చిన్నపిల్లలు మొదలు అన్ని దశల బాలలకు ఉపయోగకరమైనవి చాలా ఉన్నాయి

బాలసాహిత్య రచయిత్రులలో పేర్కొనదగిన మరో రచయిత్రి చావలి బంగారమ్మగారు (1900), వీరు బాలలకోసం గేయాల్ని వ్రాయడమేగాక బాల జాన పదగేయాలను కొన్నింటిని సేకరించారు వీరు సృష్టించిన, సేకరించిన గేయాలు ఎక్కువగా గృహలక్ష్మి పత్రికలో 'బాలవిజ్ఞానశాఖ' శీర్షిక క్రింద ప్రచురించబడ్డాయి వీరి గేయాలలో కప్పతల్లి పెండ్లి, ఆ కొండ, కార్తిక పూర్ణిమ, చెలియెడబాటు మొదలైనవి పేర్కొనదగినవి. చెలియెడబాటులో పిల్లలు బొమ్మలపెండ్లిచేసి బొమ్మ పెండ్లి కూతురిని అత్తారింటికి పంపుతూ చెలికత్తెలు అప్పగింతలు పెట్టడాన్ని సంప్రదాయ సిద్ధంగా వర్ణించారు.

"మాతోటి ఆడేటి
మాచిన్న చెలియా
మగనితో అత్తింటి
కేగుచున్నావా ?
మరల ఎప్పుడు వచ్చె
దవె మమ్ము జూడ
... ... ..."

(గృహలక్ష్మి 1933 ఏప్రిల్ సంపు : 6, సంచిక 2. పుట : 152)

చెట్లగాలులను, ఆకాశ వీవనలని, పయనించే మేఘాలను స్వర్గనాధుడు రథమెక్కి పోతున్నట్లు, ఉరుములను మేళతాళాల చప్పుళ్ళుగా, మెరుపులను పెళ్లిళ్ళలో

వెలిగించే బాణసంచాలుగా భావించడం రచయిత్రి ఊహాశక్తికి తార్కాణం. తర్వాత చాలామంది రచయిత్రులు బాలగేయాలను సృష్టించి గృహలక్ష్మి పత్రికలలో ప్రకటించారు. నేమాని భారతీ రత్నాకరాంబ, కాంచనపల్లి కనకమ్మ (1893) కంకిపాటి రుక్మిణమ్మ, చదలవాడ రాఘవాంబ మొదలైనవారు వ్రాసిన గేయాలుకొన్ని గృహలక్ష్మి పత్రికలో ప్రచురితమైనాయి.

తెలుగుసాహిత్యంలో పాతపాటలుపోయి కొత్తపాటలు ప్రాణం పోసుకుంటున్న సమయంలో 'మహాప్రస్థానం' గేయాల్లో తెలుగు సాహిత్య విప్లవ శంఖారావం చేసిన వారు శ్రీశ్రీ గారు కష్టసుఖాలు తెలియని పసిపిల్లల వెర్రిసంతోషాలను కీర్తిస్తూ కొన్ని గేయాల్ని వ్రాశారు ప్రపంచంలోని అందచందాలను, వెలుగు నీడలను' సుఖదుఃఖాలను కవితా హృదయంతో గానంచేశారు. సమస్తవిశ్వం నీదేనంటూ భావి పౌరులైన బాలలను ఆశీర్వదించారు. ఆ గేయం :

"పాపం పుణ్యం ప్రపంచ మార్గం
కష్టం సౌఖ్యం శేషార్థాలూ
ఏమీ ఎరుగని పూవుల్లారా !
అయిదారేడుల పాపల్లారా !
మెరుపు మెరిస్తే వానకురిస్తే
ఆకాశమున హరివిల్లు విరిస్తే
'అవి మాకే' అని ఆనందించే కూనల్లారా !
గరిక పచ్చని మైదానాల్లోనూ
తామరపూవుల కోనేరులలో
పంట చేలలో బొమ్మరిళ్ళలో
తండ్రి సందిటా తల్లి కౌగిటా
దేహధూళితో కచభారంతో
నోళుల వ్రేళులు పాలబుగ్గలూ

ఎక్కడ చూస్తే అక్కడ మీరే
విశ్వరూపమున విహరిస్తుండే
పరమాత్ములు ఓ చిరుతల్లారా !
మీదే మీదే సమస్త విశ్వం
మీరే లోకపు భాగ్య విధాతలు
మీ హాసంలో మెరుగులు తీరును
వచ్చే నాళ్ళ విభా ప్రభాతములు"

ఇలాంటి రచనలు ప్రత్యక్షంగా పిల్లలకోసం నిర్దేశించబడక పోయినా పిల్లల అభిరుచిని, వారి రుచిర ప్రకృతిని ప్రతిబింబిస్తాయి.

కప్పవైద్యుడు (బాల, సెప్టెంబరు 1949) అనే వినోద ప్రధానమైన నీతికథా గేయాల్ని కూడా శ్రీశ్రీ వ్రాశారు బాల్యం, పుట్టనిపాప, ప్రార్థన అన్నవి వారి అనువాద గేయాలు.

"అరెరె తమ్ముడీ దొరికింది
దాంతో ఏమిటి చేస్తారు ?
దీంతో పలకా కొంటాను
దీంతో బలపం కొంటాను
... ... ... ..."

(సృజన బాలల సంచిక : 1978)

ఇలాంటి పిల్లల మనస్తత్వాన్ని చిత్రించే గేయాల్నికూడా వారు కొన్నింటిని వ్రాశారు వారు సినిమాలకోసం వ్రాసిన పాటల్లో గూడా కొన్ని బాలలకు ఉపయుక్తమయ్యే రచనలున్నాయి.

బాలసాహిత్య రచనలు చేసిన వారిలో పైన పేర్కొన్నవారేగాక కథా రచయితలు, నవలా రచయితలు, నాటికా రచయితలు, వైజ్ఞానిక గ్రంథరచయితలు

బాలవిజ్ఞాన సర్వస్వాలు వ్రాసినవాళ్ళు బాలసాహిత్యంలో పరిశోధనచేసినవాళ్ళు ఎందరో ఉన్నారు. వాళ్ళరచనలకు సంబంధించిన వివరాలు కొన్ని అనుబంధంలో ఇవ్వబడ్డాయి.

## 2. బాలల పత్రికలు.

బాలసాహిత్య వికాసానికి, ప్రచారానికి సాధనాలైన వాటిలో ప్రథమస్థానం పత్రికలకే, బాలల పఠనాసురక్తికి, భాషాభివృద్ధికి అవి ఎంతో దోహదకారులు బెంగాల్, హిందీ మొదలైన భాషల్లో ఈ శతాబ్దం ఆరంభంలోనే పిల్లలకు ప్రత్యేకమైన పత్రికలు వెలువడ్డాయి ఇంగ్లీషులో అంతకు ముందే సర్వతోముఖంగా బాల సాహిత్యం అభివృద్ధి చెందింది తెలుగులో 1940 వరకు బాలలకు ప్రత్యేకమైన పత్రికలేదు. కొన్ని సాహిత్య పత్రికల్లో బాలశీర్షికలు లేదా విభాగాలు మాత్రం కేటాయించ బడ్డాయి మొత్తం మీద బాలసాహిత్య సృష్టికి దోహదం చేసిన పత్రికలను రెండు రకాలుగా విభజించవచ్చు.

1. బాలశీర్షికలున్న పెద్దల పత్రికలు.
2. కేవలం బాలల పత్రికలు.

### బాలశీర్షికలున్న పెద్దల పత్రికలు.

తొలిదశలో బాలసాహిత్య ప్రచురణకు తోడ్పడిన తెలుగు పత్రికలు జన వినోదిని, వివేకవతి, అనసూయ, నవ్వులతోట కృష్ణా పత్రిక, భారతి, గృహలక్ష్మి ప్రతిభ మొదలైనవి. ఆంగ్ల పత్రికలైన **Indian Antiquary Monern review** లుకూడా బాలసాహిత్యాన్ని కొంతవరకు ప్రచురించాయి.

1884 లో మద్రాసునుంచి వెలువడ్డ జనవినోదని (1875–1885) పత్రికలో మొట్ట మొదటి సారిగా చిట్టి పొట్లకాయ, రంగు రంగు ఎళ్ళ మొదలైన పిల్లల పాటలు ప్రచురించబడ్డాయి. చింతా దీక్షితులు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారింజి ప్రముఖ

రచయితలు వ్రాసిన పాటలు కొన్ని అనసూయ మాసపత్రికలో 1919 లో అచ్చయినాయి, నందిరాజు చలపతిరావుగారి సంపాదకత్వంలో వెలువడ్డ గృహలక్ష్మి పత్రికలో 1928 లో బాలవిజ్ఞానశాఖ శీర్షిక ప్రారంభమైంది. ఈ విభాగంలో పిల్లల పాటలు, కొప్పుపల్కులు, నీతికథలు, మెదడుకు మేత మొదలైన శీర్షికల క్రింద కొంత బాలసాహిత్యం ప్రచురితమైంది పిల్లల తెలివి తేటలను దోహదపరిచే యుక్తిలెక్కలు, చిక్కుప్రశ్నలు జానపదగేయాలు కూడా గృహలక్ష్మి పత్రికలో ప్రచురించడం జరిగింది కేసరిగారి సంపాదకత్వాన వెలువడ్డ గృహలక్ష్మి (1923-1960) పత్రికలో కూడా బాలసాహిత్య పరమైన గేయాలు కథలు మొదలైనవి ప్రచురించబడ్డాయి. తెలుగు సాహిత్య పత్రికల్లో అగ్రగణ్యమైన భారతి (1924) మాస పత్రికలో 1940 లో గిడుగు సీతాపతిగారి సంపాదకత్వాన బాలసాహిత్య ప్రచురణార్థం 'బాలానందం' శీర్షిక ప్రారంభమైంది ఈ శీర్షిక కొంత కాలం మాత్రం సాగి తర్వాత ఆగిపోయింది. ఆంధ్ర పత్రిక (1918), ప్రగతి (1936-1940), ఆంధ్రప్రభ (1938) మొదలైన పత్రికల్లో కూడా బాలసాహిత్యానికి కొన్ని పేజీలు కేటాయించడం జరిగింది టామ్‌సాయర్ (18-10-1950), మనిషిలో మ౦షి, అల్లీ బిల్లీలోకంలో అమ్మాయి (**Alice in the wonder land**) లాంటి పిల్లల అనువాదనవలలు ఆ పత్రికల్లో ధారావాహికంగా ప్రచురించబడ్డాయి. ప్రగతి సచిత్ర వారపత్రికలోను, విశాలాంధ్ర దినపత్రికలోను 'చిన్నారిలోకం', ఆంధ్ర జ్యోతి సచిత్రవారపత్రికలో 'బొమ్మరిల్లు', ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 'బాలప్రభ' ఇంకా కొన్ని పత్రికల్లో బాలసాహితి, బాలానందం, బాల జ్యోతి, రంగులరాట్నం మొదలైన శీర్షికలు బాలసాహిత్య రచనల కోసం ప్రత్యేకించబడ్డాయి

పుస్తక ప్రపంచం పత్రికాధిపతులు రావూరి భరద్వాజగారి సంపాదకత్వంలో బాలల దినోత్సవాన్ని పురస్కరించుకొని ప్రతి నవంబరు సంచికను బాలల ప్రత్యేక సంచికగా ప్రచురించేవారు. ఆ సంచికలో బాలసాహిత్యానికి సంబంధించి పాటలు, పద్యాలు, కథలు, హాస్యరచనలు, వ్యాసాలు ఉండేవి ఆ పత్రికా సంపాదకులు 5-8, 9-12, 13-15 సంవత్సరాల పిల్లలకు వ్యాసరచనలో పోటీలను నిర్వహించి, బహుమతులను కూడా పంచేవారు.

## 2. కేవలం బాలల పత్రికలు.

1940 లో మెడిచర్ల ఆంజనేయమూర్తిగారి సంపాదకత్వంలో 'తొలి బాలల మాసపత్రిక 'బాలకేసరి' ప్రారంభమైంది ఈ పత్రిక ప్రారంభంతో బాలసాహిత్య చరిత్రలో ఒక నూతనదశ ఆరంభమైందని చెప్పవచ్చు.

### బాల (1945 - 1958, 1977 - )

తెలుగులో వెలువడ్డ పిల్లల పత్రికలలో సమగ్రమైన మొదటి పత్రిక బాల బాలసాహిత్య సాంస్కృతికాభివృద్ధులకు విశేషంగా కృషిచేసి తమ జీవితాలను బాలలకే అంకితం చేసిన న్యాయపతి దంపతులు ఈ పత్రికా సంస్థాపకులు 1945 నుంచి 1958 వరకు ఈ పత్రిక గొప్ప దక్షతతో నడిచింది ఆర్థిక పరిస్థితుల కారణంగా మధ్యాంతరంగా ఆగిపోయింది నేడు ప్రముఖ బాలసాహిత్య రచయితలుగా పేరు పొందిన చింతా దీక్షితులు, గిడుగు సీతాపతి, ముళ్ళపూడి వెంకటరమణ, బాపు, వి. వి. నరసింహారావు, ముద్దా విశ్వనాథం మొదలైనవారి రచనల్ని ప్రచురించి, ప్రోత్సాహ మిచ్చింది బాలల పత్రికే. వెటూరి ప్రభాకరశాస్త్రి, వెటూరి శివరామ శాస్త్రి లాంటి గొప్ప పండితులు వ్రాసిన గేయాలు, కథలు, పద్యాలు కూడా బాలపత్రికలో చోటు చేసుకున్నాయి. తెలుగులో బాలపత్రికలు వెలువడటానికి 'బాల' మార్గదర్శి అయిందని చెప్పవచ్చు. కథలు, చిత్రకథలు రూపకాలు ప్రహసనాలు, గేయాలు, పొడుపు కథలు, పిల్లల ఆటలు, నీతి పద్యాలు, నాటికలు, హాస్య చిత్రాలు, పిల్లల చలన చిత్రాలకు సంబంధించిన వార్తలు,రేడియో కార్యక్రమాల వివరాలు, క్రీడా విశేషాలు, బాలసంఘ వార్తలు, విదేశీ విషయాలు, మెదడుకు మేత పెట్టే విజ్ఞాన విషయాలు, చిక్కు ప్రశ్నలు, యుక్తి లెక్కలు, వినోదాన్నిచ్చే వింతలు, విజ్ఞానాన్ని కూడా అందించే ప్రశ్నలు - జవాబులు, మొదలైన వినోద విజ్ఞానాలకు సంబంధించిన విషయాలను ఎన్నింటినో ప్రవేశ పెట్టిన ఘనత ఒక్క 'బాల' పత్రికకే దక్కింది. తెలుగు దేశమంతటా బాలానంద సంఘాల స్థాపనకు కూడా ఈ పత్రికే తోడ్పడింది ఈ పత్రిక 1945 నుంచి పదమూడు సంవత్సరాలు నిర్విరామంగా నడచి 1958 లో హైదరాబాదులో ఆర్థిక సాంకేతిక కారణాలవల్ల

స్ర్దావస్థలో మునిగి బాలల అకాడెమీ మేలుకొలుపులు పాడగా లేచి 1977 లో మళ్ళీ జీవితయాత్ర ప్రారంభించింది. పునర్జీవిత గమనాన్ని కొంతకాలం మాత్రం నిరాటంకంగా సాగిస్తూ 'బాల' పేరును 'బాల చంద్రిక' గా మార్చుకొని పిల్లల పత్రికా ప్రపంచంలో చంద్రునిలా వెలుగుతూ విజ్ఞానాన్ని అందిస్తూంది. న్యాయపతి రాఘవ రావు, న్యాయపతి కామేశ్వరిగార్ల సంపాదకత్వంలో అకాడెమీ ఆధ్వర్యంలో పునర్ముద్రించబడ్డ బాల (1977) పత్రికలో హాస్యప్రధానమైన లటుకు–చిటుకు, పొట్టిబావ–చిట్టిమరదలు, కొంటెకిష్టయ్య, మిఠాయిపొట్లం, రామూ–సోమూ, సరళా–విరళా వినోదకథలు, పొడుపు కథలు, అతుకు బొతుకులకథ, మెదడుకు మేతపెట్టే విజ్ఞాన విషయాలు, చిక్కు ప్రశ్నలు, వింతలు–కవ్వింతలు–కేరింతలు, ప్రశ్నలు–జవాబులు, సినీ బాలకబుర్లు, బాలిండియా రేడియో (వార్తలు), నాటికలు మొదలైన పాత క్రొత్త శీర్షికలతో బాలపత్రిక ఆకర్షణీయంగా వెలువడేది.

## చందమామ (1946)

నాగిరెడ్డి, చక్రపాణి గార్ల సంపాదకత్వాన రంగు రంగుల బొమ్మలతో చందమామ పత్రిక 1946 లో ప్రారంభమయింది అది పిల్లల పత్రికా ప్రపంచంలో అద్భుతమైన సంచలనాన్ని రేకెత్తించిందనడంలో సందేహం లేదు. పిల్లల పత్రికలలో ఈ పత్రికకు ప్రత్యేకమైన స్థానం ఉంది. జీవం ఉట్టిపడే రంగు రంగుల బొమ్మలతో వెలువడుతున్న ఆ పత్రిక పిల్లల్నేగాక పెద్దల్ని కూడా తనవైపు ఆకర్షించు కొన్నది. ప్రస్తుతం చందమామ పత్రిక ఇంగ్లీషుతో సహా ఇంచుమించు పదిభాషల్లో ప్రచురించబడుతున్నదంటే ఆ పత్రికకు దేశంలో ఎంత ప్రచారం, ఆదరణ ఉందో అర్థమవుతుంది చందమామలోని ప్రతిపుటలోను ఆకర్షణీయమైన రంగులబొమ్మ ఒకటి తప్పక ఉంటుంది పురాణాలకు సంబంధించిన కథ ఒకటి, పంచ తంత్ర కథల్లో ఒకటి తప్పక ఉంటుంది సాధారణంగా అట్టమీదిబొమ్మ పురాణకథకు, అట్టవెనుకబొమ్మ పంచతంత్రకథకు సంబంధించిందై ఉంటుంది నీతుల్ని బోధించే సోషియల్ కథలు, పిట్టకథలు, అద్భుత సన్నివేశాలతో కూడుకున్న భేతాళకథలు, ఇంద్రజాలపు కథలు చందమామ పత్రికలో వెలకొలది ప్రచురిత

పైగాయి. 'అమరవాణి' శీర్షిక క్రింద నీతుల్ని బోధించే కొన్ని సంస్కృత శ్లోకాలకుకూడా ఈ పత్రికలో స్థానముంది చివర బొమ్మల వ్యాఖ్యనిచ్చి ఆబొమ్మకు సరైన వాఖ్య పంపేవారికి బహుమతులివ్వడం కద్దు. తెలుగు చందమామలో ప్రచురితమయ్యే కథలన్నీ వైవిధ్యంలేని చక్కని శైలిలో ఉండడం గమనించదగ్గ విషయం. ఇంచుమించు చందమామను పోలిన పత్రికలే బాలమిత్ర, బొమ్మరిల్లు వసంతబాల, బుజ్జాయి మొదలైనవి

తెలుగులో ఇంచుమించు నలభై పత్రికలు వెలువడ్డాయి. కొన్ని అర్ధాంతరంగా ఆగిపోతే కొన్ని నిరాటంకంగా కొనసాగుతున్నాయి. తెలుగులో వచ్చిన పిల్లల పత్రికలకు సంబంధించిన ముఖ్య వివరాలను క్రింది పట్టికలో గమనించవచ్చు.

## పిల్లల పత్రికలు

| వరుస | పత్రిక పేరు | సంపాదకులు | ప్రచురణ వివరాలు |
|---|---|---|---|
| 1 | బాలకేసరి | మెడిచర్ల ఆంజనేయ మూర్తి | మాసపత్రిక 1940 లో ప్రారంభం, ఆగిపోయింది |
| 2 | బాల | న్యాయపతి రాఘవ రావు, న్యాయపతి కామేశ్వరి | మాసపత్రిక 1945 లో ప్రారంభమై 1958లో ఆగిపోయిన 1977 లో పునః ప్రచురణ |
| 3 | చందమామ | నాగిరెడ్డి, చక్రపాణి | మాసపత్రిక 1946 నుంచి వెలువడు తున్నది. |
| 4 | బాలమిత్ర | బి వి. రాధాకృష్ణ | మాసపత్రిక 1949 నుంచి వెలువడుతున్నది |
| 5 | బొమ్మరిల్లు | కె రాజారావు | మాసపత్రిక 1949 లో ప్రారంభం కొంతకాలం సాగి ఆగిపోయింది |
| 6 | పాపాయి | డా॥డి. అప్పారావు | మాసపత్రిక 1950 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |

| వరుస | పత్రిక పేరు | సంపాదకులు | ప్రచురణ వివరాలు |
|---|---|---|---|
| 7 | బాల వినోదం | గోపేటి శ్రీరామా రావు | మాసపత్రిక 1950 లో ప్రారంభం కొంత కాలానికి ఆగి పోయింది |
| 8 | ఉదయ బాల | — | 1952 లో ప్రారంభం కొంతకాలానికి ఆగిపోయింది. |
| 9 | బాలప్రభ | పొటిబండ మాధవ శర్మ | మాసపత్రిక 1952 లో ప్రారంభం తర్వాత ఆగి పోయింది |
| 10 | బాలప్రభ | — | వారపత్రిక 1952 లో ప్రారంభమై కొంతకాలానికి ఆగిపోయింది |
| 11 | బాలానందం | న్యాయపతి రాఘవ రావు | వారపత్రిక 1956 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 12 | బాలప్రభ | జి. మురిరత్నం నాయుడు | మాసపత్రిక 1958 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 13 | బాలబంధు | అర్. ఎస్. మూర్తి | పక్షపత్రిక 1962లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 14 | చంద్ర భాను | కోటిపాటి, యం ఎ శేషయ్య | మాసపత్రిక 1962 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 15 | బాలరాజ్యం | గోపేటి శ్రీరామా రావు | మాసపత్రిక 1963 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 16 | బాలానందం | ముదునూరు రామా రావు, వెంకటేశ్వర రావు | మాసపత్రిక 1964 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 17 | రఘుబాల | ఎ ఎల్లయ్య | మాసపత్రిక 1965 లో ప్రారంభం |
| 18 | పసిడి బాల | చింతా హనుమంత రావు | మాసపత్రిక 1969 లో ప్రారంభం |

| వరుస | పత్రిక పేరు | సంపాదకులు | ప్రచురణ వివరాలు |
|---|---|---|---|
| 19 | బాల ప్రపంచం | మొసూనా (మంచా సూర్యనారాయణ) | మాసపత్రిక 1970 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 20 | ఆనంద బాల | ఎ కె విశ్వేశ్వర రావు, ఎ ఎన్. ఆర్. ఆంజనేయులు | మాసపత్రిక 1970 నుంచి వెలువడుతున్నది. |
| 21 | బొమ్మరిల్లు | విజయ బాపినీడు | మాసపత్రిక 1972 నుంచి వెలువడుచున్నది |
| 22 | పాలవెల్లి | గిరిజ శ్రీభగవాన్ | మాసపత్రిక 1974 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 23 | వసంతబాల | విశ్వప్రసాద్ | మాసపత్రిక 1974 నుంచి వెలువడుచున్నది. |
| 24 | పొదరిల్లు | బి వి రంగా చార్యులు | పక్షపత్రిక 1974 లో ప్రారంభం తర్వాత ఆగిపోయింది |
| 25 | బుజ్జాయి | గీతా సుబ్బారావు | మాసపత్రిక 1975 నుంచి వెలువడుతున్నది |
| 26 | స్నేహబాల | నాయని కృష్ణ మూర్తి | మాసపత్రిక 1976 నుంచి వెలువడుచున్నది |
| 27 | బేబి | సి నాగేశ్వరరావు | మాసపత్రిక 1977 నుంచి వెలువడుతున్నది |
| 28 | చంపక్ | — | మాసపత్రిక 1977 లో ప్రారంభం |
| 29 | స్నేహబాల | నాయని కృష్ణ మూర్తి | మాసపత్రిక 1977 లో ప్రారంభం |
| 30 | బాల | న్యాయపతి రాఘవ రావు, న్యాయపతి కామేశ్వరి | 1977 లో బాలల అకాడెమీచే పునః ప్రారంభం |
| 31 | ఎలియన్ జోక్సు | యల్ వెంకటేశ్వర్లు | వినోద కథల మాసపత్రిక 1977 లో ప్రారంభం |

| వరుస | పత్రిక పేరు | సంపాదకులు | ప్రచురణ వివరాలు |
|---|---|---|---|
| 32 | బాలచంద్రిక | ఏడిద కామేశ్వర్రావు | మాసపత్రిక 1978 లో బాలల అకాడమిచే ప్రారంభం |
| 33 | బాలభారతి | వి. వి. నరసింహా రావు, శశిభూషణ్ | మాసపత్రిక 1978 లో ప్రారంభం |
| 34 | ప్రమోద | ధనికొండ హను మంతరావు | మాసపత్రిక 1978 లో ప్రారంభం |
| 35 | బాలజ్యోతి | — | మాసపత్రిక 1980 లో ప్రారంభం |

తెలుగులో ఇన్ని పిల్లల పత్రికలు వెలువడినా వీటిలో చాలా పత్రికలు పుబ్బలో పుట్టి మఘలో మాయమైనవే. పాడిందే పాటరా పంగనామాల దాసరి అన్నట్లు వేసిన కథల్నే వేస్తున్నారు. సృజనాత్మకమైన కొత్త శీర్షికలతో అన్ని అంశాలతో సమగ్రమైన పత్రికలు చాలా తక్కువనే చెప్పాలి. జానపద సాహిత్యానికి పిల్లలపత్రికల్లో కావలసినంత స్థానమివ్వడంలేదు. ఇతర దేశాలతో, ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే పిల్లల పత్రికల్ని నిర్వహించడంలో మనం చాలా వెనుకబడిఉన్నాం. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌లో పిల్లలకు పాఠశాలలో చదివే పాఠాలతోబాటు రకరకాల పనులు నేర్పుతారట. వాటిలో ముద్రణకూడా ఒకటి. అక్కడ పిల్లల ముద్రణాలయాలు 150 వరకున్నాయి. పిల్లల పత్రికల్ని పిల్లలే నడుపుకుంటారు. కావలసినవన్నీ పుస్తకాలు మొదలైనవి వాళ్లే ముద్రించుకుంటారు[1] అలాంటి అదృష్టం, అవకాశం తెలుగు పిల్లలకు కలిగే దెప్పుడో !

జపానులో 'మైనచి' అనే దినపత్రిక ఒక క్రొత్త కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నదట. 1955 నుంచి బాలసాహిత్యంలోని కొన్ని గ్రంథాలను వాటిపేర్లను

1. నరసింహారావు, వి. వి. బాలవాఙ్మయం పుట 20, 1975.

ప్రకటించి, ఆ గ్రంథాలను చదివిన పిల్లల అభిప్రాయాలను, సమీక్షలను సేకరిస్తుంది. సర్వోత్కృష్టమైన వాటికి బహుమతులివ్వడమేగాక వాటిని ప్రచురిస్తుందట. 1968 లో ఆపోటీలో పదహారు లక్షలమంది బాలబాలికలు పాల్గొన్నారంటే ఆ ప్రయోగానికి ఎంత విస్తృతి ఉందో, అది పిల్లల్ని ఎంతగా ఆకర్షిస్తున్నదో ఊహించవచ్చు. పోటీకయ్యే ఖర్చును కొంత ప్రచురణకర్తలు, కొంత పత్రికల వాళ్లు భరిస్తారట. రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటే తెలుగు పిల్లలకు కూడా ఇటువంటి అవకాశాలను కల్గించవచ్చు చర్చల ద్వారా చక్కని రచనలు రావటానికి ఆస్కారముంటుంది. పిల్లలు ఆసక్తితో, జిజ్ఞాసతో పత్రికల కోసం ఎదురుచూసే విధంగా పత్రికలు రూపొందాలి పత్రికల్లోని అన్ని అంశాలకు ఆకర్షణీయమైన బొమ్మలు తోడుకావాలి

## 3 ఆకాశవాణిలో బాలల కార్యక్రమాలు.

1937 లో తెలుగు బాలసాహిత్య చరిత్రలో ఒక ముఖ్యమైన ఘట్టం ప్రారంభమైందని చెప్పవచ్చు ఆ సంవత్సరమే ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం నుంచి తెలుగు పిల్లలకోసం ప్రత్యేక కార్యక్రమాలు ప్రారంభమైనాయి. బాల సాహిత్య వ్యాప్తికి ఉపయోగపడే సాధనాలన్నిటిలో రేడియో చాలా ఆకర్షణీయమైంది. దానికి కారణం రేడియోలో ప్రసారమయ్యే పాటలు, కథలు, నాటికలు నిరక్షరాస్యులకు కూడా అవగాహన కావడం. రేడియోలో కథగాని, నాటికగాని ప్రసారమవుతున్నప్పుడు సమయోచితంగా సాంకేతిక పరికరాల సహాయంతో పక్షులు, జంతువులు మొదలైనవాటి అరుపుల్ని, ఇతర ధ్వనుల్ని కూడా చేర్చి రక్తికట్టించే అవకాశముంది. అందువల్ల రేడియో కార్యక్రమాలు పిల్లలకెక్కువ ఆకర్షణీయాలు ఆనందదాయకాలు. ఆ ఉద్దేశంతోనే 1937 లో మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో బాలానంద కార్యక్రమాలు దుర్గాబాయమ్మగారిచే ప్రారంభమైనాయి మొట్టమొదట మద్రాసు, హైదరాబాదు, విజయవాడ రేడియో కేంద్రాల నుంచి పిల్లల కార్యక్రమాలను న్యాయపతి దంపతులు నిర్వహిస్తుండేవారు అందుకే వాళ్లు రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్యలుగా తెలుగు దేశంలో స్థిరపడినారు. ఆంధ్ర దేశంలో వాళ్ళని గురించి వినని తెలుగు

పిల్లలుండరంటే అతిశయోక్తి కాదు. వాళ్లు మొట్టమొదటి సారిగా రేడియో కార్యక్రమాలద్వారా బాలబాలికల్లో ఉండే సహజశక్తుల్ని వికసింపజేశారు పిల్లల్ని మురిపించి, లాలించి ముద్దు ముద్దు మాటల్ని వాళ్ల నోళ్లద్వారా అందరికీ వినిపించారు. పిల్లలచేత పాటలు పాడించి, కథల్ని వినిపించి, నాటకాల్ని వెయించడమేగాక ఆ కార్యక్రమాల కోసం ఎంతో మంది రచయితలకు ప్రోత్సాహమిచ్చి బాలసాహిత్యాభివృద్ధికి తోడ్పడ్డారు వాళ్లు రేడియో కార్యక్రమాలలోని లోటు పాట్లను సరిదిద్దేందుకు వివిధ ప్రాంతాల్లో ఉన్న పిల్లల అభిప్రాయాలను ఉత్తరాల శీర్షిక ద్వారా తెలుసుకొనే వారు పసిపిల్లల చిన్ని బుద్ధులకు పదునుపెట్టే చిక్కుప్రశ్నలు, పొడుపుకథలు కూడా ఆ కార్యక్రమాల్లో స్థానాన్ని సంపాదించుకొన్నాయి. ప్రత్యేకించి రేడియో కార్యక్రమాలకోసం ఎన్నో కథలు, పాటలు, నాటికలు వ్రాయబడ్డాయి.

పిల్లల రేడియో కార్యక్రమాలు సాంప్రదాయికంగా వస్తున్న జానపదగేయాలను కూడా ఎక్కువ ప్రచారంలోకి తీసుకువచ్చాయి పిల్లల చేత నాటికల్ని ప్రసారం చేయించడం ద్వారా సాహిత్యరంగంలోని ప్రసిద్ధకవులు. వాళ్ళకావ్యాలు, అందలి అంశాలు, ఆకావ్యాల్లోని పాత్రలు గురించి పిల్లలు సులభంగా తెలుసు కోవడానికి వీలుకలిగింది. సింత్రిల్లా, సిందూబాద్, అల్లావుద్దీన్, దిలీపుడు, రఘువు మొదలైన నాటికలెన్నో రేడియోలో చాలాసార్లు ప్రసారమైనాయి ఆ కార్యక్రమాల ఫలితంగా క్రొత్త రచనలెన్నో వచ్చాయి అలాంటి రచనలు చేసిన వాళ్లలో ముఖ్యులు కృష్ణమూర్తి, బాలాంత్రపు రజనీకాంతరావు (జేజిమామయ్య పాటలు) శ్రీవాత్సవ (జల్తారు జాబిలి అద్భుతకథ) న్యాయపతి రాఘవరావు, న్యాయపతి కామేశ్వరి, ఏడిద కామేశ్వరరావు, కె సభా మొదలైన వాళ్లు రావూరి భరద్వాజగారు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ప్రస్తుతం పిల్లల కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు వసంతరావు వెంకటరావు, తురగా జానకిరాణి గార్లుకూడా ఈ రంగంలో ఎక్కువ కృషిచేశారు ఇంకా చేస్తున్నారు.

బాలానందం, బాలవినోదం, బొమ్మరిల్లు, పాలవెల్లి, ఆటవిడుపు, బాలవిహార్ బాలవాణి మొదలైన ప్రత్యేక కార్యక్రమాలు పిల్లలకోసం ప్రసారమవుతున్నాయి

ప్రాథమిక మాధ్యమిక పాఠశాలల కార్యక్రమాలు కూడా పిల్లలకు ప్రయోజనకరంగా ఉన్నాయి. బాల కవి సమ్మేళనాలు బాలల దినోత్సవాలు, జాతీయ పర్వదినాలు మొదలయిన వాటిని పురస్కరించుకొని ప్రత్యేకంగా వాటికోసం పాటలు, పద్యాలు నాటికలు, బుర్రకథలు, కథలు, ప్రహసనాలు ఎన్నో వ్రాయబడి రేడియోలో ప్రసార మవుతున్నాయి

# 4. బాలసాహిత్యానికి సంస్థల దోహదం.

బాల సాహిత్యాభివృద్ధికి ఇతర సంస్థల ప్రోత్సాహం కూడా ఒక కారణం. బాలవాఙ్మయ శాఖలోని ఉత్తమ రచనలకు ప్రభుత్వం, ఇతర సంస్థలు బహుమతు లివ్వడానికి సంకల్పించినప్పటినుండి సంస్థల ప్రోత్సాహ ఫలితంగా చాలామంది రచయితలు కొత్తపద్ధతిలో ఎన్నో విషయాలను పిల్లలకు అందిస్తున్నారు.

## కేంద్ర ప్రభుత్వ బహుమతులు.

గేయాలు, కథలు గేయకథలు, విజ్ఞానశాస్త్ర గ్రంథాలు మొదలైన ప్రక్రియ లతో కూడిన పిల్లల పుస్తకాలకు కేంద్ర ప్రభుత్వం బహుమతులివ్వడానికి పూనుకొంది మొట్టమొదట 1955 లో చింతా దీక్షితులుగారి లక్క పిడతలు, 1956 లో గిడుగు సీతాపతిగారి బాలానందం కేంద్రప్రభుత్వ బహుమతులను అందుకొన్నాయి 1955 లో కవిరావుగారి బొమ్మరిల్లు బాల విజ్ఞాన సర్వస్వంగా పేరుపొందిన మాగంటి బాపినీడుగారి తెలుగుతల్లికి, పిల్లల బొమ్మల భారతానికి కూడా కేంద్ర ప్రభుత్వ బహుమతులు లభించాయి 1957 లో బాలన్నయ్యగారి (న్యాయపతి రాఘవరావు) బడిగంట (1956), 1958 లో ఏ వి నరసింహారావుగారి పాలబడిపాటలు (1958) 1959 లో ఆవంచ లక్ష్మణరావుగారి చిలుకమ్మ చుట్టాలు, సత్తిరాజు కృష్ణారావుగారి పక్షిపాటలు (1959), 1968 లో వక్కలంక లక్ష్మీపతిరావుగారి స్వతంత్ర భారతి (1970), మసూనాగారి బాలప్రపంచం అనే గేయసంపుటాలకు, 1962 లో ఉత్పల సత్యనారాయణగారి ఉత్పలమాల అనే గేయకావ్యానికి 1963 లో వారి దాస్యవిముక్తి

అనే గేయకథా కావ్యానికి 1964 లో డి. కన్యాకుమారిగారి పగలు-రాత్రికి, 1965లో ఏ సూర్యనారాయణమూర్తిగారి బాలల బొమ్మల నెహ్రూజీకి భారత ప్రభుత్వ బహుమతులు లభించాయి. ముఖ్యంగా శాస్త్రవిజ్ఞాన గ్రంథాలకు కేంద్రప్రభుత్వం ఎన్నో బహుమతులిచ్చి ప్రోత్సహించింది. ఎ. వి. యస్. రామారావుగారి అంతరిక్ష విషయం పరమాణువుకథ, చంద్రలోకయాత్ర, బాలవిజ్ఞాన కథావళి, ఎన్. ఎన్. నరసింహారావు గారి విజ్ఞాన మందిరం, విస్సా అప్పారావుగారి ఆకాశం, నటరాజ రామకృష్ణగారి నర్తనశాల, కె. నరసింహారావుగారి బిడ్డల చేతిపనులు, వారణాసి సుబ్రహ్మణ్యంగారి ఏనుగు, రెడ్డి రాఘవయ్యగారి గాలిలో ప్రయాణం ఆ బహుమతుల్ని అందుకున్నాయి కలువకొలను సదానందగారి బంగారు నడచినబాట అనే పిల్లల నవలకు 1966 లో ఉత్తమ నవలా బహుమతి వచ్చింది భారత ప్రభుత్వ విద్యాశాఖ కొత్తగా అక్షరాస్యులైన వయోజనులకు, బాలబాలికలకు ఉపయోగపడే సాంఘిక జీవితానికి దగ్గరగా ఉన్న వ్రాతప్రతులకు కూడా ఏటా బహుమతులిస్తున్నది. యండమూరి సత్యనారాయణగారి (శ్రీవాత్సవ) టెలివిజన్‌కథ, రంగురంగుల పూలు, కె యస్ రెడ్డిగారి చందమామ, కె వి. వి సత్యనారాయణ వర్మగారి భూదేవి, చెట్టా-చేమ, కె. యల్. నరసింహారావుగారి నాన్నకు జాబులు, డా॥ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తిగారి సంఘజీవనం, కొసనం మహేశ్వరరావుగారి గ్రామరాజ్యం మొదలైన గ్రంథాలకు భారత ప్రభుత్వ విద్యాశాఖ బహుమతులొచ్చాయి

## రాష్ట్ర ప్రభుత్వ బహుమతులు.

బహుమతి ప్రదానం ద్వారా బాలసాహిత్య వికాసానికి ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం కూడా దోహదం చేసింది గిడుగు సీతాపతిగారి బాలవినోదగేయాలు, చింతాదీక్షితులుగారి లీలాసుందరి, బంగారు పిలక, బుజ్జాయిగారి పిల్లలు - పువ్వులు, దాశరథి, నారాయణ రెడ్డిగార్ల బాలభారతం, యన్ యన్. నరసింహారావుగారి జంతుపురాణం, గుంటుపల్లి రాధాకృష్ణమూర్తిగారి విజ్ఞానం, 1958 లో వేలూరి సాంబశివరావుగారి ముద్దు పాటలు, ఉత్పల సత్యనారాయణగారి గంగావతరణం మొదలైన గ్రంథాలు ఈ బహుమతుల్ని అందు కొన్నాయి

## దక్షిణ భాషా పుస్తక సంస్థ బహుమతులు.

దక్షిణ భారతీయ భాషల్లో శాస్త్రవిజ్ఞాన గ్రంథాలను, బాలసాహిత్య గ్రంథాలను అభివృద్ధి పరచడానికి, ప్రాంతీయ భాషలన్నిటిలోనూ ఒక భాషలోని ఉత్తమ రచనలను ఇతర భాషలలోకి అనువాదం చేయించడానికి, దక్షిణ భాషలు (తెలుగు, కన్నడం, తమిళం, మళయాళం) నాల్గింటిలోనూ మంచి పుస్తకాలను ప్రచురించడానికి దక్షిణ భాషా పుస్తక సంస్థ స్థాపించబడింది ఆసంస్థ బహుమతులను కూడా ప్రకటించి రచయితలకు ప్రోత్సాహాన్నిచ్చింది 1957 లో డా. ఎస్. ఆర్. రంగనాథన్‌గారి ఆధ్వర్యంలో బాలసాహిత్యంలో దక్షిణభాషా పుస్తకసంస్థ చేత సర్వేనిర్వహింప చేసింది. యస్ యల్ నరసింహారావుగారి జంతు దర్శనం, వాసమూర్తిగారి (వారణాసి సత్యనారాయణమూర్తి) అల్లరిగోపీ అద్భుతయాత్ర, వెలగా వెంకటప్పయ్య గారి విజ్ఞాన లోకం మొదలైన శాస్త్రవిజ్ఞాన గ్రంథాలకు ఆ సంస్థ బహుమతులు లభించాయి 1965 లో మిరియాల రామకృష్ణగారి బాలాభిరామం గేయసంపుటికి ఆ బహుమతి వచ్చింది. 1930 లో బాలల పఠనాసక్తిపై ఈ సంస్థ సర్వే జరిపింది 1961 లో యునెస్కో ఆధ్వర్యంలో సర్వే నిర్వహించబడింది.

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతులు.

1966 నుండి సాహిత్య అకాడెమీ రచయిత్రులు వ్రాసిన బాలసాహిత్య రచనలకు బహుమతుల్ని ప్రకటించింది మొదట 1966-67 లో గంగరాజు సుశీలాదేవిగారి చిట్టిముత్యాలు, (గేయాలు) కె రామలక్ష్మిగారి యువరాజు (నవలిక) ఆ బహుమతుల్ని అందుకొన్నాయి 1967-68 లో జి రాఘవమ్మగారి గేయ కదావళి (గేయాలు) సంక్రాంతిపాటి వెంకట రామమ్మగారి నేటి విద్యార్థి, బాలచంద్రిక, (నాటికలు) 1968-69 లో ఎ లక్ష్మీరమణగారి మూడు మొగ్గలు (కథాసంకలనం) కోసూరి లీలావతీదేవిగారి కుంకుమరేఖ, 1969-70 లో ఆకాశ కిరణాలు (నవల), గిడుగు విశాలాక్షిగారి ప్రకృతి వింతలు (విజ్ఞాన వ్యాసాలు), 1970-71 లో కంచి రమాదేవిగారి అనంతంలో అంతం, కమలవాసినిగారి ఆంధ్రదేశయాత్ర,

1972-73 లో ఎ. యస్ మణిగారి ప్రేమమంత్రం, యాసం సుశీలాదేవిగారి తెలుగుకవులకథ, 1974-75 లో సీతగారి యాజ్ఞికం, 1975-76 లో కంచి రమాదేవిగారి డెయ్యాల మెదలు (సాహస గాథలు) మొదలయినవి.

## ఇతర సాహిత్య సంస్థల బహుమతులు.

ఇతర సాహిత్య సంస్థలు కొన్ని ఏటేటా బహుమతులను ప్రకటించక పోయినా కొన్ని ప్రత్యేక సందర్భాలను పురస్కరించుకొని బాలసాహిత్య రచనలకు బహుమతుల్ని ప్రకటిస్తున్నాయి 1949 లో నార్ల చిరంజీవిగారి కర్రా-చెప్పులుకు ఆంధ్ర వారపత్రిక బహుమతి వచ్చింది. 1970 లో మిరియాల రామకృష్ణగారి రంగురంగుల రత్నదీపాలు భారతీయ బాలసాహిత్యం పదిహేనో పోటీలో, పధ్నాలుగు ప్రాంతీయ భాషల్లో తెలుగు వెలుగుగా ఎన్నికై జాతీయ బహుమానాన్ని అందుకొన్నది. నాయని కృష్ణకుమారిగారి ఆంధ్రుల చరిత్ర, కోదూరి శ్రీరామమూర్తిగారి రవీంద్రకథ, కె యస్ రెడ్డిగారి విజ్ఞానం, గిడుగు విశాలాక్షిగారి రాబిన్‌సన్ క్రూసో మొదలైన గ్రంథాలకు వివిధ సంస్థల బహుమతులు లభించాయి 1975 లో ఆంధ్ర జ్యోతి నిర్వహించిన బాలల నవలా పోటీలో పాలంకి వెంకటరామచంద్రమూర్తిగారి బంగారుతల్లి అనే పిల్లల నవలకు బహుమతి వచ్చింది

సంస్థలు ప్రకటించిన బహుమతులు కారణంగా ఎంతోమంది రచయితలు రచనలు చేసి ఉంటారనడంలో సందేహంలేదు బహుమతులు రాసంతమాత్రాన అవి ఉత్తమ రచనలు కావనికాదు వచ్చినవాటిలో న్యాయనిర్ణేతలు ఉత్తమ గ్రంథంగా ఎన్నికచేసిన దానికి బహుమతి వచ్చినా, మిగిలినవాటిని రచయితలు ఇతరసంస్థల లేదా వ్యక్తుల ధనసహాయంతోనో, సొంతఖర్చులతోనో పుస్తకాల్ని ప్రచురించుకోవడం జరుగుచున్నది ఈ విధంగా బాలసాహిత్య రచనలుకొన్ని పిల్లలకు అందుబాటులోకి వస్తున్నాయి మొత్తంమీద కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇతర సాహిత్య సంస్థలు బాలసాహిత్య రచయితలకు బహుమతుల మూలంగా ప్రోత్సాహాన్నిస్తూ ఉత్తమ బాల సాహిత్యాభివృద్ధికి తోడ్పడుతున్నాయని చెప్పవచ్చు.

బాలానంద సంఘాలు.

భావి భారత పౌరులైన పిల్లలకు అన్నిరంగాల్లోనూ మంచి శిక్షణను యివ్వ డానికి పిల్లల సంస్కృతాభివృద్ధికి మార్గంచూపే బాల సంస్థలు కొన్ని నెలకొల్ప బడ్డాయి. అలాంటి వాటిలో బాలానంద సంఘాలు ముఖ్యమైనవి. గుమ్మడిదల దుర్గాబాయమ్మగారి ప్రోత్సాహంతో "లిటిల్ లేడీస్ ఆఫ్ బృందావన్" పేరుతో 1937 లో తొలి బాలసంఘం స్థాపించబడింది. పిల్లలకు కేవలం రేడియో ప్రోగ్రాములేకాక వాళ్ళ అభిరుచులకు అనుగుణంగా దినవారీ కార్యక్రమాలను ఏర్పాటు చేయవలసిన అవసరం ఉందని మొట్టమొదట గ్రహించినవారు న్యాయపతి దంపతులే. వాళ్ళు ప్రతి శని, ఆదివారాల్లోను, బడి శెలవురోజుల్లోనూ పిల్లలందరిని ఒకచోటచేర్చి కథలు, పాటలు, ఆటలు ఎన్నో నేర్పేవారు. పిల్లలు కూడా ఉత్సాహంతో నృత్యాలు, నాటికలు, ఎన్నెన్నో నేర్చుకొని అవకాశం వచ్చినప్పుడు రంగస్థలంపై ప్రదర్శించే వారు వాటి కృషిఫలితంగా మద్రాసులోని మైలాపూరులో 1947 లో ఆంధ్ర బాలానంద సంఘస్థాపన జరిగింది ఆ సంస్థపిల్లల వినోద, విజ్ఞాన, సాంస్కృతిక సారస్వత వికాసాలకు పునాది అయింది. అదే ఇతర బాలానంద సంఘాల స్థాపనకు తోడ్పడింది. ఆ ఉద్యమానికి 1945 లో ప్రకటించిన బాలపత్రిక రేడియోలో ప్రసారమయ్యే పిల్లల కార్యక్రమాలు మంచి ప్రచారాన్నిచ్చాయి. దాని ఫలితంగా ఊరూరా బాలానంద సంఘాలు ఏర్పడ్డాయి ఉత్సాహవంతులైన పెద్దలు, కళాభి మానులు పిల్లల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడే బాలసంఘాలను తెలుగుదేశ మంతటా స్థాపించారు. చాలామంది రచయితలకు ఆ సంఘముల కార్యక్రమాలకోసం రచనలు చేసే అవకాశం లభించింది కేంద్ర బాలానందసంఘం సొంతమైకులూ రంగస్థల పరికరాలూ మొదలయిన హంగులను సమకూర్చుకోవడమే గాక మూడువేల పిల్లల పుస్తకాలతో గ్రంథాలయాన్ని కూడా నడుపుతున్నది. ఊరూరా స్థాపించబడ్డ బాలానంద సంఘములుకూడా సాంస్కృతిక కార్యకలాపాల్లో పిల్లలకు శిక్షణ యివ్వ డమే గాక రచనలద్వారా వాళ్ళల్లో పఠనాసక్తిని పెంపొందించి సృజనాత్మక శక్తికి దోహదం చేస్తున్నాయి.

## తెలుగుదేశంలోని కొన్ని బాలానంద సంఘాలు.

1. ఆంధ్ర (కేంద్ర) బాలానంద సంఘం. హైదరాబాదు, మద్రాసు
2. గౌతమి బాలవిహార్. నాగార్జున సాగర్
3. బాలానందకేంద్రం. గుంటూరు
4. బాలభారతి. విజయవాడ
5. రామా బాలానంద సంఘం అనకాపల్లి
6. నేతాజీ బాలానంద సంఘం. పోడూరు
7. దివిసీమ బాలానంద సంఘం, అవనిగడ్డ
8. రాయలసీమ బాలానంద సంఘం గుంతకల్
9. శ్రీ కాళహస్తి తాలూకా బాలానంద సంఘం. కాళహస్తి.
10. నవరంగ్ చిత్ర కళానికేతన్. పెల్లటూరు
11. రాజేంద్ర బాలానందం. పాలమూరు.
12. విశ్వశాంతి బాలనంద సంఘం. తాడికొండ.
13. కాకతీయ బాలానంద సంఘం వరంగల్.
14. జాంబాగ్ బాలానంద సంఘం. హైదరాబాదు.
15. నవీన్ బాలానంద సంఘం. చిక్కుడపల్లి

నగరాల్లోనేగాక పల్లెల్లోకూడా బాలనంద సంఘా లెన్నో ఉన్నాయి. ఉదాహరణకు కొన్నిటిని మాత్రం పేర్కొనడం జరిగింది

## బాలానంద సంఘాల కార్యకలాపాలు.

సాంస్కృతిక, వినోద, విజ్ఞాన విషయాలకు సంబంధించిన అన్ని రంగాల్లోనూ పిల్లలకు పాల్గొనే అవకాశాన్ని కల్గించి వాటిలో అభిరుచిని కల్గించడం బాలానంద

సంఘాల ముఖ్యోద్దేశం. సంగీతం, నాట్యం, నాటకం, చిత్రలేఖనం, ఫోటోగ్రఫీ, వ్యాసరచన, గేయరచన, వక్తృత్వం మొదలైన అంశాలలో పోటీలను నిర్వహించి ప్రోత్సాహాన్నిస్తున్నాయి. బాలసాహిత్యాన్ని ప్రచురించి, పంపిణీ చేసే బాల సాహిత్యాభివృద్ధికి కూడా బాలానంద సంఘాలు తోడ్పడుతున్నాయి.

ఈ సంఘాలు తెలుగు పిల్లల్లో నూతన చైతన్యాన్ని కల్గించాయని చెప్పవచ్చు. బాలసాహిత్య వికాసానికి, ప్రచారానికి పల్లెపల్లెలోనూ స్థాపించబడ్డ బాలసంఘాలేగాక మహిళా సంఘాలు. ఇతర సాంస్కృతిక సంస్థలు కూడా తోడ్పడుతున్నాయి. ఉదాహరణకు : హైదరాబాదులో 1965 లో స్థాపించబడ్డ జవహర్ బాలభవన్ కేవలం పిల్లలకు చదువు నేర్పడమేగాక శారీరక, మానసిక వికాసానికి కావలసిన ఏర్పాట్లెన్నో చేసింది. లైబ్రరీ, మట్టిపని, కుట్టుపని, మృదంగం, ఈత, ఫోటోగ్రఫి, సంగీతం, చిత్రలేఖనం, నృత్యం మొదలైన రంగాల్లో పిల్లలకు శిక్షణఇస్తూ ఎన్నో కళలలో విరాజిల్లుతున్న బాలల సంస్థ అది.

బాల సభలు.

బాలానంద సంఘాల సభ్యులతో, ప్రభుత్వ సహాయంతో అప్పుడప్పుడు నిర్వహించబడుతున్న బాలసభలు కూడా సాహిత్యాభివృద్ధికి దోహదం చేస్తున్నాయి. 1952 వ సంవత్సరం ఆగష్టు నెలలో మద్రాసులో ఆంధ్ర బాలల మహాసభలు జరిగాయి. ఆ సమయంలో పిల్లల పత్రికలు, ఇతర దేశాలలో బాలలు నడుపుతున్న వార్తా పత్రికలు, పిల్లల పుస్తకాలు మొదలైనవి ప్రదర్శించబడ్డాయి. ఆసభల్లో బాలసంఘాల స్థాపనకు ప్రచారం చేయబడింది. 1953 లో నెల్లూరులో సభలు జరిపి అక్కడ బాలానంద సంఘాన్ని స్థాపించారు. కేంద్రసంస్థ అయిన ఆంధ్ర బాలానంద సంఘం ఆధ్వర్యంలో నాలుగు బాలమహాసభలు జరిగాయి 1952 లో మద్రాసులో, 1954 లో కర్నూలులో, 1956 లో గుంటూరులో, 1957 లో మళ్ళీ గుంటూరులోను ఆసభలు జరిగాయి. ఆ సభల ఫలితంగా రాష్ట్రంలోని బాల సంఘములన్నీ ఆంధ్ర బాలానంద సంఘంలో చేరి ఒక కేంద్ర సంఘాన్ని ఏర్పాటు

చేసుకోవాలనే తీర్మానం చేయడం జరిగింది 1957 లో మైసూరులో, 1977 లో బాలల అకాడెమీచే హైదరాబాదులో, 1979 లో ఢిల్లీలో - బాలసాహిత్య సదసులు నిర్వహించబడ్డాయి 1959 లో జాతీయ స్థాయిలో న్యూఢిల్లీలో బాలసాహిత్య సదస్సు నిర్వహించబడింది. 1959 లో హైదరాబాదులో, 1974 లో (అక్టోబరు 23 నుంచి 25 వరకు) బాలానంద సంఘం సహకారంతోనూ అఖిల భారత తెలుగు బాలల మహోత్సవాలు జరిగాయి. 1964 లో లక్నోలో, 1966 లో కలకత్తాలో, 1968 లో అలహాబాదులో, 1969 లో ఘటసిలలో, 1970 లో వారణాసిలో, 1971 లో పురాలియాలో, 1973 లో కాకీ ద్వీపంలో, 1974 లో భువనేశ్వర్‌లో, హైదరాబాద్‌లో, 1976 లో మైసూరులో, 1978 లో వారణాసిలో అఖిల భారత బాలసాహిత్య వేత్తల మహాసభలు నిర్వహించబడ్డాయి

ఆ సభలలో అభినయ గేయాలు, నృత్య సంగీత నాటికలు, చిత్ర ప్రదర్శనలు, కవి సమ్మేళనాలు, కదంబ కార్యక్రమాలు, లలితకళల సదస్సులు సాంస్కృతిక ప్రదర్శనలు, జానపద నృత్యాలు, మొదలైన వినోద కార్యక్రమాల ప్రదర్శన విజయవంతంగా జరిగింది

హైదరాబాదులో జరిగిన ఈ మహోత్సవాల సందర్భంలో బాలల అకాడెమీ స్థాపన గురించి ప్రభుత్వాన్ని కోరడం జరిగింది దాని ఫలితంగానే 1976 మార్చిలో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమీని స్థాపించడం, 1976 సెప్టెంబరు 14 న భారత మాజీ రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ దానికి ప్రారంభోత్సవం చేయడం జరిగింది అకాడెమీ ఆధ్వర్యంలో 1977 ఫిబ్రవరి 12, 13, 14 తేదీల్లో పెద్ద ఎత్తున బాలల మహాసభలు నిర్వహించబడ్డాయి ఆ సమయంలో పుస్తక ప్రదర్శనలు జరిగాయి బాల సాహిత్యానికి సంబంధించి సదస్సులు నిర్వహించబడ్డాయి ఆ సదస్సులలో బాల సాహిత్యాభివృద్ధికి కావలసిన అంశాలను గూర్చి సాహితీ వేత్తలు చర్చలు జరిపారు. పిల్లలకు ఉపయుక్తమయ్యే రచనల్ని అకాడెమీ కొంతవరకైనా ప్రచురించి అందరికీ అందించాలనే నిర్ణయం జరిగింది

బాలల అకాడెమీ.

బాలల అకాడెమీ సాహిత్యాభివృద్ధికి కృషిచేస్తూ రచయితలకు, ప్రచురణ కర్తలకూ ప్రోత్సాహాన్నిస్తూ పిల్లలకు అనువైన, ఎక్కువ ఉపయోగకరమైన సాహిత్యాన్ని రూపొందించడానికి ప్రయత్నిస్తున్నది. ఏప్రిల్ 1977 నుంచి పిల్లలకోసం మాసపత్రికను ప్రచురిస్తున్నది. కథలు, గేయాలు, పాటలు, నాటికలతోబాటు 'చెప్పుకోండి చూద్దాం' బాలప్రపంచం, బాల సమాచారం (వార్తలు) విజ్ఞాన చంద్రిక, శాస్త్రజ్ఞుడి జీవితం, మీ కోసం ప్రత్యేకం (కేవలం పిల్లలు వ్రాసినవి) బాలనేస్తాలు, మీరూ అంతవారు కావాలి (ప్రముఖుల చరిత్రలు), పద్యామృతం, చిత్రకథ, బాల లోకం, ఉత్తరాలు మొదలైన కొత్తశీర్షికలతో పిల్లలకు వినోదాన్ని, విజ్ఞానాన్ని ఆ పత్రిక అందిస్తున్నది

ఆంధ్ర రాష్ట్రంలో వెలసిన బాలానంద సంఘములను పటిష్టంచేసే బాధ్యత అకాడెమీదే బాలసంఘముల నిర్వహణను ప్రోత్సహిస్తూ లలితకళలను అభివృద్ధి చేయడం అకాడెమీ ముఖ్య ఆశయం 1978 లో డా॥ పి తిరుమలరావు గారికి వి. వి. నరసింహారావుగారికి, పాలంకి వెంకట రామచంద్రమూర్తిగారికి, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారికి బాలసాహిత్య రంగంలో చేసినకృషిని పురస్కరించుకొని 'బాలబంధు' బిరుదు ప్రదానం చేసింది అదే సమయంలో అకాడెమీ ఇచ్చిన బాల బంధు బిరుదును న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిగార్లు తిరస్కరించారు 1980 లో ఏడిద కామేశ్వరరావుగారికి, శ్రీకంఠం కృష్ణారావుగారికి, మద్దులూరి రామకృష్ణా రావుగార్లకు ఆ బిరుదుతో సత్కరించడానికి అకాడెమీ నిర్ణయించింది

బాలవాఙ్మయ సంకలనాల ప్రచురణను చేపట్టి తారంగం – తారంగం, గోరు ముద్దలు (రంగు రంగుల చిన్నారి బొమ్మల పాటలు సంకలనం దేవకి), మల్లెలు మందారాలు (బొమ్మల గేయాలు, సంకలనం. వి. వి నరసింహారావు). పసిడి తెర (బాలనాటికలు సంకలన కర్త . న్యాయపతి రాఘవరావు) చిరుగజ్జెలు (నృత్య నాటికలు. సంకలనం ఏడిద కామేశ్వరరావు) అనగా అనగా (కథలు, సంకలనం మంజా సూర్యనారాయణ) గోడమీదబొమ్మ (పొడుపు కథలు సంకలనం వెలగా

వెంకటప్పయ్య) వెలుగు బాటలు (జీవిత చరిత్రలు సంకలనం కవిరావు) మొదలైన వైవిధ్యంతో కూడిన పుస్తకాలను 1979 లో ప్రచురించింది

బాలవిజ్ఞాన సర్వస్వ ప్రచురణకు ప్రయత్నాలు చేస్తున్న అకాడెమీ బాల సాహిత్య వికాసానికి అన్ని విధాలా తోడ్పడ గలదని ఆశించవచ్చు.

## బాలసాహిత్య రచనాలయాలు.

భారత దేశానికి స్వాతంత్ర్యం లభించి నప్పటినుంచీ ఏటేటా బాలసాహిత్యం లోని ఉత్తమ రచనలకు బహుమతులివ్వడమేగాక కేంద్ర ప్రభుత్వ సహాయంతో రాష్ట్ర ప్రభుత్వం 1956 లో (మే, జూన్ నెలలలో) రాజమహేంద్ర వరంలోను 1958 లో (నవంబరు 24 నుంచి జనవరి వరకు) 1961 లో (అక్టోబరు 24 నుంచి డిసెంబరు 5 వరకు) హైదరాబాదులోను బాలసాహిత్య రచనాలయాలను నిర్వహించింది. కొంతమంది రచయితలకు డా. గిడుగు సీతాపతిగారు శిక్షణ ఇచ్చారు ఆ రచనాలయాలలో శిక్షణ పొందిన వాళ్లలో బాలసాహిత్య రచయితలుగా ఈనాడు ప్రసిద్ధి చెందిన బి వి. నరసంహారావు, ఆవంచలక్ష్మారావుగారు. ఉత్పల సత్యనారాయణాచార్యగారు, కవిరావుగారు మొదలైన వాళ్లున్నారు 1979 లో బాలసాహిత్య రచయితల శిక్షణ శిబిరం అకడెమీ వారిచే వెలగా వెంకటప్పయ్యగారి ఆధర్యంలో నాగార్జున సాగర్‌లో నిర్వహించబడింది.

## బాలల చలన చిత్రాలు.

తెలుగులో పిల్లల చిత్రాల నిర్మాణం చాలా తక్కువ. ముద్దు బిడ్డ, పాప కోసం, రాజూ–పేదా, పిల్లలు తెచ్చిన చల్లని రాజ్యం (అనువాద చిత్రం), మానాన్న నిర్దోషి, భలేపాప, పాపకోసం, పాపంపసివాడు, చిన్నారిపాపలు, బాలరాజు కథ లాంటి చిత్రాలలో బాలలు ప్రధాన పాత్రలను నిర్వహించారు. అంత మాత్రంచేత వాటిని బాలల చిత్రాలుగా పేర్కొనలేము.

బాల బాలికలే పాత్రలుగా ఉన్న అసలు సిసలైన బాలల చిత్రాలను తెలుగులో మొట్ట మొదటి సారిగా 1956 లో కె. ఎస్. ప్రకాశరావుగారు నిర్మించారు తెలుగులో వారు నిర్మించిన బాలానందం పూర్తి బాలల చలన చిత్రం. బూరెలమూకుడు, కొంటె కిష్టయ్య, రాజయోగం – ఈమూడు కథలు కలిపి తీయబడ్డ ఆ చిత్రం విజయవంతంగా నడచింది ఈ సినిమాలోని నటీనటులందరు బాలానంద సంఘంలోని బాలసభ్యులే.

చలన చిత్రాలలో పిల్లలకు సంబంధించిన పాటలు ఎక్కువగానే ఉన్నాయి. కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, దాశరథి, నారాయణరెడ్డి, ఆచార్య ఆత్రేయ మొదలైన ప్రఖ్యాత కవులు చలనచిత్ర రంగానికి పిల్లల పాటలను కూడా అందించారు. ఆ పాటల్లో ఎక్కువగా ప్రబోధాత్మకాలు ఉదాహరణకు 'నీ ధర్మం, నీ సంఘం, నీ దేశం నువు మరవద్దు ......' బడిపంతులు చిత్రంలో 'చదువూ సంపద అందరిదీ – పాడిపంటా అందరిదీ' మొదలైనవి. [1] ప్రబోధాత్మక గేయాలేగాక హుషారునిచ్చే వినోదాత్మకమైన పాటలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు : ఆత్రేయగారు వ్రాసిన తోడికోడళ్లు సినిమాలోని 'ఎంతెంతదూరం కోసెడు కోసెడు దూరం ... ' జీవనతరంగాలులోని 'ఉడుతా ఉడుతా హూష్... ' లాంటివి ఈ పాటలను సినిమాలో పిల్లలే పాడినట్లు చూపినా, వాళ్ల కోసం పెద్దవాళ్లు పాడినట్లు చూపినా, తెరవెనుక పాడింది మాత్రం పెద్దవాళ్లే. 1955 లో కేంద్ర ప్రభుత్వం 'పిల్లల చలనచిత్ర సమితి' (Children's **Film Society**) ని స్థాపించింది. కాని ఆ చలనచిత్ర సమితిలో చలనమున్నట్లు కన్పించదు. మొత్తంమీద చలన చిత్రాలుకూడా సాహిత్యానికి తోడ్పడే ముఖ్య రంగాలని చెప్పవచ్చు.

బాలల అకాడెమీ 1976 నవంబరులో జిల్లా స్థాయిలో వివిధ రంగాలలో ప్రతిభా పాటవ పోటీలను నిర్వహించింది. ఆ పోటీలలో గెలుపొందిన బాలకళా కారులకు బాలమహాసభల సందర్భంగా (ఫిబ్రవరి, 1977) వివిధ రంగాలతోబాటు

---

1. వరదాచార్య, జి యస్ చలన చిత్రాలలో బాలగేయాలు ఆంధ్ర ప్రదేశ్ బాలల మహాసభల ప్రత్యేక సంచిక 1977.

"నేనెరిగిన ఆంధ్రప్రదేశ్" అనే శీర్షికతో వ్యాసరచన పోటీని జరిపింది. ఆ పోటీలో గెలుపొందిన వాళ్లలో జిల్లా కిద్దరిని ఎన్నికచేసి సంపూర్ణ ఆంధ్ర దేశయాత్ర చేయించి, ఆ వినోద, విజ్ఞాన యాత్రను రంగుల వార్తా చిత్రంగా రూపొందించింది. పేకేటి శివరాంగారి దర్శకత్వంలో తయారైన ఆచిత్రంలో ఆంధ్ర దేశంలోని ప్రముఖ స్థలాలు, ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు, పవిత్రమైన నదులు, ఎత్తైన కొండలు, పచ్చని పంటపొలాలు, కర్మాగారాలు, విద్యాలయాలు, శిల్పకళలు మొదలైనవన్నీ చోటు చేసుకున్నాయి. ఆంధ్రుల సాంఘిక, సాంస్కృతిక జీవితానికి అద్దంపట్టే చిత్రమది. ఆంధ్రదేశంలోని దేశీయమైన క్రీడలు, శాస్త్రీయ సంగీతం, నాట్యం, హరికథ, బుర్రకథ, తోలుబొమ్మలాట మొదలైన దృశ్య సాహిత్యానికి సంబంధించిన అంశాలను ఆయా ప్రాంతాల్లో ఉన్న ప్రాతినిధ్యాన్ని అనుసరించి చిత్రించడం జరిగింది. శిల్ప కళలకు ఆంధ్రదేశం పుట్టినిల్లు. వాటి చిత్రీకరణకు ఆసినిమాలో ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడింది.

## టెలివిజన్ (దూరదర్శిని)

ఇటీవలి కాలంలో టెలివిజన్‌లో పిల్లల నాటికలు, పాటలు మొదలైనవి ప్రసార మవుతున్నాయి. ఆ కార్యక్రమాల కోసం ప్రత్యేకంగా కొంతమంది రచయితలు రచనలు చేస్తున్నారు.[1] కానీ టెలివిజన్ కొన్ని ప్రాంతాలకు, అందులోనూ కొంత మందికి మాత్రం అందుబాటులో ఉంటుంది. కొంతవరకు సాహిత్యాభివృద్ధికి దూర దర్శిని కూడా దోహదకారే.

పై పరిశీలననుబట్టి బాలసాహిత్యం జానపద సాహిత్యంలో పుట్టి ఆధునిక యుగ ప్రారంభంనుంచి చాలామంది రచయితల కృషిఫలితంగా క్రమక్రమంగా

---

1. న్యాయపతి రాఘవరావుగారు ప్రత్యేకంగా ఆ కార్యక్రమాలకోసం కొన్ని రచనలు చేసినట్లు చెప్పారు. ప్రచురణకు సిద్ధంగాఉన్న 'బాలగేయ మాల' సంకలనంలోని గేయాల్లో ఈగతల్లి, జేబురుమాలు మొదలైన గేయాలు టెలివిజన్ కోసం వ్రాయబడినవే. అలాగే కొన్ని నాటికలు, ఉపన్యాసాలు కూడా.

అభివృద్ధి చెందుతూ ఒక ప్రత్యేక సాహిత్య శాఖగా స్థానాన్ని ఏర్పరచుకొన్నదనవచ్చు. ఇన్ని విధాలుగా కృషిజరిగినా, రకరకాల ప్రక్రియలతో కూడిన రచనలు లెక్కలేనన్ని వెలువడినా ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే బాలసాహిత్యరంగంలో మనం వెనుకబడి ఉన్నామనే చెప్పాలి. ఎన్ని గ్రంథాలున్నాయనే విషయంకాదు ఎన్ని గ్రంథాలు బాలలకు అనువుగా ఉన్నాయి ? అని ప్రశ్నించుకొంటే తెలుగులో పిల్లలకు అనువైన గ్రంథాలు అతి తక్కువనే చెప్పాలి. మన సోదరభాష అయిన కన్నడంలో బాల విజ్ఞాన సర్వస్వంకూడా వెలువడింది. ఇంగ్లీషులో పిల్లల్లో పఠనాశక్తిని పెంచే గ్రంథాలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఆ పుస్తకాల్లోని అచ్చు, రంగురంగుల బొమ్మలు చూస్తుంటే అటువంటి పుస్తకాలకు తెలుగుపిల్లలు నోచుకొనేదెప్పుడో అన్పిస్తుంది నూటికి తొంభైమంది పాఠ్యపుస్తకాలు కొనుక్కోవడానికే అష్టకష్టాలు పడుతున్న తెలుగు దేశంలో అందమైన గెటప్‌లో పుస్తకాలను అందివ్వటం కష్టసాధ్యమే. అచ్చువేసే వాళ్ళున్నా కొనేవాళ్ళుండాలికదా ! ప్రభుత్వం తగినంత శ్రద్ధతీసుకుంటే కొంతవరకు ఫలితాన్ని సాధించవచ్చు

బాలసాహిత్యం సంపూర్ణ వికాసాన్ని చెందాలంటె ఒక రచయిత కృషి మాత్రమే సరిపోదు. రచయిత, చిత్రకారుడు, సంపాదకుడు, గ్రంథరూప నిర్మాత, ప్రచురణకర్త, విక్రేత, పాఠకుడు మొదలైనవాళ్ళ సమిష్టికృషి అవసరం. ముఖ్యంగా చిన్నపిల్లలకోసం రచనలు చేసేవారు పిల్లల చిత్తవృత్తుల్ని అభిరుచుల్ని గ్రహించాలి వాటికి అనుకూలంగా ప్రయోజనాత్మకమైన రచనలు చేయాలి. రచయితలు అవకాశ మున్నప్పుడు పిల్లలతో కలిసి మసలుతూ వారి చర్యల్ని పరిశీలిస్తూ, వారితో కలసి పోయి వారి అభిరుచుల్ని గుర్తించవచ్చు. చక్కని రచనలకు చిత్రకారుల అందమైన బొమ్మలు తోడుకావాలి. పత్రికలు, ఇతర సంస్థలు వ్యాపారదృష్టిమాని కళాదృష్టితో పనిచేయాలి. ప్రభుత్వం తగినంత శ్రద్ధతీసుకోవాలి. సాహిత్య రచనలో రచయితలకు శిక్షణ యివ్వాలి. వీలైనన్ని సభలుజరిపి పిల్లల్లో సాంస్కృతిక దృక్పథాన్ని కల్గించాలి. సదస్సులు జరిపి, సాహితీ వేత్తలతో చర్చలు జరిపి, ఉత్తమ సాహిత్యాభి వృద్ధికి ప్రయత్నించాలి. అన్ని అంశాలు ప్రస్తుతం అమలులో ఉన్నవె కాని పేరుకు మాత్రమే. ప్రత్యేక శ్రద్ధతో అన్నిరంగాలు పనిచేస్తే తెలుగు పిల్లలకు ఉత్తమ సాహిత్య రచనల్ని అందించవచ్చు.

---

# 3. జానపద బాలగేయ సాహిత్యం.

## 3 1. జానపద సాహిత్య స్వరూపం - విభాగాలు.

సమాజంలో అక్షరజ్ఞానంలేని గ్రామీణులు, సామాన్యులు ఏనాడో అప్రయత్నంగా. అలవోకగా సృష్టించుకోగా అలిఖితంగా ఒక తరంనుండి మరొక తరంవారికి మౌఖికంగా సంక్రమిస్తూవచ్చే కథలు, గాథలు, గేయాలు, పాటలు మొదలైన వాఙ్మయరాశియే జానపద సాహిత్యం. ఒక సమాజంలోని లిఖితమైన శిష్టసాహిత్యానికి ఏమాత్రమూ తీసిపోనట్టి ప్రాధాన్యాన్ని ఆ సమాజపు జానపద సాహిత్యానికి నేటి సాహితీ వేత్తలు ఇస్తున్నవిషయం గుర్తించదగింది సాధారణంగా ఒక సమాజంలోని ఆచారవ్యవహారాలను, వివిధవర్గాల మనస్తత్వాలను, సామాజిక జీవిత దృక్పథాన్ని ప్రతిబింబించే లక్షణం ఆ సమాజపు జానపద సాహిత్యంలోనే అధికంగా ఉంటుంది. వాస్తవమైన సామాజిక చరిత్రావగాహనకు జానపద సాహిత్య పరిశీలన తొలిమెట్టు. ఈనాడు అనేక దేశాలలో జానపద సాహిత్యం పఠన పరిశోధనార్హమైన విద్యావిషయంగా గుర్తించబడి విశ్వవిద్యాలయాల్లో సముచిత ప్రాధాన్యాన్ని పొంది ఉండడం కూడా ఎన్నదగిన విశేషం. లిఖితమైన శిష్ట సాహిత్యం ఎంత వైవిధ్యభరితమో జానపద సాహిత్యం కూడా అంత వైవిధ్య సహితం. అది ప్రాచీన కాలానికి మాత్రం చెందిందనీ అర్వాచీన కాలానికి చెందదనీ చెప్పడం సబబుకాదు దానికున్న స్థానం, గౌరవం ఎప్పటికీ చెరగనిది తరగనిది.

జానపద సాహిత్యంలో ముఖ్యమైన ఈ క్రింది ఐదు శాఖలను తంగిరాల సుబ్బారావుగారు గుర్తించి ఉన్నారు. [1]

---

1. కాటమరాజు కథలు. మొదటి సంపుటము. 1976. పుట IX

జా న ప ద సా హి త్యం
**( Folk Literature )**

- గద్యాఖ్యానాలు (Prose Narrative)
- జానపద గేయాలు (Folk Songs)
- వీరగాథలు లేదా జానపద గేయకథలు (Ballads)
- పొడుపుకథలు (Riddles)
- సామెతలు (Proverbs)

పై విభాగంలో మరల అంతర్భాగాలను చూపవచ్చనికూడా సుబ్బారావుగారు చెప్పారు. ఉదాహరణకు గద్యాఖ్యానాలను పుక్కిటి పురాణాలు (Myths) ఐతిహ్యాలు (legends) , జానపద కథలు (Folk tales) అని మూడురకాలుగా వర్గీకరించవచ్చు అలాగే జానపద గేయాలను వలపు పాటలు, వేడుక పాటలు, స్త్రీలపాటలు, పిల్లల పాటలు, లేదా బాలగేయాలు, శ్రామిక గేయాలు, హాస్యపు పాటలు, తాత్విక గేయాలు. ఇలా పలు రకాలుగా వర్గీకరించవచ్చు

జానపద సాహిత్యంలో పిల్లలకు సంబంధించి కథలు, పాటలు, గేయాలు, గేయకథలు, పొడుపు కథలు మొదలైన ప్రక్రియలున్నాయి. వీటిలో బాలగేయాలకు వి. రామరాజుగారు ప్రతిపాదించిన ప్రధాన లక్షణాలు తొమ్మిది. [1] అవి.

1 ఆశు రచన
2. అనామక కర్తృకం లేదా సామూహిక కర్తృకం
3 నియమిత స్వరూప రాహిత్యం
4. అనిర్ణీత రచనా కాలికం
5. మౌఖిక ప్రచారం
6. అకృతక శైలి
7. గాన యోగ్యత
8. పునరావృత్తి (పల్లవి వంటిది)
9. జనసామాన్య పరిచిత వస్తువు

1. జానపదగేయ సాహిత్యము. పుట 15–23. 1958.

పై లక్షణాలన్నీ ఇంచుమించు బాలగేయాలకు కూడా వర్తిస్తాయి లిఖిత రూపంలో లేని జానపద గేయసాహిత్యంలో బాలగేయాలు ఒకభాగం. అవి కూడా మౌఖికంగా అనుశ్రుతంగా పెద్దలనుండి పిన్నలకు సంక్రమిస్తూ వచ్చినవే. వాస్తవానికి జానపదగేయాలు పిల్లల మనస్తత్వాలకు దర్పణాల్లాంటివి

పెద్దలలాగే పిల్లలు కూడా ఒకపాట విన్నప్పుడు ఆనందాన్ని పొందుతారు అద్భుత, వీర, కరుణ, శాంత, హాస్యరస ప్రధానమైన కథలు, పశుపక్ష్యాదులు పాత్రలుగాగల నీతికథలు, దేవతలు, రాక్షసులు, మాంత్రికులు మొదలైన వాళ్లు పాత్రలుగాగల పురాణ కథలు, దివ్యగాథలు (Fairy tales , చమత్కారం, వినోదం, సాహసాలను ప్రదర్శించే ఆసక్తిదాయక కథలు అవాస్తవికమైనప్పటికీ పిల్లల హృదయాల్ని రంజింపజేస్తాయి కాని అలాంటి కథల్ని అర్థంచేసుకొనే వయసువస్తే గాని వాటివల్ల కలిగే ఆనందాన్ని సంపూర్ణంగా అనుభవించలేరు కాని గేయాలు అలాకాదు. గేయాలను ఆలాపించినప్పుడు చంటిపిల్లలు-కూడా తన్మయత్వం పొందుతారు. గేయాలు తాళలయాన్వితాలై గానానుకూలతను కలిగి ఉంటాయి శబ్ద మాధుర్యం, నడతలవల్ల గేయాలు అపార మధురం అవుతాయి,

## 3. 2. జానపద బాలగేయ సాహిత్యోద్ధరణ

జానపద సాహిత్యంలో ఒకభాగమైన బాలగేయాల్ని, పాటల్ని సాహిత్యప్రియులు అనేకులు సేకరించి పత్రికలలోను, పుస్తకాల రూపంలోను ప్రకటించి ఉన్నారు. బాల జానపద వాఙ్మయోద్ధరణకు వ్యక్తులేగాక పత్రికలు కూడా ఎన్నదగిన కృషి చేశాయి. జానపద సాహిత్యప్రియులు సేకరించి పంపిన గేయాలను తొలుత పత్రికలు ప్రచురించి దోహదం చేశాయి ఆ తర్వాతనే జానపద బాలగేయాలు పుస్తక రూపంలో వెలువడినాయి ఎందరెన్ని సేకరించి ప్రచురించినా సేకరణ, ముద్రణాయోగం పట్టని జానపదగేయాలు ఇంకాఎన్నో తెలుగు ప్రజల్లో ప్రచారంలో ఉన్నాయి. జానపద బాలగేయాలను సేకరించిన ప్రముఖుల సేవను స్థూలంగా పరిశీలించడం ఇక్కడ అప్రస్తుతం కాదు.

## 1. యం. యన్ వెంకటస్వామి.

మొట్టమొదటసారిగా తెలుగులో జానపద బాలగేయాలను సేకరించి ప్రచు రించినవారు యం. యన్. వెంకటస్వామిగారు **The Indian Antiquary** అనే పత్రికలో వారు సేకరించి ప్రచురించిన బాలగేయాలు [1] మొత్తం ఆరే అయినా తెలుగులో బాలగేయాల సేకరణలో ప్రథముడనే కీర్తి వారికే దక్కుతుంది. అవి తెలుగులిపిలో కాకుండా రోమన్‌లిపిలో ముద్రితం. వాటి పేర్లను కూడ ఇంగ్లీషులోనే **A lullaby, A Nursery Rhyme, A Nursery game** అని ఇచ్చారు.

## 2. వేటూరి ప్రభాకర శాస్త్రి. (1880-1950)

పండితులు, పరిశోధకులు ప్రాచీన వాఙ్మయ ప్రియులు అయిన వెటూరి ప్రభాకర శాస్త్రిగారు బాలజానపద వాఙ్మయాన్ని అభిమానించడం వారి సమదృష్టికి, బాలవాఙ్మయ ప్రాముఖ్యానికి ఒక నిదర్శనం. వారు సేకరించిన జానపదగేయాలు మొదట కృష్ణాపత్రికలో (21-4-1917, 14-6-1917) 'మధురకవితలు' అనే శీర్షిక క్రింద బాలభాష, పామరభాష, స్త్రీభాష, వృద్ధభాష అనే పేర్లతో ప్రచురించబడ్డాయి. తెలుగుదేశంలో బాలబాలికలు పాడేపాటలు, పలికే మాటలు, చెప్పుకొనేకథలు కొన్నింటిని సేకరించి 'భారతి' (1930) లో కూడ 'బాలభాష' అనే పేరుతో ప్రచురించారు. ప్రభాకరశాస్త్రిగారు సేకరించిన బాలగేయాలను 'బాలభాష' అనే పేరుతో ప్రభాకర పరిశోధక మండలివారు పుస్తక రూపంలో ప్రకటించారు. అందులో ఇంచుమించు 60 పాటలున్నాయి 'ముగ్ధమధుర వాఙ్మయము' అనే శీర్షికతో ఎనిమిది పుటల చక్కని పీఠికనుకూడ శాస్త్రిగారు అందు పొందు పరచి ఉన్నారు,

---

1. Some Telugu Nursery songs. Indian Antiquary. vol : xxxiv. 1905.
2. Some Telugu Nursery songs and catches. Indian Antiquary vol : xxxv. 1906.

**3. టి. రాజగోపాలరావు.**

రాజగోపాలరావుగారు సేకరించిన 102 బాలజానపదగేయాలు 1927 లో **Telugu Nursery Rhymes** (పిల్లల పద్యములు) అనే పేరుతో ప్రచురితమైంది.

**4. కేతవరపు రామకృష్ణ శాస్త్రి.**

కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారు 1929 లో **'బాలగీతాంజలి'** అనే పేరుతో ఒక పుస్తకాన్ని ప్రచురించారు

**5. టేకుమళ్ల కామేశ్వరరావు.**

కామేశ్వరరావుగారు సేకరించిన జానపదగేయాలు భారతి (1929, 1931. 1932 సంవత్సరాలలో మొత్తం సంచికలలో) పత్రికలో 'పాత పాటలు' పేరుతో ప్రచురితం అవె 'సాంప్రదాయిక విజ్ఞానం – మొదటిభాగం (పాతపాటలు)' అనే పేరుతో 1941 లో నవ్యసాహిత్య పరిషత్తువారిచే పుస్తకరూపంలో వెలువడింది, అందులో బాలజానపదగేయాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడింది. వాటిని ఏలపాటలు, ఆటపాటలు, అని వర్గీకరించారు అవిగాక పణతిపాటలు, ప్రకీర్ణాలు, ప్రాపంచికోక్తులు అనే విభాగాల క్రింద ఇచ్చిన వాటిలోకూడ కొన్ని బాలగేయాలు న్నాయి.

**6. నేదునూరి గంగాధరం.**

తెలుగుదేశంలో ప్రధానంగా కోస్తాజిల్లాలకు సంబంధించిన జానపద వాఙ్మయాన్ని ఉద్ధరించిన సాహిత్య సేవకులు నేదునూరి గంగాధరంగారు. వారి సేకరణ మొదట భారతి, గృహలక్ష్మి, రెడ్డిరాణి, ఆంధ్రభూమి, ఢంకా మొదలయిన పత్రికల్లో వెలువడ్డాయి అవే తర్వాత పుస్తకాల రూపంలో వచ్చాయి వారి ప్రచురణలలో బాలవాఙ్మయానికి సంబంధించి చెప్పదగినవి రెండు. 1. సెలయేరు 1955

అందులో బాలసారస్వతం అనే విభాగంలో బాల జానపద గేయాలు (1-25) సంకలితం. 2. ఆటలు-పాటలు (దేశీయ క్రీడలు) (1965) అందులో తెలుగు పిల్లలు ఆడుకొనే ఆటలు వాటికి సంబంధించిన పాటలు కొన్ని వివరణ పూర్వకంగా ఉన్నాయి.

## 7. గొత్తిపాటి వెంకట సుబ్బయ్య.

భావిపౌరులైన బాలలకు ఆకర్షణీయమైన పుస్తకాన్ని ప్రకటించాలనే అభిలాషతో బాలగేయాలను సేకరించి అత్యుత్తమమైన గేయాలను 'నవ్వులు—పువ్వులు' (1942) అనే పుస్తకరూపంలో ప్రకటించారు. బాలల మనః ప్రవృత్తికి అనుకూలమైన రీతిలో కూర్చిన ఆ గేయ సంపుటిలో పాతపాటలు కొత్తపాటలు అనే రెండు భాగాలున్నాయి. బొమ్మలాటలు, ఆటలు, పొడుపుకథలు, నవ్వులాటలు, నీతులు-రీతులు, అవి-ఇవి అనే శీర్షికలక్రింద జానపద గేయాలను, కొత్తపాటలక్రింద ఆధునిక రచయితలు వ్రాసిన గేయాలలో దేశాభివృద్ధికి అనుకూలమైన పదిగేయాలను చేర్చారు

## 8 వేదుల సత్యనారాయణశర్మ, కాళహస్తి వీరభద్ర స్వామి

తెలుగు దేశంలో ప్రచారంలో ఉన్న వివిధరకాలైన బాల జానపదగేయాలను వారిరువురు సేకరించారు 1949 లో పుస్తకరూపంలో ప్రచురితమైంది.

## 9. కోటసోదర కవులు.

బాలబాలికలకు సాహిత్యరంగంలో అభిరుచి కల్గించాలనే తలంపుతో వారు ఆటలు – పాటలు కొన్నింటిని సేకరించి వాటిని 'బొమ్మరిల్లు' పేరుతో 1952 లో ప్రచురించారు.

## 10. చింతా దీక్షితులు (1891-1960)

బాలసాహిత్యంలో విశిష్టమైన రచనలుచేసిన చింతా దీక్షితులు జానపద గేయాలను కూడా కొన్నింటిని సేకరించారు. 1955 లో 'ప్రజా వాఙ్మయము' పేరుతో

వెలువడిన ఆ గ్రంథంలో బాల వాఙ్మయ విభాగం క్రింద బాల జానపద గేయాలను వివరించడమే గాక బాలసాహిత్య ప్రాముఖ్యాన్ని తెలుపుతూ వ్యాసంకూడా వ్రాశారు

## 11. ఇల్లిందల సరస్వతీదేవి (1918)

బాల సాహిత్యాన్ని అభిమానించే రచయిత్రుల్లో పేర్కొనదగిన మహిళ ఇల్లిందల సరస్వతీ దేవిగారు. 1954 లో వారు ప్రచురించిన 'పిల్లల పాటలు' అనే సంకలన గ్రంథంలో ప్రాచీన బాలగేయాలు ఆధునికమైనవి కూడా చేరి ఉన్నాయి

## 12. ఎల్లోరా

తెలుగు జానపద గేయాలను సేకరించి పుస్తకాలుగా ప్రకటించిన వారిలో ఎన్నదగినవారు ఎల్లోరాగారు 'జానపదగేయాలు' రెండు సంపుటాలేగాక వారి ప్రచురణలో వాఙ్మయ దృష్ట్యా గుర్తించదగిన మరొక గ్రంథం 'మధుర కవితలు' (1961) అనే జానపద వాఙ్మయ సమీక్షా గ్రంథం. బాలవాఙ్మయం, ప్రమదలు - ప్రత్యేకతలు, పొలం పాటలు మొదలైన విషయ విభాగాల క్రింద వర్గీకరించి కూర్చబడిన కూర్పులో బాల వాఙ్మయం విభాగం క్రింద బాల జానపద గేయాలను సవ్యాఖ్యా సంగా చర్చించి ఉన్నారు

## 13. బి. రామరాజు.

తెలుగు జానపద వాఙ్మయ రంగంలో అపూర్వమైన పరిశ్రమ, పరిశోధన చేసిన రామరాజుగారు 'తెలంగాణా పల్లె పాటలు' (మొదటి భాగం) 1968 లో ప్రకటించారు అందు తెలంగాణా ప్రాంతంలో ప్రచారంలోవున్న పిల్లల పాటలు కూడా ఉన్నాయి తెలుగు జానపద గేయసాహిత్యం అనే గ్రంథంలో జానపద సాహిత్యానికి సంబంధించిన పిల్లల పాటల్ని సవిమర్శకంగా సమీక్షించి ఉన్నారు.

## 14. స్వీయ సేకరణ

పరిశోధన వ్యాసంగాన్ని పురస్కరించుకొని ఈ రచయిత్రి చిత్తూరు జిల్లాలో ప్రచారంలో ఉన్న బాలగేయ వాఙ్మయాన్ని ప్రత్యేకించి కొంత సేకరించడం

జరిగింది. ఈ సేకరణలో ఇంతవరకు గ్రంథస్థం కాని పాటలు 200 కి పైగా గుర్తించబడ్డాయి ఈ సిద్ధాంత వ్యాసంలో ఆయా ప్రకరణాల్లో వాటినికూడా చేర్చి చర్చించడమైనది

తెలుగు జానపద వాఙ్మయ సేకరణకు ప్రచురణకు తెలుగు పత్రికలు చేసిన కృషికూడా గుర్తించదగినదే. కొన్ని పత్రికలు ప్రత్యేకంగా బాలవాఙ్మయ శీర్షికలను కూడ నిర్వహించాయి వాటిలో క్రొత్తరచనలకే గాక బాల జానపద గేయాల ప్రచురణకు కూడా ప్రాధాన్యం ఇవ్వబడింది. అనసూయ, భారతి, గృహలక్ష్మి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక మొదలైన పత్రికల్లో పాతపాటలు, పిల్లలపాటలు, బాలానందం, అనే శీర్షికలక్రింద జానపద వాఙ్మయాభిలాషులు సేకరించి పంపిన బాల గేయాలెన్నో ప్రచురితమైనాయి

## 3. 3. జానపద బాలగేయాల విభజన.

జానపద గేయసాహిత్యంలోని బాలగేయాలను ఆచార్య రామరాజుగారు ఇలా విభజించారు. "బాల గేయములు రెండు విధములు బాలుర కొరకు పెద్దలచే రచింపబడి తరతరములనుండి వచ్చునవి ఒకవిధము. బాలురచేతనే రచింపబడి ఒక తరమునుండి మరియొక తరమువారి నోటికందెడునవి మరియొక విధము. పెద్దలు పిల్లల కొరకు రచించిన పాటలందుకూడా రెండు విధములు కలవు. పిల్లలను లాలించుటకు పాడెడు లాలిపాటలను నిద్రపుచ్చుటకు పాడెడు జోల పాటలను ఒక తీరువి. పిల్లలనే వస్తువుగా గ్రహించియో, ప్రపంచమందలి మనోహరములగు విషయములనో గ్రహించి పిల్లల కానందము గూర్చుటకై ఆటలాడించుటకై రచింపబడినవి ఇంకొకతీరు పాటలు"[1] "పెద్దల సొంత రచనములందు రెండు రకముల గేయము లున్నవి. పెద్దల ననుకరించి పెద్దల గీతములను నేర్చుకొని వానిలో కాళిదాసు కవిత్వములో తమ పైత్యము కొంత యనునట్లు తమ సొంత కవిత్వము కలిపిన పాటలు కొన్ని. పూర్తిగా స్వకపోల కల్పితములగు గేయములు మరికొన్ని"[2]

1. తెలుగు జానపద గేయసాహిత్యము. 1958. పుట : 495.
2. రామరాజు, బి. తెలుగు జానపదగేయ సాహిత్యం. 1958. పుట : 505.

తెలుగు జానపద సాహిత్యంలోని బాలగేయాలను ఆర్వీయస్ సుందరంగారు మూడు రకాలుగా విభజించారు [1]

1. పిల్లలకోసం పెద్దలు పాడే లాలలు, జోలలు
2, పిల్లల కోసం పెద్దలు రచించగా పిల్లలు పాడే గేయాలు
3. పిల్లలే కల్పించుకొని పాడుకొనే పాటలు.

రామరాజుగారు పేర్కొన్న పిల్లల సొంతరచనల్లో పెద్దలననుకరించి పెద్దల గీతాలను నేర్చుకొని కొంత సొంత కవిత్వం కలిపి పిల్లలు పాడే పాటల్ని సుందరంగారు పిల్లలకోసం పెద్దలు వ్రాసిన గేయాలన్నారు. ఇంచుమించు వాళ్ళ ఇద్దరి విభజన ఒకటిగానే తోస్తుంది.

జానపద బాలగేయ వాఙ్మయాన్ని క్రింది రేఖాచిత్రంలోని విధంగా వర్గీకరించి చూపవచ్చు,




1. జానపద సాహిత్య స్వరూపం. 1976. పుట : 21

తెలుగు జానపద బాలగేయ సాహిత్యంలోని వైవిధ్యం యొక్క తత్త్వాన్ని, వైశిష్ట్యాన్ని సమగ్రంగా తెలుసుకోవడానికి పై విభజన చాలా ఉపకరిస్తుంది

## 3. 4. పెద్దలు పాడే పాటలు.

### 1. లాలిపాటలు లేదా జోలపాటలు.

ఏడాదిలోపు చిన్నపిల్లలను నిద్రపుచ్చడానికో, ఏడుపునాపడానికో, ఓదార్చ డానికో సాధారణంగా తల్లులుపాడే పాటలివి మారాము చేసేవాళ్లను ఏడ్చే పిల్లల్ని సమాధానపెడ్తూ లాలిస్తూ పాడే పాటలు కాబట్టి లాలిపాటలని లేదా నిద్రపుచ్చడానికి జోకొడుతూ పాడే పాటలు కాబట్టి జోలపాటలని లోకవ్యవహారం. ఉయ్యాలలు ఊపుతూ పాడె పాటలు కాబట్టి వీటికి ఊయ్యాల పాటలనికూడ మరొక పేరు. ఈ పాట లకు గానఫణితి, సరళత్వము, రాగధోరణి ముఖ్యమైనవి.

మానవభాష ఏర్పడినప్పుడే ఈ లాలిపాటలు పుట్టాయని చెప్పవచ్చు. ఆనాటి నుండి అవి అనుక్రమంగా వస్తున్నాయి. "పండ్లురాని పసిబిడ్డలకు ప్రబోధకరమైన విషయాలను పాటల రూపంలో నిత్యమూపాది బోధన చేయాలని ఈ పాటల ముఖ్యో ద్దేశము."[1] అన్న ఇల్లిందల సరస్వతీదేవిగారి మాటలు సత్యదూరం కావు.

తెలుగు భాషలోని లాలిపాటలు వందలాదిగా ముద్రితమయి ఉన్నాయి ఈకాని ఆ పాటలు లక్షణకర్తలచేత ఆదరించబడలేదు. సుప్రసిద్ధకవులచే పరి గ్రహించబడలేదు. అవి జానపదవాఙ్మయ భాగంగానే పరిగణించబడు తున్నాయి. ఆ పాటల్లో సాధారణంగా ఎత్తుగడలోకాని, చరణంచివరకాని 'లాలి' అనే పదం లేదా 'జోజో' అనేమాట పునరుక్తమవుతూ ఉంటుంది. 'లాలి' అనే ఎత్తుగడతో ఉన్న లాలిపాటకు ఉదాహరణ :

---

1. లాలిపాటలు - జోలపాటలు. ఆంధ్రపత్రిక 26 అక్టోబరు, 1949 పుట 18

"లాలి లాలోయమ్మ లాలిమాయమ్మా
లాలి ముద్దుల గుమ్మ బాల కృష్ణమ్మా ॥లాలీ॥
... ... ... ... ... ... "

— స్వీయ సేకరణ.

కొన్నిపాటలు ఆయా, ఆయీ (హాయీ హాయీ) అనే ఎత్తుగడతో ఉంటాయి. ఉదాహరణకు.

1. "ఓ ఓ ఆయీ
ముద్దు మద్దికాయ
ముత్యాల కుల్లా
ముద్దాడ లేపుదురు
మీ మేన మామలు
ఓ ఓ ఆయీ
పాల మద్ది కాయ
పగడాల కుల్లా
పాలుదాగ లేపుదురు
మీ మేన మామలు
... ... ... "

(The Indian Antiquary. vol xxxv. 1906 పుట 151)

2. "హాయి హాయి హాయి ఆపదలుగాయి
చిన్ని వాళ్లను గాయి శ్రీ వెంకటేశ !
పిల్లమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లూ
అబ్బాయి కన్నుల్లు కలువ రేకుల్లూ
చిన్నారి పొన్నారి చిరుతవే నీవు
చిగురు మామిడికింద చిన్న కోవిలవు"

(భారతి 1924, సం: 1. సంఖ్య: 2 పుట . 64)

మరికొన్ని పాటల్లో ఎత్తుగడ ఇంకొకతీరులో ఉంటుంది రెండు పెదవులమధ్య కొన నాలుకను అటు అటు త్రిప్పుతూ 'ల' వర్ణధ్వనిలాంటి ధ్వనిని పునరుక్తంచేస్తూ ప్రారంభించే లాలిపాటలవి. ఉదాహరణకు :

ఉ ళ ళ ళ ... ... ...పిల్లీ
పిల్లి రావే తల్లి పిల్లల్లమర్రీ
మర్రీ కిందావారు తోర్రి నాగన్న
తోర్రి నాగన్నకు తోడెవ్వరమ్మా
గుర్రాలు కాసేటి గురవడే తోడు."

(భారతి. 1924. పుట: 24)

ఎటువంటి ఎత్తుగడలేని పాటల్నికూడా కొన్నింటిని పిల్లల్ని నిద్రపుచ్చడానికో, ఓదార్చడానికో తల్లులు పాడడంకద్దు. వాటినికూడ లాలిపాటల క్రిందనే చేర్చవచ్చు.

ఉదాహరణకు :

"నిద్రపో నాబాబు ! నిద్రపోనాన్న
నిద్రలకు నూరేళ్లు ! నీకునూరేళ్లు
నిద్రపో బలభద్ర ! రామకుమార
నినుగన్న తండ్రికి ! నిండనూరేళ్లు"

(సెలయేరు.)

మాటలూ, నడకారాని చిన్నపిల్లలకోసం పెద్దలు పాడేవి ఈ లాలిపాటలు, జోలపాటలు. జోలపాటల ఉపయోగాన్ని కూర్చి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు ఇలాపేర్కొన్నారు "పాటలద్వారా విజ్ఞాన బోధ తత్వబోధకూడా జరిగినట్లు తెలుస్తున్నది నిద్రపొయ్యేమనస్సు శాంతిని కోరుతుందనీ గాఢ సుషుప్తిలో ఏకత్వసుఖము, శాంతి ఉంటాయి గనుక, ఆ సమయంలో బిడ్డల ఆత్మను ప్రబోధిస్తూ దేహధారియైన జీవుడు పరమాత్మలోని ఒక అంశమని కర్తవ్యము నిర్దేశిస్తూ గానము చేయుట ఆచారమయినది అదిగాక బిడ్డలు నిద్రించేటప్పుడు గాలిధూళి ఎద్దలకు

సోకకుండాను వారి అంతఃకరణమును ప్రజ్వలింపజేయటానికి కూడా యీ పాటలు తోడ్పడ్డాయి. అందుకొరకే వీరగాధలు ఈ పాటల్లో యిమిడి ఉన్నాయి "[1] ఈ పాటల్లోని భావం పిల్లలకు అర్థమవుతుందని చెప్పలేము. కాని ఆ పాటల్లోని సంగీతం మాత్రం వారిని నిద్రపుచ్చడానికో, ఏడుపునాపడానికో ఉపయోగపడ్తుంది. "ఏదోషమూ ఆవరించని చిన్నపిల్లల హృదయమార్ధవం, ఏలౌకికానుభవపు చిక్కుల్లోను మొద్దుబారని న్యూనత, స్త్రీ స్వభావంలోని నిర్మలత్వమూ, లోకాతీతమైన పురాణ పురుషుల చరిత్రానుభవాన్ని తమ దోసెట్లోకి ఇళ్ళలోకి తెచ్చుకొని ఇముడ్చు కోవాలనే ముగ్ధల ప్రయత్నమూ ఈ పాటల్లో ప్రతిబింబిస్తాయి" అంటారు చలంగారు.[2] ప్రతితల్లికీ తనబిడ్డ ఒక ఆశాజ్యోతి, ఒక వెలుగు. ఆ భావానికి అక్షరరూపమే తల్లులు పాడే ఈ క్రిందిపాట.

"ఇంతింత దీపమ్ము ఇల్లెల్ల వెలుగు
ఈశ్వరుడి చందమామ జగమెల్ల వెలుగు
గోరంత దీపమ్ము కొండలకు వెలుగు
గోపాల కృష్ణమ్మ గోవులకు వెలుగు
మాడంత దీపమ్ము మందల్ల వెలుగు
మారాజు అబ్బాయి మాకళ్ళ వెలుగు"

(సాంప్రదాయిక విశ్వాసం (పాతపాటలు) అని ఎవరికి వారే మురిసిపోతుంటారు తల్లులు.)

తరతరాలనుండి ప్రచారంలోఉన్న ఈ లాలిపాటల్ని జోలపాటల్ని, పరిశీలిస్తే ఆ పాటలలోని భావం, వస్తువు పలు రకాలుగా మనకు కన్పిస్తుంది. కొన్ని పాటల్లో రాముడు, కృష్ణుడు మొదలైన పురాణపురుషుల ప్రశంస ఉండడం తమ బిడ్డలు అంతటి మహనీయులు కావాలనే తల్లుల వాంఛకొక నిదర్శనం రామకృష్ణుల ప్రశంస ఉన్న లాలిపాటలు చాలా ఉన్నాయి.

1. లాలిపాటలు – జోలపాటలు. ఆంధ్రపత్రిక. అక్టోబరు, 1949.
2. ప్రస్తావన. చింతాదీక్షితులు, ప్రజావాఙ్మయము. 1955. పుట : 4

ఉదాహరణకు :

1. "జో అచ్యుతానంద - జోజో ముకుంద
రావె పరమానంద - రామ గోవింద
నందునింటను జేరి - నయము మీఱంగ
చంద్రవదనలు నీకు - సేవ చేయంగ
... ... ... ...
గోవర్ధనంబెల్ల - గొడుగుగా బట్టి
కావరమ్మున నున్న - కంసు బడగొట్టి
నీవు మధురా పురము - నేల జేపట్టి
ఠీవితో నేలిన - దేవకీ పట్టి
అంగుగా దాళ్ళపా - కన్నయ్య చాల
శృంగార రచనగా - జెప్పెనీ జోల
సంగతిగ సకల - సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల - మదన గోపాల"

(అన్నమాచార్య చరిత్ర పీఠిక, పుట : 61)

చివరి చరణంవల్ల పై జోలపాట అన్నమాచార్యులు వ్రాసిందని తెలుస్తుంది. ఆనాటినుండి ఇది విశేష ప్రచారాన్ని పొంది జానపద గేయంగానే పరిగణించబడు చున్నది

2. "జో అచ్యుతానంద జోజో ముకుందా
లాలి పరమానంద రామ గోవింద
తొలుత బ్రహ్మాండంబు తొట్టిగా వేసి
నాలుగూ వేదములు గొలుసు లమరించీ
చిత్తమని యేటి దూలములు వేసి
అందముగ జాంబవతి చందనము పుయ్యా

పొందుగా కాళింది పువ్వు లందియ్యా
ఇందుముఖి లక్ష్మణా వింజామరెయ్యా
చుట్టు గోపస్త్రీలు తొట్టె నూచంగా
కోట్ల రంగారాజు కోర్కెలొసగంగా"

(ఎల్లోరా: జానపద గేయాలు, మొదటి భాగం)

ఇదికూడా అన్నమాచార్యులు వ్రాసిన జోలపాటే అని తెలుస్తున్నది[1] ఈ పాటలోని తత్వ బోధను గమనిస్తే మనదేశంలో ఆధ్యాత్మిక జ్ఞానాన్ని బాల్యం నుంచే ప్రారంభిస్తారన్న విషయం సువ్యక్తమవుతుంది

3. జోజో దశరథ రాజకుమారా
కౌసల్యా వరపుత్ర కరుణా కటాక్షా
రఘుకుల భూషణా రాజపూజితుడా
సీతాంగనాపతీ శ్రీరామచంద్రా జోజో॥
... ... ... ...
పసుపు కుంకుమలనూ పరిమళాలిచ్చీ
గుగ్గిళ్లు పంచెనే కుసుమ శ్రీగంధీ ॥ జోజో"

(తెలంగాణా పల్లె పాటలు)

శ్రీరాముని పరంగా ఉన్న పై జోలపాటలో బారసాలనాడు జరిపే వేడుకలన్నీ వర్ణితమైనాయి

భర్తచే పరిత్యజించబడి అడవిలో పిల్లలతో అష్టకష్టాలు పడిన సీతాదేవికథ కరుణరస భరితం. ఆ సాధ్విని ఆధారం చేసుకొని వెలువడిన స్త్రీల పాటలు ఎన్నో ఉన్నాయి ఆమె కుశలవులను లాలిస్తూ పాడిన జోలపాట ఒకటి ప్రచారంలోఉంది.

---

1 ఆనందమూర్తి, వేటూరి, తాళ్ళపాక కవుల పదకవితలు – భాషా ప్రయోగ విశేషాలు 1976. పుట · 330

అడవిలో ఉన్నా తన పుట్టింటివారిపై అత్తింటి వారిపై ఆశతో వారిని స్మరిస్తూ పేరు పేరునా వాళ్ళు ఏయే వస్తువులు కుశలవులకు కానుకలుగా తెచ్చి ఇవ్వగలరో ఊహి స్తుంది అలా ఊహించుకొనే ఆత్మతృప్తి పొందుతుంది. మనోహరమైన ఆ జాలిపాట :

"శ్రీహరి ఋషిపల్లె సోమ వీధులనూ
ఊరికీ ఉయ్యాల లమ్మ వచ్చినవీ
కొమర కొడుకుల తల్లి కొనరె ఉయ్యాల
చేరాతో చేరెడు ముత్యాలు పోసి
కొన్నాదె సీతమ్మ బంగారు తొట్టె
చేసెనే సీతమ్మ పొగడంపు చీర
కట్టెనే సీతమ్మ పొన్న మానులకు
ఇటునుంచి వూచితె ఇంద్రూని చాయ
అటునుంచి వూచితె చంద్రూని చాయ
కొండా వంకలలోను కోనేటి నడుమా
పాపన్నా మినుగంటి బండా మరుగులను
ఏడవకూ లవకుమార ! రామూ కుమారా !
ఏడిస్తే నిన్నెవ్వారెత్తుకొను వారు !
వుట్టాటందెలు బూని పులిగోళ్ళె బూని
కౌసల్య మీయవ్వ వచ్చెనేడవకు
దేవతార్చన పెట్టె దేమూళ్ళు బూని
జనకూడు మీతాత వచ్చె నేడవకు
ధనమూ మిక్కిలి బూని ధాన్యాలు బూని
దశరథులూ మీతాత వచ్చె నేడవకు
పరగా దేవాసురా యుద్ధమ్మునాడు
సీలవుడు విరిగియూ తేరు గ్రుంకంగ

వేలితో కైకమ్మా తేరు యెత్తంగా
మీా తాత దశరథులు తానేమొ మెచ్చి
కోమలీ కోరూమి వరములిచ్చెదను
నాటి వరములన్నైన నేడు తాగోరి
మీాతండ్రి పట్టాభిషేకమ్ము నాడూ
వరము లందిన అవ్వ వచ్చె నేడవకు
చెవలా పోగులె బూని చెల్లాలె బూని
శాంతమ్మ మేనత్త వచ్చె నేడవకు
సూాడైన బంగారు రుమ్మాళ్ళ గొనుచు
ఋష్యశృంగుడు మేనమాామ వచ్చె నేడవకు
ఉగ్గూ బంగారు గిన్నె ఉయ్యాలె గొనుచు
ఊర్మిళా పినతల్లి వచ్చె నేడవకు
చక్కాని ముక్కల్లా చెక్కిళ్ళు మెరయూ
శతకీర్తి పినతల్లి వచ్చె నేడవకు
మల్లేలు మొల్లాలు మాాలాలె గొనుచు
మాాళావి పిసతల్లి వచ్చె నేడవకు
బంగారు పావాలె గొడుగూలు గొనుచు
భరతూడు పినతండ్రి వచ్చె నేడవకు
శత్రుల్ని సంహారింప చంద్రాయుధము బూని
శత్రుఘ్నుడు పినతండ్రి వచ్చె నేడవకు
అంచె పంచెలు బూని అందలాలె బూని
హానుమంతుడు మనబంటు వచ్చె నేడవకు
ఒడలెల్ల విభూతి జడలెల్లా దాల్చి
కులగురువు వశిష్టు వచ్చె నేడవకు

పట్టూ గొడుగుల నీడ పల్లాకి యెక్కి
పట్టభద్రాడు మీ తండ్రి వచ్చే నేడవకు
మనమంతా గూడుకు అందలాలె యెక్కి
అయోధ్యకు వెళదాము అయ్యా యేడవకు
బంగారు మేడల్లో రత్నాల తొట్లెలలో
మిమ్ము పడుకోబెట్టి జోల పాడెదను"

(గృహలక్ష్మి, సెప్టెంబరు 1934)

ఈ పాటలో 'ప్రహారి ఋషిపల్లె సోమవీధులనూ' అనేమాట అడవిలో వాల్మీకి మహర్షి ఆశ్రమంలో ఆమె ఉనికిని తెలుపుతుంది. అలా అమ్మకానికి వచ్చిన ఉయ్యాల ఒకటికొని పొన్నమానుకుకట్టి ఊయలలో కవలలిద్దరినీ పెట్టి ఊపుతుంటే సూర్య చంద్రుల జ్యోతులు వెలిగినట్లున్నాయట అంటే లవకుశలకు సూర్యచంద్రులకు పోలిక. అలా ఊపుతూ భవిష్యత్తుమీది ఆశతో కలలుగంటూ అందరూగూడి అయోధ్యకు వెళ్దామంటుంది. జానపదులు సృష్టించిన ఈ పాటలో ఒక కుటుంబానికి సంబంధించిన వ్యక్తులమధ్యఉన్న సంబంధ బాంధవ్యాలు, ప్రేమానురాగాలు సువ్యక్తమవుతాయి లవకుశలకు అన్వయిస్తూ పాడేపాటలు కొద్దికొద్ది మార్పులతో ఎన్నో ప్రచారంలో ఉన్నాయి బిడ్డకు ఊయలొకటి కొనలేని పేదతల్లికూడ తన కుమారుని నిద్రపుచ్చుతూ పొందే ఆనందం, ఆశించే శుభం అత్యధికం వాలి పాటల్లోనే తల్లి ఊయల కొనలేని దారిద్ర్యానికి భర్తను నిందించకుండ భర్త ఆయురారోగ్యాల్ని ఆశిస్తూ పాడు కొంటుంది అలాంటి పాట ఒకటి

"ఊరికీ ఉయ్యాల లమ్మవచ్చినవి
కొడుకులా గన్నతల్లి కొనరె ఉయ్యాలా
వంబెట్టి నేగొందు వెండి ఉయ్యాలా
పాదివేలు (పదివేలు) పోసి పైడిఉయ్యాలా

నిద్రబో నాతండ్రి నిద్రబోవయ్యా
నిద్రబో బలభద్ర రాముతమ్ముడ
నిద్రాకు నూరేండ్లు నీకు వెయ్యేండ్లు
నినుగన్న తండ్రికి నిండ నూరేండ్లు ,,

(తెలంగాణా పల్లెపాటలు)

పుట్టింటిపై మమకారం ఆడవాళ్లకు సహజం జానపదుల సరససల్లాపాలలో వరసైన వారితో చతురోక్తులాడడం అతిసహజం, లాలిపాటల్లో పుట్టింటి వారిని పొగడడం వరసైన వదినగారిని హేళన చేయడం కూడ గోచరిస్తుంది, ఉదాహరణకు

"చిచ్చీ ఓయీ ఓయల్లా ఓయీ
ఓయల్లా లాడేరే వాల లాడేరే
నాయినను పాడేరే బంగారు తండ్రి
ఓయల్ల పండెరుపు వంగపండెరుపూ
తానెరుపు నాయన్న తనవారిలోనూ
ఓయల్ల ఓయల్ల వంకాయపుల్ల
నల్లావులచల్ల నీయత్త కనుమెల్ల
ఊరిముందరి మొలక చెంచెల్లి మొలక
బత్తెవచ్చీ బరుక నీయత్తమిడుక
చీలమ్మ చెలరేగి చింతకొమ్మెగురు
నాయన్న చెలరేగి మామభుజ మెగురు."

(తెలంగాణా పల్లెపాటలు)

అలాగె పుట్టింటి వాళ్ళలో సంబంధ బాంధవ్యాలను పటిష్టం చేసుకోవాలనే ఆలోచన, ఆరాటం కూడ స్త్రీలకెక్కువ వాళ్ళకున్న అటువంటి ఆశక్రింది పాటలో వ్యక్త మవుతుంది

" ... ... ...
తింటేను తియ్యా దోసపండ్లే తినాలి
కంటేను కొడుకుల్లా కాన్పు కనాలి
అందితే అన్నతో వియ్యా మందాలి
ఆడితే వదినతో జగడమాడాలి"

(బాలభాష)

"ఏనుగు యెక్కొయ్యో ఓరాజు రాగ
ఏక దివాణము యెవరి లోగిలి
పల్లకీ యెక్కొయ్యో ఓరాజు రాగ
బంగారు తలుపుల్ది యెవరి లోగిలి
అందలా లెక్కొయ్యో ఓరాజు రాగ
అద్దాల తలుపుల్ది ఎవరి లోగిలి
... ... ... ...
ఏనుగు ఎక్కొయ్యో ఓరాజు రాగ
ఏక దివాణమ్మొ వదినె లోగిలి
... ... ... ..."

( సాంప్రదాయిక విజ్ఞానం, (పాతపాటలు) )

ఈ పాటలోని గొప్పతనాన్ని వదిన పరంగా చెప్పినా అన్నగారికే (పుట్టింటికే) అన్వయిస్తుంది.

తల్లులకు తమ పిల్లలపై ఎలాంటి కోరికలు, ఆశలు ఉంటాయో కొన్ని లాలి పాటల్ని పరిశీలిస్తే వ్యక్తమవుతుంది అతి ప్రాచీన కాలంలోనే సాహసోపేతమైన సముద్రయానం చేసి ద్వీపాంతరాలలో వర్తకవాణిజ్యాలను నిర్వహించి స్వదేశాన్ని సిరిసంపదలతో నింపినట్టి సువర్ణ ఘట్టాలు ఆంధ్రుల చరిత్రలో ఉన్నాయి. ఈ

చారిత్రక సన్నివేశాలు బాలగేయాల్లో కూడ చోటు చేసుకొని ఉండడం విశేషం. తమ బిడ్డలు ఓడవ్యాపారం చేసి శ్రీమంతులు కావాలనే తెలుగు తల్లుల కోరికలకు క్రింది లాలిపాట ఒక దృష్టాంతం.

"విశాఖ పట్నాన విరిసింది గాలి
వింజగపు రేవున్న తేలింది వాడ
వర్తకుడి పేరేమి వాడ పేరేమి
వాడలో పోసున్న దినుసు పేరేమి
వర్తకుడు అబ్బాయి వాడ నావాడ
వాడలో పోసున్న దినుసు ముత్యాలు"

(సాంప్రదాయిక విజ్ఞానం (పాతపాటలు) )

పై పాటలో తనబిడ్డ గొప్ప ముత్యాల వర్తకుడు కావాలనే కోరికను వెల్లడిస్తుంది తల్లి.

కాకిపిల్ల కాకికి ముద్దన్నట్లు ప్రతితల్లికి తనబిడ్డ ముద్దుబిడ్డ అంద చందాలలో తనబిడ్డ అందరిని మించిన బిడ్డగా భావించడం తల్లుల వాత్సల్య జగత్తులో ఒక వాస్తవం. క్రింది నాలుగు చరణాల్లో తెలుగుతల్లి ఎంతటి భావగరిమను, ధ్వనిని పొందు పరిచిందో చూడండి 'అల్పాక్షరముల ననల్పార్థరచన' అనడానికి ఇది ఎంతో చక్కని ఉదాహరణ

" వీధి నెందరు వున్న విసరదే గాలి
రచ్చ నెందరు వున్న రాదమ్మ వాన
నా చిన్ని అబ్బాయి వీధి నిలుచుంటే
మొగలి పువ్వుల గాలి ముత్యాలవాన."

( సాంప్రదాయిక విజ్ఞానం (పాతపాటలు) )

పొత్తిళ్లలో కొడుకును పెట్టుకొని మురిసిపోతూ కుమారుని పెళ్లిగురించి అప్పుడే కలలుగనే తల్లి హృదయం ఎంతటి అమాయకమైన ఆశాలతలకు నిలయమో క్రిందిపాటల్లో గమనించవచ్చు

"గోపాల కృష్ణమ్మ పెళ్లయ్యేనాడు
గోరింట పూచింది కొమ్మ లేకుండ
మాయింట అబ్బాయి పెళ్ళయ్యే నాడు
మల్లెల్లు పూచేయి మొగ్గలేకుండ."

" వేసంగి కాలాన ఓ పెళ్లి కొడుకా
వేప తోరణాల నీడనే రమ్మి
మా యింట అబ్బాయి పెళ్లయ్యే నాడు
మామిడి తోరణాలు మరి దూరిరమ్మి "

( సాంప్రదాయక విజ్ఞానం. (పాతపాటలు) )

కూలి నాలి చేసుకొని జీవించె తల్లి తన బిడ్డను చెట్టుకు కట్టిన ఊయల్లో పెట్టి పోయినప్పుడు అమ్మకోసం ఏడ్చే బిడ్డను బిడ్డ తండ్రిగాని, ఇతరులుగాని ఓదార్చ డానికి పాడే ఈ క్రింది లాలిపాటలోని చమత్కారం గమనించ దగింది.

"ఊడుగూ చెట్టుకూ ఉయ్యాల గట్టి
ఊగుమని మీాయమ్మ ఊళ్ళోకె పోయె
పందికొక్కా రావె పాలిచ్చిపోవె
ఉడుతమ్మ నువురావె ఊకుంచి పోవే
ఎలుకమ్మ నువురావె ఎత్తుకొని పోవే"

(తెలంగాణా పల్లె పాటలు)

అవయవ సౌష్ఠవం కన్నా, చర్మ సౌందర్యంకన్నా బిడ్డలకు అందాన్ని కలిగించేవి చక్కని కళ్ళే. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అని కదా లోకోక్తి. పాశ్చాత్య సౌందర్య దృష్టిలో కూడా కళ్ళకు ప్రాధాన్యం ఉంది హేమ నేత్రులయిన వాళ్ళు అందమైన వాళ్లని పాశ్చాత్యుల అంచనా. భారతీయ దృష్టికి నల్లని కనుపాపలతో విశాలంగా ఉన్న నేత్రాలు అందమైనవి. ఆకర్షణీయమైనవి.

ఈ లక్షణాన్ని పురస్కరించుకొని ఏర్పడినట్టివె చారెడేసి కళ్లు, కలువ కన్నులు అనే నుడికారాలు. మన దృష్టికి హేమ నేత్రాలు అందమైనవికావు. వాటిని పిల్లి కళ్ళంటాం. పిల్లికళ్ళని బీరపువ్వులకీ, నల్లని కనుపాపలున్న విశాల నేత్రాల్ని కలువరేకులతో పోల్చే కవి సమయాలు బాలగేయాల్లో కూడా ఉన్నాయి. కాటుక పెట్టిన కళ్ళు మరీ అందంగా ఉంటాయి. తల్లిచూపుకు తనబిడ్డకళ్లు ఎంతో అందమైనవి కళ్ళ అందాన్నికూడ ఆమె పాటరూపంలో వర్ణిస్తుంది. అలాంటి పాటకు ఒక ఉదాహరణ :

"పిల్లెమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయి కన్నుల్లు కలువ రేకుల్లు
కలువ రేకులవంటి నీ కన్నులకును
కాటుకలు పెట్టితే నీకు అందమ్ము
... ... ... ..."

(బాలభాష)

కన్నబిడ్డ కళ్ళ అందాన్ని చూసి మురిసిపోయినా ఆ కళ్ళలో కన్నీరు కారితే తల్లి మనసు తపించి పోతుంది. అందుకే

"ఏడవకు ఏడవకు వెఱ్ఱి అబ్బాయి
ఏడిస్తే నీకళ్లు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను
పాలైన కారవే బంగారుకండ్లు"

(బాలభాష)

అని వెఱ్ఱిగా ఓదారుస్తూ పాడుతుంది. తనబిడ్డమీద తల్లి ఎంతో ముద్దూ మురిపాన్ని ఒలకపోసి లాలించి పాలించినా ఏదోఒక సమయంలో బిడ్డ ఏడుపుకో, అల్లరికో కొంత విసుక్కోవడం కూడా సహజం. అలాంటి సమయాల్లో అల్లరి చేయకుంటే

తాయం పెడతాననో, ఏడ్పు మానకుంటే బూచివాడికో, దొంగకో ఇచ్చేస్తాననో అంటుంది అలాంటి పాటలు కూడా జానపద వాఙ్మయంలో విశేషంగా ఉన్నాయి. ఉదాహరణకు :

"ఏమే ఓ చిట్టీ - ఏడవకే ఈ రొట్టె ముక్క
విరిచి పెట్టీ - నిను పడుకోనా జోకొట్ట
... ... ... ... ..."

(వేదుల సత్యనారాయణ శర్మ, కాళహస్తి వీరభద్ర స్వామి 'పిల్లల పాటలు')

"అల్లరి చేయకమ్మా
నీకు బెల్లము పెట్టెదనమ్మా
అల్లరి చేయకమ్మా
పల్లకి యిదిగోనమ్మా
... ... ... ... "

(పిల్లల పాటలు)

ఎంత ఓదార్చినా ఏడుపు మానసప్పుడు భయమంటే తెలియని బిడ్డను భయపెడ్తూ పాటలు పాడ్తారు ఉదాహరణకు రెండు పాటలు :

1. "అదుగో బూచివాడు
మన అటక మీదున్నాడు
ఏడుస్తే వాడు నిన్నెత్తుకు పోతాడు
మిట్ట గుడ్డివాడు
పొణకంత పొట్టివాడు
మన తట్టలో దాగున్నాడు
జడ పట్టుకు లాగుతాడు

నోరు చూపుతాడు
పలు కోరలు చూపుతాడూ
నీ అరడి విన్నాడా
ఈ సారి ఊరుకోడు"

(పిల్లల పాటలు)

2. "పిట్ట రావె పిట్ట పిల్లలకు తల్లీ
పిల్లలకు పాలిచ్చి పల్లెలకు పోవే
పల్లెలకు పోయొచ్చి బుట్టల్లుకోవే
బూచివాడా రార బుట్టల్లుకోసి
బుట్టలో నాయనను పట్టుకొనిపోరా."

(తెలంగాణా పల్లె పాటలు)

తల్లికి బిడ్డమీద కలిగే విసుగు, కోపం తాత్కాలికమె బిడ్డను బెదిరించినా, భయపెట్టినా మరుక్షణంలోనే తల్లి బిడ్డ క్షేమాన్ని మనసార కోరుకుంటుంది భయ పెట్టినపుడు బిడ్డ ఏడుపుమాని నిద్రలోకి జారుకోగానే తల్లి తన బిడ్డను భగవంతుడు ఆశీర్వదించాలని పాట రూపంలోనే ప్రార్థిస్తుంది. ఉదాహరణకు

"ఆయి ఆయి ఆయి ఆపదలు గాయి
చిన్ని వాళ్లను గాయి శ్రీ వెంకటేశ
గాయి గాయి గాయి యేడమ్మ గాయి
అంగళ్ళ ఆడేటి అబ్బాయి గాయి
పోలేరమ్మ పొత్తుళ్ళు గాయి
పొత్తిళ్ళ నాడేటి అబ్బాయిగాయి."

(పాతపాటలు.)

ఈవిధంగా పిల్లలకోసం పెద్దలు పాడే లాలిపాటలు, జోలపాటలు పిల్లల్ని నిద్రపుచ్చడానికి ఉద్దేశించినా పనిలో పనిగా పెద్దలకు అవతారగాథలు, వీరగాథలు, మానవధర్మాలు మొదలైన విషయాల్ని కూడ జోలపాటల్లో బోధించడం కన్పిస్తుంది. నేటికాలానికి అనుగుణమైన, ప్రచారోద్దేశకమైన జోలపాటలు కూడ కొన్ని వ్యాప్తిలో ఉన్నాయి ఉదాహరణకు .

"ఏడవకు పసిబాల ఏడవకు తండ్రీ
ఏడిస్తే నినుభరత వీరుడనరయ్యా
ఇంక నిద్దురపోర నాచిట్టి తండ్రీ
వేళాయె రా సభకు నేనేగ వలెను."

తెలుగు లాలిపాటలు పాడుతుంటె వింటున్న పెద్దవాళ్లు కూడ నిద్రాదేవి లాలనానుభూతికి వశులవక తప్పదు "'లాలి' అన్న అక్షరాలలో 'రిసా' అన్న స్వరాలు వినబడి లాలిపాటలో ప్రకృతిసిద్ధించే షడ్జస్వరాల సయ్యామీదికి దింపురాయి శిశువు చైతన్యాన్ని" 1 అంటారు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు "కాల సూచక రాగమైన ఆనంద భైరవిలోను, నిద్రకనుకూలమైన శ్రీరాగములోను లాలిపాటలు ఎక్కువగా పాడ్తారు సామరాగము, మధ్యమావతి మొదలైన సాత్విక రాగాలలో కూడా పాడ్తారు ముఖ్యంగా ఆనందభైరవిలో ఆర్తభావం కనబడుతుంది "2 అంటారు ఇల్లిందల సరస్వతీ దేవిగారు. రాగాలు ఏవైనా లాలిపాటల్లోని గాన మాధుర్యం ప్రతి తెలుగు బిడ్డకూ అనుభవైకవేద్యమె.

మానవ జీవితంలో జోలపాటలకు ఇంత ప్రాముఖ్యమున్నా ఈ కాలంలో ఎక్కువగా ఆదరణ పొందడం లేదు దేవాలయాల్లో మాత్రం స్వామికి పవ్వళింపు సేవచేస్తూ జోలపాటలు పాడడం ఈనాటికీ నిలిచిన భారతీయుల నాగరికత.

---

1. జానపదగేయకథా వాఙ్మయము. విజ్ఞాన సర్వస్వం, 4వ సంపుటి పుట 803
2. లాలిపాటలు జోలపాటలు, ఆంధ్రపత్రిక 26 అక్టోబరు 1949

### 3. 4. 2. పిల్లల్ని ఆడించే పాటలు.

పసిపిల్లలకు ఉగ్గు పెట్టడం, స్నానం చేయించడం, తలదువ్వడం, అన్నం పెట్టడం మొదలైన పనులన్నీ తల్లులే చేస్తారు. అటువంటప్పుడు వాళ్ళని ఆడిస్తూ నవ్విస్తూ పాడే పాటల్ని ఆడించే పాటలనవచ్చు. తెలుగు దేశంలోని పల్లెప్రజల్లో అలాంటి పాటలెన్నో ప్రచారంలో ఉన్నాయి. ఒక పాటకు భిన్నప్రాంతాల్లో పాఠాంత రాలుకూడ కన్పిస్తాయి. పిల్లల్ని ఆడించడానికి పాడే ఈ పాటల్లోకూడ తెలుగు వాళ్ల అనురాగాలు, నమ్మకాలు, ఆచారవ్యవహారాలు చోటు చేసుకొని ఉన్నాయి.

#### 1. ఉగ్గు పాటలు.

జానపదస్త్రీలు పసిపిల్లలకు ఉదయాన్నే ఉగ్గుపెడతారు. ఉగ్గు తాగడానికి పిల్లలు సాధారణంగా ఇష్టపడరు. మారాం చేయడం మామూలు అప్పుడు వాళ్లదృష్టిని తమవైపు మరల్చుకోవడానికి తల్లులు–

"ఊం ఊం ఉంగన్న
ఉగ్గు పాలు ఇందన్న
గుండెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న"
(బాలభాష)

అని పాడుతూ పిల్లల్ని సుముఖంగా చేసికొని ఉగ్గు పోస్తారు. ఉగ్గులోని ఆముదం వెగటుగా ఉంటుంది. అందువల్ల పిల్లలు ఉగ్గు మింగకుండా నోట్లోనే ఉంగలు పెడ్తారు. అప్పుడాతల్లి

"ఊం ఊం ఉంగన్న
ఉంగలు పెట్టకు గ్రక్కన్న

ఓర్వని సవతుల దిష్టన్న
ఒప్పుగ మనలర బుచ్చన్న"

(బాలభాష)

అని పాడుతుంది. పిల్లలవి లేతపేగులు. వాళ్ళు 'తాగినవి' తిన్నవి బాగా జీర్ణంకావాలి. అజీర్ణమయితే వాళ్ల ఆరోగ్యం చెడుతుంది. అందుకని అజీర్తి లేకుండా త్రాగినవి తిన్నవి చక్కగా జీర్ణమై జవసత్వాలు నిండుగా సిద్ధించాలని తల్లి కోరుకుంటుంది. అలాంటి కోరికను తెలిపే క్రింది పాటలో జీర్ణానికి వాతాపి ఐతిహ్యాన్ని, జవ సత్వాలకు భారత వీరుల్లో భీమార్జునుల్ని, జంతు వర్గంలో గజాల్ని స్మరిస్తుంది. అక్షరజ్ఞానం లేని జానపదమహిళలు ఏనాడో సృష్టించిన ఇటువంటి బాలగేయాల్లో అద్భుతమైన కల్పన, అపూర్వమైన భావన కమ్మనికవిత్వమే కాకుండ సార్థకప్రయోగ చాతుర్యం కూడ కన్పిస్తుంది

"జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుఱ్ఱాల్ తిన్న గుగ్గిళ్లరిగి
ఏనుగుల్ తిన్న వెలక్కాయ లరిగి
అర్జునుడు తిన్న అరటి పళ్లరిగి
భీముడు తిన్న ఖజ్జా లరిగి
అబ్బాయి తిన్న పాలు ఆముదం అరిగి
పందల్లే పాకి కుందల్లే కూర్చుండి
నందల్లె నడిచి, గుఱ్ఱమంత పరుగు.
ఏనుగంత సత్తువ ఉండేటట్టు
సాకుమీా, యీా బిడ్డను సంజీవరాయ!"

(బాలభాష)

పై పాటతో 'సంజీవరాయా': అన్న సంబోధన చివరఉన్నమాట చివరి చరణంలో సహజంగా పడిన ఈమాట ఎంతో అర్థవంతంగా, సాభిప్రాయంగా, ఐతిహ్యసూచకంగా

ఓషధి ప్రశంసాత్మకంగా ఉంది సంజీవని ఒక దివ్యమైన ఓషధి వ్యుత్పత్తి పరంగా సార్థకమైన పేరు. రామాయణ ప్రసిద్ధి సంజీవరాయుడంటె హనుమంతుడే కదా! హనుమంతుడు జవసత్వాలకు ప్రతీక పైగా ఆంధ్రుల ఆరాధ్య దైవాల్లో ఒకడు అతడు చిరంజీవి అని మనవాళ్ళ నమ్మకం. ఉగ్గుపెడ్తూ తనబిడ్డ ఆయురారోగ్యాలతో, జవసత్వాలతో చిరంజీవిగా వర్ధిల్లాలని 'సంజీవ రాయని' స్మరించడంలోని ఔచిత్యం ఎంతో అత్యద్భుతమైంది

2. తలంటు పాటలు.

తల్లులు చిన్నపిల్లలకు రోజూ తలంటి స్నానం చేయిస్తారు పిల్లలు మంచి బలంరావాలని స్నానానికి ముందు శరీరానికి నూనెరాసి మర్దన చేస్తారు ఆసమయంలో తల్లులు పాడే ఒక పాట .

"మాడు పట్టుకు మంచి నూనె
కను చెవి ముక్కుల కమ్మని నూనె
డెబ్బ సిబ్బెముల గబ్బున నూనె
ఎడ పెడ తొడలకు మడిగెల నూనె
రొమ్ము దిమ్మెగల రొక్షం నూనె
రంధ్రం పట్టుల రాసిన నూనె
తల పొర యంటుల గిద్దడి నూనె
కందున పూసిన గానుగ నూనె
సన్న నలుగుతో సాదిన నూనె
పచ్చ పసుపుతో వండిన నూనె
గోరు వెచ్చని నీరున నూనె
కుంకుడు నురగను గ్రక్కిన నూనె
బోరికి మోకిరి బుడుగో పుటుకో

సన్న వల్లెతో సరుకో నిరుకో
నూనె పాపనికి నిన్న రేపటను
నీరాజన నిత్య స్నానం
తీర్చి వేసువన దిద్ది కుమారం"

(పిల్లల పాటలు)

3. దీవెన పాటలు:

స్నానం చేయించడం పూర్తయిన తర్వాత తల్లి బిడ్డను దీవిస్తూ పాడే పాటలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు.

"అమ్మ కడుపు చల్లగా
అత్త కడుపు చల్లగా
లెక్కలేని సొమ్మెట్టుకొని
పుట్టంలేని బట్ట కట్టి
అనుము - తునుము
ముని మనుమలతో వర్ధిల్లాలి."

(పిల్లల పాటలు)

బిడ్డ క్షేమాన్ని సకల సౌభాగ్యాల్ని మనసారా కోరుకొనే తల్లి అనుక్షణం బిడ్డను దీవిస్తుంటుంది స్నానం తర్వాత బిడ్డకు ధూపంవేస్తూ

"మంచి గంధం మాచికాయ
ఊదొత్తి ఉమ్మకాయ
కప్పూరంబు కచ్చోరంబు
కస్తూరికా కైరికమ్ము
సన్నవేరు సాంబరాణి

గంధ ధూపములు గండాదీపం
హారతి హోమం అగ్ని ధూమములు
దేవత సత్తువ దివికె జోతల
పురిటి సుద్దికే పున్నెము జోతలు "

(పిల్లల పాటలు)

అని పాడుతుంది. ఈ గేయంలో పిల్లలకు ధూపం వేయడానికి ఉపయోగించే సుగంధ ద్రవ్యాలన్నీ పేర్కొనబడ్డాయి. బిడ్డకు బొట్టుపెట్టి, కాటుక తీర్చి, ఊయలలో పడుకోబెట్టి తనివితీరా చూచుకుంటూ అందాన్ని వర్ణిస్తూ పాడే క్రింది పాటలో కూడా తల్లి దీవెన కన్పిస్తుంది.

"మాడపట్టు మంచి నూనె
... ... ... ...
సిరిసిరి పాణుల చిరి పారాణుల
చిలుక పందిరి తూగుటుయ్యాలలో
తొక్కుల పాపడు మాయింటి కీవల
మొక్కిన దేవుడు చల్లగ పడర
స్వామి పరాకు ! "

(పిల్లల పాటలు)

పిల్లలకు చేసే స్నానాదికాలలోను, ముద్దుమురిపాలలోను తల్లి అడుగడుగునా బిడ్డను దీవిస్తుందనడానికి పైపాటలు నిదర్శనాలు.

## 4. వ్యాయామం పాటలు.

చిన్న పిల్లల పెరుగుదలకు అన్నపానాదే కాకుండ శరీర వ్యాయామం కూడ ఎంతో అవసరం. పసిపిల్లలు స్వయంగా శరీర వ్యాయామం చేయలేరు. కాబట్టి

తల్లిదండ్రులు వాళ్ళని ఒళ్ళోనో, కాళ్ళమీదనో పడుకోబెట్టుకొని అన్ని అవయవాలకు వ్యాయామం చేయించినట్లు ముందు వెనకలకు ఊపుతూ పాటపాడుతూ ఆడిస్తారు. అలాంటి పాటల్లో క్రింది పాకటి.

"ఊగూ ఊగూ గంగెద్దా
ఉగ్గు పాలే గంగెద్దా
సోలీ ఊగే గంగెద్దా
సోలెడు పాలే గంగెద్దా
... ... ...
అగీ ఊగే గంగెద్దా
అడ్డెడు పాలే గంగెద్దా

(తెలంగాణా పల్లెపాటలు)

తనబిడ్డ గుమ్మడి పండులాగుండాలని ప్రతితల్లీ కోరుకుంటుంది. దానికి తగిన శరీర వ్యాయామం చేయిస్తూ ఆడించేటప్పుడు కూడా ఆ భావాన్నే వ్యక్తం చేస్తుంది.

"గుమ్మాడమ్మా గుమ్మాడీ
ఆకుల్లు వేసింది గుమ్మాడీ
పువ్వుల్లు పూసింది గుమ్మాడీ
పండ్లు పండిందమ్మ గుమ్మాడీ
అందులో ఒకపండు గుమ్మాడీ
అతి చక్కనీ పండు గుమ్మాడీ
ఆ పండు యెవరమ్మ గుమ్మాడీ
మా చిట్టి తండ్రమ్మ గుమ్మాడీ"

(బాలభాష)

## 5. నడక పాటలు.

నడవడానికి ముందే పిల్లలు వస్తువులను చేతులతో పట్టుకోడానికో ఎత్తడానికో ప్రయత్నించడం సహజం. చేతికి బలం రావాలని కొన్నాళ్ళ ను పట్టుకొని బిడ్డచేతుల్ని తల్లి ఊపుతూ వ్యాయామం చేయిస్తూ పాటలుకూడా పాడుతుంది ఉదాహరణకు .

"చెయి వూచమ్మా చెయి వూచు
సంతకు పోదాం చెయి వూచు
శెనగలు తెద్దాం చెయి వూచు
చల్లగ తిందాం చెయి వూచు
పప్పులు తెద్దాం చెయి వూచు
పట పట తిందాం చెయి వూచు
మిఠాయి తెద్దాం చెయి వూచు
మెల్లగ తిందాం చెయి వూచు
బొమ్మలు కొందాం చెయి వూచు
కమ్మలు కొందాం చెయి వూచు."

(స్వీయ సేకరణ)

పిల్లలు నిలబడి తప్పటడుగులు వెయడానికి ప్రయత్నించే దశలో తల్లులు వాళ్ళ రెండు చేతుల్ని పట్టుకొని మజ్జిగ చిలికినట్లుగా ఆ చేతుల్ని లాగుతూ మెల్లగా వెనకడుగులు వెనుకుంటూ నడచి పిల్లల్ని ముందుకు నడిపిస్తారు ఆ నడకను కూడ పాటలు పాడుతూనే నేర్పుతారు అలాంటి పాటల్లో ఒకటి :

"చల్లా చెయ్యి గొల్లభామ నీ
నందిట దండలు కదిలేను
వెన్న చెయ్యి అమ్మాయి నీ
వెండి మురుగులు కదిలేను

పాలు తాగి అబ్బాయి నీ
పైడి మురుగులు కదిలేను. "

(బొమ్మరిల్లు)

6. చప్పట్ల పాటలు.

కొంతదూరం నడచి అలసిన బిడ్డను మళ్ళీ ఒళ్ళో కూర్చోబెట్టుకొని ఆడిస్తూ నవ్విస్తూ తల్లి చేతులు త్రిప్పుతూ చప్పట్లు కొడుతూ-

" తారంగం తారంగం
తాండవ కృష్ణా తారంగం
... ... ... ... "

(బాలభాష)

అని పాడుతుంది ఆ పాటలోని నాదానికి, లయకు శిశువు కూడ చేతులు చరచడానికి ప్రయత్నిస్తుంది. ఇంకా

" తప్పట్లోయ్ తాళాలోయ్
దేవుని గుళ్లో బాజాలోయ్
పప్పూ బెల్లం పిల్లలకోయ్
పాలూ నెయ్యీ దేవునికోయ్. "

(స్వీయ సేకరణ)

అని తల్లి పాడుతూ, పిల్లలకు రెండుచేతుల్తో చప్పట్లు కొట్టడం నేర్పిస్తుంది.

7. జాంజి పాటలు.

పెరిగే పిల్లలకు భయాన్ని పోగొట్టి నిర్భీతులను చేయడానికి పెద్దలు చేసే ప్రయోగాలు కొన్ని ఆట పాటల రూపంలో ఉన్నాయి ఒకవిధంగా అవి పిల్లలకు

ఎనోదాన్ని, ధైర్యాన్ని కల్గిస్తాయి. వెన్నెల వేళల్లో ఆరుబయట చాపమీద వెల్లికిలా పడుకొని పాదాలపైన బిడ్డను కూర్చోబెట్టుకొని మోకాళ్లనువంచి ముందుకూ వెనక్కూ కొంతసేపు ఊపుతూ ఒక్కో ఊపుకు ఒక్కోపదం పాడుతూ చివరకు 'అల్లల్లల్లా... ...' అని ఒక్కసారిగా శిశువుతో పాటు కాళ్లను పైకెత్తుతారు. అపుడు శిశువు కొంత తలక్రిందులై పడిపోతున్నట్లు భయపడ్తుంది. కానీ పడిపోకుండా పట్టుకొని కాళ్లను దించివేసేసరికి నవ్వుతుంది. ఉత్సాహంతో మళ్లీ మళ్లీ అలా చేయమని కోరుతుంది కూడా. ఈవిధంగా ఆడించే ఆటను చిత్తూరు జిల్లాలో 'జాంజి' అంటారు ఆ పాట :

"జాంజీ జప్పాంజీ
చక్రవర్తి కళ్యాణం
ఊరంతా వైభోగం
వచ్చేవాళ్లు రావచ్చు
పొయ్యే వాళ్లు పోవచ్చు
అల్ల ల్ల ల్ల ల్లా ... ..."
(స్వీయ సేకరణ)

ఈ విధంగా ఆడించేటప్పుడు తెలంగాణా ప్రాంతంలో పాడే పాట

" ఉయ్యాల లోయ్
జంపా లోయ్
కొత్త కొండోయ్
కొమ్మ రెల్లోయ్
బిల్లో నోయ్
మల్ల న్నోయ్
అల్ల ల్ల ల్ల ల్లా ... "
(తెలంగాణా పల్లెపాటలు.

పైపాటలో 3,4,5 పాదాల్లో తెలంగాణవు శైవక్షేత్రాలపేర్లు ఆరో పాదంలో శివుని పేరు కన్పిస్తుంది. ఈ విధంగా ఆడించడంవల్ల పిల్లలకు పడిపోతామన్న భయం పోవడంతో బాటు నిలవొక్కుకో గలిగే శక్తి అలవడుతుంది.

## 8. జడుపు పాటలు.

పిల్లల్లో భయాన్ని పోగొట్టడానికి కాకపోయినా 'నీకింతా భయం పోలేదులే' అని నిరూపించడానికా అన్నట్లు ప్రయోగించే పాటలు కొన్ని ఉన్నాయి. ప్రభాకర శాస్త్రిగారి 'బాల భాష'లో 'జడుపు' అనే శీర్షిక క్రింద ఒకపాట గ్రంథస్థమై ఉంది. మాటలు వచ్చిన పసిబిడ్డను ముందు కూర్చోబెట్టుకొని యీ పాటలోని ప్రశ్నరూపంలో ఉన్న ఒక్కొక్క చరణాన్ని పాడాలి. శిశువు ఆ ప్రశ్నకు సమాధానం చెప్పాలి.

"నూకలు పెడ్తాను మేకలు కాస్తావా? — కాస్తాను.
పెద్దపులి వస్తే జడవవు కద? — జడవను.
... ... ... ...
తోడేలు వస్తే జడవవు కద? — జడవను.
(బాల భాష)

చివరకు 'నేను వస్తే జడవవుకద ?' అంటూ కళ్లలోకి 'ఉఫ్' అని ఊదడం లేదా కళ్లదగ్గర చప్పట్లు కొట్టడం చేస్తే బిడ్డ కళ్లుమూసుకుంటుంది. అప్పుడు 'జడిసినావులే అమ్మ జడిసినావులే' అంటూ ఏడిపించి నవ్విస్తారు.

## 9. చక్కిలి గింత పాటలు.

పిల్లల్ని నవ్వించడానికి చక్కిలి గింతలు ఒక చక్కని సాధనం. పిల్లలు ఏమరుపాటుగా ఉన్నప్పుడు ఉన్నట్లుండి చక్కిలి గింతలు పెడ్తే కిలకిలా నవ్వుతారు చక్కిలి గింతలు పెట్టడానికి ముందు ఏదో కధచెప్పినట్లు కొన్ని మాటలు చెప్తూ

చివరకు చక్కిలిగింతలు పెడ్తారు. బిడ్డను ముందు కూర్చోబెట్టుకొని ఒక చేయి చాపించుకొని చేతి వ్రేళ్లను లెక్కిస్తూ బువ్వ, పప్పు, చారు, పెరుగు అని ఒక్కొక్క మాటకు ఒక్కొక్క వ్రేలును ముడుస్తూ,

ఇల్లలికి - ముగ్గుపెట్టి
ఆకేసి - పీటేసి
అన్నంకలిపి - ముద్దలుచేసి
నీకోముద్ద - నాకోముద్ద
అమ్మకోముద్ద - అక్కకోముద్ద
... ... ... ... ... "

(స్వీయ సేకరణ.)

అని అభినయిస్తూ మా అబ్బాయి "సంతకు పోయే దోవేదీ శనగలు తెచ్చే దోవేదీ అంటే అట్లా... అట్లా... వచ్చి" అని మెల్లగా మునివ్రేళ్ళను శిశువు చేతిమీదుగా చంక వరకు తీసుకెళ్ళి "కిత కిత - కిల కిల" అని చక్కిలిగింతలు పెడ్తారు. అప్పుడు పిల్లలకు పట్టలేనంత నవ్వువస్తుంది ఈ విధంగా ఒకటి రెండుసార్లు చేసేంతర్వాత 'అట్లా... అట్లా... వచ్చి' అనే మాటలు చెప్పేసరికి తమచేతిని వెనక్కి లాక్కోవ వాసికి పిల్లలు ప్రయత్నిస్తారు అయినా వదలకుండా గిలిగింతలు పెడితే ముడుచు కుంటూ నవ్వుతారు చక్కిలిగింతలకే 'కిత కిత' అని మరొకమాట ఈ పాటలు చాలా ఉన్నాయి వాటికి పాఠాంతరాలూ ఉన్నాయి. అయినా వాటి ప్రయోగం ప్రయోజనం ఒక్కటే.

## 10 బువ్వ పాటలు.

ఆటల పరాకువల్లగాని, చెప్పడానికి మాటలు రాకపోవడంవల్లగాని, మరే కారణాలవల్ల గాని పసిబిడ్డలు ఆకలి అని చెప్పరు అయినా ఆకలికి ఏడుస్తారు. ఆకలికి ఏడుస్తున్న పాపకు తల్లి అన్నం తినిపించినా తినకుండా మారాము చేస్తుంది. అలాంటప్పుడు పాపను ఇంటి బయట అటు ఇటు త్రిప్పుతూ కడుపునిండా తినిపించా

టని తల్లి ప్రయత్నిస్తుంది. అలా అన్నంతినిపించేటప్పుడు ఆకాశంలో చందమామను చూపుతూ పాడే పాట ఒకటి బాగా ప్రచారంలోఉంది. 'చందమామ రావె - జాబిల్లి రావె' అనే ఎత్తుగడలోఉన్న ఆపాట కొన్ని పాఠ భేదాలతో తెలుగుదేశ మంతటా వ్యాప్తిలో ఉంది ఈ పాట తెలియని తెలుగుతల్లిగాని, విని పెరగని తెలుగుబిడ్డ గాని లేదంటే అతిశయోక్తి గాదు

"చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె గోగుపూలు తేవె
ఒలవని పండు ఒళ్ళో ఉంచుకొని
ఒల్చిన పండు చేతబుచ్చుకొని
పయిడి గిన్నెలో పాలు పోసుకొని
వెండి గిన్నెలో వెన్న పెట్టుకొని
అమ్మా నువ్వూ తిందురుగాని
అట్టా అట్టా రావె!"

(బాలభాష)

చందమామను చూపిస్తూ అటు ఇటు తిరుగుతూ పాట పాడుతూ అన్నం తినిపించ డానికి ప్రయత్నించినా ఒక్కొక్కప్పుడు చంటిపిల్లలు అన్నం తినడానికి ఇష్టపడరు. అట్టి సమయాల్లో తల్లి కుక్క - నక్క, ఎలుక - చిలుక, పిల్లి - బల్లి మొదలైన పేర్లు చెబుతూ మరొక పద్ధతిలో అన్నం తినిపించడానికి ప్రయత్నిస్తుంది ఆ పద్ధతి పాటా ఇది పాపను ఒళ్ళోనో, ముందో కూర్చోబెట్టుకొని తల్లి గిన్నెలోనుంచి ఒక్కొక్క ముద్దను తీసుకొని తాను కళ్ళు మూసుకొని ముద్ద ఉన్న చేతిని అటుఇటు త్రిప్పుతూ-

"కుక్కే వచ్చి తింటుందో - నక్కే వచ్చి తింటుందో
ఎలికే వచ్చి తింటుందో - చిలకే వచ్చి తింటుందో
పిల్లే వచ్చి తింటుందో - బల్లే వచ్చి తింటుందో

మా అమ్మా యే తింటుందో - మా అబ్బాయే తింటాడో
యెవరు వచ్చి తింటారో - యెవరు వచ్చి తింటారో. "
(బాలభాష)

అని పాడుతూ పాటతోబాటు మూసుకున్న కళ్ళు తెరవనట్లు నటిస్తుంది అప్పుడా పాటకూ, తల్లి నటించే ఆటకూ బిడ్డ విస్మయంతో నోరు తెరచి ఉన్నప్పుడు నోటి లోనికి తల్లి కలిపిన అన్నం ముద్దను తోసేస్తుంది ఆ ఏమరుపాటులోనే పాప ఆ ముద్దను గుటుక్కున మింగేస్తుంది ఈ విధంగా 'దొంగ బువ్వను' పాప ఆకలి తీరడానికి కావలసినంత తినిపించిన తర్వాత 'చాకలివాళ్ళ కుక్క వచ్చి చల్లగ అన్నం తిని పోయింది పో' అని నటించి మూతి చెయ్యి కడుగుతుంది

11. దిష్టి పాటలు.

ప్రతి తల్లికి తన పాపే పంచ ప్రాణాలు తన పాపను పువ్వుల్లో పెట్టి పెంచాలని తల్లి ప్రయత్నం ఉగ్గు పెట్టినా, ఊగించినా, ఆడించినా, అన్నంపెట్టినా గిలిగింతలు పెట్టినా, నిద్రపుచ్చినా ... అన్ని పనులు పాటలు పాడుతూ నిర్వహి స్తుంది సంగీతం దేవతల భాష. (Music is the language of the Angels) అని పాశ్చాత్యుల అభిప్రాయం. ప్రతి తల్లికీ తనబిడ్డ ఒక దేవత. ఆ దేవత అకారణంగా ఏడ్చినా, అన్నం తినకపోయినా, నిద్రపోకున్నా తల్లి వెంటనే ఇతరుల దృష్టి దోషం తన బిడ్డకు సోకిందని భావిస్తుంది. బాధపడుతుంది. దృష్టిదోషం అనే నమ్మకం భారతీయుల్లోనే కాదు పాశ్చాత్యుల్లో కూడా ఉంది దృష్టి దోషానికి ఇంగ్లీషు మాట **'evil - eye'**. ఈ దోష నివారణకు తెలుగు తల్లులు చేసే తతంగం ఎన్నో విధాలుగా ఉంటుంది. కర్పూరం ముట్టించి పళ్ళెంలో పెట్టుకొని లేదా పొడుగాటి పొరక పుల్లల్ని నాలుగైదు తీసుకొని క్రింది భాగాన్ని ముట్టించి పాపకు హారతిచ్చి నట్లు చేసి ఈ క్రింది మాటలను దృష్టిదోష నివారణకు మెల్లగా ఉచ్చరిస్తారు.

1. "అంగరక్ష ఆదిరక్ష దివ్యరక్ష దీపరక్ష
చిన్ని నా అబ్బాయికి శ్రీరంగరక్ష. "
(పిల్లల పాటలు)

2. " దిష్టి దిష్టి - సంధ్య దిష్టి
అవ్వ దిష్టి - తాత దిష్టి
తల్లి దిష్టి - తండ్రి దిష్టి
ముండ దిష్టి - రండ దిష్టి
పావి (పి) దిష్టి - పాడు దిష్టి
ఇరుగు దిష్టి - పొరుగు దిష్టి
కన్ను దిష్టి - కన్నోళ్ళ దిష్టి. "

(స్వీయ సేకరణ)

సాధారణంగా దిష్టి తీయడం చీకటి పడ్డ తర్వాతనే. దిష్టితీసిన తరువాత కర్పూరం పొగను ఎడమచేతి బొటనవేలుకు పట్టించుకొని పాప నుదుట బొట్టు పెడతారు. చీపురు పుల్లలతో దిష్టి తీస్తే ఆ మండుతున్న పుల్లల్ని గడిలో ఒకమూల పడేస్తారు. అవి మండుతున్నప్పుడు చిటపట శబ్దం ఎంత ఎక్కువగా వస్తే అంత ఎక్కువగా దిష్టి తగిలిందని తల్లుల నమ్మకం. అలా మండి ఆరిన చీపురు పుల్లల బూడిదను ఎడమ చేతి బొటనవ్రేలికి తీసుకొని పాపకు బొట్టు పెడతారు. దిష్టి తీయడం తల్లిగాని, ఇతర స్త్రీలుగాని చేస్తారు

ఈ విధంగా తన బిడ్డ పెంపకంలో తెలుగుతల్లి ఉదయంనుంచి రాత్రి వరకు ప్రతి క్షణాన్ని నవ్వుల పుష్పాలతోను ఆనంద పరిమళంతోను, పాటల మాధుర్యం తోను నింపివేస్తుంది

## 3. 4. 3. పిల్లలకు నేర్పించే పాటలు.

రెండేళ్ళ నిండేసరికి పిల్లలు ముద్దు ముద్దుగా పదాల్ని ఉచ్చరించ గలుగుతారు క్రమంగా చిన్నచిన్న వాక్యాలనుకూడ చెప్పుతారు ఆ దశలో వారికి తల్లిదండ్రులు ఇంట్లోని పెద్దలు చిన్న చిన్న పాటలు నేర్పడం మొదలు పెడ్తారు. వాటినే నేర్పించే

పాటలను వచ్చు. పాటలతోబాటు చిన్న చిన్న పద్యాలు కూడ పిల్లలకు నేర్పడం ఉంచి ప్రాథమిక దశలో నేర్పే పాటలు మగ పిల్లలకు ఆడపిల్లలకు సమానంగానే ఉంటాయి ఆరేడు సంవత్సరాలు దాటినదశలో వాళ్లకు నేర్పే పాటలు కొన్ని బాల బాలికలకు వేరువేరుగా ప్రత్యేకించి ఉంటాయి. తొలి దశలో పిల్లలకు నేర్పించే పాటలు చాలా చిన్నవిగా ఉంటాయి. వాటిలో అర్థానికన్నా శబ్దానికి ఎక్కువ ప్రాధాన్యం. అర్థ దృష్టితో చూస్తే అవి ప్రాచీన భారతీయ సంస్కృతిని ప్రతి బింబించే దైవప్రార్థనకు, పురాణపురుష ప్రశంసకు, నీతిబోధకు సంబంధించి ఉంటాయి తొక్కు పలుకులు పల్కే దశలోనే పిల్లలు సులభంగా నేర్వగల పాట చూడండి :

" ఏనుగు ఏనుగు నల్లన
ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగు మీాదా రాముడు
ఎంతో చక్కని దేవుడు. "

(సెలయేరు.)

రాముడు దేవుడని తెలియజెప్పే పైపాటలోఉన్న ఆద్యక్షరప్రాస, అంత్యాను ప్రాస, నాల్గేసి మాత్రలకు విరుపు, పదాల పునరుక్తి పిల్లల వినికిడికి ఇంపుగాను, అనుకరణకు అనువుగాను - కర్త ఎవరో తెలియకుండాగాని - కూర్చబడింది. ఇట్టి కూర్పుఉన్న పొట్టిపాటలు, చిన్నపద్యాలు పిల్లల నోటికి సులభంగావస్తాయి.

పద్యాల్లో చిన్నికృష్ణుని రూపురేఖలను వర్ణించే ఈ క్రింది చిన్నిపద్యం తెలుగుదేశంలో చిన్నపిల్లలకు అభినయంతో కంఠస్థం

" చేత వెన్న ముద్ద । చెంగల్వ పూదండ
బంగరు మొల త్రాడు । పట్టు దట్టి
సందె తాయెతులును । సరి మువ్వ గజ్జెలు
చిన్ని కృష్ణ ! నిన్ను । చేరికొలుతు. "

(బాల గీతాంజలి)

అందరికంటె ముందు మ్రొక్కవలసిన దేవుడు విఘ్నేశ్వరుడు. బొజ్జగణపతి బాలబాలికలకు ముచ్చటగొలిపే దైవం. వినాయక చతుర్థి పిల్లలకు ముఖ్యమైన పండుగ. అక్షరాభ్యాసానికి ముందే గణపతి స్తోత్రాల్ని పిల్లలకు నేర్పే సంప్రదాయం తెలుగుదేశంలో ఉంది. విఘ్నేశ్వరుని ప్రార్థనారూపమైన ఈ క్రింది గేయం మూడు నాలుగేండ్ల తెలుగు పిల్లలకు నోటిపాట.

" ఓ బొజ్జ గణపయ్య
నీ బంటు నేనయ్య
కమ్మని నెయ్యయ్య
కంది పప్పయ్య
పేరిన నెయ్యయ్య
పెసర పప్పయ్య
ఎలుక వాహనమదే
ఎక్కరాదయ్య
ఉండ్రాళ్ల మీదికి
దండు బోవయ్య. "

(బాల గీతాంజలి.)

చదువులు తమపిల్లలకు నిర్విఘ్నంగా సిద్ధించాలని అక్షరాభ్యాసానికి ముందే పెద్దలు నేర్పేపాట ఈ క్రిందిది.

" విఘ్నమ్ము లేకుండ
విద్య నివ్వవయ్య
విఘ్నేశ్వరుడ నీకు
వేయి దండాలు. "

(బాలభాష)

విఘ్నేశ్వరుని మొదలు బ్రహ్మపర్యంతం హిందువులు పూజించే దేవతలు అసంఖ్యాకం. దేవతాస్తోత్రాలు ఎక్కువగా సంస్కృత భాషలో ఉన్నాయి. కాని పసిపిల్లలకు సంస్కృతం నేర్పడానికి పెద్దలకు ఆభాష వచ్చిఉండాలి కదా! అయినా జానపదులు మణి ప్రవాళశైలిలో ప్రధాన దేవతల్ని స్తుతిస్తూ పిల్లలకు నేర్పే ప్రార్థనా గీతం చూడండి.

" కుదురుగ పాపడు । గుమ్మడి కాయ
విరిసిన పాపడు । విఘ్నేశాయ
సాగిన పాపడు । సాంబ శివాయ
చెలగిన పాపడు । శ్రీకృష్ణాయ
... ... ... ...
బోజ్జన్న పాపడు । పూర్ణ బ్రహ్మాయ
ఆడిన పాపడు । ఆనందాయ. "

(సెలయేరు)

దశావతారాల్ని పిల్లలకు వరుస క్రమంలో తెలిపే ఈ క్రిందిపాటలో హాస్యం కూడ మిళితమై ఉండడం మెచ్చదగింది. ఈ పాటలోకూడా యతి, అంత్య ప్రాసలున్నాయి.

" మా పాప మామల్లు మత్స్యావతారం
కూర్చున్న తాతల్లు కూర్మావతారం
వరసైన బావల్లు వరహావతారం
నట్టింట నాయత్త నరసింహావతారం
వాసి గల బోట్టల్లు వామనావతారం
పరమ గురుదేవ పరశురామావతారం
రక్షించు మామయ్య రామావతారం
బంగైన బంధువు బలభద్రావతారం

చిట్టి నా కన్నోడు శ్రీకృష్ణావతారం
కలివిడితో మాచిట్టి బుద్ధావతారం
బుద్ధితో మాచిట్టి బుద్ధావతారం
వర్ధిల్లు పసిపాప వర్ధిల్లు నాతండ్రి. ”
(సెలయేరు)

గుడిలో దైవదర్శనంచేసే సందర్భంలో, పిల్లలు వల్లించడానికి తెలంగాణా ప్రాంతం వారు నేర్పించే ప్రార్థనాగేయం ఈ క్రిందిది.

“ వెనకా వెనకా వేములతాతా
కనకా పండ్లు కాముని రూపుల్
ఎత్తని గొడుగుల్ ఏకవస్త్రములు
వాగు నీల్లు వనం పత్రి
తెల్లని గుళ్లో నల్లని వెంకయ్యకు
నాలుగు చేతుల నమస్కారము. ”
(తెలుగు జానపద గేయసాహిత్యం. పుట : 505)

దేవుని ఎదుట నమస్కారం పెట్టడాన్ని పిల్లలకు నేర్పడమె నాలుగుచేతుల నమస్కారంలోని అంతర్యం.

దైవ భక్తే గాక మాతృభక్తిని కూడా కల్గించడానికి పిల్లలకు నేర్పే పాటలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు :

1. “ఉన్న ఊరు విడిచి
ఉండనే లేము
కన్న తల్లిని విడిచి
ఘడి యుండ లేము

ఉన్న ఊరే నాకు
చెన్న పట్నమ్ము
కన్న తల్లీ నాకు
కల్ప వృక్షమ్ము. "

(బాలభాష)

2. " తల్లి కంటె వేఱుదైవం
ఇలను లేదు ఎంచి చూడ
... ... ... ... ...
మాతృ పూజా మనకుమేలు
మాతృ సేవా మనకు చాలు. "

(భారతి. మార్చి 1931)

పిల్లల విద్యార్జనను ప్రోత్సహించే వంశాభిమానం, స్వగృహాభిమానం వ్యక్తం చేసే పాటల్ని పిల్లలకు నేర్పడంలో పెద్ద తప్పులేదు. అలాంటి పాటలు కొన్ని తెలుగు జానపద గేయాల్లో ఉన్నాయి. ఈ క్రిందిది వాటికి ఒకచక్కని ఉదాహరణ :

" గడప లన్నిటిలోన ఏ గడప మేలు
మహాలక్ష్మి నివసించు మా గడప మేలు.
వీధులన్నిటిలోన ఏ వీధి మేలు
విద్వాంసు లున్నట్టి మా వీధి మేలు.
అరుగు లన్నిటిలోన ఏ అరుగు మేలు
పండితులు కూర్చున్న మా అరుగు మేలు. "

(స్వీయ సేకరణ)

తరతరాలుగా సంక్రమించిన ప్రాపంచిక అనుభవాల్ని పిల్లలకు బోధించి వాళ్ని సన్మార్గంలో నడిపించాలనే కోరిక పెద్దల కుండడం సహజం. తెలుగు జాన

## 3. 5. పిల్లలు పాడుకొనే పాటలు.

పెద్దలు పాడే పాటల్ని లేదా నేర్పేపాటల్ని గురించి ఇంతవరకు పరిశీలించడ మైంది ఇవిగాక పిల్లలే సాధారణంగా తమలోతాము పాడుకొనే పాటలూ ఉన్నాయి ఈరకం పాటల్ని ఆటల సంప్రదాయాల్లోను, వినోద సన్నివేశాల్లోను పిల్లలు పాడి ఆనందిస్తుంటారు ఈపాటలుకూడా చాలావరకు మౌఖికంగా, అను ప్రతంగా సంక్రమిస్తూ వచ్చినవి కొన్ని సన్నివేశాల్లో క్రొత్తగా పాటల్ని కల్పించడం కూడా జరుగుతుంది అలాంటి పాటలు పరివ్యాప్తంగాకుండా ఆయా ప్రాంతాలకు, పరిసరాలకు పరిమితమైఉంటాయి.

పెద్దలుపాడే పాటల్ని విన్న పిల్లలకు ఆపాటల గాన స్వరూపం పట్టు బడుతుంది పాటలోని లయ, తాళం, యతిప్రాసలు, నడక మొదలైన లక్షణాలు తెలియక పోయినా వాటికి అనుకరణరూపమైన పద్ధతిలో క్రొత్తపాటల్ని కల్పించిపాడే శక్తి పిల్లలకు లేకపోలేదు నాలుగైదేండ్లవయసు వచ్చేసరికి పిల్లల్లో కొంత సొంతకల్పన ఆరంభమవుతుంది పెద్దలు పాడేపాటల్నివిని ఉండడంవల్ల ఆపాటల్లోని కొన్ని భాగాల్ని తీసుకొని వాటిలో తమ సొంతకవిత్వాన్ని కొంత కలిపి పాడు కుంటారు. కాని భావసౌష్ఠవాన్ని కుదర్చగల కల్పనాశక్తి, భాషాపాటవం వాళ్ల కుండదు. అందుకే ఆపాటలు చాలావరకు అర్థరహితంగా ఉంటాయి పిల్లల ఆటపాటలన్నీ ఎక్కువగా ఈకోవకు చెందినవి. అందుకే పిల్లలకోసం పెద్దలుపాడే పాటల్ని Nursery Rhymes అని, అర్థప్రాధాన్యం లేకుండా పిల్లలు కల్పించుకొని పాడే పాటల్ని Nonsense Rhymes అని అన్నారు[1] పిల్లలు తమలో తాము పాడుకొనే పాటలకర్తృత్వం సామూహికం. అసలు జానపదగేయాలన్నీ సామూహిక కర్తృకాలే. ఒక గేయం ఒకరిచేత సృష్టించబడినా అది చాలామంది చేతుల్లో మార్పు చేర్పుల్ని సంతరించుకొంటుంది.

పిల్లలు పాడుకొనే పాటల్ని ముఖ్యంగా నాలుగు రకాలుగా విభజించవచ్చు

1. ఆట విడుపుపాటలు
2. పండుగ పాటలు.
3. ఎగతాళి పాటలు
4. పొడుపు కథలు

1. బి. రామరాజు తెలుగు జానపదగేయసాహిత్యం పుట ౬౦౮.

## 3. 5. 1. ఆట విడుపు పాటలు

పిల్లలు ఆడుకొంటూ పాడుకొనే పాటలివి. సాధారణంగా పిల్లలు ఆడుకొనే ప్రతిఆటకు జానపద సాహిత్యంలో ఒక పాటకద్దు. ఆటవిడుపు పాటల్లో ఎక్కువగా అర్థరహితాలైన పాటలే కన్పిస్తాయి. ఆయా ఆటల్లోని హావభావాది చేష్టలకు అనుగుణంగా తాళలయలు ఆపాటల్లో ఇమిడిఉండడం గమనించదగ్గ విషయం. ఈ ఆటలవల్ల చిన్న పిల్లలకు కల్గే శరీర వ్యాయామం, ఉత్సాహం, సంఘీభావం పెద్దలు ఆడే ఆటలవల్ల వాళ్లకు కల్గే వ్యాయామాదుల విషయంలో ఏమాత్రం తీసిపోవు. పిల్లల ఆటవిడుపు పాటలు ముఖ్యంగా మూడురకాలు

1 అబ్బాయిల ఆటవిడుపు పాటలు.
2 అమ్మాయిల ఆటవిడుపు పాటలు.
3 ఉభయుల ఆటవిడుపు పాటలు.

అబ్బాయిల ఆటవిడుపు పాటలు.

చెడుగుడు, గోటీబిళ్ల, గోలీలు, గిరిఆట, బొంగరాలు మొదలైన ఆటలు ప్రత్యేకంగా బాలురాడుకొనేవి. ఈ ఆటలకు సంబంధించిన పాటలు పలుప్రాంతాల్లో పలురకాలుగా ప్రచారంలో ఉన్నాయి

చెడుగుడు :

చెడుగుడు ఆటకె కబడ్డీ, బలిగుడు, బలిచిప్లాం అని పర్యాయ నామాలు. ఈ ఆట ఇద్దరు మొదలు ఎంతమందైనా ఆడవచ్చు. ఆడేవాళ్లు రెండు జట్లుగా విడిపోయి మధ్య ఒక గీతగీసి, ఆగీతకు రెండువైపులా సమాన దూరంలో ఎదురెదురుగా నిలబడతారు. ఆటకోసం చుట్టు కొంతమేరం సరిహద్దు ఏర్పరచుకుంటారు. హద్దుదాటి వెళ్ళినవాళ్లు ఓడినట్లే. మొదట ఒక జట్టులోని ఆటగాడు ఏదైనా పదాలను కూతపెడ్తూ గీతదాటి గుక్క వదలకుండా రెండవ జట్టులోని వాళ్లనెవరినైనా తాకి తన జట్టులోనికి

వచ్చి చేరడానికి ప్రయత్నిస్తాడు ఒకవేళ ఆ ఆటగాడు గుక్క వదలిన సమయంతో ఎవరైనా తాకితె వెలిఅయి తన జట్టుకు కొంచెం దూరంలో కూర్చుంటాడు. లేక ఆట గాణ్ణి రెండవ జట్టువాళ్ళు పట్టుకున్న తర్వాత కూడా గుక్కవదలకుండా వచ్చి మధ్య గీతను కాలితోగాని, చేతితోగాని, తాకితే ఆపట్టుకున్న వాళ్ళందరూ ఓడినట్లు (అవు టయినట్లు) మొదటిజట్టు ఆటగాడు రెండవజట్టులోని వాళ్ళను తాకడానికి వెళ్ళి అవు టయితే రెండవ జట్టులోని ఆటగాడొకడు గుక్కతోవచ్చి మొదటి జట్టులోని వాళ్ళను తాకడానికి ప్రయత్నిస్తాడు ఇతడు ఎంతమందిని అవుటు చేస్తే ఎదుటి జట్టునుండి అవుటయి దూరంగా కూర్చున్న ఆటగాళ్ళు అంతమంది వచ్చి తమ జట్టులో చేరతారు ఏదైనా ఒక జట్టులోని ఆటగాళ్ళందరూ అవుటయ్యేంత వరకు ఆట సాగుతుంది. ఈ ఆటకు సంబంధించిన కూతపెట్టే పాటలెన్నో ఉన్నాయి నేదునూరి గంగాధరంగారి సంకలన గ్రంథంలో ఈ ఆటకు సంబంధించి పన్నెండు పాటలు గ్రంథస్థమైనాయి. [1] వేదుల సత్యనారాయణశర్మ కాళహస్తి వీరభద్రస్వామిగార్ల సంకలనంలో 'చెడుగుడు' ఆటకు సంబంధించి ఈ క్రింది పాట గ్రంథస్థమై ఉంది

" ఆకు - అల్ల - సూది - సుద్ద
ఆకు - పోకు - కర్వే పాకు
డాం - డూం - తుసుక్ దెబ్బ "

(పిల్లల పాటలు)

రాయలసీమలో ఈ ఆటకు సంబంధించి ఎన్నో పాటలు ప్రచారంలో ఉన్నాయి. ఉదాహరణకు కొన్ని :

1. " ఎద్దూ ఏదంబులూ - చొప్పకట్టు దుమ్ములూ
పాటి మీద ఎన్నెలా - పత్తి చేలో పందెము. "

---

ఆటలు - పాటలు (దేశీయ క్రీడలు) ప్రాచీన గ్రంథావళి రాజమండ్రి. 1965. పుట : 106, 107.

2. " గుడ్డెద్దు గంటా - గూనివాడికి చింత
   నా మొగుడు అందగాడు - నాకేమి చింత. "

3. " బలిగుడు బంతికి జగడం
   కాకీ రెక్కా - ఏనుగు దంతం కొలో కొలో. "

(స్వీయ సేకరణ)

ముఖ్యంగా ఈ ఆటకు సంబంధించిన పాటలన్నీ స్వరూపంలో చిన్నవిగా ఉండడం గమనించ దగింది. ఈ పాటల్లో ఉన్న విషయం ఇదే అని ప్రత్యేకంగా నిర్ణయించి చెప్పడానికి వీలుకాదు. జానపదులకు ఏ యే అంశాలతో పరిచయం ఉంటుందో ఆ అంశాలన్నీ ఈ పాటల్లో చోటుచేసుకుంటాయి. పాటల చిత్రీకరణలో ఒక క్రమం లేకపోవడం ఉదాత్తమైన అర్థం స్ఫురించకపోవడం ఈ పాటల సృష్టికి కారకులైన పసి పిల్లల అజ్ఞానాన్ని తలపింప జేస్తాయి. పై పాటల్లో ఎద్దు, ఏడంబులు, చొప్పకట్టు (జొన్నవెన్నులు తీసేసిన తర్వాత మిగిలిన కర్ర) పత్తిచేను, గుడ్డెద్దుగంట మొదలైన వన్నీ వ్యవసాయానికి సంబంధించినవి. 'బలిగుడు బంతికి జగడం' అన్నది ఈ ఆట పోటీలోని తీవ్రత్వాన్ని సూచిస్తుంది. (బంతి = జట్టు, వరుస) కాకిరెక్కకు ఏనుగు దంతానికి ఉన్న సంబంధ మేమిటో తెలియదు. గుక్క తిప్పుకోవడానికి వీలుగా ఉన్న పదాల కూర్పు, ఊపిరి వదలకుండా మరల మరల అదేవాక్యాలను అందుకోవడానికి వీలైన సంక్షిప్త స్వరూపం ఈపాటల్లో గుర్తించదగినన ప్రత్యేకమైన అంశాలు. ఉదాహరణకు మరికొన్ని పాటలు :

1. "చింతాకు - పులగూర - తిందువురారా - బామ్మర్ది"
2. "మాపాక్షి - రోజాపువ్ - టింగ్ టింగ్ - కన్నాది
3. "అంటాకు - ఆరాకు పన్నెండు గెంట్ల - పై రాకు"
4. "పప్పులుసు-పచ్చిపులుసు-కలుపుకు తినరా పుల్లయ్యా"
5. "అద్దంకి - ఆరంకి - పన్నెండు గడపల - పెదకోట"

(స్వీయ సేకరణ)

పూర్వకాలంలో సంఖ్యల సంప్రదాయం విశేషంగా ఉండేది ఒక్కొక్క వారికే గాకుండ, ఒక్కొక్క జాతిలో కూడ ఒక్కొ కాలంలో ఒక్కొక్క సంప్ర దాయం ఉండేదని చెప్పవచ్చు తెలుగు జానపద వాఙ్మయంలో ఒక్కొక్క సంఖ్యకు ఒక్కొక సంప్రదాయం ఏర్పడింది. పై పాటల్లో (3, 5) పన్నెండు సంఖ్య కనిపిస్తుంది. ఈ పన్నెండు సంఖ్యకు జానపద సాహిత్యంలో ఉన్న స్థానం చెప్పుకో దగింది.[1] పోతన కాళింగునికీ,

---

1 1. కాంబోజరాజు కథలో ఆరాజుకు పన్నెండు ఘటల ఏనుగులున్నాయి

2. పల్నాటి వీరచరిత్రకు బాలచంద్రుని తల్లిఅయిన ఐతమ్మకు పన్నెండేళ్ళ పాటు సంతానంలేదు.

3 కుమార రాముని కథలో అరణ్యం పొడవు పన్నెండామడలు పన్నెండేళ్ళపాటు గుర్రానికి పెట్టిన పాలు పన్నెండు శేర్లు. కుమార రాముడు పన్నెండుమంది భటులతో యుద్ధం చేశాడు

4. దేశింగురాజు కథలో దుర్గాధిపతులు పన్నెండేళ్ళనుంచి కిస్తీ కట్టలేదు

5 బాలనాగమ్మ కథలో మూడు పాములకు పన్నెండేసి తలలున్నాయి

6. పల్లితంగాల్ కథలో మూదేవి పన్నెండేళ్ళ పాత మురికి రాగులు ఉప ఎద్దకు, పిల్లలకు వంటచేసి పెడుతుంది

7. బొబ్బిలి కథలో పల్లకీ బోయీలు పన్నెండుమంది ఒక్కొక్క సైనికునికి పన్నెండు ఆయుధాలుంటాయి ఎబాసె లక్ష్మయ్య పన్నెండేళ్ళు యుద్ధం చేసినా బొబ్బిలి కోటను గెలవలేమంటాడు.

8 సన్యాసమ్మ కథలో ఆమె పన్నెండేళ్లపాటు వ్రతం తలపెట్టింది దొర పన్నెండేళ్ళ క్రితం సముద్రంలో పడి చనిపోయిన కొడుకును బ్రతికించమని సన్యాసమ్మను కోరుతాడు, వెంచయ్యకు దొరవారి కొలువులో జీతం పన్నెండు వరహాలు

నూరు తలలున్నట్లు రాశాడు.[1] కాని కాళింగపాటలో పన్నెండు శిరసులున్నట్లు చెప్పబడింది. అప్రయత్నంగానైనా జానపద సాహిత్యంలో భాగమైన పిల్లల పాటల్లో పన్నెండు సంఖ్య చోటు చేసుకోవడం విచిత్రం.

## గోడీబిళ్ళ.

ఈ ఆటకు గోడుబిళ్ల గూటిబిళ్ల, చిత్రబిళ్ల, బిళ్లంగోడు వోటీ బిళ్ల, గోటీ బిళ్ల, జిల్లాం (జెల్లా) గోడి, చిఱ్ఱగోనె, చిల్లాకట్టె మొదలైనవి వివిధ ప్రాంతాలలో పర్యాయ వాచకాలు. ఈ ఆటకు విశాలమైన స్థలం, సుమారు ముప్పాతిక గజం పొడవు కర్ర (కోడి), అరంగుళాల బిళ్ల ఉండాలి. ఆట ఆడేవాళ్లు రెండు జట్లుగా చీలి పోతారు ఒక చోట చిన్న గుంట త్రవ్వి ఒక జట్టువాళ్లు బిళ్లను గూటడానికి, రెండో జట్టువాళ్లు బిళ్లను పట్టుకోవడానికి సిద్ధపడతారు. మొదటి జట్టులో ఒకడు త్రవ్విన గుంటపై బిళ్ళను అడ్డంగా పెట్టి ఎడంచేతి కర్రతో విసరబడేటట్లు కొడతాడు. ఎదటి జట్టువాళ్ళా బిళ్ళను పట్టుకుంటే గూటినవాడు ఓడినట్లే. అలా పట్టుకోని పక్షంలో గూటినవాడు కర్రను గుంటకు అడ్డంగా పెట్టి కాచుకొని ఉంటాడు. ఎదుటి పక్షం వాళ్ళు బిళ్ళను కర్రకు తగిలేటట్లు విసరాలి. అవి కర్రకు తగిలినా గూటినవాడు ఓడినట్లే తగలనప్పుడు కర్రను చేతి పిడికిలిలో పట్టుకోని ఆ పిడికిలిపైనే బిళ్లను పెట్టుకొని ఎగరేసి కర్రతో దూరానికి కొడతాడు. అలా కొట్టినప్పుడు ఎదుటిపక్షం వాళ్ళు పట్టుకున్నా గూటినవాడు ఓడినట్లే. పట్టుకోనప్పుడు ఆ బిళ్ళ పడిన స్థలంలో నిలబడి రెండవ జట్టులోనివాళ్ళలో ఒకరా బిళ్లను గుంట సమీపానికి విసురుతారు ఆ సమయంలో గూటినవాడు గుంట దగ్గర కాచుకొని ఉండి అలా విసరబడిన బిళ్లను గాలిలో తేలి ఉండగానే దూరానికి కొడతాడు. అలా కొట్టలేకపోయినప్పుడు బిళ్ళ గుంటదగ్గర (కర్రపొడవుకంటే దగ్గర) పడితే గూటినవాడు ఓడినట్లే; దూరంగా పడితే బిళ్లకు, గుంటకు మధ్య ఉన్న దూరాన్ని ఆ కర్రతో కొలుస్తాడు కొలిచే

1. "... ... ... బాలుఁడు మత్పదా శతము భగ్నముగా వెసఁద్రొక్కి యాడెడిన్" ఆంధ్ర మహాభాగవతము. దశమస్కంధము. ౩౬౩ వ పద్యము

టప్పుడు కొన్ని పదాలు పలుకుతాడు చివర ఏ పదం మిగిలితేదాని ననుసరించి బిళ్లను కంటిపైనో, కాలిపైనో పెట్టుకొని కొడతారు. ఓ దేంతవరకు ఇలా ఆడగా కర్రతో కొలిచినప్పుడు ఎన్ని పాయింట్లు వస్తే అంత గెలుపుంటుంది

"గోడీబిళ్ళ ! గూటీబిళ్ళ ! కాసుబిళ్ళ ! కంచాబిళ్ళ !
మానుబిళ్ళ ! మక్కేబిళ్ళ ! సానుబిళ్ళ ! చక్కవిబిళ్ళ
... ... ... ..."

(సెలయేరు పుట 6)

" కాలకంటి ! మూలముట్టి ! నాలనర
అంజాకోత ! ఆరంకి ! సరోజ "

(స్వీయసేకరణ)

ఈ రెండు పాటలు పైఆటకు సంబంధించినవే. కర్రతో కొలతవేసేటప్పుడు పాడేపదాలు చాలా ఉన్నాయి.[1] రెండవ పాటలోని 'అంజా' అనే పదం తమిళంలోని అంజి (అంచి అయిందు) నుంచి వచ్చింది. తమిళవ్యవహారంలో అంజి అంటే 'ఐదు' అని అర్థం తమిళ భాషా ప్రభావం ఎక్కువగా ఉన్న ప్రాంతంలో పాడే పాటఇది.

గోలీలాట.

ఎందరైనా ఈఆట ఆడవచ్చు ఒక చిన్నగుంట త్రవ్వి గుంట కేంద్రంగా పదిహేనడుగుల దూరంలో ఒక రేఖనుగీసి ఆటఆడేవాళ్లు ఒకరి తర్వాత ఒకరు ఆరేఖ వెనుక నిలబడి తమ గోలీలను గుంటవైపుకు దొర్లిస్తారు. ఎవరి గోలి గుంటకు

---

1. సత్యనారాయణశర్మ, వేదుల వీరభద్రస్వామి, కాళహస్తి పిల్లలపాటలు. 1953,55. పుట : 38.

2. రామరాజు, బి. తెలంగాణా పల్లెపాటలు 1968 పుట . 22.

దగ్గరగా పడుతుందో వాళ్ళకి ఆటలో మొదటి అవకాశం ఇవ్వబడుతుంది. గుంటలో పడేట్లు గోలీని వెయగల్గినపుడంతా ఒక పాయింటు వచ్చినట్లే. ప్రతి ఆటగాడు తాను ఆడేటప్పుడు గుంట సమీపంలో ఉన్న ఇతరుల గోలీలను తనగోలీతో కొట్టి గుంటనుండి దూరమయ్యేట్లు చేయవచ్చు. ఇతరుల గోలీని కొట్టగల్గిన వానికి మరొక అవకాశం ఇవ్వబడుతుంది. తన గోలీ గుంటలో పడేట్లాడినప్పుడు కూడ మరొక అవకాశం లభిస్తుంది. ఆట ప్రారంభంలోనే గోలీగుంటలో పడేట్లు వేయిగల్గితె అతనికి ఒకేసారి మూడు పాయింట్లు వస్తాయి. అందరి కంటె ముందు పది పాయింట్లు సంపాదించగల్గిన ఆటగాడు గెల్చినట్లు. ఈ గోలీలాటనే మరోవిధంగా కూడా ఆడ్తారు[1] గోలీలాడ్తూ పాడే పాటలు కొన్ని.

1. 'ఒక్కాలాం కొక్కి - రెండాం రొట్టి-మూడుంముద్ద నాలుగునంది
ఐదర బొండాం ఆరక్కధారా - వడిసే బొద్దు ఎడమాకన్ను
తొమ్మా బుడగా తొట్టికి లగ్గం.
సోప్ నకాముకాల్ అదూల్ బెదూల్
పీక్ బనాస్ ఛట్ ఫిట్ కాసుకో ,,

(పిల్లల పాటలు పుట : 37.)

2. " ఒక్కసి కుక్కొ - రెంటవు రోలు
మూనవు ముత్యం - నానకు నావే
అయితం పైతం - ఆరవు జేగ
పట్లో నీరు - ఎనబది రేఖల్
తొమ్మిది మొగ్గ - తొట్టికి లగ్గం. "

(స్వీయ సేకరణ.)

1. చూ. గంగాధరం, నేదునూరి. 'ఆటలు – పాటలు 1965 పుట : 98.

గిరి ఆట.

బాలురు రెండు జట్లుగా విడిపోయి ఆడే ఈఆట ఒక విధంగా చెడుగుడు ఆటలాంటిదే. గుండ్రంగా గిరిగీసి రెండువైపులా ఏభైగజాల స్థలం పెట్టుకుంటారు ఒక జట్టులోని వాళ్లు ఎదుటవాళ్ల మీద కూస్తారు అలాకూస్తూ బద్దెలోపులో గుక్క ఆపుచేస్తే అవుటయినట్లు. గుక్కఆపకుండా బద్దెదాటి వెళితే పట్టుకున్నవాడు అవుటవుతాడు. ఈ ఆటలో కూసేటప్పుడు పాడే పాటలుకొన్ని

1. " తాత ముక్కులో తంగేడు పుల్లా
దసినీ యవ్వ - కుందేలు పిల్లా - పిల్లా - పిల్లా, "
2. " చిప్ప దెచ్చుకో చియ్యాలు బెడతా
నీయబ్బ తినిపోయె-నన్నేమంటకు నన్నే-నన్నే-నన్నే. "

(ఆటలు - పాటలు పుట. 110)

బొంగరాలు.

ఈ ఆటను కూడా ఎంతమందైనా ఉండొచ్చు. అందరూ బొంగరాన్ని తిరిగేట్లువేసి దారంతో తిరుగుతున్న బొంగరాన్ని పైకెగురవేసి పట్టుకుంటారు ఆపట్టుకోవడంలో చివరపడినవాళ్లబొంగరాన్ని ఒకగుండ్రటిగిరిగీసి మధ్యలో పెడ్తారు. మిగిలిన వాళ్ళు తమ బొంగరాన్ని దారంతో చుట్టి ఆ బొంగరానికి తగిలేట్లు వేస్తారు బొంగరానికి గాట్లు పడేట్లు కొడుతూ పాటలు పాడతారు. ఉదాహరణకు :

" చిలుకు ఖిలాట్ ములుకు ములాట్
పావు సేర్ - అర్థ సేర్ - సవ్వాసేర్
గువ్వా దెబ్బా చూచుకో. "

(పిల్లల పాటలు. పుట : 38)

ఈ ఆట ఆడే వాళ్ల మధ్య జరిగే పోటీలోని తీవ్రత పైపాటలోని పదాల విరుపుతో స్ఫురిస్తున్నది. బొంగరంలోని ములికితో ఎదుటి వాళ్ల బొంగరానికి వీలైనన్ని గాట్లు పెట్టడానికి ప్రయత్నిస్తారు.

## 2. అమ్మాయిల ఆట విడుపు పాటలు.

జానపదుల్లో మగపిల్లల ఆటలకంటే ఆడపిల్లలాడుకొనే ఆటలే ఎక్కువగా కన్పిస్తాయి. దానికి కారణం వాళ్లకు పనిపాటలు – చదువు సాములు లేకపోవడం కావచ్చు. అప్పటి కుటుంబాలన్నీ సమిష్టి కుటుంబాలు. ఇంట్లో పెద్దలే పనులు చేసుకొనేవాళ్లు. ఆరోజుల్లో చదువుకొనే అవకాశం కూడా చాలా తక్కువ. ఉన్నా చాలా మంది ఆడపిల్లల్ని బడికి పంపేవాళ్లు కాదు అందువల్ల వాళ్లకు కాలం గడిచేదికాదు. కాలక్షేపం కోసం ఏవో ఆటలు ఆడుకుంటూ గడిపేవాళ్లు అందుకే జానపద సాహిత్యంలో బాలికలు ఆడుకొనే ఆటలూ, ఆ ఆటకు సంబంధించిన పాటలూ ఎక్కువగా కన్పిస్తాయి కుటుంబ జీవితంలోని సమస్త విషయాలూ (జానపదాంశాలు) ఆ ఆట పాటల్లో చోటు చేసుకొని ఉండడం కూడా గమనించవచ్చు. చిక్కు చిక్కుపుల్ల, కోడిగుడ్డు ఆట, అల్లీ బిల్లీ, గచ్చకాయలు, గుడుగుడు గుంచం, చెమ్మచెక్క, ఒప్పులకుప్ప, నాలుగు స్తంభాలాట, తొక్కుడు బిళ్ల, చిప్ప చిప్ప గోళ్ళు, కజ్జ గానుగ, చిట్లపొట్లకాయ, బుడ బుడ సంచి, ఒత్తొత్తి వారొత్తి, దొంతి, కొంగపువ్వు, బొంతలాట, గుడి చుట్టు, దొంగాట, సన్నికల్లు పొత్తరము, అలంకి గుడి, అత్తారింటికి మొదలైన ఆటలెన్నిటినో బాలికలు ఆడుతుంటారు. ఈ ఆటలన్నిటికి పాటలు కూడా తోడై ఉన్నాయి. పాటలతో కూడుకున్న ఈ ఆటలను ప్రత్యేకమైన పేర్లతో గాక పాటలోని మొదటి పదంతోనో, పాదంతోనో పిలవడం గమనించదగ్గ విషయం.

### చిక్కు చిక్కు పుల్ల.

ఈ ఆటనే కుచుకుచుపుల్ల, దూడుంపుల్ల అనే పేర్లతో కూడా పిలుస్తారు. ఇద్దరమ్మాయిలు ఎదురెదురుగా కూర్చొని మధ్యలో మట్టిని కోలగా ప్రోగుచేసి ఒక అంగుళం పొడవుగల పుల్లను మట్టిలో దాచిపెట్టి ఆడే ఆట ఇది మొదటి అమ్మాయి ఎదుటి అమ్మాయికి తెలియకుండా ఆపుల్లను ఇసుకలో దాస్తుంది రెండో అమ్మాయి రెండు చేతుల వేళ్లను కలిపి ఆ పుల్ల ఉన్న చోటును ఊహించి అక్కడ చేతుల్తో మట్టిని కప్పుతుంది. మొదటి అమ్మాయి రెండవ అమ్మాయి చేతుల ప్రక్కనుండి మిగిలిన భాగమంతాతాను పెట్టిన పుల్లను వెదకి తీయాలి. పుల్ల దొరికితె తాను గెలిచినట్లు.

రెండవపుల్ల అమ్మాయి చేతులక్రింద ఉంటే గెలుపు ఆ అమ్మాయికి చెందుతుంది మట్టిలో పుల్లను దాస్తూ పాడే పాటలు కొన్ని :

1. " దూదుంబుల్ల - దుక్కుంబుల్ల
 పాపిడి పుల్ల - పందుంబుల్ల "
 (ఆటలు - పాటలు పుట. 76)

2. "చిక్కు చిక్కుపుల్ల - చిగురాకుపుల్ల
 దోపిడీకి దొంగలొస్తె - దాంకోయా పుల్ల"

3. " గుచ్చు గుచ్చు పుల్ల - గూరేలోపుల్ల
 (కుచ్చు కుచ్చు పుల్ల - కూరాకుపుల్ల)
 దొమ్మరోడొస్తాడు - దాంకోయొపుల్ల"
 (2, 3, స్వీయసేకరణ)

పుల్లను మట్టిలో దాచింతర్వాత ఎదుటి అమ్మాయి నుద్దేశించి పాడేపాట

" దూదూపుల్ల దురాయ్‌పుల్ల
చూడకుండా జాడాతీయ్
ఊదకుండా పుల్లతీయ్ "

(స్వీయ సేకరణ

ఐదేళ్ల వయసు పిల్లలు ఈ ఆటను ఎక్కువగా ఆడతారు దొంగలు రావడం దాచిన సొమ్మును దోచుకు పోవడం సహజం. దొంగలబారినుండి కాపాడటానికి ధనాన్ని దాచిపెట్టినట్లే ఇక్కడ పుల్లను దాచడం జరుగుతుంది ఇది సామాజిక స్థితిని తెలియ జేస్తుంది అదే పోగొటుకున్న సొమ్మును వెదకి పట్టుకున్నట్లే పుల్లను వెదకడం ఉంది మరి దొమ్మరోడు - రావడానికి పుల్లను దాచడానికి మధ్యసంబంధ మెమిటో చెప్పలేము.

కోడిగుడ్డు ఆట :

ఇదికూడా ఐదేండ్లలోపు పిల్లలకు పరిమితమైన ఆట. వర్షంవచ్చి నేలతడిగా ఉన్నప్పుడు ఆడే ఆట ఇది. కొబ్బరి చిప్పలలో బాగా తడిసిన మట్టిని పూర్తిగా నింపి భూమిపై బోర్లించి ఒక చిన్నరాయి తీసుకొని-

"కోడి గొడ్డు రావే - కొక్కెరి గుడ్డు రావే
బాతు గుడ్డు రావే - బంగారు గుడ్డు రావే"
(స్వీయ సేకరణ)

అని పాడుతూ ఆ కొబ్బరిచిప్పపై మెల్లగా కొడతారు. తర్వాత చిప్పను పైకితీస్తే గుండ్రంగా, నున్నగా మట్టి గుడ్డులాగ వస్తుంది పిల్లలు పోటీలు వేసుకొని లెక్క లేనన్ని మట్టి కోడిగుడ్లను తయారు చేసి ఆనందిస్తారు

అల్లీ బిల్లీ :

బాల బాలికలు రెండు చేతులూ బారసాచి కళ్ళు మూసుకుని గానీ, తెరచుకొని గాని గుండ్రంగా గిరగిర తిరుగుతారు అలా వేగంగా తిరిగేటప్పుడు ఒక్కోసారి కళ్లు తిరుగుతాయి. పందెం వేసుకొని ఒకరి నొకరు మించి గిరగిర తిరగాలన్న ఉత్సాహంతో ఈ ఆట ఆడ్తారు. తిరుగుతూ-

"వానాలప్ప వానాలప్ప - వానొస్తుందో వరదొస్తుందో
చాకలోళ్ళ పిల్లకీ వస్తుందో - వానా వానా వరదప్పా"

అని వానవస్తుంటే "వానమ్మను గోతిలో పెట్టి ఎండమ్మా నువు రావె" అనీ ఎండ కాస్తుంటే "ఎండమ్మను గోతిలోపెట్టి వానమ్మా నువురావె" అనీ ఎండకాస్తూ వాన కూడా వస్తుంటే-

" ఎండా వానా - కుక్కల నక్కల పెళ్లి
అల్లి బిల్లి దండ - అరకాసు దండ
జంగం వారి తోటలో - జాజిపూల దండ "

(ఆటలు-పాటలు పుట : 11)

అని పాడుకుంటూ తిరుగుతారు. ముఖ్యంగా సన్నటి వర్షపు తుంపర్లు రాలుతున్న సమయంలో పిల్లలు ఒకచోట చేరి ఉత్సాహంతో కేరింతలు కొడుతూ గిరగిర తిరుగుతారు ఆ సమయంలో వాళ్ళు పాడే పాటలు కొన్ని .

1. " అల్లీ బిల్లీ పెద్దమ్మా - అల్లుడొచ్చా లెయ్యమ్మా
సిరిచాప వెయ్యమ్మా - సిరి గంధం పుయ్యమ్మా
ఆకూ వక్కా ఇయ్యమ్మా - అల్లుడి ముచ్చట తీర్చమ్మా. "

2. " బావి నీళ్లకూ నేబోతే
బంగరు మెట్లకు సింగారం. "

3. " వానా వచ్చే వంకలు దోలే - గువ్వా వచ్చే గుడ్డూ పెట్టే
తాతా వచ్చే తొంగి చూచే - అవ్వా వచ్చే అందుకొనిపోయె
అమ్మకిస్తే - అట్టూచేస్తే - నాన్నా వచ్చే గుటుక్కుమింగె.

(1, 2, 3 స్వీయ సేకరణ)

గచ్చకాయలాట

ఆడ పిల్లలు సమయం సందర్భం చూడకుండా ఎక్కువ ఉత్సాహంతో ఆడుకొనే ఆట ఇది. ఐదు నుండి పదేళ్ళ మధ్య వయసులోని పిల్లలు ఈ ఆట ఆడటానికి ఆసక్తి చూపుతారు. అచ్చన గండ్లు, అచ్చనగాళ్ళు, అచ్చన గాయలు అని రకరకాల పేర్లతో పిలిచినట్లే ఆడే విధానంలో కూడా చాలా రకాలున్నాయి. ఐదు కాయలతో, ఏడు కాయలతో ఆడే ఆటలే గాకుండా నూటికి మించిన కాయలతో కూడా ఆడడం ఉంది అలా ఎక్కువ కాయలతో ఆడే ఆటను 'ఉప్పాట' అనీ 'కుప్పలాట'

అనీ పేర్లు. నాలుగు గచ్చకాయలు ఒక కుప్ప లేక ఉద్ద. గచ్చకాయలకు బదులు అదే మోస్తరుగా ఉన్న రాళ్ళను సేకరించి వాటితో ఈ ఆట ఆడుకోవడం ఉంది. గచ్చకాయ లాటకు సంబంధించి ప్రతి ప్రాంతంలోను రకరకాల పాటలు ప్రచారంలో ఉన్నాయి. కాయని పైకి ఎగురవేసి క్రిందఉన్న కాయను / కాయలను తీసికొని వెంటనే పైకి ఎగురవేసిన కాయను పట్టుకోవడం జరుగుతుంది. కాయను పైకి ఎగుర వేసిపట్టుకొన్నప్పుడల్లా ఒక్కొక్క చరణం పాడ్తరు. లెక్కపెట్టి ఆడే గచ్చకాయిల్లాగే ఆ పాటలు కూడా అంకెలతో కూడి ఉండడం విశేషం. ఉదాహరణకు :

" ఒక్కటి ఓ చెలియా - రెండూ రోకళ్ళు
మూడూ ముచ్చిలుకా - నాలుగు నందన్నా
అయిదుం బేడల్లు - ఆరుం జవ్వాజి
ఏడూ రొలుమంద - ఎనిమిది మనమంద
తొమ్మిది తోకుచ్చు - పది పటనేడు.

(బాలభాష పుట : 47)

అంకెలతో కూడిన ఈ పాటకు పాఠాంతరాలెన్నో ఉన్నాయి[1] కేవలం వినోదాన్నే గాక పిల్లలకు సులభ పద్ధతిలో అంకెలు నేర్పడానికి కూడా ఈ పాటలు ఉపయోగ పడ్తాయనడంలో సందేహంలేదు. వాటిలో అంకెలులేని పాటలుకూడా కొన్నిఉన్నాయి. గచ్చకాయలాటకు సంబంధించి ఎక్కువ ప్రచారంలో ఉన్న అలాంటి పాట ఒకటి.

" కొండ మీద వెండిగిన్నె - కొక్కిరాయి కాలువిరిగె
దానికేమి మందు?

---

1. గంగాధరం, నేదునూరి. సెలయేరు. 1955. పుట : 8.
ఎల్లోరా, జానపద గేయాలు. 1959 పుట : 77
వెంకట సుబ్బయ్య, గొత్తిపాటి. నవ్వులు - పువ్వులు. 1942.
సత్యనారాయణ శర్మ, వెదుల, వీరభద్రస్వామి, కాళహస్తి. పిల్లల పాటలు 1953, 1955. పుట . 40.

వేపాకు చేదు - వెల్లుల్లి గడ్డ
నూనెలో మడ్డి-నూటొక్క- సారి
పూయవోయ్ నూరి - పూట కొక్క- తూరి. ”

(నవ్వులు పువ్వులు)

ఈ పాటను ఆయుర్వేద సంబంధమైన ఆటపాటగా సురవరం ప్రతాపరెడ్డి గారు పేర్కొన్నారు. రామరాజుగారు కూడా అదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు [1] ఎముకలు విరిగినపుడు చేయవలసిన చికిత్స ఈ పాటలో సూచించబడింది.

గుడు గుడు గుంచం

ఈ ఆట ఇద్దరి నుండి ఐదారుగురు కలసి ఆడ్తారు. బాలికలందరూ ఒక చోటచేరి రెండు చేతులూ పిడికిళ్ళు పట్టి అందరూ ఒక పిడికిలి పైన మరొక పిడికిలి వచ్చేట్లు వరుసగా పెడ్తారు. ఆటపెద్ద పైనున్న పిడికిలిలోనికి తన చూపుడు వేలు నుంచి ఆడిస్తూ -

“ గుడు గుడు గుంచం - గుండారాగం
పాముల పట్నాన - పడగా రాగం
అప్పడాల గుర్రం - ఆడుకోబోతే
పేపే గుర్రం - పెండ్లికి పోతే
నడ్డి గుర్రం - నారి కొ స్తే
నీ గుర్రం - నీళ్లకు పోతే
నా గుర్రం - పాలకు పోతే
క త్తేయనా - బద్దేయనా
వేణ్ణీళ్లా - చన్నీళ్లా ”

(నవ్వులు - పువ్వులు)

---

[1] తెలంగాణా పల్లెపాటలు 1968 పుట. 23.

అని పాటరూపంలో పై పిడికిలి అమ్మాయిని అడుగుతుంది. ఆ అమ్మాయి కత్తెయ్య మంటే కత్తితో కొట్టినట్లు, బద్దెయ్య మంటే బద్దెతో కొట్టినట్లు కొట్టి వేణ్ణీళ్లంటే గట్టిగా, చన్నీళ్లంటే మెల్లగా ఆ పిడికిలిమీద గిచ్చుతుంది. తర్వాత ఆ బాలిక ఆ పిడికిలిని వెనుకవైపు దాచుకుంటుంది. ఆటపెద్ద అందర్నీ అలాగే ప్రశ్నిస్తుంది. బాలిక లందరూ చేతులు వెనుక దాచుకున్న తర్వాత ఆటపెద్దకు, మిగిలిన వాళ్లకు మధ్య సంభాషణ ఇలాజరుగుతుంది.

"మీ చేతులేమైపోయాయి ? - పిల్లెత్తుకు పోయింది
పిల్లి నెక్కడిదాకా తరిమారు ? - గోల్కొండ దాకా
గోల్కొండ ఏమిచ్చింది ? - గుడ్డి గువ్వనిచ్చింది
... ... ... ... ... ...
పాలేమి చేశారు ? - పరమాన్నం చేశాము
పరమాన్నం కాస్త పెడతారా ? - ఆఁ పెడతాము"

(ఆటలు పాటలు పుట 58)

అంటూ వాళ్లలో ఒకఅమ్మాయి పరమాన్నం తేవడానికి వెళ్లినట్లు వెళ్లి తిరిగి వచ్చి పరమాన్నం లేదంటూ అభినయంతో క్రిందిపాట పాడుతుంది.

పాశం పాశం వండిన పాశం - పెద్దింట్లో పెడితే పెద్దన్న తినేశాడు
చిన్నింట్లో పెడితే చిన్నన్న తినేశాడు - నట్టింట్లో పెడితే
నాన్న తినేశాడు
పెట్టెకింద పెడ్తే - పందికొక్కు తినేసింది
పీటకింద పెడ్తే - పిల్లొచ్చి తినేసింది
గూట్లో పెడితే - గద్దెత్తుకు పోయింది"

(స్వీయ సేకరణ)

చివర ఆటపెద్ద అందరికీ చక్కిలిగింతలు పెడ్తుంది. పిల్లలు ఏమైనా కావాలని ఏడ్చినపుడు, పెద్దలు అది వారి కివ్వకుండా దాచాలనుకున్నప్పుడు 'కాకెత్తుకు

పోయిందని' పిల్లెత్తుకు పోయిందని చేతులు వెనుకపెట్టి ఆవస్తువును వాళ్ల కళ్లముందు నుంచి తొలగించడం పరిపాటి అలాంటి సన్నివేశానికి అనుకరణ ప్రాయమైన అభినయం పైపాటలో ఉంది. 'గుడు గుడు గుంచం' పాటకు కూడా పాఠాంతరాలున్నాయి. [1]

## చెమ్మ చెక్క.

ఆడపిల్లల ఆటల్లో ఎక్కువ ప్రసిద్ధిని పొందిన ఆట చెమ్మచెక్క. ఈ ఆటకు సంబంధించిన పాటలకు కూడా ప్రచారం ఎక్కువ. ఈ ఆట – పాట రాని తెలుగు పిల్లలు లేరంటే అతిశయోక్తిగాదు ఇద్దరమ్మాయిలు ఎదురెదురుగా నిలబడి పరస్పరం చేతులు తట్టూ వెంటనే చేతులు ప్రక్కకు తీసుకొని చప్పట్లు కొడుతూ అలా చప్పట్లు కొట్టినప్పుడు వెనక్కి గెంతుతూ ఒకరికొకరు చేతులు కలిపి తట్టేటప్పుడు ముందుకు దూకుతూ లయాత్మకంగా పాడుతూ ఆడే ఆట ఇది. ఆపాట ఒకటి.

" చెమ్మ చెక్క చారడేసి మొగ్గ – అట్లు పొయ్యంగ ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గులెయ్యంగ – రత్నాల చెమ్మచెక్క
రంగులెయ్యంగ
పగడాల చెమ్మ చెక్క పందిరెయ్యంగ – పందిట్లో మా బావ పెళ్లి
చెయ్యంగ.

(పాతపాటలు పుట : 11)

ఈ పాటకు :–

" సుబ్బారాయుడి పెండ్లి – చూచి వద్దాంరండి
మనవారింట్లో పెండ్లి – మళ్లీ వద్దాం రండి. "

(స్వీయ సేకరణ)

---

1. కామేశ్వరరావు. చేకుమళ్ళ. సాంప్రదాయక విజ్ఞానం (పాత పాటలు) 1941 పుట : 10. 'పల్లెపాటలు' శీర్షిక ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక.

" బండి అమ్మా బండి - పదహారు కుచ్చుల బండి
సూర్యదేవుడి పెళ్లి - చూచి వద్దాం రండి
ఆకు పోకలు తెండి - అడిగి వద్దాం రండి. "

(గృహలక్ష్మి, అక్టోబరు 1936)

మొదటైన చరణాలను కూడా కలిపి పాడుకోవడం ఉంది. వెంకట పార్వతీశ కవుల 'బాల గీతావళి' లో ఈ పాట మరో విధంగా ఉంది. చెమ్మచెక్క పాటలో మాచ కమ్మలకు సంతానం లేనివాళ్లకు మందు చెప్పబడింది[1]

ఒ ప్పు ల కు ప్ప :

ఐదారేండ్లు నిండిన బాలికలు ఆడే ఆట ఇది. ఇద్దరు బాలికలు ఎదురెదురుగా నిలబడి పరస్పరం కుడిచేతిని కుడిచేతితో ఎడమ చేతిని ఎడమ చేతితో పట్టుకొని ఇద్దరూ పాదాలొకచోట చేర్చి వెనుకకు వంగి గిరగిర తిరుగుతారు. ఇలా తిరగడాన్నే 'బిత్తి' తిరగడం అంటారు 'చాదుచుక్క' అనేది కూడా ఈ ఆటకు మరొకపేరు. ఈ ఆటకు సంబంధించిన పాటలివి.

1. " ఒప్పుల కుప్పా - ఒయ్యారి భామా
మినపా పప్పూ - మెంతీ పిండీ
తాటి బెల్లం - తవ్వెడు నెయ్యీ
గుప్పెడు తింటే - కులుకు లాడే
నడుమూ గట్టి - నా మాట బట్టీ. "

2. " ఒప్పుల కుప్ప - ఒయ్యారి భామ
సన్నా బియ్యం - చాయ పప్పూ
(మినపాపప్పూ - మెరికా బియ్యం)

1. రామరాజు బి. తెలంగాణా పల్లె పాటలు. 1968. పుట : 27.

పాలూ నెయ్యీ - పాశం వొండూ
నీ మొగుడు దింటే - ఆనంద మంటే. "
(తెలంగాణా పల్లెపాటలు పుట : 24)

పై పాటల్లో మొదటి పాటలో స్త్రీలకు రెండవ పాటలో పురుషులకు ఉపయుక్తా లైన చిట్కాలు చెప్పబడినట్లు తెలుస్తున్నది [1]
ఈ పాటకు కూడా కొన్ని పాఠాంతరాలు గ్రంథస్థమైనాయి.[2] ఈ ఆటకు సంబంధించి లెక్కలేనన్ని పాటలు ప్రచారంలో ఉన్నాయి.

"తురకోళ్ళ దొడ్లో - త్రుల్లి పువ్వు
మా దొడ్లో - మల్లి పువ్వు"
"కొబ్బరి కుడకలు బెల్లపచ్చులు"
(ఆటలు - పాటలు పుట . 6)

వీటిలో చాలా పాటలు సంక్షిప్తంగా ఉన్నాయి ఒక పాదంలోని ఒక భాగాన్ని ఒకరు పాడితే మిగిలిన భాగాన్ని మరొకరు అందుకుంటారు

1. చాదు చుక్క - సవారి బండి
2. దీగిట్లా ముక్కు పుల్ల - అందియ్యో పిన్నమ్మా
3. ఉట్టిమీద ఊరగాయ - అందుకోవె పిల్లా
4. ఒంటిచెయ్యి బిర్రు - ఒడ్డాణ్ణం బిర్రు
5. సున్నపు కుండలో చుక్కల రవిక - నీ మొగుడు తెచ్చింది మొగ్గల రవిక.

1. రామరాజు బి తెలంగాణా పల్లె పాటలు. 1968. పుట : 24.
2. ప్రభాకర శాస్త్రి, పెటూరి బాలభాష సత్యనారాయణశర్మ, వేదుల. వీర భద్రస్వామి, కాళహస్తి. పిల్లల పాటలు. 1953, 1955.

6. పొంతలో నీళ్లు - పోసుకోర మొగుడ
7. నా పెండ్లి పీట నాకు తే - నా అత్త సవరం నాకు తే
(తే = ఇవ్వు)
8 రోట్లో రూపాయ్ - నీ మొగుడు సిపాయ్
(స్వీయసేకరణ)

మొదలైనవన్నీ 'ఒత్తి' తిరిగేటప్పుడు పాడేవే. మంచి శరీరవ్యాయామం కల్గించే ఈ ఆటను ఒక్కోసారి నలుగురు కలిసి ఆడడం ఉంది.

నాలుగు స్తంభాలాట.

ఐదుమంది కలసి ఆడే ఆట ఇది. నాలుగు స్తంభాలను ఏర్పరచుకొనో, స్తంభాలు లేనప్పుడు భూమిపై నాలుగు గదుల్లాగా గీసుకొనో ఈ ఆట ఆడ్తారు. అందరు కలిసి ఉండగా ఆటపెద్ద ' స్తంభాల నెవరు ముట్టుకుంటారో! ' అని కేక వెస్తుంది ఆకేక విన్న వెంటనే అమ్మాయిలు పరుగు పరుగున వెళ్లి ' ఇది నాది - ఇదినాది' అంటూ స్తంభాల్ని పట్టుకుంటారు. బాలికల కన్న స్తంభాల సంఖ్య ఒకటి తక్కువ కావడం వల్ల ఒకమ్మాయి మిగిలి పోతుంది ఆ అమ్మాయికి ' గొల్లభామ ' అనిపేరు. ' చల్లో యమ్మ చల్ల ' అంటూ చల్ల అమ్ముతున్నట్లు 'గొల్లభామ ఒక్కో స్తంభం దగ్గరకు వెళ్తుంటుంది గొల్లభామ స్తంభాలకు దూరంగా వెళ్లినప్పుడంతా ఒకరి కొకరు స్తంభాలు మారుతుంటారు అలా మారుతున్న సమయంలో గొల్లభామ కాచి ఉండి ఖాళీ అయిన స్తంభాన్ని ఆక్రమించు కుంటుంది. ఖాళీ స్తంభాన్ని పట్టుకోవ డానికి వస్తున్న అమ్మాయి స్తంభం పొరక్క ఆగిపోతుంది. అప్పుడా అమ్మాయి ' గొల్లభామ ' అవుతుంది. ఈ ఆటలో స్తంభాలు మారుతున్నప్పుడు పాటలు పాడ్తారు. ఉదాహరణకు :

"నాలుగు స్తంభాలాట - నడిమికి తొడిమికి
తానక తప్పక - తనపేరేమంటే

ఉట్టిమీద బెల్లం - పొట్టి కాకరకాయ
బావా! బావా. - బరుకూ బరుకూ!
తన్నులు తింటే - తల కొకటి (తలకట్టు)"

(బాలభాష. పుట : 64.)

తొక్కుడు బిళ్ళ.

ఈ ఆటను సాధారణంగా ఏడెనిమిదేండ్లు నిండిన పిల్లలు ఆడ్తారు. ఇద్దరు కలసిఆడే ఆటఇది. నేలమీద రెండువరుసల్లో ఎనిమిది (4 + 4) పెద్దగళ్ళు గీచుకొని ఆగళ్ల చివరి రేఖమీద నిలబడి ఒకమ్మాయి కళ్ళు మూసుకొని తొక్కుడు బిళ్ల (పెంకుడు బిళ్ల) ను మొదట అనుకున్న గదిలో పడేట్లు వేస్తుంది అనుకున్న గదిలోగాక వేరే గదిలో పడినా రేఖమీద పడినా ఇంకో బాలికకు ఆడేఅవకాశం వస్తుంది. అనుకున్న గదిలో బిళ్ల పడినపుడు ఆ అమ్మాయి ఒంటికాలితో ఒక్కొ-గదిని దాటుతూ ఆబిళ్లను ఒక్కొ-గది నుండి గీతదాటేట్లు కాలితో జరుపుతుంది. రెండోకాలు నేలమీద మోపినా ఓడినట్లే. తర్వాత ఆ బిళ్లను కాలివ్రేళ్లమీద ఉంచుకొని బిళ్ల క్రిందపడకుండా అన్ని గదులూ దాటుతుంది కాలివ్రేళ్లమీద కాకుండా చేతిని పూర్తిగా చాచి బిళ్లను అరచేతిలోగాని, పిడికిలి మీదగాని, తలపైనగాని ఉంచుకొని గదులు దాటవచ్చు బిళ్ల క్రిందపడితే ఓడినట్లే. అలా గదులన్నీ దాటితే ఆటలో పండినట్లు పండిన తర్వాత బిళ్లను తలమీద పెట్టుకొని ఒక్కొ-గదికి ఒక్కొ-అంగచొప్పున వేసుకుంటూ ఊతగా పాట పాడ్తుంది

"చెన్న పట్నం చెరుకుముక్క - నీకోముక్క నాకో ముక్క
భీముడు పట్నం బిందెల జోడు - నీకోబిందె నాకో బిందె
కాశీపట్నం కాసుల పేరు - నీకోపేరు నాకోపేరు"

(బాలభాష.)

చిప్ప చిప్ప గోళ్ళు.

ఇద్దరమ్మాయిలు ఎదురెదురుగా నిలబడి ఒకరి చేతులు పోర్లగా ఇంకొకరి చేతులు తిరగగావేసి లంకెలాగ తగిలించుకొని తలమీదుగా చేతులెత్తుకొని కుడి ఎడమలకు గిరగిరా తిరుగుతారు ఈ ఆటకు ఓటమి గెలుపులులేవు. కాని ఒక జతతో ఇంకొక జత 'ఎవరు ఎక్కువసేపు తిరుగుతారో?' అని పందెం వేసు కుంటారు. అలా తిరుగుతూ పాడేపాటలు.

"చిప్ప చిప్ప గోళ్ళు । సింగరాయడి గోళ్ళు
మా బావి నీళ్ళు । మండావ రాళ్ళు
మా మామ కాళ్ళు । మంచవు కోళ్ళు.
(సెలయేరు. పుట : 8)

"చింత పూలు చింతపూవు రాలంగ - చిల్లక్క బొట్లా పెట్టంగ
దండుబోయి దండుబోయి నామరిది - దంపలు దెచ్చే రెవ లెవరు
పసుల పోలిగాని తమ్ముడూ - అట్లయితే యిట్లా రమ్మాను
ఆకుల తోటకు పొమ్మాను - అరకట్లాకులు తెమ్మాను
చెర్లో పల్లెకు పొమ్మాను - చేరెడొక్కలు తెమ్మాను
దగ్గు దగ్గు పెండ్లికొడకా దుగ్గా నిస్తావా ?
పయనమయే పాపిరెడ్డి వదుచునిస్తావా ? "
(భారతి. 1931. సంపుటి: 8. సంచిక: 6.)

ఈ పాటల్లో మామగారు, పెళ్లికొడుకు హాస్యానికి పాత్రులవడం కన్పిస్తుంది

కఱ్ఱ గానుగ.

ఒక పొడవైన కర్రను ఒకచోట మొదలు నేలపై ఉంచి ఆ మొదలు పైన ఒక అమ్మాయి పాదాలు నిల్పి పడిపోకుండ కర్రను పట్టుకొనికూర్చుంటుంది. తక్కిన

వాళ్లా కర్ర కొనను పైకెత్తి పట్టుకొని చుట్టూ త్రిప్పుతుంటారు. అంటే కూర్చున్న బాలిక గానుగయితే, త్రిప్పేవాళ్లు ఎద్దులన్నమాట. కర్రకు బదులు ఆకులు తీసివేసిన కొబ్బరి మట్టను వాడ్తారు. కొబ్బరి మట్ట మొదలు పాదాలు పెట్టి కూర్చోవడానికి వీలుగా వెడల్పుగా ఉంటుంది ఆట ఆడుతూ పాడే పాట —

> " ఆకాశమంతా అల్లుకురాగా
> అడ్డెడు బియ్యం ఆడుచు రాగా
> కడివెడు నీళ్ళు కారుకు రాగా
> చాటెడు చెక్కలు చెక్కుకు రాగా
> అందులో ఒకరాజు పాడుతూనే ఉన్నాడు"

(సవ్వాలు - పువ్వాలు)

ఈ పాటే పొడుపు కథగా ప్రచారంలో ఉంది 'గానుగ' దీనికి జవాబు.

చిట్ల పొట్ల కాయ.

ఒకమ్మాయిని ఒక మూల కూర్చుండ బెట్తారు మిగిలిన అమ్మాయిల్లో ఎవరో ఒకరు ఆ అమ్మాయికి తెలియకుండా కళ్లు మూస్తారు. అప్పుడా అమ్మాయి -

> "చిట్ల పొట్ల కాయ - సీమ నెల్లి కాయ
> గోడ పుచ్చ కాయ - గొబ్బి నెల్లి కాయ
> అత్తకు పెడితే అల్లం - అల్లుడు తింటే బెల్లం
> కొత్తకుండల్లోని కోడిపిల్లారా! - పాల పిడతల్లోని పాపల్లారా!
> అమ్మ అమ్మ నీ బిడ్డ పేరేమంటే
> నీళ్ళల్లో నిమ్మ పండు - పాలల్లో పనస పండు
> నేతిలో నేరేడు పండు"

(స్వీయ సేకరణ)

అని పాడ్తూ కళ్ళు మూసిన అమ్మాయి పేరు చెప్తుంది ఆ పేరుగల అమ్మాయే అయితే ఆ అమ్మాయి కళ్లు మూస్తారు పేరు చెప్పలేకపోతె మరలా ఆ అమ్మాయికే కళ్ళు మూస్తారు.

బుడ బుడ సంచీ – ముక్కుడు గిల్లీలు.

చిత్తూరు ప్రాంతంలో ఈ ఆటను ' మెల్లా వందు గిల్లిపో ' అని అంటారు. మెల్లా వందు (మెల్లగ వచ్చి) తమిళ పదం ఈ ఆటకు ఆట పెద్దలిద్దరు ఏ వయసు బాలికలైనా, ఎంత మందైనా ఈ ఆట ఆడవచ్చు. ఆటపెద్దలిద్దరూ అమ్మాయి లందర్నీ ఉద్దీలు వేయించి చెరిసగం పంచుకుంటారు ఒక్కో ఆటకు ఆటపెద్దలు పువ్వులో, పండ్లో, నగలో, నాణాలో తమకిష్టమైన వాటిని ఎన్నుకుంటారు. అందే ఒక ఆటపెద్ద పువ్వులను ఎన్నుకుంటె తన జట్టులోని వాళ్లందర్ని దూరంగా తీసికెళ్లి ఒక్కొక్కరికి ఒక్కొక్క పువ్వుపేరు పెడ్తుంది. అట్లే పండ్లయితే పండ్లలోని రక రకాల పేర్లు తన వాళ్లకు పెడ్తుంది. ఇలా రెండు పార్టీల వాళ్లు పేర్లు పెట్టుకొని వచ్చి ఎదురెదురుగా బంతులు దీరి కూర్చుంటారు అప్పుడు ఒక జట్టులోని ఆటపెద్ద రెండవ జట్టులోని వాళ్లలో ఒకరికి కళ్లు మూస్తూ తన జట్టులోని ఒకరిపేరు (పెట్టిన పేరు) పెట్టి పాట రూపంలో పిలుస్తుంది. ఉదాహరణకు: 'మల్లెపువ్వు పేరు పెట్టుకున్న అమ్మాయిని పిలవడానికి –

"మల్లీ పూవు మల్లీపూవు
మెల్లావందు గిల్లీపో
కాయూటూని కలుక్కుని పో..."

(స్వీయ సేకరణ)

అని పాడుతుంది ఆ పేరు పెట్టుకున్న అమ్మాయి వచ్చి కళ్లుమూసి ఉంచిన అమ్మాయి ముక్కుగిల్లి యధాస్థానంలో కూర్చుంటుంది కళ్లు మూసిన ఆటపెద్ద తన చేతులు తీసిన వెంటనె మొదటి బంతిలోని వారంతా చప్పట్లు కొడ్తూ క్రింది పాట పాడ్తారు

"బుడ బుడ సంచి - బుడాయి సంచి
సంచిలోఉన్న - చిట్టెలుక పేరు
చెప్పక పోతే - చేరిపో మాలో"

(స్వీయ సేకరణ)

ఆ అమ్మాయి కళ్ళు నులుముకొని అందర్నీ తేరి పారజూచి అనుమానమున్న అమ్మాయిని మాపెడుతుంది. గిచ్చిన అమ్మాయినే చూపెడితే ఆ అమ్మాయి వచ్చి రెండవ జట్టులో చేరిపోతుంది కాకపోతె ఈఅమ్మాయి వారిలో కలిసిపోతుంది తర్వాత రెండవ జట్టులోని ఆటపెద్ద మొదటి బంతిలో ఒకరికి కళ్లుమూస్తుంది. ఈ విధంగా ఒకమారు వీళ్ళు, మరోమారు వాళ్ళు ఎదుటి జట్లలోని వాళ్లకి కళ్ళు మూసి గిచ్చిన వాళ్ల పేర్లు చెప్పేస్తారు ఎవరిజట్టులోని వాళ్ల క్రమంగా తగ్గిపోతారో వాళ్ళు ఓడినట్లు.

ఒత్తొత్తి - వారొత్తి.

ఈ ఆటకు కూడా ఆటపెద్దలిద్దరు మిగిలిన అమ్మాయి లెంతమందైనా ఉండవచ్చు. అమ్మాయిలందరూ చుట్టూ గుండ్రంగా కూర్చొని అందరి పాదాలు మధ్య ఒకచోట కలిపెట్టి కాళ్ళుచాచుకొని చేతులు వెనుక పెట్టుకుంటారు. ఆట పెద్దలలో ఒకమ్మాయి అందరి పాదాలు కలిపినచోట నిలబడుతుంది. ఆ అమ్మాయికి ఆటలో తాడిచెట్టనిపేరు రెండో అమ్మాయి ప్రత్తో గుడ్డముక్కో తీసుకొని చేతిలో కన్పించకుండా పెట్టుకొని వంగి అమ్మాయిల చుట్టూ తిరుగుతూ అందరి చేతుల్లో వత్తి పెడుతున్నట్లు నటిస్తూ చివరికి ఎవరికీ తెలియకుండా ఒకమ్మాయి చేతిలో పెడ్తుంది అలా ఒత్తిపెడ్తూ పాడేపాట ఇది

"ఒత్తొత్తి వారొత్తి - చూసినోళ్ళ కళ్ళల్లో సూరొత్తి
పత్తొత్తి పాలొత్తి - పరుల కళ్ళల్లో నీరొత్తి"

(స్వీయ సేకరణ.)

ఇలా పాడుతూ రెండు మూడు చుట్లు తిరిగి చివర ఒకమ్మాయి వీపుపైన 'బల భద్రకోట్' అని కొడుతుంది. ఈ బలభద్రకోట్ అంటే అర్థమేమిటో చెప్పలేము. బహుశా ఒత్తి ఉన్న అమ్మాయిని కన్పించకుండా జాగ్రత్తగాదాచమని హెచ్చరించడం కావచ్చు. అప్పుడు అమ్మాయిలందరూ పిడికిళ్ళు మూసుకొని చేతులు రెండూ ముందర కాళ్ళపైన చాచి పెట్టుకుంటారు మధ్య నిలబడిన అమ్మాయి ఒత్తి ఎవరిచేతిలో ఉందో చెప్పాలి. ఆ చెప్పబడిన అమ్మాయి చేతిలో ఒత్తి ఉంటే గెలుపు నిలబడిన అమ్మాయిదే. మధ్య నిలబడిన అమ్మాయి ఒత్తి ఎవరి చేతిలో ఉందో చెప్పడానికి ముందు అందరికాళ్ళు పట్టిచూస్తుంది ఎవరి కాళ్ళు వేడిగా ఉన్నాయో ఆ అమ్మాయి చేతిలో ఒత్తి ఉంటుందని నమ్మకం. ఈ నమ్మకం వెనుక కొంత నిజం కూడా లేకపోలేదు ఒత్తి తన చేతిలో ఉందని ఆ అమ్మాయి ఎక్కడ కనిపెట్టేస్తుందో అనే ఆత్రుత ఒత్తి ఉన్న అమ్మాయికి ఉంటుంది. ఆ టెన్షన్‌లో శరీరం వెడెక్కవచ్చు. ముఖకవళికలను బట్టి కూడా ఒత్తి ఎవరి చేతిలో ఉందో చెప్పవచ్చు. అందుకే ముఖంలోని భావాలను వ్యక్తం చేయకుండా తెలివితో కొంత మంది జాగ్రత్త పడతారు.

## దొంతి.

నాలుగేళ్లనుండి పదిహేనేండ్ల వయసు వరకున్న అమ్మాయిలు చాలామంది ఉమ్మడిగా ఆడే ఆట ఇది. పొడవుగా ఉన్న అమ్మాయి వెనుక ఎత్తు ననుసరించి ఒక్కొక్కరే గొలుసులాగ నిలబడి చిట్ట చివర పొట్టి అమ్మాయిని నిలబెడతారు. దొంతిపైనున్న పాలకుండను పిల్లి పడద్రోసి పారిపోయిందన్న కోపంతో ఆ పిల్లిని వెతుక్కుంటూ వస్తుందొక అమ్మాయి. ఆ అమ్మాయిని ' గొల్ల భామ ' అంటారు. ' మా పిల్లని చూశారా? మా పిల్లని చూశారా? ' అంటూ ఒక్కొక్కరినే ప్రశ్నిస్తుంది అందరూ చూడలేదనే జవాబిస్తారు గొల్లభామ పిల్లని వెతుక్కుంటూ మరో దిక్కుకు వెళ్లబోతున్న సమయంలో చివర ఉన్న అమ్మాయి ' మ్యావ్ ' అని పిల్లి అరుపు అరుస్తుంది పిల్లిని వెదుక్కుంటూ వెళ్తున్న గొల్లభామ వెనక్కి వస్తుంది. అప్పుడు క్రింది పాట పాడుతూ ఆట ఆడ్తారు.

| గొల్లభామ | | బాలికలు |
|---|---|---|
| అదిగదిగో మా పిల్లి | — | లేదు లేదు |
| దొంతులు పగిలా | — | వెంకులాయా |
| పావ్వాకు మట్ట | — | తిరగేసి కొట్టు |
| దుడ్డుకర్ర దీసికొని | — | దూరి దూరి కొట్టు |
| అదిగదిగో మా పిల్లి | — | లేదు లేదు" |

( స్వీయసేకరణ. )

గొల్లభామ పిల్లిని ( చివరి అమ్మాయిని ) అందుకోవడానికి ప్రయత్నిస్తుంటే ముందున్న అమ్మాయి చేతులడ్డు పెడ్తూ గొల్లభామ ఎటువస్తే అటు తిరుగుతుంది మిగిలిన వాళ్లందరూ ఆ అమ్మాయిని అనుసరిస్తారు ఇలా చివరనున్న అమ్మాయి గొల్లభామ చేతికి చిక్కేంతవరకు పాడుతూ ఆడుతూనే ఉంటారు ఆ అమ్మాయి దొరికింతర్వాత ఆ అమ్మాయికి ముందున్న అమ్మాయి పిల్లి అవుతుంది. ఆటకు 'దొంతి' అన్న పేరు మిగిలిన ఆటల పేర్లలాగే పాటలోని పదాన్ని బట్టి వచ్చి ఉండవచ్చు. కుండల్ని ఒకదానిపైన ఒకటి వరుసగా పెట్టడాన్ని 'దొంతి' అంటారు పాలు, పెరుగు కుండల్ని పల్లెల్లో దొంతులపైన పెట్టుకోవడం ఈనాటికీ ఉంది పిల్లి పాలకోసం దానిపైకి ఎక్కినపుడు ఖాళీకుండలయితే క్రింద పడడం ఖాయం. పాలు తాగిందన్న కోపం కంటే కుండలు పగిలాయన్న కోపం మరీ ఎక్కువ అందుకే వెదకి మరీ కొట్టడానికి రావడం. ఈ పాటలో మానవస్వభావం కూడా చక్కగా చిత్రమైనట్లనిపిస్తుంది ఒకవైపు ఆశ్రయించిన వారిని ఆదరించడం, మరోవైపు ఎదుటి వాళ్లక వంత పాడడం ఈ పాటలో చూడవచ్చు లేదు లేదు, తిరగేసికొట్టు, దూరి దూరి కొట్టు. అన్న వాక్యాల్లో పైవిషయం స్పష్టం.

## కొంగ పువ్వు.

కొంగలు ఆకాశంలో ఒక్కోసారి బారులుతీరి వెళ్తుంటాయి. వర్షాలతో చెరువులు, కుంటలు నిండి చేపలతో సమృద్ధిగా ఉన్న ప్రాంతాల్లో ఆ దృశ్యాన్ని

తలుచూ చూడవచ్చు. అలాంటప్పుడు పిల్లలు వాటినిచూస్తూ చేతుల్ని వెల్లకిలా పెట్టుకొని గోళ్ళు పైకి కన్పించేట్లు వేళ్ళను ముడుచుకొని చేతులు త్రిప్పుతూ క్రింది విధంగా పాడ్తారు.

"కొంగా కొంగా పువ్వెయ్యే - దేవుని గుళ్లో దెబ్బెయ్యే
రాగి చెట్టుమీద రెట్టెయ్యే - చింత చెట్టుమీద చూపెయ్యే
నీముక్కుకు ముక్కెర చేయిస్తా - నీకాళ్లకు గజ్జెలు నేకడతా"
(స్వీయ సేకరణ)

పాట పూర్తయిన తర్వాత చేతి గోళ్ళను చూసుకుంటారు. ఒక్కోసారి గోళ్ళపై చిన్న తెల్లటి చుక్కలు కన్పిస్తాయి. అవి అలా ఎందుకేర్పడతాయో చెప్పలేను. కాని పిల్లలు మాత్రం అలా ఉంటే 'నాకుకొంగ పువ్వేసిందం'టూ అందరికీ చూపిస్తూ తెగమురిసిపోతారు అలా చుక్కలుంటే కొత్తబట్టలొస్తాయని కూడా మనవాళ్ల నమ్మకం తెలంగాణా ప్రాంతంలో గోళ్లు కన్పించకుండా పిడికిలి మూసుకొని ఈ ఆట ఆడ్తారు.[1]

బొంతలాట.

ఇద్దరమ్మాయిలు ఎదురెదురుగా నిలబడి ఒకరి చేతులొకరు పట్టుకొని క్రిందికి దించి చేతులు కదిలిస్తూ -

"ఉలవలు ఉలవలు వేయించి - ఉట్ల నిండా పోయించి
జొన్నలు జొన్నలు వేయించి - జోలెలనిండా పోయించి
కందులు కందులు వేయించి - కడవల నిండా పోయించి
కుడుములు కూల్ద్రోసి - అట్లు ఆరబోసి......"
(స్వీయ సేకరణ)

1. రామరాజు బి. తెలంగాణా పల్లెపాట. 1968. పుట : 28.

అని పాడుతూ ఒకసారి ఒక ప్రక్క, మరోసారి మరొక ప్రక్క చేతుల్తో పొడిచినట్లు, పొడిచినట్లు అభినయిస్తారు తర్వాత ఇద్దరూ చేతులు పట్టుకొనే వుండి ఎదమలను దువ్వుతూ క్రింది పాట పాడ్తారు

"అక్కలమ్మ గుంటకాడ జింకలాట
చూద్దాము రండి ఆ బొమ్మలాట (బొంతలాట)
గుర్రాల బాయికాడ వింతలాట
చూద్దాము రండి ఆ దొమ్మరాట"
(స్వీయ సేకరణ)

గుడి చుట్టు

ఈ ఆటకూడా చాలా మంది కలసి ఆడేఆట ఇద్దరమ్మాయిలు ఎదురెదురుగా నిలబడి చేతులు పట్టుకొని ఆ చేతుల్ని గోపురం లాగా పైకెత్తి పట్టుకుంటారు మిగిలిన వాళ్లందరూ ఒకరి వెనక ఒకరు పట్టుకొని వారిద్దరి చుట్టూ క్రింది పాట పాడుతూ ఎనిమిది అంకె ఆకారంలో తిరుగుతారు

" కలింకాయ తిని కక్కుంటివి - దాదేరమ్మకు మొక్కుంటివి
యీపకాయ తిని ఎక్కిళ్ళొస్తే - యీసాలమ్మకు మొక్కుంటివి
ఇప్పకాయ తిని ఎర్రొస్తే - ఇరపాక్షమ్మకు మొక్కుంటివి"
(స్వీయ సేకరణ)

ఇలా నాలుగైదు చుట్లు తిరిగిన తర్వాత నిలబడిన అమ్మాయిలు ఉన్నట్టుండి ఒక అమ్మాయిని వెళ్లడానికి వీల్లేకుండా చేతులు క్రిందికి దించి పట్టుకుంటారు. మిగిలిన వాళ్లామ్మాయిని వదలిపెట్టమని కోరుతారు 'మాతోట్లోకాయలు కోస్తుంటె పట్టుకున్నామంటూ దొంగతనానికి శిక్షగా ఆ అమ్మాయి చేత అంట్లుతోమడం' నీళ్లు తోడడం వాంటి పనులు చెయిస్తారు ఆ అమ్మాయి చేసినట్లు అభినయిస్తుంది ఇలా అందరమ్మాయిలు పట్టుపడేవరకు ఆట ఆడ్తారు. ఈ పాటలో ఉన్న దాదేరమ్మ,

యాపాలమ్మ, ఇరపోశమ్మ (ఏరూపోషమ్మ) గ్రామదేవతలు శరీరానికి నలతగా ఉన్నప్పుడు ఆ దేవతలకు ముడుపులిస్తామని మొక్కుకోవడం జానపదుల సంప్రదాయం. ఈనాడు డాక్టర్లకు మందులు చెల్లిస్తే, జానపదులు దేవతలకు ముడుపులిస్తూ నమ్మకంతోనే వచ్చిన కష్టాన్ని ఎదుర్కొనేవారు. ఆ సత్యం ఈ పాటలో సువ్యక్తం.

దొంగాట.

ఇది కూడా చిన్నా పెద్దా బాలికలందరూ కలిసి ఆడే ఆట. ఆ ఆటలో ముగ్గురమ్మాయిలు ఒకరు తోటమాలిగా, ఒకరు కాపలాకుక్కగా, ఒకరు దొంగగా వ్యవహరిస్తారు మిగిలిన వాళ్లందరూ తోటలోని చెట్లు, విరగకాసిన కాయలు, విచ్చుకున్న పువ్వులు. కొంతమంది నిలబడి ఉంటే కొంత మంది కూర్చుంటారు తోటమాలిగా ఉన్న అమ్మాయి అలా చెట్లుగా, కాయలుగా నిర్ణయించబడిన వాళ్ల చుట్టూ ఒంటికాలితో కుంటుతూ క్రిందిపాట పాడుతూ తిరుగుతుంది

" గుమ్మడి చెట్లకు నీళ్లు కట్టేది నేనే<br>
గుమ్మడి కాయలు కాయించేది నేనే<br>
బీర చెట్లకు ... ... ... ...<br>
పూల చెట్లకు నీళ్ళు కట్టేది నేనే<br>
పూలన్నీ పూయించేది నేనే "

(స్వీయ సేకరణ)

సన్నికల్లు పొత్తరము.

దొంతలాట లాంటిదే ఈ ఆట కూడా: ఇద్దరమ్మాయిలు ఎదురెదురుగా నిలబడి ఒకరి చేతులొకరు పట్టుకొని –

" సన్నికల్లు పొత్తరము సరిజోడు<br>
మా అక్క మట్టెలు ఘల్లు ఘల్లు... "

(ఆటలు పాటలు. పుట : 75)

అని పాడుతూ రెండుచేతులు దగ్గరగాపెట్టి ఈ ప్రక్క సన్నికల్లు అటు, అటు ప్రక్కది ఇటు పెడుతున్నట్లు నటిస్తూ వినోదంగా చేతులు తిప్పుతూ ఈ ఆట ఆడ్తారు.

**ఆలంకి గుడి.**

ఎనిమిదేండ్లు నిండిన బాలికలాడే ఆట ఇది 'సిర సిర బండి' అని దీనికి మరో పేరు మొదట నలుగురమ్మాయిలు గుండ్రంగా నిలబడి ఒకరి చేతులొకరు పట్టుకొని చేతులు పైకెత్తుతారు వాళ్లలో ఒకమ్మాయి మెల్లగా ఎదురుగా ఉన్న రెండు చేతుల క్రిందనుంచి దూరి అవతలకి వెళ్తుంది. ఎవరి స్థానాల్లో వాళ్లే చేతులు విడవకుండా మొదటి అమ్మాయి వెలుపలికి వెళ్లగా ఉంచిన చేతుల మెలికలను తప్పించుకొని వెను కకు తిరుగుతారు లంకెలుగా పట్టుకున్న చేతులు అరి చేతులపై ఉండేట్లు వంచాలి తర్వాత ఒకమ్మాయి కాలు వెనుకకు చాచి ఇద్దరి చేతుల లంకెమీద-అంటె అరచేతుల మీద మోకాలు తగిలించి ఒంటికాలుమీద నిలబడుతుంది మూడవఅమ్మాయి తనకాలిని రెండవఅమ్మాయి క్రిందనుంచి పోనిచ్చి మోకాలని మొదటిబాలిక కాలితో లంకెవేస్తుంది. దీనినే 'చీల బిగింపు' అంటారు అందరి కాళ్లు విడిపోకుండా ఉంటాయి అప్పుడు నాల్గవ అమ్మాయి తనకాలిని పైన తగిలిస్తుంది చివర అందరూ చేతులు వదిలిపెట్టి చప్పట్లు కొడ్తూ క్రింది పాట పాడ్తారు

" ఆలంకోయ్ ఆలంకోయ్ - చంద్రగిరి బాలంకోయ్
సిర సిర బండి - చిరాల బండి
ఎండ రెక్కినా - ఇరగని బండి
బండోయ్ బండి - బండోయమ్మ బండి "

(స్వీయ సేకరణ)

ఈ ఆట మరీ చిన్న పిల్లలు ఆడినా, అజాగ్రత్తగా ఆడినా కాలు బెణికే ప్రమాదముంది

అత్తారింటికి.

ఎన్నో ఆటలు ఆడి అలసిపోయిన అమ్మాయిలు చివర ఇండ్లకు వెళ్తూ పాటా ఆడుకొంటూనే వెళ్తారు. అమ్మాయిలందరూ ఒకరి వెనుక ఒకరు వరుసగా నిలబడి ఒకరి భుజాలొకరు పట్టుకుంటారు. ముందున్న అమ్మాయి తప్ప మిగిలిన వాళ్లందరూ కళ్లు మూసుకుంటారు. ప్రశ్నోత్తర రూపంలో క్రిందిపాట పాడుకుంటూ వెళ్తారు. వెనుక ఉన్న అమ్మాయిలు ప్రశ్నిస్తే అందరికంటె ముందున్న అమ్మాయి జవాబిస్తుంది ఆ పాట :

" అత్తారింటికి దోవేది ? (దారేది ?)
చిన్న చెరువు కట్టమింద (మీదుగ) పోవాలి
కట్ట దిగి ఎట్లెట్ల పోవాలి ?
మర్రిమాను తొర్ర దూరి పోవాలి
అబ్బబ్బ అదెంత దూరం ?
ఆటలకు ఆమడ దూరం "

(స్వీయ సేకరణ)

ఈ ఆటకు ఇంతమంది ఉండాలన్న నియమం లేదు. ఓటమి గెలుపులు అసలే లేవు. అంతకు ముందు ఆడిన ఆటల్లో కలిగిన కోపతాపాలు, ఓటమిగెలుపులు మరచి పోవటానికి కాబోలు ఈఆట చివర ఆడ్తారు

శారీరక పరిశ్రమతో కూడుకున్న ఈ ఆటలేగాక ఆడపిల్లలకు ప్రత్యేకించి మరికొన్ని ఉన్నాయి. అవి బొమ్మలాటలు, బొమ్మల పెళ్లిళ్లు మొదలైనవి

పెళ్ళి ఆట

చాలా మంది సమూహంగా కలిసి ఆడే ఆట ఇది అమ్మాయిలందరూ ఉద్దిలు వేసుకొని రెండుజట్లుగా విడిపోతారు పెళ్లికూతురు వాళ్లొక జట్టు. పెళ్లికొడుకు

వాళ్లొక జట్టు. రెండు జట్లు వాళ్ళు ఎదురెదురుగా మధ్య సుమారు పదిగజాల ఖాళీస్థలం వదిలి నిలబడతారు ఒక్కో జట్టులోని వాళ్లంతరూ మా అందరి అభిప్రాయం ఒకటే అన్నట్లు కలిపి కట్టుగా చేతులు కూర్చుకుంటారు. తర్వాత పాటరూపంలో పరస్పరం పెళ్లి ఒప్పందం చేసుకుంటారు. ఈ పాటనెన్నో రకాలుగా ప్రచారంలో ఉన్నాయి వాటిలో కొన్ని గ్రంథస్థమైనాయికూడా.[1] కొందరు – "చిట్టీ మీ రేమిటి వారే–చిట్టెక్కా మీరేమిటివారే" – అంటూ మొదట సంప్రసక్తి తీసుకొస్తే మరికొందరు

"గుజ గుజ రేకుల పిల్లుందా – గుజ్జా రేకుల పిల్లుందా ?
స్వామీ దండల పిల్లుందా – సహ రాజులు మెచ్చ పిల్లుందా !"

అంటూ అమ్మాయి కోసం అన్వేషణ ప్రారంభిస్తారు. 'గుజ గుజ రేకుల' నే కొన్ని ప్రాంతాల్లో 'బుజ బుజ రేకుల' అని వ్యవహరిస్తారు పరస్పరం ఒప్పందం చేసుకొనేటప్పుడు పెళ్లికూతురు జట్టువాళ్ళు తమ అభిప్రాయాన్ని పాట రూపంలో పాడుతూ పెళ్లికొడుకు జట్టు దగ్గరికి వెళ్లి వెనక్కి వస్తారు అదే విధంగా ఆ జట్టు వాళ్ళు వీళ్ల దగ్గరికి వచ్చి వెళ్తారు. పెళ్లికి కావలసిన కట్నకానుకలు, సారె చీరలు ఎవరెవరు ఏమేం పెట్టేది మొదలైన ఒప్పందాలన్నీ కుదుర్చుకున్న తర్వాత మేళ తాళాలతో అభినయిస్తూ పెండ్లి కొడుకు బృందంవాళ్ళు –

"గుజ గుజ రేకుల చీనాంబరాలు తెచ్చితిమి
గుజ్జా రేకుల జల్తారు రవికలు తెచ్చితిమి
స్వామి దండల పండ్లు పసుపు తెచ్చితిమి
సహ రాజులు మెచ్చ పెండ్లికి వచ్చితిమి"

అని పాడుతూ పెళ్లికి తరలి వస్తారు. పెళ్లికూతుర్ని, పెళ్లికొడుకును సింగారించి కూర్చుండ బెట్టి అభినయంతో పెళ్లితంతు ముగిస్తారు. పిల్లలు ఉత్సాహంతో ఆడు

1. సత్యనారాయణశర్మ, ఎడుల. వీరభద్రస్వామి, కాళ్లహస్తి. పిల్లల పాటలు 1953, 1955 పుట : 71.

కానే ఈ ఆటలో తెలుగు వాళ్ల పెళ్లి సంప్రదాయాలన్నీ చోటుచేసుకొని ఉండటం గమనించవచ్చు. పిల్లలపై ఉన్న పరిసరాల ప్రభావం, వాళ్లకున్న సామాజిక స్పృహ ఈపాటల్లో సువ్యక్తమవుతాయి. సామాన్యంగా వరుసైన వాళ్లని వదులుకోవటానికి మన పెద్దలు ఇష్టపడరు. మేనత్త మేనమామ పిల్లలకైతే పుట్టక ముందుసుంచే ఒప్పందాలు ఏర్పరచుకొని పుట్టిన తోడనే వాళ్లకి భార్యా భర్తలనే ముద్ర వేసేస్తారు. సామాన్యంగా పెళ్లి కొడుకు పెళ్లికూతిరి కంటె వయసులో పెద్దగా ఉంటాడు. కొడుకుని చూసుకొని మురిసిపోతూనే కోడలు పుట్టిందని తెలిసి చూడటానికి పరుగెత్తి వస్తారు. అలాంటి సన్నివేశాలు కూడా ఈ పాటల్లో కన్పిస్తాయి

చిట్టీ పుట్టిందా ? - చిట్టికొక్కా పుట్టిందా ?
దాదీ పుట్టిందా ? - దామర మొగ్గా పుట్టిందా ? "

అంటూ పుట్టిన పిల్లను చూసుకోవటానికి వరసైన వాళ్ళు తరలివస్తారు ఎంతదగ్గరి వాళ్లైనా. మేనరికమైనా పెట్టిపోతల విషయంలో మాత్రం చాలా నిక్కచ్చిగా వ్యవహరిస్తారు.

బొమ్మలాట.

అమ్మాయిలు పాడుకొనే పాటల్లో బొమ్మలాట పాటలనే పేరుతో కొన్ని పాటలు గ్రంథస్థమైనాయి. ఈ పాటలు ఏ ఆటల సందర్భాల్లో పాడుకుంటారో చెప్పడానికి వీలుకాదు. పై ఆటలన్నీ ఆడి శారీరకంగా అలసిపోయిన పిల్లలు విశ్రాంతిగా ఒకచోట కూర్చుని ఈ పాటలు పాడుకుంటారేమో ? కానీ వీటిలో సామాజిక స్పృహ కన్పిస్తుంది. ఉదాహరణకు కొన్ని పాటలు :

1. " గోలుకొండ పంపించి - గోటూ రవికలు తెప్పించి
కుమ్మరోళ్ళింటికి పంపించి - కుమ్మరి మట్టిని తెప్పించి
బొమ్మరిల్లూ వేయించి - బొమ్మరింటో బిడ్డను కంటే
అత్తా తలకు ఆముదం లేదు - మామా తలకీ మడ్డీలేదు."
(నవ్వులు - పువ్వులు)

పైపాటలో ఎన్నివిధాలుగా కష్టపడినా రోజులుగడవని పేదల బ్రతుకుల్లోని లోటుపాట్లు ప్రతిఫలితమైనాయి.

2. " చిట్టీ చిట్టీ మిరియాలు - చెట్టూ క్రింద పోసి
పుట్టమన్ను తెచ్చి - బొమ్మరిల్లు కోట్టి
బొమ్మరింట్లో బొమ్మా నీళ్ళాడితే
బొమ్మ తలకి నూనే లేదు
అంతట్లోనే పెద్దన్నొస్తే
కాళ్లా చెప్పులు విడిపించే
కంచెడు పాయసం జుర్రించె "

(నవ్వులు–పువ్వులు)

ఈ పాటల్లో ఎంత పేదరికంలో ఉన్నా, నిత్య అవసరాలు కూడా జరగని పరిస్థితుల్లో బంధువులొస్తే, ముఖ్యంగా పుట్టింటివాళ్ళు వస్తే అప్పుతెచ్చి అయిన వాళ్లని తృప్తితో ఆదరిస్తారన్న విషయం వ్యంగ్యంగా ద్యోతకమవుతుంది

అదేవిధంగా ఎంత డబ్బు ఖర్చుచేసి ఎంతగొప్పగా పెళ్లిచేసినా, ఎంతో జాగ్రత్తగా సేవ చేసినా వచ్చిన వారికి అతిథి సత్కారాలందించినా ఎవరో ఒకరు లోపాల్ని వెదకి ఎడిపిస్తుంటారు ముఖ్యంగా మగపెళ్లివాళ్ళు ఆడపెళ్లివాళ్లను వేధించుకు తింటుంటారు. పెళ్లిలో వచ్చినవాళ్లకు తగిన మర్యాదలు జరగలేదని ఎత్తిచూపడం క్రిందిగేయంలో కన్పిస్తుంది.

" చిట్టి చిట్టి మిరియాలు - చెట్టు క్రిందా పోశారు
బొమ్మరిల్లూ కట్టారు - బొమ్మల పెళ్ళిల్లు చేశారు
వియ్యపురాలికి నూనెలేదు - వియ్యపురాలితో వచ్చిన
వారికి నెయ్యీ లేదు"

(పిల్లల పాటలు. బాలభారతి. 1931)

పిల్లలు చేసే బొమ్మల పెళ్లిళ్ళు కేవలం వినోదంకోసం ఆడుకొనే ఆటలే కాని ఎందుకుబందవుకదా? కానీ ఏదోవిధంగా పప్పులు బెల్లాలు సేకరించి పంచుతారు. అవి కూడా లోపించినప్పుడు పైపాటపాడి పెళ్లిపెద్దగా వ్యవహరించిన అమ్మాయిని ఏడిపిస్తారు.

పెళ్లాట పాటల్లో వర్ణనాత్మకమైన గేయాలు కూడా ఉన్నాయి ఉదాహరణకు:

"చిట్టి బొమ్మల పెళ్లి చెయ్యి వేడుక
శ్రీ రెండు వాకిళ్లు సిరి తోరణాలు
గాజు గుమ్మాలనూ రత్నకంబళ్లు
పసిబాల కుడకలో పచ్చనక్షతలు
అరటి స్తంభాలతో అమరె పెళ్లరుగు
చిన్నన్న పెట్టేదు చింతాకు చీర
పెద్దన్న పెట్టేదు పెట్టెల సొమ్ము
నాయన్న పెట్టేదు నానుతో పుస్తి
నాబొమ్మ వెళ్లింది దబ్బల్లుదాటి
నాబొమ్మ వెళ్లింది అత్తవారింటికి."

(నవ్వులు – పువ్వులు.)

## ౩. బాలబాలికల ఆట విడుపు పాటలు.

ఏడెనిమిదేండ్ల వయసువరకు బాలబాలికలు వీరు వారనే తారతమ్యం లేకుండా మెలగుతారు కొన్ని ఆటల్ని కూడా వాళ్ళు కలసిమెలసి ఆడుకుంటారు వాటికి కూడా పాటలు తోడై ఉంటాయి ఉదాహరణకు అలాంటి ఆటలు కొన్ని .

### కాళ్లాగజ్జి.

ఐదేండ్ల బాలబాలికలు కలసి ఆడేఆట కాళ్లాగజ్జి. ఈ ఆటకు ఒకమ్మాయి ఆటపెద్దగా వ్యవహరిస్తుంది మిగిలిన వాళ్లందరూ పద్మాసనం వేసుకొని చుట్టూ

కూర్చుంటారు. ఆట పెద్దగా ఉన్న అమ్మాయి "కాళ్లాగజ్జి - కంకాలమ్మా" అని పాడుతూ తన కుడిచేతితో పాటకు అనుగుణంగా ('కాళ్లాగజ్జి - అన్నప్పుడు ఒక కాలుపైన, కంకాలమ్మా అన్నప్పుడు మరొకకాలుపైన) ఒక్కొక్కరి కాళ్లను వరుసగా తట్టుతూ ఉంటుంది. పాటలోని చివరిపదం ఏకాలుమీద పలుకుతుందో ఆకాలు పండినట్లు. ఏ పండినకాలు పండుతుందో ఆ అమ్మాయి ఆ కాలుసు ముడుచుకొని కూర్చుంటుంది. అలా ముడుచుకున్న కాలును వదిలి ఆటపెద్ద మళ్లీ మళ్లీ వరుసగా పాడుతూ తడుతూ ఉంటుంది. అందరి పిల్లల రెండు కాళ్లూపండి చివరికి ఎవరో ఒకరి కాలుమిగిలిపోతుంది. అలా చివర పండక మిగిలిన కాలుగల వాళ్ళని 'ముట్టు' అంటారు. ఆట పెద్ద ఆ బాలికను "నిలుచుంటే ముట్టుకుంటావా? కూర్చుంటే ముట్టుకుంటావా?" అని అడుగుతుంది కూర్చుంటే ముట్టుకుంటానంటే ఆ అమ్మాయి దగ్గరికి సమీపించినప్పుడు అందరూ నిల్చొని, నిల్చుంటే ముట్టుకుంటానంటే కూర్చొని 'మీ అత్తగారింట్లో ఇంత కోడిపిల్ల' అని ఉడికిస్తుంటారు. అప్పుడు కూర్చోవలసినప్పుడు నిలబడి ఉన్నా నిలబడవలసినపుడు కూర్చొని ఉన్నా ఏమరిపాటుగా ఉన్న సమయంలో ఆ అమ్మాయి ఎవరినైనా ముట్టుకుంటె ఆ అమ్మాయి 'ముట్టు' అయిందన్నమాట. తర్వాత అందరూ ఆ అమ్మాయిని ఏడిపిస్తారు ఈ ఆటలో కాళ్లమీద తడుతూ పాడే పాటలు చాలా ఉన్నాయి ఒకే పాటకు పాఠాంతరాలు కూడా ఎక్కువే. 'కాళ్లాగజ్జి - కంకాలమ్మా' అనే పాటకు ప్రచారం ఎక్కువగా కన్పిస్తుంది

"కాళ్లాగజ్జీ - కంకాలమ్మా (గంగరమ్మా)
వేగులచుక్కా - వెలగా మొగ్గ
మొగ్గాగాదు - మోదుగనీరు
... ... ... ... ...
రాజుగారి తోట్లో - ఏముందంటే
పువ్వో మొగ్గో - పుచ్చుకుంటే దెబ్బ
కాలూదీసి - కడగాపెట్టు"

(బాలభాష పుట. 52.)

ఈ పాటే తెలంగాణా ప్రాంతంలో కొంచెం పాఠభేదంతో ప్రచారంలో ఉంది.

"కాళ్ళా గజ్జ - కంకాలమ్మ
... ... ... ...
పండుగాదు - పాపిడి మీసం
మీసం గాదు - మిరియాల పోతు
పోతు గాదు - బొమ్మల శెట్టి
శెట్టి గాదు - శామల మన్ను
మన్నుగాదు - మంచి గంధపు చెక్క
లింగు లిటుకు - పందే మేల పటుకు
కాలు పండినట్లు - కడగదీసి పెట్టు"

(తెలంగాణా పల్లె పాటలు.)

ఈ పాటలో పిల్లలకు మోకాళ్ళపై లేచే గజ్జికి మందున్నట్లు చెప్తారు.[1] రాయల సీమ ప్రాంతంలో ఈ ఆటకు 'తత్తిం బిత్తిం' అని వ్యవహారం. వాళ్ళుపాడే ఈ పాటననుసరించి ఆ యాటకీపేరు స్థిరమైనట్లు తెలుస్తుంది. ఆపాట:

"తత్తిం బిత్తిం - తగడా బిత్తిం
వకో జల్ల - ఎలగాపండు
మామిడి ముట్టి - మల్లే రాకు
కీర కాయి - బీర కాయి
గంగీ రెడ్డి - బాయీ కాడ
కాలూ ముడువు - కామాక్షీ!"

(స్వీయ సేకరణ)

1. రామ రాజు, బి. తెలంగాణా పల్లె పాటలు. 1968. పుట : 25.

దాగుడు మూతలు.

ఈ ఆటకు ఒక ఆటపెద్ద, పోలీసు ఉంటారు. ఆటపెద్ద పోలీసుగా నిర్ణయమైన బాలునికో, బాలికకో కళ్ళు మూసి మిగిలిన వాళ్లను దాక్కోమని పాట రూపంలో చెప్పిస్తారు. ఆ పాటలు కొన్ని

" దాగుడు మూతా దండాకోర్
పిల్లీ వచ్చె ఎలకా దాగే
ఎక్కడి దొంగా లక్కడే
గప్ చిప్ సాంబారు బుడ్డి. "

( బాలభాష )

" గజ్జ కాకర కాయ పప్పా ముద్దాయ పప్పా
సజ్జలో వంకాయ నంగ నాచి కొప్పా
బట్ట మీద పువ్వా దొంగ వచ్చె దాక్కో. "

(వె స, కా. మీ. పిల్లల పాటలు. పుట 66. )

దాగుడు మూత ఆటకు సంబంధించిన పై రెండు పాటల్లోనూ కొంత భేదం కన్పిస్తుంది. మొదటి పాటలో దొంగలు దాక్కోవడం వ్యక్తమయితే రెండవ పాటలో దొంగను వుంచి మిగిలిన వాళ్ళు దాక్కోవడం కన్పిస్తుంది. ఇలా పాట వినగానే ఎక్కడి వాళ్ళక్కడ దాక్కుంటారు. కళ్ళు మూయించుకున్న వాడు మిగిలిన వాళ్లను వెదకి, తరిమి పట్టాలి. అలా తరుముతున్న వాళ్లకు చిక్కకుండా అందరువచ్చి ఆ పెద్దను ముట్టుకుంటారు. ముట్టుకోక ముందు ఎవరినైనా తాకితే వాళ్ళు అవుటయినట్లు. తర్వాత అవుటయిన అమ్మాయికో, అబ్బాయికో కళ్ళు మూస్తారు.

" సూరీతా పిల్లి
మారీతా పిల్లి
పదమలుక్కల్లార పారిపోండి. "

( సాంప్రదాయిక విజ్ఞానం (పాతపాటలు) పుట. 28

అనే పాటకూడా ఆటపెద్ద కళ్ళు మూసిన తర్వాత మిగిలిన వాళ్లను దాక్కోమని హెచ్చరిస్తూ పాడేపాట.

ఉయ్యాలాట

ఉయ్యాలలూగడం కూడా ఆట విశేషమే. ఈ ఆటకు ఆడా మగా భేదంలేదు. ఒక చెట్టు కొమ్మకో, ఎత్తైన దూలానికో బలమైన త్రాళ్లతో ఉయ్యాల కట్టి ఊగడం తోపు ఒకడు ఊగుతుండగా మరొకరు ఊపడం కూడా జరుగుతుంది. ఇలా ఒకరి తర్వాత ఒకరు ఉయ్యాల లూగుతూ పాటలు పాడ్తారు

"ఉయ్యాలలోయ్ జంపాలోయ్ - జేజమ్మకొండకు దీపాలోయ్
అట్లు అరిసెలు ఉయ్యాలోయ్ - అమ్మకు నాన్నకు జంపాలోయ్
పెట్లు తిట్లు ఉయ్యాలోయ్ - అల్లరి పిల్లకు జంపాలోయ్
ఉయ్యాలోయ్ జంపాలోయ్ - శివశివ - ఉయ్యాలోయ్
జంపాలోయ్."

(స్వీయ సేకరణ)

తెలంగాణా ప్రాంతంలో అట్లతద్ది పండగనాడు ఉయ్యాల లూగడం వాడుకలో ఉన్నట్లు అది కూడా అమ్మాయిలు మాత్రం ఊగేట్లు నేదునూరి గంగాధరం గారు వివరించారు[1] అది ఆ ప్రాంతపు ఆచారం కావచ్చు. కానీ బాలబాలికలు సెలవు రోజుల్లో ముఖ్యంగా వేసవి సెలవుల్లో ఈ ఆట ఆడటం చాలా ప్రాంతాల్లో గమనిస్తాం.

ఇతరాలు.

పిల్లలందరూ కలిసి ఆడుకొంటున్న సమయంలో ఇక ఆడడం ఇష్టంలేకనో, వేరేకారణం వల్లనో ఆటమధ్యలో ఎవరైనా వెళ్లిపోతే సంఖ్య సరిపోక కొన్ని సమయాల్లో ఆ ఆట అంతటితో ఆపివేయాల్సివస్తుంది. కొన్ని ఆటలు ఆపివేయక

1. ఆటలు - పాటలు (దేశీయ క్రీడలు) 1965. పుట - 132.

పోయినా ఆడాలనిరో, బాలికతో జతగా ఉన్నవాడు ఆపడం మానుకోవలసివస్తుంది అలాంటి సమయాల్లో ఆట ఆడిపోయడం ఇష్టంలేని పిల్లలు తమ అయిష్టాన్ని, కోపాన్నికూడా పాటరూపంలో వ్యక్తం చేస్తారు ఆటఆగిపోవడానికి కారణ భూతుడైన వారిని -

"సగమాటలో బోయింది సాకలోడి పెండ్లాం
మధ్యాటలో బోయింది మంగలోని పెండ్లాం
ఆటవిడిచి పోయింది పోశ్యగాని పెండ్లాం" అని
అక్కసంతా వెళ్ళగక్కుతూ తిట్టడం మొదలు పెడ్తారు.
అడ్డాబిడ్డా - నాగలబిడ్డా
పండగనాడు - పైడు బీమేసుకొని - పటుక్కుని చావాలి."
(స్వీయ సేకరణ.)

అని మెటికలు విరుస్తారు. సంతోష సమయాల్లో కలిసి మెలిసి తిరుగుతూ ప్రాణ మైనా ఇవ్వడానికి సిద్ధపడే స్నేహితురాలు ఇంత చిన్న విషయానికే చావును కోరు కుంటున్నదంటే ఆసమయంలో ఆడుకోవడంలో వాళ్లకున్న ఉత్సాహం, ఆట ఆగిపోవడంతో వాళ్లకు కలిగిన నిరుత్సాహం వ్యక్తమవుతాయి. బాలల మనస్తత్వ పరిశీలనకిది చక్కని ఉదాహరణకూడా

## 3. 5. 2. పండుగ పాటలు.

పండుగ రోజుల్లోనూ, ఇతర ఉత్సవ సమయాల్లోనూ బాల బాలికలు ఆనం దంతో ఉత్సాహంగా పాడుకొనే పాటలే పండుగ పాటలు సంక్రాంతి, అట్లతద్ది మొదలైన పండుగరోజుల్లో పిల్లలు వినోదంగా పాడుకొనేపాటలెన్నో ఉన్నాయి. అవి.

### 1. గొబ్బి పాటలు.

చిన్న పిల్లలు మొదలు పెద్దవాళ్ల వరకు ఈపాటలు పాడ్తారు. సంక్రాంతి పండుగ రోజుల్లో గొబ్బెమ్మలు పెట్టి, పాటలు పాడ్తూ ఆపాటలలోని లయకు అను

సుణంగా చేతులు తడుతూ గొబ్బెమ్మ చుట్టూ తిరుగుతారు. తెలుగు దేశంలో గొబ్బి పాటలకు ప్రసిద్ధి, ప్రచారం ఎక్కువ. అవి లెక్కించ లేనన్ని ఉన్నాయి బాల గేయ వాఙ్మయంలో ప్రత్యేక వర్గంగా గుర్తించి పరిశీలించ దగినంత విస్తృతి, వైవిధ్యం ఆపాటలకుంది. అన్నమయ్య (క్రీ. శ 1424 - 1503) కూడా గొబ్బిపాటల్ని వ్రాయడం ఆ పాటలకున్న ప్రాధాన్యాన్ని, ప్రాచీనతని తెలుపుతుంది. స్వరూపాన్ని బట్టి, వాటిలో నిర్ణీతమైన విషయాన్ని బట్టి గొబ్బిపాటల్ని చాలా రకాలుగా వర్గీకరించ వచ్చు. సామూహికంగా పాడుకొనే ఈ పాటల్లో ఒకరు ఒక చరణాన్ని పాడగానే మిగిలిన వాళ్ళు దానిని అనుకరిస్తారు.

కథన రూపం లోనివి.

జానపద సాహిత్యంలో ప్రధాన శాఖల్లో కథాగేయం ఒకటి కథనం ఉన్న గేయాలు. కథాగేయాలు పునరావృత్తి లేక పల్లవి ఈ గేయాల్లో సహజంగా కన్పించే లక్షణం. ఈ పాటల్లోని రాగాలు సంకీర్ణాలై ఉంటాయి ఒక్కపాటను అందరూ ఒకేవిధంగా పాడాలన్న నియమంలేదు మొత్తం మీద పాడడం ప్రధానం. గొబ్బి పాటల్లో కథనరూపంలో ఉన్న పాటలు కొన్ని ప్రచారంలో ఉన్నాయి. ఉదాహరణకు:

"రామా దశరథ రామా, రామా దశరథ రామా!
" రామన్న భీమన్న అన్నదమ్ముళ్ళు "
" రామన్న బోయేను రాజ్యాలేలాను "
" భీమన్న బోయేను బీడుదున్నాను "
" ఏడు జాముల పొద్దు ఏట్లో వాలింది. "
" భీమన్న వచ్చాడు బీడు దున్నేసి "
" అన్నరో ఓయన్న నీళ్ళియ్యరన్న "
" మీ యన్న లేడు మరిది నేనున్నా మరిది "
" ఎవరుంటె ఏమొదిన నీళ్ళియ్యి వదినా "
" బావి లోని నీళ్ళన్ని బండమరుగాయ "

రామా దశరథ రామా ! రామా దశరథ రామా !
,, పాలన్న దీసియ్యే పాపకారాదినా ,,
,, ఆవులన్ని అడివేగి తిరిగి రాలేదు ,,
,, అన్నమన్న పెట్టవే ఆకపోతొాదీనా ,,
,, పొయ్యిలోని పిల్లి లెయ్యానే లేదు ,,
,, మంచమన్న వెయ్యావే మాటకారొాదినా ,,
,, మంచంలో మీాయన్న కన్నుమూసేను. ,, ,,

( స్వీయసేకరణ. )

జానపద కుటుంబాల్నో ఇంచు మించు ఒకప్పుడు సమిష్టికుటుంబాలే. ఆ కుటుంబాల్లో ఇంటి పెత్తనం జ్యేష్ఠ సోదరునిది తక్కిన వాళ్ళు అన్ని పనులూచేస్తూ అన్నకు సాయంగా ఉంటారు పైపాటలో రామన్న, భీమన్న సోదరులు. రామన్న రాజ్యమేలితే (ఇంటి యాజమాన్యం) భీమన్న వ్యవసాయం చేసేవాడు కాని వదిన అతన్ని సరిగా ఆదరించేది కాదు. ఇది సమాజంలో చాలా కుటుంబాల్లో జరుగుతున్న కథే అందుకే ఏమడిగినా ఏదో కారణంతో లేదంటుంది. కథలో కూడుకున్న ఈ పాటలో 'రామా దశరథ రామా!' అనేది ప్రతి చరణంలోను ముందు వెనుకల వస్తున్న మాట అలా మరలా మరలా రావడమె పునరుక్తి.

**సంభాషణా రూపంలోనివి.**

గొబ్బిపాటల్లో పరస్పరం సంభాషించుకొన్నట్లుగా వర్ణితమైన పాటలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు :

"గొబ్బియ్యాలో కట్టమింద (మీాద) బోయేది ఎవరమ్మ చిలకా
,, నీచేతి మల్లెమొగ్గ నాకిచ్చిపోవే
,, ఇస్తాను రావమ్మ ఈ కోనలోకి
,, ఈకోన దాటంగ ఏమ్పూరువచ్చు ?

"గొబ్బియ్యాలో

,, ఈకోన దాటగానే గుజ్జమావిళ్లు
,, గుజ్జమావిళ్లకాడ వేంజూసినావు
,, గుజ్జమావిళ్లకాడ గుర్రాల దండు
,, గుర్రాల దండుకు మంచి నీళ్లబావి
,, మంచి నీళ్ల బావికి బుడ బుడ చెంబు
,, బుడ బుడ చెంబేస్తే బుడగల్లు రేగే
,, బుడగల్లు రేగగానే గురుగింజ జిక్కె
,, గురుగింజ తీసుకెళ్లి సాలోనికి స్తే
,, సాలోడు నాకొక్క పట్టు చీరిచ్చా
,, ఆ చీర కట్టుకోని పట్నానికి పోతే
,, పట్నాన పెళ్లికొడుకు పూలుదీసిచ్చా
,, ఆపూలు పెట్టుకోని సంతాకు బోతి
,, సంతలో మామా! సై సై మామా!!"

— (స్వీయ సేకరణ.)

వర్ణనాత్మకమైనవి.

" గొబ్బియ్యాలో ఊరూరి ముందరా మాఊరి ముందరా
,, మా ఊరి ముందరా సిరిపొన్న మానూ.
,, సిరిపొన్న మానూకు మూారెడే రేకు
,, మూారేసి మాయన్న మేడ కట్టించే
,, మేడలో ఉండాది[1] మేలంపు కన్నె

1. ఉన్నాది (ఉన్నది)

గొబ్బియ్యాలో కిస్నాకు దగ్గాది కాశ్మీర బొట్టు
" బొట్టూకు దగ్గాది బొమ్మంచు చీర
" చీరాకు దగ్గాది చిలుక పట్టు రవిక
" రవికాకు దగ్గాది రత్నాల ఒళ్లు
" ఒళ్ళూకు దగ్గాది ముత్యాల పేరు
" పేరూకు దగ్గాది పెట్టెల్ల సొమ్ము
" సొమ్మూకు దగ్గాది సొగసైన పసుపు
" పసుపూకు దగ్గాది పారేటి నీళ్లు
" నీళ్లాకు దగ్గాది నిత్యమల్లె తోట
" తోటాకు దగ్గాది శోభనాలిల్లు
" ఇల్లూకు దగ్గాది దాల బంద్రాము[1]
" దాల బంద్రం మీద దాగుండె చిలుకా
" నీతోటి చిలుకాలు ఎందుబోయినాయి
" నాతోటి చిలుకాలు మేతకు బోయినాయి.

జానపదుల వర్ణనా చాతుర్యం కల్పనాశక్తి ఈపాటలో చక్కగా వ్యక్తమవుతుంది.

"బండీరా పొగ బండీరా - అది దొరాలెక్కే బండీరా
ఒంపూ సొంపుల బాటరా - అది మైసూ సుందర బాటరా
పగాలేసిన దానిపైనా - కోగిలాడుతుందీరా
ఆడా కూతా లేసేరా - అది ఈడా కూతా లేసేరా
నీలగిరీ సంతలోనా - నిలిచీ కూతా లేసేరా
పుంగనూరి పేటాలోనా - పిలిచీ కూతా లేసేరా"

(స్వీయ సేకరణ

1. ద్వారబంధము.

పై పాటలో రైలుబండి వర్ణన కనిపిస్తుంది. ఇది రైలుబండి కొత్తగా కని పెట్టిన రోజుల్లో కల్పించినదై ఉంటుంది. ఈనాడు సామాన్యుల ప్రయాణ సౌకర్యాలకు అనువుగా ఉన్న వాహనాలలో రైలు ప్రధానంగా కన్పిస్తుంది. కాని ఈపాటలో దొరసెక్క బండిగా చెప్పబడింది. దొరలంటే ధనవంతులని, పరపతిఉన్న వాళ్ళని సామాన్యులకంటే భిన్నమైన గొప్పవాళ్ళని అర్థం చెప్పుకోవచ్చు. ఆంగ్లేయుల్ని దొరలని వ్యవహరించడం రివాజు. ఆంగ్లేయుల పరిపాలన భారత దేశంలో ప్రారంభమైన తర్వాతనే ప్రయాణ సౌకర్యాలకు ఎన్నో వాహనాలు భారత దేశంలో ప్రవేశ పెట్టబడ్డాయి. ప్రారంభంలో వాళ్ళ ప్రయాణ సౌకర్యాలకోసం మాత్రం పరిమిత మైన రైలు బండిని దొరసెక్క బండిగా వర్ణించడం మనోహరం. 'ఏగాలేసిన దానిపై కోగిలాడుతుందిరా' వెళ్ళడానికి బయలుదేరగానే పొగ గుప్పు గుప్పుని పైకిలేస్తుంది. ఆ పొగనే కోయిలలు ఆడుతున్నట్లుగా ఊహించడం రైలుకూత ప్రత్యేకంగా చెప్పదగినదే. నిలిచేముందు వెళ్ళే ముందు కూత వేస్తుంది. ఆ కూతను ప్రయాణీకులను పిలవడంగా వర్ణించడం రమణీయం.

పిల్లలు గొబ్బిపాటల్లో ఇలాంటి వర్ణనాత్మకమైన పాటలు చాలా కనిపిస్తాయి. కాని ఈ పాటల్ని పిల్లల కల్పనగా చెప్పలేము. పెద్దలు కల్పించిన పాటల్ని పిల్లలు నేర్చుకొని పాడుకోవడం జరిగి ఉంటుంది. పెద్దవాళ్ళు కూడా గొబ్బి పాటల్ని పాడడం ఉంది. అలాంటి సందర్భాల్లో పిల్లలు వాటిని నేర్చుకొని ఉంటారు. తర్వాత అనుక్రమంగా అవి ప్రచారాన్ని పొంది ఉంటాయి.

## దేవతా ప్రార్థనలోనివి.

గొబ్బిపదాల్లో ప్రాచీనమైనవన్నీ దైవభక్తి ప్రధానాలే. గొబ్బి పండుగలో నృత్యమొక విశేషం. వైష్ణవ సంప్రదాయాన్ని తెలిపే ధనుర్మాసపు వేడుకల్లో నృత్యం చేయడం ఉంది. గొబ్బి, సుమ్మిపదాలు ఒకే సాంప్రదాయాన్ని తెలియ జేస్తాయి[1]. కృష్ణుని పరంగా, కంచివరదరాజు పరంగాను అల్లబడిన పాటలున్నాయి.

---

1. కామేశ్వరరావు, బేకుమళ్ల. ఆంధ్ర జానపదగేయ వాఙ్మయ చరిత్ర. పుట: 107.

"కోలని దోపరికి - గొబ్బిళ్ళో
యదుకులస్వామికి గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా - గోవులు గాచిన
కొండుక శిశువుకు - గొబ్బిళ్ళో
దుండగంపు దైత్యులకెల్లను తల
గుండు గండనికి - గొబ్బిళ్ళో[1]
... ... ... ..."

ఈ పాట యదుకుల తిలకుడైన శ్రీకృష్ణుని నాయకునిగా చేసి కన్నెపిల్లలు పాడేది. గోపికల ఊహల్లో ఉయ్యాలలూగిన వీర శృంగార మూర్తి గోపాలుడు. పాప పక్షుల శిశుపాలుని తిట్టుల కోపగాడు రాక్షసుల గుండె దిగులు కంసుని కష్టాలు పెట్టిన గోపబాలుడు గోపికల మనసుల్ని దొంగిలించిన గోపీ మనోహరుడు. అందుకే కృష్ణుడు వీర శృంగారమూర్తిగా కీర్తించబడ్డాడు

కంచి వరదరాజస్వామిపై అల్లబడిన గొబ్బిపాటలున్నాయి ఉదాహరణకు:

"గొబ్బియనీ పాడవమ్మ - కంచి వరదరాజుకి గొబ్బిళ్ళో
ఏబదియారు దేశాలకు - హెచ్చు కంచి పట్టణామే గొబ్బిళ్లో"

ఈ పాటలోని మొదటిపాదం తర్వాత కొన్ని గొబ్బిపాటలకు ఊతపదమయింది.

పై పాటలన్నీ దేవతాపరమైన వర్ణనలలో కూడిన గొబ్బిపాటలు అలాగాక దేవతల్ని పూజించి వరములిమ్మని కోరుతూ ప్రార్థించే పాటలు కొన్ని ఉన్నాయి.

"గొబ్బియ్యాలో గొబ్బియ్యాలో
గంగమ్మ తల్లికి గొబ్బియ్యాలో ॥గొబ్బి॥
గౌరమ్మతల్లికి గొబ్బియ్యాలో ॥గొబ్బి॥
గుమ్మాడి పూచే గొబ్బియ్యాలో ॥గొబ్బి॥

1. అన్నమాచార్యుల సంకీర్తనలు టి టి డి ప్రచురణ 1977 పుట, 5న

ఆ పూలు కోసుకోని గొబ్బియ్యళ్ళో ॥గొబ్బి॥
పూజా చేతాము రారె గొబ్బియ్యళ్ళో ॥గొబ్బి॥
పసుపూ కుంకాలు తేరె గొబ్బియ్యళ్ళో ॥గొబ్బి॥
పూజా చేతాము రారే గొబ్బియ్యళ్ళో ”

(స్వీయ సేకరణ)

ఈ పాటలో గొబ్బిదేవత గౌరమ్మను పూజచేయడం కొంతవరకు వర్ణితమైంది. గొబ్బి పూజకు గుమ్మడి పూలు శ్రేష్ఠమైనవి. పేడముద్దలను గుమ్మడి పూలతో అలంకరించి వాటిపై పసుపు కుంకుమలు పెట్టి గొబ్బిళ్ళు తడతారు.

“సుబ్బి గొబ్బెమ్మా శుభము లియ్యావే
గుంటు గౌరమ్మా గుణము లియ్యావే
మంచి గొబ్బెమ్మా మేడ లియ్యావే
నిండు గౌరమ్మా నీడ నియ్యావే
తామర పువ్వంటి తమ్ముణ్ణియ్యావే
చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యావే
మొగిలి పువ్వంటి మొగుణ్ణియ్యావే ”

(స్వీయ సేకరణ)

ఈ పాటలో కోరికల పరంపర కన్పిస్తుంది.

**హాస్య ప్రధానమైనవి.**

భక్తితో బాటు హాస్యానికి కూడా గొబ్బిపాటల్లో ప్రాధాన్యం కన్పిస్తుంది. వరసైన వారితో మేలమాడటం పండుగ వినోదాల్లో ప్రధానమైన భాగం. పండుగలకు కొత్తల్లుడు అత్తవారింటికి రావడం కూడా ఆనవాయితీ. అలా వరసైన వారిముందర గొబ్బిళ్ళు తట్టి వారి నుంచి వీలయినంత ఎక్కువగా కానుకల్ని రాబట్టడానికి చూస్తారు. అలాంటి సమయాల్లో వాళ్ళు పాడే పాటలుకూడా హాస్యప్రధానంగా ఉంటాయి. ఉదాహరణకు:

" మామొచ్చినాడమ్మ మామొచ్చినాడు
యాలొచ్చినాడమ్మ యాలొచ్చినాడు
నట్టింటి పుల్లాకు నాకనొచ్చినాడు
ఆకగిడినాడమ్మ ఆకడిగినాడు
కట్టమింద (మీద) కానగాసు కోసుకోమంటి
వక్కడిగినాడమ్మ వక్కడిగినాడు
దిబ్బలో చింతగింజ ఏరుకోమంటి
సున్నమడిగినాడమ్మ సున్నమడిగినాడు
గోడమింద (మీది) కాకిరెట్ట తీసుకోమంటి
దుగ్గడిగినాడమ్మ దుగ్గడిగినాడు
వీథిలో దుమ్మెత్తి పోసుకోమంటి
పొవ్వాకడిగినాడమ్మ పొవ్వాకడిగినాడు
అటక క్రింద ఎలుకతోక తుంచుకోమంటి "

(స్వీయ సేకరణ)

గొబ్బిపాటల్లో సామూహ్యంగా అభినయానికి అనుకూలంగా ఎత్తుగడతో కొన్ని పదాలు కన్పిస్తున్నాయి అవి జంగం కథలోని ' తందానతానె' లాంటివి. పాటల్లో ఒక చరణం నుండి మరో చరణాన్ని అందుకోవడానికి అవి ఊతపదాల్లాగా ఉపయోగ పడ్తాయి ఉదాహరణకు కొన్ని ఊత పదాలలో కూడిన గొబ్బిపాటలు చూడండి.

గొబ్బియ్యళ్ళో.

గొబ్బి పాటల్లో ' గొబ్బియ్యళ్ళో ' అనే ఎత్తుగడతో కూడిన పాటలే ఎక్కువగా ఉన్నాయి

" గొబ్బియ్యళ్ళో చిన్న చిన్న బుడిగిల్లో కూరొండిపెట్టి
" పెద్ద బుడిగిల్లో కూడొండి పెట్టి

గొబ్బియ్యళో కోడి గూటి మింద కూడారబోస్తి
" కొంత చిలకలు వచ్చి చిల్లాడిపోయె
" చిల్లాడి పోతానే మొలకలై మొలిచే
" మొలకలకు మారాజు కోటగట్టిచ్చా
" కోట కోటంటారు ఏదమ్మ కోట
" చూడండి చెల్లెళ్లా చుక్కల్ల కోట "

(స్వీయ సేకరణ)

'గొబ్బియళో' అనే ఎత్తుగడతో కూడిన ఈ పాటలోని వర్ణనావైచిత్రి గమనించదగింది. తెల్లని వెన్నెలే అరబోసిన అన్నము 'వెన్నెల పిండారబోసినట్లుంది' అని లోకవ్యవహారం. అంటేనే ఇదిగాకా పగలు అసలు కన్పించని చుక్కలు రాత్రయ్యేసరికి ఒకటొకటి పుట్టుకొస్తాయి. పుట్టే చుక్కలకు మొలచే మొలకలకు చక్కని సామ్యముంది. చుక్కలకు రాజు చంద్రుడు. అతడు కట్టిచ్చిన చుక్కల్లకోటే ఆకాశం. జానపదులు అప్రయత్నంగా సృష్టించుకున్న ఈపాటల్లో ఇలాంటి మధురమైన భావనలుండడం వారి ఊహాశక్తికి తార్కాణం. 'బుడిగి' అనే పదం పిల్లల భాషలోనిది 'పిడత' అని అర్థం. 'బుడిగి' లు చిన్న పిల్లల ఆట వస్తువుల్లో ప్రధానమైనవి.

గౌరమ్మ.

గౌరమ్మని పూజిస్తూ వినోదంగా పాడే గొబ్బిపాటల్లో 'గౌరమ్మ' అనే పదమే ఎత్తుగడతో ఉండడం గమనించదగ్గ విషయం. ఉదాహరణకు.

" ఒక్కొక్క పోకందునే - గౌరమ్మ
ఒక్క కట్టాకులందూ
రాచూరి సున్నమందూ - గౌరమ్మ
రాయబారా మందునూ
... ... ...

బంట్లకూ ఒయ్యారమూ - గౌరమ్మ
బాలలతో చెండ్లాటమూ ”
(ఆంధ్రపత్రిక. అక్టోబరు 6, 1948 పుట : 14)

తుమ్మెదా.

ఈ పేరును మొదట తెలియజేసినవాడు పాల్కురికి సోమనాథుడు (క్రీ శ 1190-1220) ఇది జానపద గేయాల ప్రాచీనతను తెలియజేస్తుంది వేటూరి ప్రభాకర శాస్త్రి గారు తుమ్మెద పాటలకిచ్చిన ఉదాహరణ .

“ముట్టీ ముట్టని పువ్వు తుమ్మెదా ! - అది
ముట్టింది జగమెల్ల తుమ్మెదా !
... ... ... ... ”[1]

పై పాటలాగే గొప్ప పాటల్లోనూ 'తుమ్మెదా !' అనే ఎత్తుగడలో ఉన్న పాటలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు-

“ ఎనకాల బుట్టింది తుమ్మెదా ! - అది
ఎఱ్ఱబంతి చెట్టు తుమ్మెదా !
“ఆ చెట్లో పూచింది తుమ్మెదా ! - పెద్ద
ముద్ద బంతి పువ్వు తుమ్మెదా !
... ... ... ... ... ”
(స్వీయ సేకరణ)

'తుమ్మెదా' అనేమాట ధ్వని పూర్వీకంగా ఉంటుందని, కొన్ని చోట్ల అత్మ అని, మరికొన్నచోట్ల భారతీయుడని భావం కన్పిస్తుందని అంటారు దేవమళ్ల కామేశ్వర రావుగారు [2]

1. మధుర కవితలు. భారతీ మొదటి సంపుటం. మొదటి సంచిక
2 పూర్వపదాలు ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర పుట . 110

భద్రుడా !

'తుమ్మెద' పదం వంటిదే 'భద్రుడా' అనే సంబోధన పర్యాయ ఊత పదం కూడా

"ఆకొండ ఈ కొండరా భద్రుడా!
శివాజి కొండాకటిరా - భద్రుడా! శివాజి కొండాకటిరా,
శివాజి కొండకిందా భద్రుడా !
సిరిమల్లె లున్నాయిరా - భద్రుడా! సిరిమల్లె లున్నాయిరా.
ఆమల్లె తేవాలిరా భద్రుడా !
కొప్పునిండ పెట్టాలిరా - భద్రుడా! కొప్పునిండ పెట్టాలిరా.
కొప్పునిండ పెట్టాలిరా భద్రుడా !
కోలాట మెయ్యాలిరా - భద్రుడా కోలాట మెయ్యాలిరా.
(స్వీయ సేకరణ.)

దేవా!

" ఆ కొండ ఈ కొండరా దేవా! సిరిమల్లె శ్రీకొండరా॥దేవా॥
సిరిమల్లె శ్రీ కొండలో దేవా! ఏమేమి ఉన్నాయిరా ॥దేవా॥
సిరిమల్లె శ్రీ కొండలో దేవా! సిరిమల్లె లున్నాయిరా ॥దేవా॥
తిరుపాతి కొండపైనా దేవా తిరునామ మమరున్నది ॥దేవా॥
కాళస్త్రి[1]ముమగులోనా దేవా గన్నేరు పూలున్నవి ॥దేవా॥
శ్రీశైల క్షేత్రమందూ దేవా శివలింగ మొకటున్నది ॥దేవా॥"
(స్వీయ సేకరణ)

పై పాటలో తిరుపతి, కాళహస్తి, శ్రీశైలం - ఈ మూడు పుణ్యక్షేత్రాల ప్రశంస వచ్చింది. తిరుపతికొండ వైష్ణవక్షేత్రము. కాళహస్తి, శ్రీశైలం - రెండూ శైవ క్షేత్రాలు.

---

1. కాళహస్తి.

### ఎన్నిలాయిలో.

కథారూపంలో ఉన్న గొబ్బిపాటల్లో ఎత్తుగడలో ఎన్నిలాయిలో అనే పదాలున్న పాటలు కన్పిస్తాయి ఉదాహరణకు .

" ఒక ఊరి దేశమోడు ఎన్నిలాయిలో
వాడు చింతమాను మగ మనిషి ఎన్నిలాయిలో ॥చింత॥
వాడు చీమకన్నా చీకసేసె ఎన్నిలాయిలో ॥చీమ॥
వాడు పాముకన్నా పయిలునేసె ఎన్నిలాయిలో ॥పాము॥
వాడు పట్టుగుడ్డ చుట్టుకు సేసె ఎన్నిలాయిలో ॥పట్టూ॥
వాడు గుడ్డాలయిన మూటగట్టె ఎన్నిలాయిలో ॥గుడ్డా॥
వాడు కోమిటేది పేటకుపోయె ఎన్నిలాయిలో ॥కోమిటేది॥
కోమిటేది అమ్మల్లారా ఎన్నిలాయిలో
మీరు గుడ్డలయిన కొంటారమ్మ ఎన్నిలాయిలో
కొంటే కొంటాము కాని ఎన్నిలాయిలో
నువ్వు చీర రొక్కం చెప్పారబ్బ ఎన్నిలాయిలో
వాడు చెప్పినాడు దేశమోడు ఎన్నిలాయిలో
వాడు కోటివేలు రొక్కం చెప్పె ఎన్నిలాయిలో
గుడ్డాలయిన మూటగట్టె ఎన్నిలాయిలో-
వాడు బాపనీది పేటకుపోయె ఎన్నిలాయిలో "

... ... .. ... ..

(స్వీయ సేకరణ)

ఈపాటలో ప్రతిపాదంలోను 'ఎన్నిలాయిలో' పదం పునరుక్తమయినా వాడు, మీరు, నువ్వు - మొదలైన పదాలు ఊతపదాలుగా వ్యవహరిస్తాయి.

ఎన్నల్.

"అక్కా చెల్లెళ్లు ఎన్నల్ ఒకూరిలో ఇచ్చె
" " "
ఏరా అన్నగారూ ఎన్నల్ ఎన్ని దినమూలూ
" " "
ఏంచేసు చెల్లెమ్మా ఎన్నల్ ఏరక్షామాయా
" "
ఏరుకు ఎంపాలీ ఎన్నల్ తీగక్షామాయా
" "
తీగకు తిరుపాతి ఎన్నల్ కొండక్షామాయా
" "
కొండ పక్కన రెండూరా ఎన్నల్ గొల్లావారిండ్లు
" "
గొల్లవారింట్లకాడ ఎన్నల్ గోపీ కృష్ణమ్మ
ఎన్నల్ గోపీ కృష్ణమ్మ"

(స్వీయసేకరణ.)

ఈ పాటలో ప్రతివాక్యం పాదం కోసం రెండవ 'ఎన్నల్' అనే పదం ఊత పదంగా వాడబడింది

**ఓబులమ్మ మయిలేరి (మైలారు) గొబ్బియ్యాళో.**

ఓబుల్లమ్మ, మయిలేరి అనేవి గంగమ్మకున్న పేర్లు గాలిసోకినా, అమ్మవారు వచ్చినా క్షుద్రదేవత పూనిందని జానపదుల నమ్మకం అందుకే గంగమ్మతల్లికి పూజలు జరుపుతారు ఎత్తుగడలో ఆపేర్ల ప్రసక్తి ఉన్న పాటలు కూడా గొబ్బి పాటల్లో ఉన్నాయి.

" గాలెమ్మ, మాలెమ్మ గంగాభవానీ ఓ బలమ్మయి లేరి గొబ్బియళో.
గంగమ్మ గౌరమ్మ అక్కా చెల్లెండ్లు ,,
గంగమ్మ తమ్ముళ్ళకు గజపోతులన్న ,,
గంగమ్మ దొక్కింది గ (ఘు) న్నమున ముల్లు ,,
ముల్లుదియర గజపోత ముల్లిట్ల దియర ,,
మూలెట దీస్తునే మునిమబ్బులోన ,,
కాసిర గజపోత కాసిర సీవు ,,
సీ గొల్లు కొట్టించి నోటికింటిస్తు ,,
సీ సేగ పెరికించి జడదెమేయిస్తు ,,
సీ నెత్తురే పోసి దీపమెలిగిస్తు ,,
ఊరు మూడు చుట్లు మెరవిణ చేయిస్తు ఓ బలమ్మ యియ్యేరిగొబ్బియ్యళో,"
(స్వీయ సేకరణ.)

పైపాటలో ఏదో పురాణాంశం దాగి ఉంటుందనిపిస్తుంది గంగమ్మకు పోతురాజుకు సోదర సంబంధముంది గంగమ్మ గుడి కెదురుగా పోతురాజు శిల ఉండడం చిత్తూరు జిల్లాలో చాలా చోట్ల చూడవచ్చు పోతురాజులనే పొద్దుదేవర అని కొన్నిచోట్ల వ్యవహరిస్తారు

రామ చిలుకా.

" వాడ బుట్టింది వానంబిలో ఓ రామ చిలుకా!
బొద్దు కోసింది బొంబాయిల్లో ,,
పేరు పెట్టింది పేరూరిలో ,,
వాడ వచ్చింది వానంబిలో ,,
గుంత తవ్వింది గుంటూరల్లో ,,
పాలు పోసింది పాకాలలో ఓ రామ చిలుకా! "
(స్వీయ సేకరణ.)

చిత్తూరు ప్రాంతంలో ప్రచారంలో ఉన్న ఈగొబ్బి పాటలోని చమత్కారం గమనించదగింది. పేరూరు, పాకాల చిత్తూరు జిల్లాలోని ఊళ్లు.

ఇంకా గొబ్బిపాటల్లో రామాయణభారతాలూ, హైందవ్య మొదలైన ఎత్తుగడలు కన్పిస్తాయి. అభినయానికి అనుగుణంగా కూర్చబడిన పదాలివి. పెద్దలచే సృష్టించబడి పిల్లలచే పాడబడి అప్రయత్నంగా దేశమంతా అల్లుకొనే పాటలకు గొబ్బిపాటలు చక్కని ఉదాహరణ.

వినోద ప్రధానమైన, అభినయంతో కూడిన ఈపాటలే గాక గొబ్బెమ్మను నిద్రపుచ్చుతూ పాడే జోలపాటలు నిద్రలేపుతూ పాడే మేలుకొలుపు పదాలు కొన్ని ఉన్నాయి. తంగేడు పూలపై గొబ్బెమ్మను పడుకోబెట్టి పండుగరోజుల్లో ప్రతిరాత్రి జోలపాడటం ఆచారం. ఉదాహరణకు :

1. సాకలి సరవన్నా రెండూ సలవలు దేరన్నా
   రెండూ ,, ,,
   కుమ్మరి గురిసెట్టి రెండూ కుండలు దేరన్నా
   రెండూ ,, ,,
   అరటి పండ్లా గారమే[1] గౌరమ్మ చింతపూల సింగారమే
   నీదీ నిదానమే గౌరమ్మ నిద్రాకు జయకాలమే
   సన్నగిరి చాపపైన చాలించి నిద్దరపోవె సంపతి[2] గౌరమ్మా"

2. "రాగులు రాగులు తిప్పంగా
   రాగుల కడవ నింపంగా
   సాకల సిద్దన్నా రెండు సలువలు దేరన్నా
   నా వెండి గౌరమ్మా నువ్వు నిద్రా పోవమ్మా"

(1, 2 స్వీయ సేకరణ)

---

1. ఆహారము 2. సంపద

అదేవిధంగా ఉదయాన్నే లేచి గొబ్బెళ్లు తట్టే వాళ్లందరూ గొబ్బెమ్మ చుట్టూ చేరి –

" ఒక్కొక్క పొద్దు బుట్టె లెయ్యో గౌరి
వంకలోని నీళ్ళు దేను లెయ్యో గౌరు
రెండు రెండు పొద్దు బుట్టె లెయ్యో గౌరి
కోటిలోని వడ్లు దంచ లెయ్యో గౌరి
మూడు మూడు పొద్దు బుట్టె లెయ్యో గౌరి
ముంత చద్ది నెత్తికెత్త లెయ్యో గౌరు "

(స్వీయ సేకరణ.)

అని పాడుతూ పసుపుతో పెట్టిన గొబ్బెమ్మను ఒకచోట పెట్టుగా పుష్పాలమర్చి నిల బెట్టుతారు. ప్రాచీన కాలంలోనే జానపదులచే సృష్టించబడిన ఈపాటలో తెలుగింటి ఆచారము గాని, పేదలు గాని ఉదయం చేయవలసిన కార్యక్రమాలు సువ్యక్తం. సూర్యోదయానికి పూర్వమే లేచి పనులన్నీ చేసుకోవడం పల్లెప్రజల ఆచారం. నాగరికత పెరిగిన కొద్దీ జనుల నడకలో కూడా మార్పు లొచ్చాయి. క్రమక్రమంగా ఆనాటి పాటలూ మరుగున పడిపోతున్నాయి (పోయాయి). రాయలసీమలో గొబ్బిపాటలకు ప్రసిద్ధి, ప్రచారం ఎక్కువ. తెలంగాణాలో గొబ్బెమ్మలను పెట్టినా అభినయం చేస్తూ పాటలు పాడటంకాంటి సంప్రదాయం లేదు [1]

## బొడ్డెమ్మ పాటలు

గొబ్బి పాటల్లాంటివే బొడ్డెమ్మ పాటలు, బొడ్డెమ్మ పండుగను తెలంగాణా ప్రాంత ప్రజలు విశేషంగ జరుపుకుంటారు. ఈపండుగ భాద్రపద బహుళ పంచమితో ప్రారంభమై మహాలయ అమావాస్యతో పూర్తి అవుతుంది. బొడ్డెమ్మ పాటలు కూడా ఆడపిల్లలకే ప్రత్యేకం. ఈపాటలకు కూడా అభినయం తోడై ఉంటుంది. ఇవి కూడా గొబ్బి పాటల్లాగా ఎత్తుగడలతో కూడి ఉంటుంది. ఉదాహరణకు:

1. రామరాజు, బి. తెలుగు జానపదగేయసాహిత్యము రెండవ ముద్రణ 1978 పుట 511

చిత్తూరు ప్రాంతంలో ప్రచారంలో ఉన్న ఈగొబ్బి పాటలోని చమత్కారం గమనించదగింది. పేరూరు, పాకాల చిత్తూరు జిల్లాలోని ఊళ్లు.

ఇంకా గొబ్బిపాటల్లో రామాయణకథలూ, శైవమూ మొదలైన ఎత్తుగడలు కన్పిస్తాయి. అభినయానికనుగుణంగా కూర్చబడిన పదాలివి. పెద్దలచే సృష్టించబడి, పిల్లలచే పాడబడి అపూర్వంగా దేశమంతా అల్లుకొనే పాటలకు గొబ్బిపాటలు చక్కని ఉదాహరణ.

వినోద ప్రధానమైన, అభినయంతో కూడిన ఈపాటలే గాక గొబ్బెమ్మను నిద్రపుచ్చుతూ పాడే జోలపాటలు నిద్రలేపుతూ పాడే మేలుకొలుపు పదాలు కొన్ని ఉన్నాయి. తంగేడు పూలపై గొబ్బెమ్మను పడుకోబెట్టి పండుగరోజుల్లో ప్రతిరాత్రి జోలపాడటం ఆచారం. ఉదాహరణకు :

1. సాకలి సరవన్నా రెండూ సలవలు దేరన్నా
   రెండూ ,, ,,
   కుమ్మరి గురిసెట్టి రెండూ కుండలు దేరన్నా
   రెండూ ,, ,,
   అరటి పండ్లా గారమే[1] గౌరమ్మ చింతపూల సింగారమే
   నీదీ నిదానమే గౌరమ్మ నిద్రాకు జయకాలమే
   సన్నగిరి చాపపైన చాలించి నిద్దరపోవె సంపతి[2] గౌరమ్మా"

2. " రాగులు రాగులు తిప్పంగా
   రాగుల కడవ నింపంగా
   సాకల సిద్దన్నా రెండు సలువలు దేరన్నా
   నా వెండి గౌరమ్మా నువ్వు నిద్రా పోవమ్మా "

(1, 2 స్వీయ సేకరణ)

---

1. ఆహారము  2. సంపద

బతుకమ్మ పాటలు.

గొబ్బిపాటలకు, బొడ్డెమ్మ పాటలకు, బతుకమ్మ పాటలకు మధ్య భేదం ఎక్కువగా కన్పించదు. మూడూ, దేవీపూజకు సంబంధించినవే.

" బతుకమ్మ బతుకమ్మ భాగ్యమిచ్చింది
భాగ్యమిచ్చినచోట నెల్లిబూసిందీ
నెల్లీకి మా తాత తోట కట్టించే
... ... ... ...
బాయిలో ఉన్నదీ - బతుకమ్మ సిబ్బి "
(తెలంగాణా పల్లెపాటలు. పుట : 43)

అట్లతద్ది పాటలు.

ఇది కూడా తెలంగాణా ప్రాంతంలో ఆచరణలో ఉన్న పండుగ. అట్లు ఆరగించడం ఉయ్యాల లూగడం ఈ పండుగలోని విశేషాలు.

" అట్లతద్దోయ్ - ఆరట్లోయ్
ముద్దపప్పోయ్ - మూడట్లోయ్
పలకల క్రింద - గుప్పెడు బియ్యం
పిల్లల్లారా - జల్లల్లార - లేచి రారండోయ్
పీటల క్రింద - పిడికెడు బియ్యం
పిల్లల్లార - జల్లల్లార - లేచి రారండోయ్ "
(వే. స, కా. వీ. పిల్లల పాటలు. పుట: 33.)

వానదేవుని పూజ.

వర్షం మీద ఆధారపడినట్టి దేశం తెలుగుదేశం. వర్షాలురాక పచ్చని పైరులన్నీ నీళ్ళులేక ఎండిపోతుంటే పెద్దలతో బాటు పిల్లలూ తల్లడిల్లిపోతారు. వర్షం కురిపించ

## 3. 5. 3. ఎగతాళి పాటలు.

పిల్లలు వాళ్ళలోవాళ్ళు నవ్వుతూ ఇతరుల్ని నవ్విస్తూ, కవ్విస్తూ, పరిహసిస్తూ పాడే పాటలు ఎగతాళి పాటలు లేదా వెక్కిరింపు పాటలు. తమలో తామేగాక పెద్ద వాళ్లను కూడా ఎగతాళి చేసి ఏడిపించాలన్న కుతూహలం పిల్లలకెక్కువ. జానపద సాహిత్యంలో పిల్లలకు సంబంధించిన హాస్యరసం ఈ పాటల్లో ఉంటుంది. వీటిని ముఖ్యంగా (1) సరి పిల్లల్ని పరిహసించే పాటలు 2. పెద్దల్ని పరిహసించే పాట లని రెండు రకాలుగా విభజించవచ్చు.

1. సరిపిల్లల్ని పరిహసించే పాటలు.

పిల్లలందరూ కలిసి [illegible] కోసం [illegible] పిలుస్తున్నప్పుడు ఎదుటి పిల్లను ఎగతాళి చేసి ఏడిపించడం కొందరికి గొప్ప సరదా. అలాంటి సమయాల్లో అందరూ [illegible] ఉత్సాహంగా నవ్వుకుంటారు. అలా హాస్యం చేస్తూ పాడే పాటలు ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. సామాన్యంగా ఇద్దరు మిత్రులు ఉన్నప్పుడు [illegible] కి [illegible]. వెంటపడి ఒకటిగా [illegible] ఆడుకొంటున్నప్పుడో, [illegible] వెంటపడి కొందరి ఎగతాళికి, అందరి ఆనందానికి పాత్రులవుతూ ఉంటారు

నలుగురు పిల్లలు కలిసి ఉన్నప్పుడు ఏమరి పాటుగా ఉన్నవారి తలమీద వారికి తెలియకుండా చిన్న కాగితం ముక్క, మరే చేత్తో పెట్టి, అలా పెట్టడం ఎవరైనా చూస్తుంటే వారిని చెప్పవద్దని హెచ్చరిస్తూ చేతులు తడుతూ క్రింది పాట పాడతారు.

> " ఓ అబ్బా (మా) యి నెత్తిమీద గోరింక
> చెప్పకు చెప్పకు చెడిపోతావు
> చెప్పితే సీమకుక్క తెగ్గోస్తా
> మాలం మీంచీ దూకిస్తా
> పందిరి మీంచీ పాకిస్తా

కొంచెం అన్నం తినిపిస్తా
కడివెడు నీళ్ళు తాగిస్తా ”

(బాలభాష)

చూసిన వాళ్లను చెప్పవద్దని బెదిరించడం ఈపాటలో కన్పిస్తుంది. ఈ విధంగా పాడడం మొదలు పెట్టగానే ఎవరికి వాళ్ళు చెత్త తమ తలమీద ఉందేమో! అన్న అనుమానంతో చేతులతో తడిమి చూసుకుంటారు. చెత్త ఎవరి తలమీదుందో వాళ్లకు మరీ మరీ ఏడిపించి అలసట కలిగేంతవరకు నవ్వుతుంటారు.

“తలమీద చెత్తుంది
చెప్పొద్దు చినపాపా”

(స్వీయసేకరణ.)

అనే పాట కూడా అలాంటిదే. ఈపాట చిత్తూరు ప్రాంతంలో ప్రచారంలో ఉన్నపాట.

చిన్న పిల్లలకు పుట్టు వెంట్రుకలు తీయించడం కొన్ని సంవత్సరాల్లో దేవునికి ముడుపుకట్టి తలవెంట్రుకలివ్వడం మనలోని ఒక ఆచారం. అలా గుండు కొట్టించు కున్న పిల్లలను చూసి –

“బోడిగుండి బొప్పాసిగుండి – తిరుమ్మరాజుగారి దివిటీగుండు.”
“బోడీ బోకీ బొక్కాసి – బోడోలమ్మ రాకాసి.”

అని రకరకాలుగా వెక్కిరిస్తూ ఏడిపించి ఆనందిస్తారు.

ఏడుస్తున్న తమ్ముణ్ణి నవ్వించడానికి అక్కో అన్నో పాడే పాట.

“ తెమ్ముడు తమ్ముడు తాయత్తు
తమ్ముడు పెండ్లాము మురికిత్తు
మురికిత్తు తీసుకొని

చూరాలలో పెట్టితే
నక్కెత్తుకుపోయె నారాయణా !"

(The Indian Antiquiry vol. xxxv. 1906. P. No. 152)

చీటికి మాటికి పోట్లాడుకోవడం కొంత సేపటికే ఆ పోట్లాటను మరచిపోయి కలిసిపోవడం పిల్లల నైజం. ఇద్దరు పిల్లలు పోట్లాడు కున్నప్పుడు వాళ్లలో ఒకరు మా అమ్మకు చెప్తాననో, నాన్నకు చెప్తాననో బెదిరించడం సహజం. అలా అన్న వారి నుద్దేశించి —

"చెప్పకో చెప్పకో - చెవ్వులెక్క దీసుకో
మామిడాకిస్తాను - మంచి దెట్టుకో"

(సాంప్రదాయిక విజ్ఞానం (పాతపాటలు) పుట : 28)

అని హేళనగా వెక్కిరిస్తారు. మిగిలిన పిల్లలకిది వినోద సన్నివేశం.

పిల్లలు అలిగినప్పుడు వాడికేదైనా ప్రేమతో ఇచ్చినా పుచ్చుకోరు. అలాంటి వాళ్ల నుద్దేశించి -

"వద్దకుంటే గుద్దుకో - నేతురొస్తే నాక్కో
మిరపకాయ ఇస్తాను - మందునూరి కట్టుకో"

(స్వీయ సేకరణ)

అని పాడతారు. ఇలా పాడినప్పుడు కొన్నిసార్లు వాళ్లకోపం ఎగిరిపోవడం మరి కొన్నిసార్లు ఇంకా ఉడుకుకోవడం జరగవచ్చు. అవి వాళ్లమనస్తత్వంపై ఆధారపడి ఉంటుంది.

పిల్లలు ఆడుకొంటునప్పుడు ఆ ఆటల తాకిడికి పాతబట్టలయితే చిరిగిపోవడంకద్దు

"సీను మిరపకాయ చిర్రో చిర్రో
పాత గుడ్డ చిరిగితే పుర్రో పుర్రో
దాని మొగుడు దాన్ని కొడితే మొర్రో మొర్రో"

(సాంప్రదాయిక విజ్ఞానం (పాతపాటలు) పుట : 24)

అన్న పాట అలాంటి సన్నివేశాల్లో పుట్టిందే.

పోట్లాట కారణంచేతనో మరేకారణం వల్లనో కొంతమంది ఆటల్లోచేరక మూతి బిగించుకొని అందరికీ దూరంగా ఎక్కడో ఒకమూల కూర్చుంటారు. అలాంటి వాళ్లను చూసి పాడేపాట.

" ఒంటిపిల్లి రాకాసోకచోట
ఇద్దరు ముగ్గురు ఒక చోట."

(పాతపాటలు) పుట : 25)

ముఖ్యంగా గొప్పలు చెప్పుకుంటూ డంబాలు పలుకుతూ, అతిశయాన్ని ఒలక బోసేవాళ్లనుచూస్తే ఎలాంటివాళ్లకైనా ఏడ్పించాలని పిసుంది

"చిముడకే చిమడకే ఓ చింతకాయ
నువ్వెంత చిమిడినా నీ పులుపు పోదు
ఉడకకే ఉడకకే ఓ ఉల్లిపాయా
నువ్వెంత ఉడికినా నీ కంపు పోదు"

(పాతపాటలు పుట : 32)

లాంటి పాటలు అలాంటి వాళ్లని దెబ్బతీయడానికి పుట్టినవే.

ఆడుకోవడానికో, మరెందుకైనా పిలిచినప్పుడు బద్ధకించే పిల్లల్ని ఏడిపిస్తూ వ్యంగ్యంగా క్రింది పాట పాడ్తారు

"కూర్చుంటే లెయ్యాలేను - కుమ్మరి చట్టి మొయ్యాలేను
నన్ను కొట్టనొస్తాడే - నాకు నవ్వొస్తుందే"
(స్వీయ సేకరణ)

ఈ పాటలో మొదటి రెండు పాదాలు పాడేసరికే ఆ ఎగతాళికి పాత్రమైన వాళ్ళు పాడే వాళ్లను కొట్టానికి లేస్తారు. అలాంటి వాళ్లను మరీ మరీ ఉడికిస్తూ మిగిలిన పాట పాడ్తారు.

ఇష్టం లేనిపిల్లల్ని చూసినపుడు అయిష్టాన్ని వ్యక్తం చేస్తూ పాడేపాట ఇది:

"బుర్రు పిట్ట బుర్రు పిట్ట తుర్రుమన్నది
పడమటింటి కాపురము చేయనన్నది
అత్త తెచ్చిన కొత్తకోక కట్టనన్నది
మామ తెచ్చిన మల్లెపూలు ముడువనన్నది
మొగునిచేత మొట్టికాయ తింటానన్నది"
(స్వీయ సేకరణ)

ఎదుటివాళ్లని ఎగతాళిచేసె పాటలన్నీ స్వరూపంలో చిన్నవిగా ఉన్నాయి. సంక్షిప్తంగా ఉన్న ఈపాటలన్నీ వ్యంగ్యపూరితంగా కన్పిస్తారు. వచ్చే వాళ్లని చూసి నవ్వడం ఈ పాటల ప్రధానోద్దేశం. కాని ఆ ఏడుపుకు వెనుక బాధపడవలసి నంత బలమైన కారణం కన్పించదు. చివరికి నవ్వేవాళ్లతో ఏడ్పించబడ్డవాళ్లూ శ్రుతి కలపడం జరుగుతుంది.

## 2. పెద్దల్ని పరిహసించే పాటలు.

తెలుగుబాల జానపద సాహిత్యంలో హాస్యానికి సంబంధించి పెద్దల్ని ఏడిపించి ఎగతాళిచేసే పాటలే ఎక్కువగా ఉన్నాయి. వరసైన వదినగారిని, బావగారిని అత్తమామలను, ముసలివాళ్లను, అమాయకులను ఎగతాళిచేసి ఏడిపించి ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగిస్తారు పిల్లలు.

వదిన గారిని పరిహసిస్తూ పాడేపాటలు.

మరదలు, మరదళ్లు సమయం వచ్చినప్పుడు వదిన గారిని ఏడిపిస్తుంటారు వంటింట్లో అందరికోసం అవస్థపడుతూ వంటచేస్తున్న వదినగారిని —

" వదిన గారూ మీరు వాసిగలవారు
వంటబోయిన చోట కుండ నాకేరు. "

(బాలభాష)

అనీ, పురిటి మంచంలో ఉన్న వదినగారిని —

" వదిన వదిన వాసింత – పన్నెండేళ్ల కడుపంట
పత్తిగింజ కొడుకంట – తిరుపతి రాయుడు పేరంట
తిరిగి చూస్తే లేడంట – మళ్లీ చూస్తే మంచాన్నున్నాడంట. "

(నవ్వులు – పువ్వులు. )

అనీ, వదినల పిసినారితనాన్ని ఎత్తిచూపుతూ —

" వైశాఖ మాసాన వారింటపెళ్ళి
వల్లభుడు అన్నయ్య పెళ్ళి చేయించె
మిళ్ళి[1] తడియకుండ బొట్టుపడకుండ
నేర్పుతో పెద్దవదిన నేతులొడ్డించె
అంతకంటె నేర్పరే చిన్నన్నవదినె
ఆకాశాన మిళ్ళి ఆడించి పోయె."

(సాంప్రదాయిక విజ్ఞానం (పాతపాటలు) పుట : 27.)

అనీ ఏడ్పించడానికి ప్రయత్నిస్తారు. పరిహాసంకోసం పాడేపాటలే అయినా ఒకోసారి ఆ ఎగతాళికి పాత్రమైన వాళ్ల మనసులు చివుక్కుమనడం సహజం. కాని

1. ఎన్నగరిటె.

ఆ బాధను వ్యక్తం చేయకుండా ఏడ్వలేక వాళ్లతోపాటు నవ్వడానికి ప్రయత్నిస్తారు. కాస్త ఘటికులైతే ఏడ్పించిన వాళ్లని ఎత్తి పొడుస్తూ అంతకంటే బాగా దెబ్బ తీస్తారు.

వదిన గారి మీద పాటల్లుకొని అభినయంతో పాడుకొనేవి కూడా కొన్ని ఉన్నాయి ఉదాహరణకు:

" వదినకు బిగసరి బెంగకు బిగసరి బంగారు కుచ్చుల మావదిన
గోడమీదున్న తేలును చూసి లోలాకులన్నది మావదిన
చట్టె కిందున్న చుట్టను చూసి వడ్డాణమున్నది మావదిన.
కాల్లో పోయే జైత్రివర్ని చూసి నా మొగుడన్నది మావదిన. "

(స్వీయ సేకరణ.)

ఈపాటలో వదినగారి అతిశయాన్ని అందంగా చెప్పిపొడవడం కన్పిస్తుంది. వదిన గారిని పరిహసిస్తూ పాడేపాట లీ విధంగా లెక్క లేనన్ని ఉన్నాయి. కొన్ని గ్రంథస్తమైనాయికూడా. 1

బావగారిని పరిహసిస్తూ పాడేపాటలు.

వదినను హేళన చేసి ఏడ్పించినట్లే బావగారిని నవ్వులపాలు చేసి నాలుగు చెరువుల నీళ్ల తాగిస్తారు పిల్లలు. ఆపాటలు కూడా ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. వాటిలో ఎక్కువ ప్రచారాన్ని పొందిన పాట:

" బావా బావా పన్నీరు - బావను పట్టుక తన్నేరు
వీధీ వీధీ తిప్పేరు - వీసెడు గంధము పూసేరు
చావిడి గుంజకు కట్టేరు - చప్పిడి గుద్దులు గుద్దేరు.

(బాలభాష.)

ఈ పాటకు పాఠాంతరాలు కూడా ఉన్నాయి. 2

1. వీరభద్రస్వామి, కాళహస్తి, సత్యనారాయణశర్మ. పిల్లలపాటలు పుట: 46-49.
   దీక్షితులు, చింతా. ప్రజావాఙ్మయము 1955. పుట: 60.
2. దీక్షితులు, చింతా. ప్రజావాఙ్మయము. 1955. పుట: 60.

పండక్కు ఇంటికొచ్చిన బావగారిని ఏడిపిస్తూ మరదళ్లు చేసే మర్యాద చూడండి.

" అక్కా బావ వచ్చెనే - బస్తీ నుంచి బావ వచ్చెనే
పిల్లి పీట వేయవే - నల్లి నలుగు పెట్టవే
దోమా విసరవే - ముడతా మీదెక్కవే
కాకీ కాళ్లకు నీళ్లీవె - హంసా అన్నమెట్టవే
పావురమా పక్క వేయవే. "

(స్వీయ సేకరణ.)

తాంబూలం వేసుకున్న బావగారిని చూసి –

" పదేళ్లనాటిది పాత దూలమ్ము
పడి పోయె మా బావ పల్వరుస మీద
పళ్లన్ని పిప్పాయె నోరెర్ర నాయె
వీధిలో బావ గారికే విన సిగ్గులాయె
"రచ్చలో మా బావకు రాసిగ్గులాయె
సభలోను బావకు తలవంపులాయె "

(నవ్వులు - పువ్వులు)

"అన్న, బావగారూ మీరు ప్రతిభగలవారు
నిండిన్న సభలోను పిండిబొక్కేరు
చిక్కాలాల బుట్ట చంకబెట్టుకొని
సభలోను మాబావ సంగీతపరుడు."

(బాలభాష.)

అని ఎన్ని విధాలుగా ఏడిపించాలో అన్ని విధాలుగానూ ఏడిపిస్తారు పిల్లలు.

కొత్తల్లుణ్ణి పరిహసిస్తూ పాడే పాటలు.

పిల్లల హాస్యానికి గురైనవాళ్లలో కొత్తల్లుళ్ళు కూడా ఉన్నారు. అత్తగారింటికి వచ్చిన కొత్తల్లుణ్ణి చూసి పాడేపాట.

"కోరు కొండ నుండి కొత్తల్లుడొచ్చె
గీసి గీసి వండెను గిద్దెడు బియ్యమ్ము
తిన లేక తిన్నాడు తీపులుమారాడు
లేవలేక లేచాడు నేలపట్టుకొని."

(నవ్వులు - పువ్వులు.)

అల్లుళ్ళకు అత్తవారిళ్లలో జరిగే సత్కారాలు చాలా ఉన్నతమైనవి. కాని క్రింది పాటలో పిల్లల ఎగతాళికి పాత్రమైన కొత్తల్లునికి జరిగే సత్కారాలు చూడండి.

"అత్తవారింటికి కొత్తల్లుడొస్తేను - కొత్తసున్నము దెచ్చి మెత్తరమ్మ
కొత్తసున్నములోను కోపంబువస్తేను - నల్లేరు దెప్పించి నలపరమ్మ
నల్లేరు చేతను నసనసలాడితే - దూలగుండాకుతో దులపరమ్మ
దూలగుండాకులో దుఃఖంబువస్తేను-బర్రెపలువులు దెచ్చి బాదరమ్మ
బర్రెపలువుల తోను బాధలువస్తేను - కర్రలు దెపింపించి కొట్టరమ్మ
అబ్బబ్బ అత్తవారింటికి వచ్చి సుఖమేంటి ?
వచ్చిన దారినే కాశికిపోతే మేల్ మేల్."

(నవ్వులు - పువ్వులు.)

అత్తమామల్ని పరిహసిస్తూ పాడే పాటలు.

" కొండమీద మామామ ఇల్లు కట్టెను
కోరి కొడుకుల కంది మా అత్త

కొడుకులు కొండమీది కోతుల్ని పోలు
కూతుళ్ళు గుడివాడ కుక్కల్ని పోలు
అల్లుళ్ళు నెల్లూరి రాజుల్ని పోలు
కోడళ్ళు గోల్కొండ చిలకల్ని పోలు."

(నవ్వులు - పువ్వులు.)

ఈపాటలో అత్త కొడుకులను కోతులతోను, అత్త కూతుళ్ళను కుక్కలతోను నీచమైన జంతువులతో పోలిక చెప్పి అల్లుళ్ళను నెల్లూరి రాజులతో, కోడళ్ళను గోల్కొండ చిలకలతో పోల్చారు. తమను తాము గొప్పగా 'చెప్పుకోవడం అత్త కొడుకుల్ని, కూతుళ్లను ఏడిపించడం దీనిలోని అంశం. వరుసకు అల్లుళ్ళు, కోడళ్లు తామె కదా,

అలాగే ఇంటికొచ్చిన మేనమామను పరిహసిస్తూ పిల్లలు పాడే పాట ఇది.

" అమ్మ తమ్ముడొచ్చాడు - అమ్మకేమి తెచ్చాడు
చిప్పనిండ కందులు - తిప్పుకుంటూ వచ్చాడు
నోటిలో బెల్లంముక్క - నాన బెట్టుకొచ్చాడు."

(స్వీయ సేకరణ.)

తాతగారిని పరిహసిస్తూ పాడే పాటలు.

ముసలివాళ్లకు మనుమలపై ప్రేమాభిమానా లెక్కువ. కాని వాళ్లను చూస్తే పిల్లలకు నవ్వులాటగా ఉంటుంది. వాళ్ల ఆకారాలు, చేష్టలు పిల్లలకు వింత విషయాలుగా తోస్తాయి. అందుకే వాళ్ల ఆకారాల్ని, నడకల్ని అనుకరిస్తూ ఎగతాళి చేస్తారు. తాతలకు కూడా మనుమల వెక్కిరింతలు ఆనందదాయకాలే. ఉదాహరణకు.

" చింత చెట్టు తొర్రలోన చిలుక ఉన్నది
చిలుక ముక్కు చూచి తాత చిర్రుమన్నాడు
చిలుక ముక్కు తాతముక్కు పోలికున్నది
తాతకు దాన్ని చూస్తే కోపం తాళకున్నది

చిలుక ఏమి చేసింది తాత ఊరుకో
ఛీ ఛీ వెధవ! నోరుముయ్యి చిలక గొట్టేను
తాత! నీను గూని వడ్డి వడ వడ మంటుంది
ఆ తాత! ఓ తాత! తాతోయి తాత్త. ”

(నవ్వులు - పువ్వులు.)

అలాగే అడిగిందవ్వని తాతగారిని అల్లరి పట్టిస్తూ ఈపాట పాడతారు.

“ తాత గారింటనే తూ తూలపెళ్ళి
బూరి ముక్కడిగితే బుగ్గ పొడిచేరు
గారి ముక్కడిగితే కసిరి కొట్టేరు
అరిసి ముక్కడిగితే అదిమి తన్నేరు. ”

(సాంప్రదాయక విజ్ఞానం (పాతపాటలు) పుట: 31)

ఇతరుల్ని పరిహాసిస్తూ పాడే పాటలు.

గేలి చేయటంలో పిల్లలకు వాళ్ళు వీళ్ళని లేదు దైవంతో సమానమైన గురువులు కూడా పిల్లల హాస్యానికి పాత్రులవటం క్రింది పాటల్లో కన్పిస్తుంది. అలాగే ఎగతాళి పాటల్లో కుల ప్రసక్తి కూడా తీసుకురాబడింది

“ అయ్యా గారయ్యా గారం తంత
అయ్యా గారి పెండ్లాం ముంతంత
ముంత కొండ బోయి మూలకు పెడితే
నక్కెత్తుక పాయెర నారాయణ. ”

... ... ... ...

(తెలంగాణా పల్లెపాటలు, పుట 17.)

పిలక పంతుల్ని –

"పంతులు పంతులు పావుశేరు మెంతులు
పిలకబట్టి లాగితే పీకులాటలు" అని

బ్రాహ్మణుల్ని చూసి –

"బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు బెద్దముక్క
బ్రాహ్మణుడి పెళ్ళాం సుద్దముక్క" అని

రెడ్లను చూసి –

"రెడ్డీ బుడ్డీ సారాయి బుడ్డీ
ఇంట్లో గడ్డీ యీదిలో పడ్డీ" అని

కోమట్లను చూసి –

"కోమటి కోమటి కొత్త బెల్లం – కొంటావా ? తింటావా ?
కొంటే డబ్బుఖర్చు – తింటే కడుపునొప్పి" అని
(వే. స, కా వీ. పిల్లల పాటలు పుట : –2)

"కోమటి కోమటి కొయ్యా – రొట్టెముంద రొయ్యా
నీయక్క చెవులు కొయ్యా – నీయాలి ముండ మొయ్యా"

అని ఏడిపిస్తారు. శాకాహారులైన కోమట్లను మాంసాహార ప్రశంస తెచ్చి ఏడిపించటం కన్పిస్తుంది. అలాగే జంగం దేవరను పరిహాసిస్తూ –

"లింగం లింగం మహాదేవ !
జంగం జంగం మహాదేవ !
దాక్షారం భీమన్న కోటిపల్లి సోమన్న
అంతర్వేది నర్సన్న శ్రీశైలం మల్లన్న
ఢూ ఢూ బసవన్న భం భం మహాదేవా !"
(వె స, కా. వీ. పిల్లల పాటలు పుట : 43)

అని పాడతారు. పల్లెల్లో జంగం దేవరలు వేషధారణలో భం ! భం ! అని శంఖాన్ని పూరిస్తూ ఇల్లిల్లు తిరిగి భిక్షాటన చేస్తారు వాళ్ళు శైవులు వాళ్ళను పరిహసించే పాటలో శివుని ప్రశంస ఉండడం గమనించదగింది ప్రహసనం కాదు. ఇందులో దాక్షారం, కోటిపల్లి, అంతర్వేది, శ్రీశైలం వంటి శైవక్షేత్రాలూ, అక్కడి దేవతలూ ఉన్నారు.

ఆయా సందర్భాల్లో పిల్లలిచేత పాడబడ్డ ఎగతాళి పాటల్లోనూ యతిప్రాసలు, తాళలయలు ఇమిడి ఉండడం గమనించదగ్గ విశేషం.

## 3. 5. 4. పొడుపు కథలు (Riddles)1

జానపద బాలసాహిత్యంలో పొడుపుకథల దొక ప్రత్యేకశాఖ. అవి కేవలం వాగ్రూపమైనవి కావు బొమ్మల రూపంలోను, రకరకాల భంగిమల రూపంలోను పొడుపు కథలున్నాయి వాగ్రూపమైనవి గేయాల రూపంలోను, వచనకథల రూపంలోనూ, సామెతల రూపంలోనూ, చిన్న చిన్న వాక్యాల రూపంలోనూ – ఎన్నో రకాలుగా కన్పిస్తాయి పొడుపు కథల్ని జానపదగేయాల్లో భాగంగా పరిశీలించడం కంటే ప్రత్యేక ప్రక్రియగా గుర్తించి పరిశీలించాల్సిన అవసరం ఉంది.

పొడుపు కథల్ని భిన్నభిన్న ప్రాంతాల్లో రకరకాల పేర్లతో పిలుస్తారు పొడుపుకథ, విప్పుకథ, మారుకథ, అడ్డుకథ, తట్టుకథ, శాస్త్రము, సమస్య, యుక్తులు, చిక్కులు, చిక్కుముళ్ళు, యక్షప్రశ్నలు మొదలైనవి పొడుపుకథకు పర్యాయ నామాలు

"పసివారల మనస్సులకు ఆలోచన కల్గించు ప్రశ్నలు వేయుచు అబ్బుర పాటు కల్గిస్తూ అంతలోనే ఆ ప్రశ్నలకు జవాబు చెప్పాలనే ఉత్సాహన్ని రేకెత్తిస్తూ పొడుచుట – విప్పుటలో ఆనందమును వెల్లివిరియించునవి పొడుపు కథలు"

1. పొడుపుకథలు ప్రత్యేక పరిశీలనకు అనువైన సాహిత్య విభాగం. ఈ సిద్ధాంత వ్యాసంలో గ్రంథవిస్తరణ భీతివల్ల కేవలం పొడుపుకథల ప్రస్తావనతో తృప్తి పడవలసి వచ్చింది.

అని నేదునూరి గంగాధరంగారు పొడుపు కథల్ని నిర్వచించారు[1] "జీవితమే ఆకరంగా జీవితంలో సమస్యలను విడగొట్టడానికి మనిషిచేసే ప్రయత్నమే ప్రేరణగా ఎదుటివాడి బుద్ధికుశలతకు ఒక పరీక్షగా అవతరించినవే పొడుపు కథలు "[2] సృష్టి ప్రారంభ దశలోనే పొడుపుకథలు పుట్టి ఉంటాయి. జీవితంలోని సమస్యలను పరిష్కరించడానికి చేసే ప్రయత్నమే పొడుపు కథల్ని విప్పడంలో కన్పిస్తుంది. "Riddles are questions that are framed with the purpose of Confusing or testing the wits of those who do not know the answer." అని Roger D. Abrahams, Alan Dundes పొడుపు కథల్ని నిర్వచించారు[3] పొడుపు కథలు ఎదుటివాళ్లను తికమక పెట్టే చిక్కు ప్రశ్నలు. ఉద్దేశ పూర్వకంగా రూపొందించబడ్డవి. వాటిలో వస్తువు గూఢంగా ఉంటుంది అవి వినేవాళ్లలో కుతూహలాన్ని రేకెత్తిస్తాయి. ఆలోచనా శక్తిని పెంపొందిస్తాయి బుద్ధికి పరీక్ష పెడతాయి అవి ఆదిమానవుని చిత్తప్రవృత్తిని, బుద్ధి వికాసం పొందుతున్న దశలో అతని తహతహను అభివ్యక్తి శక్తిని ప్రతిబింబిస్తున్నాయి.[4] ఈ కథల్లో వినోదం, విజ్ఞానం రెండూ లభిస్తాయి.

---

1. జానపద వాఙ్మయ వ్యాసావళి. పుట : 143
2. ఆర్వీయస్ సుందరం. జానపద సాహిత్య స్వరూపం. 1976. పుట : 76
3. ఆర్వీయస్ సుందరం జానపద సాహిత్య స్వరూపం. 1976 పుట : 78
   "Riddles" Richand M. Dorson (Ed) Folk love and folk life P No : 130
4. ఆర్వీయస్ సుందరం జానపద సాహిత్య స్వరూపం. 1976
5. ప్రభాకర శాస్త్రి, వేటూరి. (సంపా) పొడుపుకథలు చాటు పద్యమణి మంజిరి, మద్రాసు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ 1949
   శేషగిరిరావు, ఆంధ్ర, (సంపా) పొడుపు కథలు. ఆంధ్రపత్రిక నవంబరు, 1979 మార్చి 1980.
   వెంకటప్పయ్య, వెలగా (సంపా) గోడమీద బొమ్మ, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమి హైదరాబాదు 1979
   వెంకటప్పయ్య, వెలగా (సంపా). పొడుపుకథలు. సిద్ధార్థ పబ్లికేషన్స్. విజయవాడ 1981.

పొడుపు కథల సృష్టి ప్రాచీనమైనది. అనుశ్రుతంగా ప్రచారంలో ఉన్న వాటి నాధారంగా చేసుకొని వేలకొద్దీ పొడుపుకథలు పుట్టుకొస్తున్నాయి. కానీ పల్లెల్లో ఏ కొద్దిమందిలోనో తప్ప ఇప్పుడు పొడుపు కథల్ని వేసుకొని, విప్పుకొని హాయిగా, ఆనందంగా నవ్వుకోవడం కన్పించదు. జానపద సాహిత్యప్రియులు వాటిని కొంత వరకు సేకరించి శాశ్వతత్వాన్ని కల్పిస్తున్నారు.

పిల్లల పొడుపు కథల్లో వాళ్ళ బుద్ధివికాసానికి తగినట్లుగా నిత్యజీవితంలో తటస్థపడే వస్తువులు, పరిచయమున్న విషయాలు చోటు చేసుకున్నాయి. అవి వాక్య రూపంలో కొన్ని, గేయరూపంలో కొన్ని, పద్యరూపంలో కొన్ని, సామెతలరూపంలో కొన్ని రకరకాలుగా కన్పిస్తాయి.

వాక్యరూపంలోనివి.

నాలుగైదేండ్ల వయసుండిన పిల్లలు చిన్న చిన్న వాక్యాల రూపంలో ఉన్న పొడుపుకథల్ని వేసుకుంటారు. ఉదాహరణకు. కొన్ని :

1. ఆ ఇంటికి ఈ ఇంటికి లాలాబుడిగి — కుక్క
2. కొనామాన్లో కూసి కొమ్మ — మునక్కాయ.
3. ఒక సీసాలో రెండు నీలాలు — కోడిగుడ్డు.
4. పొట్టివానికి పుట్టెడు అంగీలు — ఉల్లిగడ్డ.
5. గూటిలో గువ్వ గుంజినా రాదు. — నాలుక
6. చిడికెడు పిట్టకు మూరెడు తోక — సరిసె
7. పండుగాని పండు. — విభూది పండు.

గేయ రూపంలోనివి.

పొడుపుకథలు లయాత్మకమైన గేయరూపంలో కూడా ఉన్నాయి. ఉదాహరణకు :

1. పైనొక పలక
కిందొక పలక
పలకల నడుమ
మెలికల పాము.

—నాలుక.

2. చెయ్యని కుండ
పొయ్యని నీళ్ళు
వెయ్యని సున్నం
తియ్యగ నుండు — టెంకాయ.

3. అడవిలో పుట్టింది
అడవిలో పెరిగింది
మాయింటికొచ్చింది
తైతక్క లాడింది. — కవ్వం.

4. ఆడపళపళ ఈడపళపళ
మద్దమ్మ గుడిలో మరీ పళపళ
ఆమడ దూరం నుండి అల్లుడొస్తే
మంచం కిందిద్దరు మూరు మూలొకరు
ఉలకక పలకక ఒదిగి ఉంటారు.
— చెప్పులు, చేతికర్ర.

8. ఓరోరి పాపన - ఒల్లెల్ల గుల్లలు
కాకాకు పచ్చన - నీ కంఠ తియ్యన.
— సీతాఫలం.

పద్యరూపంలోనివి.

ఆటవెలది, తేటగీతి వంటి చిన్న చిన్న పద్యాల రూపంలో కొన్ని పొడుపు కథలు అల్లబడ్డాయి. కాని వాటిని పిల్లల సృష్టి అని చెప్పలేము. పెద్దలు సృష్టించినవి పిల్లల్లోను ప్రచారంలో ఉన్నవి. అవి ప్రాచీనాలు కావు ఆధునికాలు. ఉదాహరణకు.

పాటపాడుగాని ప్రాణంబు మరిసున్న
మాటలాడుగాని మరయు లేదు
గాలి భక్తి అన్యో గాలించి చూచినాక
దీని భావమేమి తిరుమలేశ.

హార్మోనియం.

ప్రశ్న రూపంతో ఉన్న ఈ పొడుపు కథలో తిరుమలేశ అన్నది సంబోధన. దీనికి జవాబు అని, లేదా మా అని బాగా సమాధానం చెప్పకపోవచ్చు ఇలా పొడిచే వాళ్ళు ఊహించిన సమాధానాన్నే గాక దానికి సరిపోయే సమాధాన మేదైనా చెప్పి వాదంచేస్తే వివరణతో సమర్థించుకోవడానికి బాగా పొడుపుకథల్లో అవకాశం ఉంటుంది

గొలుసులాంటి కథా నిర్మాణంతో కూడినవి.

కొన్ని పొడుపు కథలు పిల్లల నోట్ల పల్లవుల్లాగా గొలుసు కట్టుగా సాగిపోతుంటాయి. ఉదాహరణకు.

“ అంబాలు
అంబాలు మీద కుంభాలు

కుంభాలు మీద కుడితి బాన
కుడితి బాన మీద యీ (వీ) ర పలక
యీర పలక మింద (మీద) ఇనపగుండు
ఇనప గుండు పైన ఎ (వె) దురు మోసులు
ఎదురు మోసుల్లో కేసు (చు) కుక్కలు

— మనిషి.

మొత్తంపైన 'మనిషి' అనే సమాధానం వచ్చే ఈ పొడుపు కథలోని ఒక్కో పదానికి ఒక్కో సమాధానం కూడా చెప్పుకోవచ్చు.

అంబాలు - పాదాలు
కుంభాలు - మోకాళ్ళు
కుడితి బాన - పొట్ట
వీర పలక - ఎదరొమ్ము
ఇనపగుండు - తల
వెదురు మోసులు - వెంట్రుకలు
కేసుక్కలు - పేలు.

సామెతల రూపం లోనివి.

'కట్టె - కొట్టె - తెచ్చె' అన్నది రామాయణకథను సూచించే సామెత ఓన్ని చిన్నపిల్లలు పొడుపుకథగా ఉపయోగించుకొంటారు.[1]

ప్రశ్నల రూపంలోనివి.

రాజ్యమండలీ చిన్నదానా
రఘుపతి కోడాలా

1. ఆర్వీయస్. సుందరం. జానపద సాహిత్యస్వరూపం. పుట : 77

బావి త్రవ్వకనే
బావి కట్టకనే
దాహానికి నీరెట్లు వచ్చెను ?
— టెంకాయ.

ప్రశ్నోత్తర రూపంలో ఉన్న కొన్ని గేయాల్లో పొడుపు కథ ఛాయలు కన్పిస్తాయి. ఉదాహరణకు :

"నీటిలో యీదే దదియేమే
గాలిలో యెగిరే దదియేమే
జాతిలో వుండే దదియేమే
రంగు రంగుల దదియేమే.

నీటిలో యీదేదది కప్ప
గాలిలో యెగిరే దది డేగ (పక్షి)
రంగు గంగుల దది పువ్వు
అన్నీ కూడా ఒక్కటే."

(భారతి. మే. 1931)

ఈ ప్రకరణంలో జానపద సాహిత్య లక్షణాలను, వివిధ శాఖలను పేర్కొని బాల గేయాల ప్రత్యేకతను తెలపటమైంది జానపద బాలగేయోద్ధరణకు కృషిచేసిన ప్రముఖులను, ప్రచురణకు తోడ్పడిన పత్రికలను కూడా పేర్కొనడం జరిగింది. గేయాలను కాలక్రమ దృష్టితోగాక వస్తుతత్వాన్ని, ప్రయోజనాన్ని పురస్కరించుకొని విభజించి సోదాహరణంగా వివరించడం జరిగింది

ఆధునిక బాలగేయాల వర్గీకరణ వాటి విమర్శ ప్రక్క ప్రకరణంలోని ముఖ్య విషయం.

---

# 4. ఆధునిక బాలగేయాల వర్గీకరణ

వస్తుతత్త్వాన్ని, రచనావిధానాన్ని, ప్రయోజనాన్ని పురస్కరించుకొని జానపద బాలగేయాలను చాలా రకాలుగా విభజించి మూడవ ప్రకరణంలో పరిశీలించడం జరిగింది. ఆదృష్టితోనే ఆధునిక బాలగేయాలను కూడా వర్గీకరించవచ్చు. జానపద బాలగేయాల కాలం, కర్తృత్వం అనిర్ణీతం కాగా ఆధునిక బాలగేయాలను రచనాకాలాన్ని బట్టి లేదా రచయిత కాలాన్ని బట్టి పరిశీలించవచ్చు. అలాంటి పరిశీలనే రెండవ ప్రకరణంలో జరిగింది. వస్తువైవిధ్యాన్ని బట్టి, గేయాల ప్రయోజనాన్ని పురస్కరించుకొని ఆధునిక బాలగేయాలను క్రిందివిధంగా వర్గీకరించవచ్చు. వర్గీకరణ పూర్వకమైన ఇలాంటి పరిశీలన ఆధునిక బాలగేయాల వైవిధ్యాన్ని, వైశిష్ట్యాన్ని సుస్పష్టం చేయడానికి ఉపకరిస్తుంది.

1. హాస్యాత్మక గేయాలు.
2. లాలిపాటలు.
3. బుజ్జగింపు పాటలు.
4. శబ్ద చమత్కార గేయాలు.
5. ప్రార్థన గేయాలు.
6. విద్యా విషయక గేయాలు.
7. ప్రబోధాత్మక గేయాలు.
8. ఆట పాటలు.

9. పేరపఠ్యాంశాల పాటలు.
10. పండుగల పాటలు.
11. నవ్వులాట పాటలు
12. ప్రకృతి పాటలు.
13. వైజ్ఞానిక విషయ గేయాలు.
14. కథా గేయాలు.
15. జీవిత కథాగేయాలు
16. బాలల బుర్రకథలు.
17. నృత్య గేయ నాటికలు.
18. పొడుపు కథలు.

పై వర్గీకరణలో మొదటి తొమ్మిది విభాగాలకు సంబంధించిన గేయాలు ప్రధానంగా తక్కువ వయసు పిల్లలకు, మిగిలిన తొమ్మిది విభాగాల క్రింద ఉన్నవి పెద్ద పిల్లలకు ఉద్దేశించబడినట్లు గుర్తించవచ్చు. సాధారణంగా ఆధునిక బాలగేయ రచయితలకు సామాజిక స్పృహ ఉన్నప్పటికీ, వారు బాలల వయోభేదాన్ని, గ్రహణాకర్షణాదుల్ని నిశితంగా గుర్తించి రచనలు చేసినట్లు చెప్పలేము. అందువల్లనే ఆధునిక బాలగేయాల వర్గీకరణ ప్రధానంగా వయోభేదాన్నిబట్టి చేయడానికి వీలుకాలేదు. పైగా ఆధునిక బాల గేయాలు చాలా వరకు ప్రౌఢ శైలిలో వ్రాయబడినవి.

# 4 1. ప్రశంసాత్మక గేయాలు.

చిన్న పిలల అందచందాలను, ముద్దు ముచ్చట్లను, చిరునవ్వుల్ని చిలిపి చేష్టల్ని, చిత్తప్రవృత్తుల్ని ప్రశంసిస్తూ వ్రాయబడ్డ గేయాలు ప్రశంసాత్మక గేయాలు ఇవి సాధారణంగా కొంత కవితా శిల్పంతో భావ ప్రధానంగా ఉంటాయి ఈ విభాగం క్రింద చెప్పదగ్గ గేయాలు జానపద వాఙ్మయంలో మృగ్యం. బాలబాలికలను వర్ణనీయ వస్తువులుగా గ్రహించినట్టి తెలుగు గెయరచయితల వర్ణనా వైచిత్రి, సౌందర్య దృష్టి, వైయుక్తిక భావనారీతి ఈగేయాల్లో వ్యక్తమవుతాయి.

బాలలు బ్రహ్మ స్వరూపులని పాలినుంచీ ఉన్న భావాన్ని ఆధారం చేసుకొని బాలల్, బ్రహ్మాను అభేదాన్ని సూచిస్తూ [illegible] కృష్ణమూర్తిగారు

" బాల దేశం భారత దేశం
బాల పట్నం బ్రహ్మ పట్నం
బాల రూపం బ్రహ్మ రూపం
బాల వాక్యం బ్రహ్మ వాక్యం
... ... ... ..."

(బాల. సెప్టెంబరు 1948)

అన్నారు. అలాగే బాలలు భగవంతునికి ప్రతిరూపాలు అనే భావాన్ని [illegible] లక్ష్మిగారు క్రింది గేయంలో ముచ్చటగా వ్యక్తం చేశారు

" కొండమీద కోవెల కోవెలలో దేవుడూ
చిన్నారి పాపాయీ చిరునవ్వుల దేవుడూ
బంగారు పల్లకిలో ఊరేగును దేవుడూ
రంగారు పాపాయీ మనకే ఒక దేవుడూ
... ... ... ..."

(పసిడిమనసుల పాలపాటలు పుట: 16)

బాలల ప్రశంసాత్మక గేయాల్లో వాళ్ల అందచందాల్ని, హావ భావాల్ని, పసిడి నవ్వుల్ని వర్ణించే గేయాలెన్నో

" మా పాప అందం మతాబీల చందం
మా పాప వాక్యం జిలేబీల పాకం
మా పాప హాసం గులాబీ వికాసం
మా పాప కోపం పకోడీల కారం "

(బాల. జూలై 1947 పుట: 17)

అన్న గేయంలో గురుసీతాపతిగారు పాప అందచందాల్ని, హావభావాల్ని తెలిపిన తీరు అపూర్వం. ఉపమానాలు నూతనం.

పసిపాపలు నిద్రలో నవ్వితే వాళ్లను దేవుడే నవ్విస్తాడని మనవాళ్ళ నమ్మకం. ఆ నమ్మకాన్నే బసవరాజు అప్పారావుగారు క్రింది గేయంలో ఇలా వర్ణించారు

"దివ దీపము పాపణ్ణి దీవించి పోంకే
దేవ లోకములోని దేవతల్లారా !
నా పాప నిద్దర్లొ నవ్వుకుంటాడు
ఆస్నేకా లాడెనో అప్సరసలతోను ॥దివ॥
మా తండ్రి నిద్దర్లొ మాటాడుతాడు
తెలియు జెప్పెనెమొ దేవరాజులు ॥దివ॥
నన్నయ్య నిద్దర్లో కన్ను గిలికేను
పెట్టి లోకము జూచి వెక్కిరించేనో ॥దివ॥
భాగీశ్వరి క్షేమ లాభము లిచ్చి
చిన్నయ్య బజ్జోర శ్రీరామ రక్ష" ॥దివ॥

(భారతి డిసెంబర్ 1930)

నండూరి రామమోహనరావుగారు పాప నవ్వును వెన్నెలతో, మల్లెలతో, ముత్యాలతో, పువ్వులతో పోల్చారు. నిద్రలో నవ్వే పసిపాప నవ్వును —

" మాయమర్మ మెరుగనిదీ - మాట మరితి తెలియనిదే
మాటి మాటి కెందుకో - మధురముగా నవ్వేను
కల లోపల కథలేవో - కని నవ్వెను కాబోలును
కళ్ళు తెరచి కల వోడని - తెల్లబోవు కాబోలును "

(హరివిల్లు పుట. 27)

అని చమత్కరించారు

యం. వి. అప్పారావుగారి 'పాపాయి నవ్వు' గేయంలోని భావశిల్పం మెచ్చదగింది

"నిశ్చలమైన నిర్మలమైన
పాపాయి నవ్వు ఎక్కడికి వెళ్ళింది ?
సూర్యునికి తేజస్సు చంద్రునికి చల్లదనం
పుష్పములకు పరిమళం వెదజల్లి......
మరల తిరిగి వచ్చింది
తల్లి వడిలో తలదాచుకుందామని"

(ప్రగతి 20 7 73)

కాకి పిల్ల కాకికి ముద్దన్నట్లు ప్రతి తల్లికి తనబిడ్డ ముద్దుబిడ్డే తన పాప ఏంచేసినా ఆ తల్లి కది ముచ్చటగా తోస్తుంది పిల్లల ప్రతికదలికా తల్లిదండ్రులకు ఆనందదాయకమే. ఆ భావాన్నే బెజెండ్ల సాంబశివరావుగారు క్రిందిగేయంలో వ్యక్తం చేశారు

"ఇంటిలో పాపాయి పుట్టంగ ముద్దు
తొట్టిలో పాపాయి ఊగంగ ముద్దు
అటు ఇటు పాపాయి నడయాడ ముద్దు
'అత్త తాత' యని అన్నపుడు ముద్దు
... ... ... ..."

(ముద్దు పాటలు)

పిల్లలకు వయసే పెరిగిన జ్ఞానం అప్పుడే పెరిగి పెద్దవాళ్ళవుతున్న పిల్లలకు సహజంగా ఎన్నో సందేహాలొస్తుంటాయి అలాంటి పిల్లల సందేహాలకు రూపకల్పనే అప్పరాజు విక్రమసేనరావుగారు వ్రాసిన 'ఎందుకు ? ఏమిటి ?' అనే క్రింది గేయం

" పగలంతా తెల్లగా - రాత్రి రంతా నల్లగా
నీళ్ళేమో చల్లగా - పళ్ళేమో పుల్లగా
ఎందుకు ఉంటాయమ్మా?
... ... ... ... ..."

(ఆంధ్ర జ్యోతి సచిత్ర వారపత్రిక బొమ్మరిల్లు శీర్షిక నుండి)

" ఎల్లానొచ్చావురా తమ్మూ - నిన్నెవరిచ్చారురా అమ్మకి
అమ్మా జేజికి దణ్ణంపెడితే - అమ్మకు జేజే నిన్నిచ్చిందా?
ఆసుపత్రిలో మంతరసానీ - అందుకొనీ అమ్మకు ఇచ్చిందా?
... ... ... ... ..."

(జేజి మామయ్య పాటలు)

అన్న గేయంలో చిట్టితమ్ముడు అమ్మకు ఎలా కలిగాడు అని బాలునకు కలిగే సందేహాన్ని, ఊహించే సమాధానాన్ని బాలాంత్రపు రజనీకాంతరావుగారు చక్కగా వ్యక్తం చేశారు

కమ్మిశెట్టి వెంకటేశ్వరరావుగారు 'చిన్నారిలోకం' అనే శీర్షికలో వ్రాసిన క్రింది గేయం బాలబాలికల బృందగానానికి అనువైన రచన. గేయం ఉత్తమ పురుషలో నడిచినా చిన్నపిల్లల చిత్త ప్రవృత్తులీ గేయంలో చక్కగా వ్యక్తమైనాయి

"చిన్నారి లోకాన చెంగు బాలలమండీ
చిరునవ్వు చిందించు చిన్ని పాపలమండీ
... ... ... ... ...
చిట్టి పొట్టి కథలు చెప్పుకుంటూ మేము
ఆటలతో పాటలతో హాయిగా వుంటాము"

(విశాలాంధ్ర. 11. 11 56. పుట : 6)

చిన్న పిల్లల ప్రపంచమంతా ఇంటికీ, బడికి పరిమితమై ఉంటుంది. పిల్లలకు బడిపంతులు చక్కని ఆదర్శం. అందుకే పెద్దవాళ్లయిన తర్వాత తాముకూడా బడిపంతులు కావాలనే ఊహ సాధారణంగా వాళ్ళకు కలుగుతుంటుంది. ఆ ఊహకు వల్లభనేని కాశీవిశ్వనాథంగారు ఈ గేయంలో చక్కని రూపకల్పన చేశారు.

"పంతులుగారిని నేనే అయితే - ఫస్టుగ హేటూ
బూటూ కోటూ వేసుక బడికీపోదును నేను
తరగతి పిల్లలు తలకొక రీతిని - గందరగోళము చేస్తూ నను గని
బల్లుల కైవడి బల్లల జేరి - చల్లగ నుందురు మెల్లగ నుందురు
బాలుర నందర పరికిస్తూ నే - చెప్పినవన్నీ చదివితిరా ? యని
దబ్బర మాటల దెబ్బ లొసంగుచు - నిజమాడండని నిగ్గదీతునూ
... ... ... ... ... ... ...

(లోకజ్ఞానం)

పిల్లల ఊహల్లో, మాటల్లో ఎంతో అమాయకత్వం ఉట్టిపడుతుంటుంది. అసాధ్యమైన పన్లె తమకు సాధ్యమవుతాయనే భావం కూడా వాళ్ల ఊహల్ని ఆవరించి ఉంటుంది.

"అమ్మా ! అమ్మా ! నే ఆడే బొమ్మ మీద
అక్కా చెల్లీ సీతా అన్నా పాపా శోభీ
అంతా కలిసి ఆనందంగా ఆకాశానికి ఎగిరి వెళ్ళితే
ఎలాగుంటుందంటావమ్మా - నీవెలా గుంటుందంటావమ్మా ?
రాజూ రమా రెక్కల చివర - రాధా రమణా రెక్కలమధ్య
లక్ష్మి లలిత రెక్కల మొదట-విమలా కమలా రెక్కలముందు
బాలలందరి మధ్యలో నీవు - బాతుపైని కూర్చుని వుండగ
... ... ... ... ... ... "

(ఆంధ్ర మహిళ, నవంబరు 1953 పుట : 101)

సాధారణంగా ప్రశంసాత్మక గేయాల్లో గేయ రచయితల వ్యక్తిత్వమే ప్రస్ఫుట మవుతూ ఉంటుంది పెద్దలయిన రచయితల భావాలు చిన్నపిల్లల మనసులో పరకాయ ప్రవేశం చేసినట్లు ఉంటాయి. ఉదాహరణకు:

" అమ్మా నేనొక రంగు మబ్బునై ఆకాశంలో ఎగిరిపోనటే ?
దేశదేశముల తిరిగినే తీయని వానలు వర్షిస్తానే !
... ... ... ... ...

అమ్మా నేనొక పూలనొకనై ఆసముద్రముల దాటిపోనటే
వింత దీవిలో రత్నాల్ ముత్యాల్ సంతరించుకొని తిరిగిరానటే
... ... ... ... ...

పాపా! ఎక్కడుంటివే అని నువ్వు పలుకరించితే చాలే అమ్మా
నీ ఒడిలోనే వ్రాలిపోనటే నీ ముద్దులలో మునిగిపోనటే. "

(జాబిల్లి పాటలు.)

నార్ల చిరంజీవిగారు వ్రాసిన పై గేయం గొప్పగొప్ప ఊహలతో నడిచింది అద్భుతమైన అంశాలకు ఆకర్షితమయ్యే మనస్తత్వం పిల్లలది. వాళ్ల ఊహలూ అలాగే ఉంటాయి. పిల్లల మనస్తత్వాన్ని చక్కగా, సుదీర్ఘంగా చిత్రించిన వాళ్లలో చెప్పుకోదగ్గవారు కవిరావుగారు. ఉదాహరణకు.

" కాల్వలో వేతు నా కాగితపు పడవల్ని
ఖండ ఖండాలెల్ల గాలించిరాగ కాల్వలో...
నాయూరు నాపేరు వ్రాయింతు దానిపై
నావ చూడంగనే నాగొప్ప తెలియాలి కాల్వలో...
మాతోటలో మంచి మంచి పువ్వులుకోసి
ఎన్నెన్నొ దేశాల కెగుమతులు చేయాలి కాల్వలో...
ఏ రేవు చూచినా నా పడవలే నిలచి
'మన' పేరు లోకాల మార్మోగి పోవాలి కాల్వలో...

(నెలవంక. పుట : 3)

పిల్లల మనస్తత్వాన్ని ఇంచుమించు ప్రతిబాలగేయ రచయిత ఏదో ఒక రూపంలో చిత్రించారు వాళ్ళను, వాళ్ళరచనలన్నింటిని పేర్కొనటం గ్రంథవిస్తర భీతివల్ల సాధ్యం కాదు. స్థాలీ పులాక న్యాయంతో కొన్ని మాత్రమె ప్రస్తుతం పరిశీలించబడ్డాయి. మొత్తం మీద ఆధునిక రచయితలు వ్రాసిన ప్రశంసాత్మక గేయాల్లోని భావాలు, ఊహలు బాలల మనస్తత్వానికి అద్దం పట్టేవి కావచ్చు కాని భాషమాత్రం ప్రౌఢసాహిత్య తత్వానికి ఏ మాత్రం భిన్నంగా లేదనే చెప్పాలి

## 4. 2 లాలిపాటలు.

లాలిపాటలు ఆధునికాలు కావు కానీ ఆధునికులు కూడా లాలిపాటల్ని వ్రాశారు అవి ప్రాచీనమైన లాలిపాటలకు అనుకరణ ప్రాయాలే కానీ విషయం లోను, భావంలోను క్రొత్తదనం గోచరిస్తుంది ఉదాహరణకు:

"లాలి లాలీ బాల - లాలి గోపాలా
లాలి భరతాన్వయా - లంకార బాలా
... .. ... ...
వెన్న మీగడ జున్ను - అన్ని తిని పెరిగి
తిన్నగా మన తెనుగు - తేనె చవి కొనుము ॥లాలి॥
.. ... .. ...
నిత్య కల్యాణమూ - పచ్చ తోరణమూ
తెలుగు నేలకు జేసి - పలుకుమో బాలా ! ॥లాలి॥"

(బాల ఏప్రిల్. 1947. పుట : 30)

గత్తి కమలమ్మగారు వ్రాసిన దేశభక్తి మిళితమైన పైలాలిపాటలో 'లాలి గోపాలా' అనే సంబోధన పాతపద్ధతికి చెందినది 'భరతాన్వయాలంకారబాలా' అనే భావం నూతనమైంది ఈగేయంలో తెలుగుదేశం, తెలుగుసంస్కృతి చక్కగా ప్రశంసించబడింది

ఎత్తుగడలో ప్రాచీన చరణాలను ప్రవేశపెట్టి తర్వాతి భాగాన్ని నూతనమైన పద్ధతిలో వ్రాసిన లాలిపాటలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు: వేజెండ్ల సాంబ శివరావుగారు వ్రాసిన ఈపాట గమనించదగ్గది

" ఏడవకు చిట్టిపాప ఏడవకు తండ్రీ
ఏడ్చేటి కన్నుల్లు నీలాలు కారు
చూడు చూడూ పాప అదిగో కాకమ్మ
చెట్టు కొమ్మామీద కూరుచున్నాది
ఇటు చూడు చిట్టిపాప పిచికమ్మ ఆట
చెంగు చెంగున గంతులేస్తున్నదోయి
... ... ... ... "

(ముద్దు పాటలు)

పిల్లల్ని నిద్రపుచ్చే సన్నివేశానికి అనువైన పద్ధతిలో బాలగంగాధర తిలక్ గారు క్రిందిపాటను వ్రాసి ఉన్నారు. ఈ పాటలో తిలక్‌గారి సామాజిక స్పృహ ప్రతిబింబిస్తుంది.

"నిదురించు చిట్టి నాతండ్రీ ! నిదురించు బంగారు తండ్రీ !
నీకు నాకన్నీరు నిత్య దీవన శాంతి ! నీకు నా ప్రాణమే
నీరాజనపు శాంతి ॥నిదు॥
... ... ... ... ... ...
నిరుపేద నీతల్లి నిరుపేద నీతండ్రి దోసెడైనా లేదు ఉసురు
నిలిపే గంజి
నిన్నిచ్చి నీ కడుపు చిచ్చుకో ? నాకిచ్చి నా కడుపు కోతకో ?
... ... ... ... ... ...

కోదమ సింహాపు జూలు కొండ శిఖరపు కేలు
చండ సూర్యుని రథము, కత్తి మోపిన పథము
నీ కలల నినదించు నిత్య శౌర్యపు వేట ॥నిదు॥

(ఆంధ్ర మహిళ. జూన్ 1944 పుట : 32)

ఆధునిక రచయితలు వ్రాసిన జోలపాటల్లో ప్రబోధాత్మకమైన గేయాలు కూడా కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు: పురాణపండ కామేశ్వరరావుగారి గేయం.

"ఉగ్గు పాలు త్రాగినీవు ఊయలనే ఊగి
హాయిగా తీయగా నిదురపోరా !
అమ్మా అని ఏడవకూ అవ్వా అని పిలువకూ
ఆదమరచి కన్నారి నిదురపోర చిన్నారి

... ... ... ... ...

విలువిద్యలో ఘనుడవై వెలుగొందర విశ్వమందు
పలువురి మన్ననలలో పేరొందర జగతియందు
కత్తిపట్టి గుఱ్ఱమెక్కి ఎదిరించర వీరులనూ
బాలవీర చంద్రుడవై చాల ఘనత పొందుమురా !"

(బాలగేయాలు. పుట : 23)

ఆధునిక బాలగేయాల్లో లాలిపాటలు తక్కువే, వాటికి ప్రచారం కూడా లేదంటే అతిశయోక్తి కాదు. ఈనాటికి లాలిపాటల్లో ప్రజాదరణ పొందినవి ప్రాచీనమైనవే.

## 4. 3. బుజ్జగింపు పాటలు.

పిల్లలు మారాము చేసినప్పుడు, ఏడ్చినప్పుడు, అల్లరి చేసినప్పుడు తల్లుల సహనశక్తికి ఒక పరీక్ష, ఎంత విసిగించినా విసుక్కోకుండా ప్రతితల్లీ ఏవో కల్లబొల్లి

మాటలు చెప్పో, చిన్న చిన్న పాటలు పాడో బుజ్జగించి పిల్లల్ని సామదాన పద్ధతిలో సముదాయిస్తుంది. కానీ దండ ప్రయోగం చెయదు. బుజ్జగించడానికి అనువైన పాటలు ప్రాచీన సాహిత్యంలో లేకపోలేదు. ఆధునిక గేయాల్లోకూడా పిల్లల నుద్దేశించి తల్లులు కొన్ని సన్నివేశాల్లో బుజ్జగింపుగా పాడడానికి అనువైనవి ఉన్నాయి.

సాధారణంగా పిల్లలు అన్నంతినే సమయంలో ఎక్కువ మారాము చేస్తుంటారు. ఎలాగైనా మాటలుతో, పాటలతో మరిపించి తినిపించడం ప్రతితల్లి అనుభవానికి వచ్చే సన్నివేశం "చందమామరావె ———" అనే పాతపాటకు అనుకరణ ప్రాయాలైన గేయాల్ని కొందరు వ్రాసిఉన్నారు. ఉదాహరణకు నండూరి రామమోహనరావుగారి గేయం

" చందమామ రావె జాబిల్లి రావె
మబ్బులెక్కి రావె మా ఇంటికేసి
... ... ... ...
గయ్యాళి పాపనీ ఉయ్యాల ఊపి
లాలించి హాయిగా జోలల్లు పాడి
కళ్ళలో తీయనీ కలలల్లి పోవె ! "

(హరివిల్లు పుట - 25)

అన్నం తినక అల్లరి చేస్తున్న బిడ్డను తల్లి కాకిపేరు, పిల్లిపేరు చెప్పి మరి పించి తినిపించే దృశ్యం అందరికీ పరిచయమైందే బాలాంత్రపు రజనీకాంతరావుగారి ఈపాట అలాంటి సన్నివేశాన్ని చిత్రించేదే.

" కాకీ కాకీ హాష్ - కాకీ కాకీ రాకే రాకే
పాపాయి బువ్వ తింటుందే కాకీ కాకీ హాష్...
వెండిగిన్నెలో పప్పూ బువ్వా - గుంజు గుంజు గుంజు
గోరు గోరు గోరు ... ...

కంచం అంచున రాసీ గోరూ గుజ్జూ తీసీ
బజ్జీనోటా అం .. అత్తా ముద్దా ఆ ఆ ఆ
ఆ ఆ ఆ — అం ... ... ..

(జేజిమామయ్య పాటలు)

పిల్లల కోరికలన్నీ తీర్చటానికి ఏ తల్లిదండ్రులకూ సాధ్యంకాదు. అనవసరమో అసాధ్యమో అయిన పిల్లల కోరికల్ని పెద్దవాళ్ళు మన్నించనప్పుడు వాళ్ళు ప్రయోగించే ఆయుధం అలుక లేదా ఏడుపు. పిల్లల అలుకను, ఏడుపును నయానా తీర్చడం ఉత్తమం. పిల్లల అలుకను తీర్చే సన్నివేశ సంబంధమైన క్రిందిపాట వాండేగారి రచన

" పక పక నవ్వే పసిడి బొమ్మలు - కిచ కిచ అరచే పొట్టి పిట్టలు
చర చర పోయే చిట్టిపాపకు - కావాలంటే తెచ్చేదెలాగు
... ... .. ... .. ...
తళ తళ మెరిసే మింటి తారలు - వన్నెలు కురిసే వెన్నెల రేడు
పక పక నవ్వే బోసిపాపకు - కావాలంటే తెచ్చేదెలాగు
పాప కోరికలు విన్నారండీ - కోరికలన్నీ తెస్తారండీ
తెగలిగితే ముందుకు రండి - మా పాపకు చప్పున అందించేస్తా"

(బాల అక్టోబరు 1957 పుట. 49)

## 4. 4. శబ్దచమత్కార గేయాలు

అర్థానికి గాని, భావపుష్టికి గాని అంతగా ప్రాధాన్యం లేకుండా శబ్దచమత్కారంతో కూడిన బాలగేయాలను ఇంగ్లీషులో Nonsense Rhymes అంటారు. తెలుగులో, ఇంగ్లీషులోని Nonsense Rhymes ని అనుకరిస్తూ అద్యంతాను ప్రాసలు, యతులు, యమకాలు, ధ్వన్యనుకరణ పదాలు మొదలైన వాటిని ప్రయోగించి వ్రాయబడ్డ శబ్దచమత్కారంతో కూడిన గేయాలని జానపద సాహిత్యంలో బాలల సృష్టిఅని

చెప్పబడిన ఆటపాటల్లో శబ్దప్రధానమైన పాటలు కన్పిస్తాయి అవి కేవలం అర్థరహిత మైనవి కావు శబ్దచమత్కార ప్రధానమైనవీ కావు లయతో కూడు కొన్నవి Nonsense Rhymes లో Sense ఉండదు శబ్దచమత్కారముంటే ఉండవచ్చు. అన్వయించు కొంటే తెలుగులోని శబ్ద చమత్కార ప్రధానమైన ఆధునిక బాలగేయాలు అర్థవంతంగానే కన్పిస్తాయి.

అంత్య ప్రాసతో కూడిన ఈక్రింది గేయం 'మ' అనే శీర్షికతో ప్రతికింపుగా వ్రాయబడింది, రచయిత కుక్కదపు సత్యనారాయణ. దీనిలో శబ్దప్రాధాన్యమే గాని అర్థ ప్రాధాన్యం కన్పించదు

"జై గోవిందు జై గోవిందు - గాంధికి విందు బూందీ తిందు
బడిలో హిందూస్తానీ విందు - ఎకుల రాట్నం తీయాముందు
బాలను గొందు బాగుగ నుందు - జై జై యందు జైహిందు !"

(బాల సెప్టెంబరు. 1946. పుటః 74)

న్యాయపతి రాఘవరావుగారి ఈ గేయంలోని శబ్ద చమత్కారం గమనించ దగింది ఈగేయంలో రచయిత ఒక సందేశాన్ని అందించడానికి చేసిన ప్రయత్నం కూడా స్పష్టంగా గోచరిస్తుంది

" అనగా అనగా ఒక చిచ్చు
దీపావళికే ఇది వచ్చు
వస్తే మనకెంతో డబ్బు ఖర్చు
ఇంట్లో ఒక బొచ్చుకుక్క ఉండొచ్చు
చిచ్చు వెలిగిస్తే దాని బొచ్చు అంటుకోవచ్చు

మీ ఇంట్లో దోమలు ఉండొచ్చు
చిచ్చు పొగకి దోమలు చచ్చు - కాని

గదిలో కాల్చొచ్చని మీరనుకోవచ్చు
గచ్చుమీద కాలిస్తే గచ్చుపెచ్చులూడొచ్చు
అదిగాక ఇంటికి డేంజర్ హెచ్చు
పెద్దలచేత చీవాట్లు పైపెచ్చు!
కనుక బాలలూ! ఈచిచ్చును
కొనకుంటేనే మీ పెద్దలు మెచ్చు!"

(బాల. నవంబరు 1950 పుట - 16)

అలపర్తి వెంకటసుబ్బారావుగారి ఈ గేయంలో కూడా అలాంటి శబ్దచమత్కారమే కన్పిస్తుంది.

" పలకా చెక్క బలపంముక్క - దొరికిన వక్క ద్వారం ప్రక్క.
పలకాచెక్క పైనే లెక్క - చేస్తానక్క చూస్తావక్క
... ... ... ... .
చీకుచు మెక్క చివరికి ఒక్క - బెల్లం ముక్క పెడతావక్క! "

(తాయం)

ఇక అద్యంత ప్రాసలతో కూడిన బాలగేయాలెన్నో ఉన్నాయి, క్రింది గేయం సమతారావుగారి రచన.

" గట్టు మీదొకచెట్టు - చెట్టు మీదొక పిట్ట
పిట్ట కట్టెను గూడు - పెట్ట గుడ్లను జోడు
... ... ... ... ..."

(బాల. ఆగష్టు 1946. పుట. 34.)

ధ్వన్యనుకరణ పదాలతో కూడిన గేయాలు పిల్లల్ని బాగా అలరిస్తాయి, అలాంటి గేయమొకటి రచన : లక్ష్మిగారు.

" జలజల పువ్వులు - కలకల నవ్వులు
గణగణ గంటలు - కణకణ మంటలు
తళతళ మెరుపులు - పెళపెళ ఉరుములు
... ... ... ... "

(బాల అక్టోబరు 1957 పుట : 6,

బాలాంధ్రపు రజనీకాంతరావుగారి ఈ గేయంలో అప్పుడే ముద్దుముద్దుగా మాటలు నేర్చుకొంటున్న చిన్న పిల్లల్ని అలరించే శబ్దచమత్కారం ఉంది.

" బురుకూ బురుకీలు, ఓహో ఎక్కడ దొరికీలు
ముద్దూ పెట్టే వారికి చిట్టీ బరుకూ బఠికీలు !! ॥బురుకూ॥
... ... ... ... ... ... ...
చిట్టి తమ్ముల్లు ఓహో చిన్నా పాపల్లూ
చీచీ అంటే తెరలూ తెరలూ బోచీనవ్వుల్లూ" ॥బురుకూ॥

(జేజి మామయ్య పాటలు)

ఇలాంటిగేయాలు ఇంకా ఎన్నో ఉన్నాయి అసలు ఈగేయాల్లోని వైశిష్ట్యం అవి అతి సులభంగా పిల్లలకు నోటికి రావటం. శబ్దాశ్రయమైన హాస్యం ఈ గేయాల్లో ఉండడంవల్ల వాటిని పాడేటప్పుడు లేదా విన్నప్పుడు పిల్లలు నవ్వడం సహజం.

## 4. 5. ప్రార్థన గేయాలు.

చిన్నపిల్లల్లో భక్తిభావాలను నాటడానికి ఉద్దేశించిన ప్రార్థనగేయాలు ఆధునిక బాలగేయాల్లో ఎక్కువగానే కన్పిస్తాయి. పిల్లలకు అక్షరాభ్యాసం చేయించేటప్పుడు చదువులతల్లి అయిన సరస్వతికి పూజలు జరిపించడం తెలుగువాళ్ల సంప్రదాయం. విఘ్నోపశాంతికి వినాయకుని పూజించడం కూడా తెలుగు నాట అనాదిగా వస్తున్న ఆచారమే. వినాయకుని ఆకారం, వాహనం, అతనికి జరిపే పూజలు పిల్లల్ని

ఎక్కువగా ఆకర్షిస్తాయి. వినాయక చవితి పండుగను వాళ్ళు ఎంతో సంబరంగా జరుపుకుంటారు. అలాగే బాల కృష్ణుని రూపురేఖలు, చిలిపి చేష్టలు పిల్లల్ని ఉత్తేజ పరుస్తాయి. అందుకే ఆధునిక సాహిత్యంలో వినాయకునికి, బాల కృష్ణునికి సంబంధించిన పాటలు ఎక్కువగా చోటు చేసుకున్నాయి.

భక్తి భావంతో దేవునికి చేతులు మోడ్చి నమస్కరించడం మన ఆచారం. కె. ఎస్. ప్రకాశరావుగారు దేవునికి దండం పెట్టే విధానాన్ని ఈగేయంలో తెలిపారు.

" చిటికెన వేలు చెల్లాయి - ఉంగరం వేలు బంగారు
మధ్యవేలు నాయన్న - చూపుడు వేలు నీకేసి
బొటన వేలు బొట్టెట్టి - ఐదువేళ్ళ అరచేయి
అరచేయి అరచేయి అంటిస్తే- దేమునకు దణ్ణం పెట్టొచ్చు."

(బాల అక్టోబరు 1957 పుట. 24)

సరస్వతిని భక్తితో స్తోత్రం చేయడానికి వీలుగా కవుల ఆంజనేయశర్మగారీ గేయాన్ని వ్రాశారు.

" నమో శారదాంబా! మా నమస్సులివె గొనుమా!! ॥నమో॥
నీదు బిడ్డలము చిట్టిబాలలము నిత్యము నిన్ను భక్తిగొలుతుము
అజ్ఞానమ్మును పారద్రోలి విజ్ఞానము మాకొసగుము తల్లీ
॥నమో॥
... ... ... ... ... ..."

(భావిపౌరులు పుట. 1)

వినాయక పరమైన గేయాలు తెలుగు సాహిత్యంలో కోకొల్లలు. ఉదాహరణకు దాశరథిగారి గేయం.

" విఘ్నేశ్వరు కీ దండాలు - వినాయకునికీ దండాలు
ఎలుక సవారికి దండాలు - ఏనుగు మోముకు దండాలు

బొజ్జసామికీ దండాలు - పార్వతి కొడుకుకు దండాలు
ఉండ్రాళ్లయ్యకు దండాలు - దయామయునికీ దండాలు
వరాలయ్యకు దండాలు - బాలల పెద్దకు దండాలు"
(బాలగేయాలు. పుట : ౭)

బాలకృష్ణుని రూపురేఖలను, చేష్టలను సహజ సుందరంగా, మనోహరంగా వ్రాసిన వారిలో చింతా దీక్షితులుగారు పేర్కొనదగ్గవారు (లక్క పిడతలు) ఉదాహరణకొక గేయం.

" చిన్ని కృష్ణుడు పుట్టాడు - చిటపట పువ్వులు కురిశాయి
చిన్ని కృష్ణుడు నవ్వాడు - తళతళ మెరపులు మెరిశాయి
చిన్ని కృష్ణుడు నడిచాడు - తప్పట్లు కొట్టింది భూదేవి
చిన్ని కృష్ణుడు ఆడాడు - అప్పుడు ఆటలు పుట్టాయి
చిన్ని కృష్ణుడు పాడాడు - అప్పుడు పాటలు పుట్టాయి."
(లక్క పిడతలు.)

భజన పాటలు కూడా ప్రార్థనా గేయాల్లోనే చేర్చదగ్గవి కొంతమంది సమూహంగా ఏర్పడి మొదట ఒకరొక చరణాన్ని పాడితే మిగిలిన వాళ్లా చరణాలను అనుకరిస్తూ పాడడమే భజనచేయడం. పండుగలప్పుడూ, ఇతర ఉత్సవసమయాల్లోనూ భక్తులు పరవశులై భజనలు చేస్తుంటారు. అలాంటి పాట ఒకటి.

"రాం రాం భజనండోయ్ - రామదేవుని భజనండోయ్
పూలూ పత్రీ తెరండోయ్ - పూజలు బాగా చేయండోయ్
కొబ్బరి ప్రసాదం చేయండోయ్ - కోరినంతగా తినరండోయ్
చిట్టిపాపలు చేరండోయ్ - చేతులెత్తి మొక్కండోయ్
(బాలసాహిత్య మంజరి)

భజన చేయడం పూర్తయిన తర్వాత దేవునికి నైవేద్యం పెట్టిన ప్రసాదాన్ని పిల్లలకు పంచిపెట్టడం మామూలే. కనుపర్తి వరలక్ష్మమ్మగారు పైగేయంలో ఆవిషయాన్నే తెలిపారు దేవునికంటే ప్రసాదం భక్తే పిల్లలకెక్కువని చెప్పవచ్చు.

తెలుగుదేశంలో క్రైస్తవ బాలబాలికలు చర్చిలోను, ఇంట్లోను, బడిలోను పాడుకోవడానికి వ్రాసిన పాటలు కొన్ని ఉన్నాయి. అవి చాలావరకు సంకీర్తన లక్షణాలను కలిగి ఉన్నాయి వాటిలో సాధారణంగా యేసుక్రీస్తు మహిమలు, బైబిలు కథల ప్రస్తావన, కరుణ, భక్తి మొదలైన వాటి ప్రశంస కన్పిస్తుంది. ఉదాహరణకు

"ఓ యేసు ప్రభువా - చిన్నపిల్లను - నేను
మొరపెట్టుకొంటిని - చిన్నపిల్లను - నా
మొరాలకించండి - చిన్నపిల్లను
కోడి తన రెక్కల క్రింద పిల్లలను దాల్చినట్లు
నేడు మీా రెక్కల క్రింద మమ్ము దాయండయ్యా"
(కీర్తనలు - పల్లవులు పొడుడి సామెతలు పుట . 17)

ప్రార్థనాగేయాల ప్రయోజనం చిన్నపిల్లల మనసుల్లో భక్తిభావాల్ని నాటడం ఈపాటల్లో వినాయకుని పరమైనవి, బాలకృష్ణునికి సంబంధించినవి ఎక్కువగా కన్పిస్తాయి.

## 4. 6. విద్యావిషయక గేయాలు.

పిల్లల్లో విద్యపై ఆసక్తిని పెంచడానికి విద్యార్జనలో మొదట అక్షరాలు, అంకెలు, వారాలు, తిథులు, నెలలు, ఋతువులు మొదలైనవాటిని పరిచయం చేయడం అవసరం అవి గేయరూపంలో ఉంటే వాళ్లు ఉల్లాసంగా సులభంగా నేర్చుకుంటారు. అలాంటి గేయాలను పరిశీలిస్తే పిల్లలకు ఆసక్తిదాయకంగా ప్రయోజన పూర్వకంగా వినోదాన్ని మేళవించి విజ్ఞానాన్ని రంగరించి రచనలు చేయడానికి ఆధునిక రచయితలు ప్రయత్నించారన్న విషయం స్పష్టమవుతుంది.

అక్షరాలను నేర్పే గేయాలు.

తెలుగు అక్షరాలతో బాటు ఆదర్శాలను బుగత సాంబమూర్తిగారు ఈగేయంలో పొందుపరచారు

"అ ఆ ఇ ఈ అనిమెదము - అందర మొకటై మెలగెదము
ఉ ఊ ఋ ౠ అనియెదము - ఉల్లాసంగా ఉండెదము
ఎ ఏ ఐ అనియెదము - ఎప్పుడు సత్యము పలికెదము
ఒ ఓ ఔ అనియెదము - ఓరిమి నెప్పుడు మెలగెదము
క ఖ గ ఘ అనియెదము - కలసి మెలసి యుండెదము
... ... ... ...
శ ష స హ అనియెదము - శౌర్యముతో మనము మెలగెదము"
(బాల జూలై 1951 పుట : 29)

తల్లిని దైవంగా చాటిచెప్పే ఈ గేయంలో ప్రతిపాదంలోని మొదటి అక్షరాలను గ్రహిస్తే తెలుగు అక్షరమాల కన్పిస్తుంది రచయిత తాడివెంకట కృష్ణారావుగారు.

"అమ్మ నీవు మరి దైవంరా
ఆదరించి నిను చూచునురా
ఇప్పుడు అప్పుడు ఎప్పుడైననూ
ఈల వేసినా గోలచేసినా
ఉరక లేసినా పరుగు లేసినా
ఊరడించి ముద్దాడునురా
... ... ...
అందుకు నిన్ను పొగడుతుండగా
అః అని పొంగిపోయెది అమ్మేరా."
(సిరిముక్కమొగ్గ)

ఇలాంటి గేయాలు పాల్కురికి సోమనాథుని అక్షరాంక గద్యను తలపిస్తాయి ఈ పద్ధతిలో కొంతమంది కథలుకూడా చెప్పారు. పి. వి. భద్రాచార్యులుగారి ఈ అక్షరాంక గేయం చూడండి

"అదొక చిట్టడవి
ఆ అడవిలో కొన్ని ఆవులు మేస్తున్నాయ్
ఇదిగో అంటూ ఒక పులి వచ్చింది
ఈ ఆవులన్నీ హడలి పారిపోయాయి
ఉన్నది ఒక ముసలి ఆవు
ఊరక నన్ను చంపకు చిన్న సంగతి అంది ఆవు
ఎందుకు చంపవద్దు ?
ఏమిటా సంగతి ? అంది పులి
ఐతే చెప్తా విను నాకో చిన్న బాల వుంది
ఒక్కసారి వెళ్ళి పాలిచ్చి వస్తానంది ఆవు
... ... ... ... ..."

(బాల జూన్ 1949 పుట : 15)

అలాగే ఆంగ్లాక్షరాలతో అల్లిన గేయాలూ ఉన్నాయి ఐచ్ఛల ముని కన్నయ్యగారి గేయం.

"A B C D నేర్వండి ఎక్కువ జ్ఞానం పొందండి
E F G H వరుసగనూ ఇంపుగ వింటూ చదవండి
I J K L ఆటలతో నైజాగ్ వరకూ వెళ్ళండి
... ... ... ..."
X Y Z లను పూరించి ఎగ్జామినేషన్ నెగ్గండి."

(బాల జూలై 1954 పుట : 4)

అంకెలు నేర్పే గేయాలు.

జానపదసాహిత్యంలో ఆటపాటల్లో అంకెలతో కూడిన గేయాలు కొన్ని కన్పిస్తాయి వాటికి అనుకరణ ప్రాయాలైన గేయాలు కొన్ని ఆధునిక సాహిత్యంలో ఉన్నాయి ఉదాహరణకు : ఎజండ్ల సాంబశివరావుగారి గేయం.

"ఒకటీ రెండూ వన్నెల కుప్పలు-కుప్పలు తాకిన ఒప్పునె అక్కా!
మూడూ నాలుగు ముత్తెపు కోనలు - కోనలు దూరిన ఒప్పునె
అక్కా!

... ... ... ... ..

(ముద్దుపాటలు.)

అంకెలతో కూడిన గేయాల్లో నీతిబోధ కూడా కన్పిస్తుంది.

" ఒకటీ రెండూ ఒప్పుగ వుండు
మూడూ నాలుగు ముచ్చట కలుగు
అయిదూ ఆరు అల్లరి వారు
ఏడూ ఎనిమిది ఏహ్యత అగు నువ
తొమ్మిదీ పది నమ్మమా ఇది! "

(అలపర్తి వెంకట సుబ్బారావు తాయం పుట: 4)

కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఈగేయంలో (ద్విపదలో) అంకెలతోపాటు తత్వబోధ కూడా చేశారు.

" ఒక్కడే పరమాత్మ నిక్కంబుగాను
మంచి చెడ్డలు రెండె మహినిల్చు సుమ్మీ
మూటి నెర్గిన వాడె ముని తల్లజుండు
వేదములు నాలుగు విదితంబు గాదె

ఐదు భూతమ్ములె ఆధారములకు
ఋతువు లారెగ కాలగతిని నడిపించు
ఏడు కొండల వాడె ఇలవేల్పు మనకు
దిక్కు లెన్మిదిగాదె లెక్కించిచూడ
తొమ్మిది వాకిండ్ల బొమ్మయే తనువు
పది రూపముల హరి ప్రభవించెగాదె."

(బాలసాహిత్య మంజరి)

లెక్కలు నేర్పే గేయాలు.

వి వి నరసింహారావుగారి ఈ గేయంలో లయాత్మకంగా, అంత్యప్రాస యుక్తంగా, వినోదాత్మకంగా కూడికల్ని నేర్పే పద్ధతి కన్పిస్తుంది.

" ఒకటి ఒకటి రెండు - చకచకమని రెండు
రెండు ఒకటి మూడు - చెండుదెచ్చి ఆడు
మూడు ఒకటి నాల్గు - చూడు గెలుపు కల్గు
... ... ... ... ..."

(పాలబడి పాటలు)

చొప్పరపు పురుషోత్తం (బాల. మే 1950 పుట : ౪) ఏడిదకామేశ్వరరావు (బాల భారతి) ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (బాల. సెప్టెంబరు 1949) మొదలైన వారు ఎక్కాలు నేర్పే గేయాలు వ్రాశారు వాటిలో కూడా నీతి నియమాల బోధన కన్పిస్తుది ఉదాహరణకు : పురుషోత్తంగారి గేయం.

" ఒకటొకట్లొకటి - మనమంతా ఒకటి
రెండొకట్లు రెండు - పొండి బడికిపొండు
... ... ... ... ..."

వారాలపేర్లు నేర్పే గేయాలు.

అందరికీ పరిచితమైన అరటిని మాటుగా పెట్టుకొని తెలుగు వారాలపేర్లను పిల్లలకు నేర్పే గేయం. ఒకప్పటి తెలుగు వాచకంలో ప్రచురితం.

" ఆదివారమునాడు అరటి మొలచింది
సోమవారమునాడు సుడివేసి పెరిగింది
మంగళవారమునాడు మారాకు తొడిగింది
బుధవారమునాడు పొట్టిగెల వేసినది
గురువారమునాడు గుబురులో దాగినది
శుక్రవారమునాడు చూడగా పండినది
శనివారమునాడు చకచకా గెలకోసి
అందరికి పంచితిమి అరటి అత్తములు
అబ్బాయి అమ్మాయి అరటి పండ్లివిగో. "

ఇలాంటిదే అబ్బాయిగారి ఈగేయం.

" ఆదివారము నాడు అబ్బాయి పుట్టె
సోమ వారము నాడు చొక్కాయి తొడిగె
మంగళ వారము నాడు మాటలు చెప్పె
బుధ వారము నాడు బుద్ధులు నేర్చె
... ... ... ..."

(బాల ఆగష్టు 1946. పుట. 31)

పిల్లలకిష్టమైన చిరుతిండ్లలో వారాలనుకూర్చిన గేయం బలిజేపల్లి మూర్తిగారు వ్రాశారు

" ఆదివారము నాడు ఆవడలు పెరుగు
సోమవారము నాడు సొజ్జియప్పాలు

మంగళవారము నాడు మైసూరుపాకు
బుధవారము నాడు బూరిముక్కలును
లక్ష్మివారము నాడు లడ్డూమిఠాయి
శుక్రవారము నాడు సేమియాహల్వా
అన్నివారములు అన్ని చిరుతిండ్లు
లీలగా తినిపించు బాలకును తల్లి."

(బాల అక్టోబరు 1949)

తిథులపేర్లు నేర్పే గేయాలు.

తిథుల పేర్లను నేర్పడానికి వీలుగా నాగవోలు వెంకట అప్పారావుగారు ఈ గేయాన్ని వ్రాశారు

" పాడ్యమినాడే బయలుదేరితిని
విదియ నాడు నే వింతలు జూచితి
తదియ నాడు తాతయ్యను జూచితి
చవితి నాడు నే జూచితి నాట్యము
పంచమి నాడొక కంచము గొంటిని
షష్ఠి నాడు నేసభలో కేగితి
సప్తమి నాపని సఫలంబవగా
అష్టమి తిథి నా డాటల నాడితి
నవమి నాడు నేకవనము నేర్చితి
దశమి నాడు దర్శించితి బంధుల
ఏకాదశి నాడేగితి షికారు
ద్వాదశి నాడొక దేవాలయమును
త్రయోదశి నొక మయూర నాట్యమా

చతుర్దశి నాడు చలన చిత్రమును
పౌర్ణమి నాడొక పులి వేషంబును
కన్నులార నే గాంచిన వన్నియు
విన్నవించితిని పిల్లలకు."

(బాల జూన్ 1947. పుట: 10)

నెలల పేర్లు నేర్పే గేయాలు.

తెలుగు నెలలను, ఆయాకాలాల్లో ప్రకృతిలోను వాతావరణంలోనూ కలిగే ప్రత్యేకమైన మార్పులను పిల్లలకు పరిచయం చేస్తూ దాశరథిగారు వ్రాసినది ఈ బాలగేయం.

" చైత్రమాస మేగుదెంచె - చక్కని వేప ప్రసాదం
వైశాఖం వచ్చె నేడు - పసందైన మామిడులూ
జ్యేష్ఠ మాసమే తెంచెను - చెప్పరాని ఎండలతో
ఆషాఢం ఆగమించె - ఆషామాషీ జల్లుల
శ్రావణ మాసం వచ్చెను - చల్లని వానలు తెచ్చెను
భాద్రపదం అరుదెంచెను - పంటపొలాలను పిలిచెను
ఆశ్వయుజం అది గదిగో - అమాంతముగ చలివచ్చెను
కార్తీకం కానుపించె - కమ్మని వెన్నెల రాత్రుల
మార్గశిరం కనుపించెను - మంచులతో అంచలతో
పుష్యమాస మే తెంచెను- పూలతో పుణ్యాలతో
మాఘమాస మరుగుదేరె - మాసిన ప్రోయిలతోన్
ఫాల్గున మదె వచ్చె వచ్చె - పచ్చని చిగురాకులతో."

( బాలగేయాలు పుట 6 )

ఇంగ్లీషు నెలల్లో ఏయే నెలకు ఎన్నిరోజులో తెలుపుతుంది వమ్మిరాము శాస్త్రిగారి ఈబాలగేయం ఇది పెద్దవాళ్లకుకూడా ఉపకరిస్తుందనడంలో సందేహంలేదు.

" రోజులు ఏనెలకెన్నో తెలుసా - నవంబరేప్రిల్ సెప్టెంబరుకూ
జూనుకు ముప్పైరోజులె ఎప్పుడూ - ఫిబ్రవరికి ఇర్వదిఎనిమిదియే
మిగిలిన నెలలకు ముప్పైఒక్కటి - లీపియరైతే అగుఫిబ్రవరికి
ఇరువది తొమ్మిది రోజులు బాలా ! "

(బాల నవంబరు 1946 పుట : 9)

ఋతువుల పేర్లను తెలిపే గేయాలు.

సంవత్సరంలో వచ్చే ఆరు ఋతువులను, వాటి ప్రాముఖ్యాన్ని పిల్లలకు తెలియజేయడానికి వీలుగా కొన్ని గేయాలు వ్రాయబడ్డాయి ఉదాహరణకు భారతీ రత్నాకరాంబగారి గేయం.

"చైత్రము వైశాఖంబులము - వసంత ఋతువున వచ్చెదము
పూవులు పండ్లూ తెచ్చెదము - పుష్కలముగ మీకిచ్చెదము
జ్యేష్ఠము ఆషాఢంబులము - ఎండకాలమున వచ్చెదము
ఎండలు మెండుగ తెచ్చెదము - చెప్పులు గొడుగులు కొనిపించెదము
... ... ... ... "

(ఇల్లిందల సరస్వతీదేవి సంకలనం పిల్లలపాటలు)

రంగులను తెలిపే గేయాలు

పిల్లలకు బాగా పరిచయమున్న వస్తువులద్వారా రంగులను, వాటి పేర్లను అలపర్తి వెంకట సుబ్బారావుగారు ఈ గేయంలో పరిచయం చేశారు.

" తెలుసుకోవె బాలా! ఇవి తెలుసుకోవె బాలా !
ముగ్గు తెలుపు రంగూ! మసిబొగ్గు నలుపురంగూ !

మబ్బు నీలిరంగూ! చేమంతి పసుపు రంగూ!
చిలక మెరుపురంగూ! రామచిలుక ఆకుపచ్చా!
వంగపువ్వు ఊదా! ఇల రంగులివే ఏడూ!
తెలుసుకోవె బాలా! ఇక తెలుసుకోవె బాలా!"

(తాయం)

పిల్లలు రోజూ చూసే పక్షుల ద్వారా, వాడే వస్తువుల ద్వారా రంగులను నాగ వోలు వెంకట అప్పారావుగారు పరిచయం చేసిన తీరు అపూర్వం.

" కాకీ కాకీ - కాటుకరవంత - కావాలానీకు
కాటుకలాగే - కారునలుపుగా - కనబడుచున్నాగా

కొంగా కొంగా - కొంచెముపౌడరు - కావాలానీకు
పౌడరుకన్నా - పాలకన్నా - తెల్లగ ఉన్నాగా."

(బాల. నవంబరు 1950. పుట: 12)

కీర్తినీ, స్వచ్ఛతను సూచించడానికి తెలుపురంగును, దుఃఖాన్ని, అసుఖాన్ని సూచించడానికి నలుపురంగులు ...... వాడతారు. ఆధునిక బాలగేయాల్లో సైతం ఇలా రంగుల ప్రసక్తి ఉంది. ఉదాహరణకు : మిరియాల రామకృష్ణగారి గేయం.

" తెలుపు

వెన్నెలలో నేను విరగబడి నవ్వాను
కీర్తిలోపల నేను కిలకిలా నన్నాను
... ... ... ...

నలుపు

ఆకాశమున నేను అందాలు చిందాను
గుండెలోపల నేను గూడు కడుతున్నాను"

(రంగు రంగుల రత్న దీపాలు)

రుచులను తెలిపే గేయాలు.

అలపర్తి వెంకట సుబ్బారావుగారు రుచులను పిల్లలకు పరిచయం చేసే తీరు ఆకర్షణీయంగా ఉంది ఆగేయం.

" పంచదారతీపి - పట్టు చేయి చాపి
చింతకాయ పులుపు - చెట్టుయెక్కి దులుపు
వేపకాయ చేదు - వేడ్కనమరరాదు
... ... ... .. "
ఉప్పుకల్లు ఉప్పన - చప్పరించు చప్పన."
(తోయం)

ధ్వనులను చెప్పే గేయాలు

ధ్వనులను అనుకరిస్తూ ఏక్కిరాల కృష్ణమాచార్య, ధారా రామనాథ శాస్త్రిగార్లు వ్రాసిన ఈ గేయం చిన్నపిల్లలకు వినోదంతోబాటు చక్కని సందేశాన్ని అందిస్తుంది

" చెట్టు మీద నుండి కాకి కావ్ కావ్ కావ్
కొమ్మ మీద కోయిలమ్మ కూ కూ కూ
చూరు మీద పిచికమ్మ చిక్ చిక్ చిక్
చిగురు చాటు రామచిలుక రాం రాం రాం
బాట మీద కుక్కపిల్ల బౌ బౌ బౌ
ఉట్టి మీద పిల్లి పిల్ల మ్యావ్ మ్యావ్ మ్యావ్
.. .. .. ... ...
చదువుకున్న వారి బ్రతుకు హాయ్ హాయ్ హాయ్
చదువురాని వారి బ్రతుకు ఛీ ఛీ ఛీ "
(భారతీయ బాలశిక్ష. పుట . 7)

వృత్తుల ప్రాముఖ్యాన్ని తెల్పే గేయాలు.

అతి ప్రాచీన కాలంనుంచి ఒక్కో జాతివారు ప్రత్యేకంగా ఒక్కోవృత్తిని చేపట్టి అందులో వాళ్ల పనితనాన్ని ప్రదర్శిస్తూ ప్రజలకు తోడ్పడుతూ వస్తున్నారు. లక్కాన మల్లికార్జునుడు 'తోడునీడగావుంటాం' అనే శీర్షికతో రకరకాల వృత్తుల వాళ్లు గ్రామసీమల్లో నివసిస్తూ దేశానికి ఏవిధంగా తోడ్పడుతున్నారో తెలిపారు ఉత్తమపుస్తకంలో నడచిన గేయమది.

"నే నే ! రైతు బాబును నే నే !
దేశానికి వెన్నెముకను నేనే !
మేడినిపట్టి నాగలి దున్ని
నీరు పెట్టి - నాటు వేసి
పంటలు పండిస్తాను
... — ... ..."
(బాలానందం పుట : 31-33)

ఇలాగే వడ్రంగిని, కమ్మరిని, కుమ్మరిని, మెదరిని, చాకలిని, సాలిని, పురోహితుని, బడిపంతుల్ని వాళ్ళచేసే పనుల్ని, వాటివల్ల కల్గే లాభాలను కూడా వివరించారు ధాన్యాన్ని పండించి ఆకలి బాధను తీర్చే రైతును, ధనిక బీద తారతమ్యం లేకుండా సర్వమానవులకి ఎలా తోడ్పడుతున్నదీ, నగలు చేసే కంసాలిని, బట్టలు నేసే సాలె వానిని, చేపలుపట్టే జాలరిని, ఎంతోమందికి ఉపయోగకరంగా ఉత్తరాలను బట్వాడా చేసే పోస్టుమాన్‌ను వాళ్ళు ప్రజలకు తోడ్పడే విధానాన్ని పిల్లలకు గేయరూపంలో చాలామంది పరిచయం చేశారు

స్థాలీ పులాకంగా ఇంతవరకు వివరించిన విద్యావిషయిక గేయాలు ఎక్కువగా 'బాల' పత్రికలో ప్రకటించబడ్డవి చిన్నపిల్లల పాఠ్యగ్రంథాల్లో కూడా పైన పేర్కొన్న గేయాల్లాంటివి కొన్ని చోటుచేసుకున్నాయి. అటువంటి పాటల్ని పిల్లల పాఠ్యగ్రంథాల్లోచేర్చినా, చేర్చకపోయినా ఆటవిడుపు పాటలుగా నేర్పించి పాడించినట్ల యితే పిల్లల విజ్ఞాన వికాసానికి ఎంతోదోహదం కల్గుతుంది.

## 4. 7. ప్రబోధాత్మక గేయాలు.

చిన్న పిల్లల్లో నీతినియమాల్ని కల్గించడానికి ఉద్దేశించిన ప్రబోధాత్మక గేయాలు ఆధునిక బాలగేయసాహిత్యంలో ముఖ్యాయ పంటగా పండిందంటే అతిశయోక్తి కాదు. పిల్లలకు మంచి చెడ్డలను తెలియజెప్పి వాళ్లను సత్ప్రవర్తకులుగా తీర్చిదిద్దడం బాలసాహిత్యం యొక్క పరమ ప్రయోజనం 'నీతిలేనివాడు కోతి కంటె ఓడు' అని లోకోక్తి 'నీతిలేనివిద్య నిరర్థకం' అనికూడా అంటారు. కాబట్టి పిల్లలు విద్యతోబాటు శుచీ శుభ్రత, క్రమశిక్షణ, సత్ప్రవర్తన, విశ్వప్రేమ, సోదరభావం, ఆస్తిక్యబుద్ధి, సచ్ఛీలం మొదలైన సద్గుణ సంపత్తులను కూడా చిన్నప్పటినుంచీ పెంపొందించుకోవాలి. నీతుల్ని గేయరూపంలో బోధిస్తే వాళ్లకు ఆసక్తిదాయకంగా ఉంటుంది. ఆ గుణాలు వాళ్లకు పట్టుబడడమే కాకుండా జీవితాంతం గుర్తుండే అవకాశంకూడా ఉంది బాలబాలికలకు ఆచరణయోగ్యాలైన నీతినియమాలతో కూడిన ప్రగతి ప్రబోధాత్మక గేయాల్ని ఇక్కడ పరిశీలిద్దాం.

విద్యనభ్యసించడానికి వయో భేదం లేదు కానీ దానికి అనువైనది బాల్యదశ మాత్రమే. చిన్నతనంలో నేర్చినవిద్య పదునులో పోసానబడిన మెలువితనం లాంటిది భావి జీవితానికి బీజాలు పడే బాల్యంలో పిల్లల్ని సక్రమంగా బడికి పంపేట్లు చూడవలసిన బాధ్యత పెద్దలపై ఉంది. అందుకే ' బడికి రా చిన్న !' అనే శీర్షికతో ఉన్న ఈగేయంలో బి వి నరసింహారావు ' విద్యలేనివాడు వింతపశువు ' అనేభావాన్ని వ్యక్తం చేశారు. పిల్లల్ని విజ్ఞాన భాండాగారమైన బడికి రమ్మని ఆహ్వానించారు

" బడికి రారో చిన్న - బడికి రా చిన్న
బడియంటె విజ్ఞాన - భాండారమన్న
చదువు నేర్వనివాడు - సరిగ ఓరన్న
రెండు కాళ్ళ యన్న - మొండి పశువన్న
... ... ... ... ... ...

(వెన్నెల బడి పుట : 12)

బడికివెళ్ళడంలో, విద్యను నేర్వడంలో ముందుండాలని పిల్లలకు బోధించే గేయాలు చాలా ఉన్నాయి.

" వెనుకంజ వేయకుము విద్యార్థి
బడికి ముందంజ వేయుమా విద్యార్థి ! "
(బాల డిసెంబరు 1957)

అన్న జి కృష్ణగారి గేయం-

" కళ కళలాడుచు కిల కిల నవ్వుచు
బాల బాలికలు ప్రతి రోజూ - పోవాలి మరి బళ్ళోకి "
( లాయం )

అన్న అలపర్తి సుబ్బారావుగారి గేయం అలాంటిదే.

బోధనలు ఎదుటివాళ్ళను ఆకట్టుకొనే విధంగా ఉంటే ఆదరణకు దారితీసే అవకాశముంటుంది కొప్పర్తి రాజగోపాలరావుగారు ప్రతిపాదం చివర 'కొమ్మ' అనే విధ్యర్థకపదం పునరుక్తమయ్యేట్లు వినోదాన్ని మేళవించి క్రింది గేయాన్ని వ్రాశారు.

" ఉదయమే లేచుట నేర్చుకొమ్మ
కాలకృత్యములు తీర్చుకొమ్మ
... ... ... ...
గురువు చెప్పినట్లు నడుచుకొమ్మ
శ్రద్ధతో పాఠముల్ చదువుకొమ్మ
... ... ... ... ... "
(బాల. నవంబరు 1946. పుట : 47)

పిల్లలకు చదువేకాదు దానితోపాటు ఆరోగ్యాన్ని, ఉత్సాహాన్ని ప్రసాదించే ఆటపాటలు కూడా ముఖ్యమే. అందుకే బి వి. నరసింహారావుగారు -

" మేటి చదువులు మెదడుకు బలమోయ్
ఆటలు పాటలు ఒంటికి బలమోయ్
రెండూ ఉంటే దండి మనుషులోయ్
నిండుతనం మన జన్మ భూమికోయ్ "
(అమ్మఒడి పు. 31)

అన్నారు.

పెద్దలను అణగి మణగి ఉండి వాళ్లను గౌరవించడం, చదువు సంధ్యల్ని శ్రద్ధతో నేర్చుకోవడం, సత్ప్రవర్తన కలిగి ఉండడం, అందర్నీ ఆప్యాయంగా చూడడం ముఖ్యంగా పిల్లలు నేర్చుకోవలసిన అంశాలు

తల్లిదండ్రులకు తమ పిల్లలపై ఎలాంటి మమతాను రాగాలుంటాయో పిల్లలకు కూడా వాళ్లపై అలాంటి భావాలే ఉండడం సహజం 'తల్లిని మించిన దైవములేద'నే సూక్తి తప్పుకాదు పిల్లల కష్టసుఖాల్ని, బరువు బాధ్యతలను భరించి వాళ్ల అవసరాలను గుర్తుంచుకొని అనుక్షణం వాళ్ల ఆనందం కోసం పాటుపడే తల్లికి ఎవరూ సాటిరారు. తల్లి పిల్లలకు చేసేటువంటి స్వార్థరహిత సేవను 'మా అమ్మ' గేయంలో న్యాయపతి రాఘవరావుగారు చక్కగా వ్యక్తం చేశారు

" తెల్లవారగానే లేపి
పళ్ళు ముఖము ఒళ్ళు కడిగి
తెల్లబట్టలేస్తుంది - మా అమ్మ
గోరు గోరు బువ్వ కలిపి
గుజ్జు గుజ్జు బువ్వ కలిపి
పాలబువ్వ పెడుతుంది - మా అమ్మ.
ఆటలెన్నో ఆడించి
పాటలెన్నో పాడించి

కథలెన్నో చెబుతుంది - మా అమ్మ
లాలి పాట పాడుతుంది
జోలపాట పాడుతుంది
బజ్జో బజ్జోమంటుంది - మా అమ్మ ”

తల్లిదండ్రుల తర్వాత గురువే పిల్లలదైవం. పిల్లల మనస్సులపై కొత్త ముద్రలను వేసి కొత్త భావాలను నాటేది గురువులే. కలువ కొలను సదానందగారు పిల్లల్ని పువ్వులుగా వాళ్ళను విద్యావంతులుగా తీర్చిదిద్దే గురువుల్ని తోటలో రకరకాల పుష్పాలను పుష్పింపజేసే తోటమాలులుగా ఊహించారు. పిల్లల్లో ఎన్నో భావాల్ని నాటే గురువులకు తోటలో రకరకాల పూలను పూయించే తోటమాలులకు చక్కని సామ్యం.

“ మిల మిల బుగ్గల బాలల్లారా - జిలిబిలి పలుకుల చిలకల్లారా
దేవుని ఇల్లిది మరవకుడీ . - మా దీవనలివిగో చేకొనుడీ !
... ... ... ... ... ... ... ...
తోటమాలులై గురువులు పువ్వులు - తోటను పెంచాకిచోట
గుమ గుమలాడే మల్లెలు మొల్లలు - గుత్తులు గుత్తులు పూచెనిట
పువ్వులు మీరే నవ్వండీ - ఆ దేవుని సిగపై నిలవండీ ! ”

సత్యం తప్పక, నీతిని విడువక, పరులకు కీడు తలపెట్టక మేలు చేయడం మానవధర్మం దాన్ని మరువరాదు విడువ కూడదు ప్రకృతి తన ధర్మాన్ని క్రమం తప్పకుండా పాటించినట్లే మానవుడు కూడా ధర్మాన్ననుసరించి నడచుకోవాలి ఈ నీతి సూత్రం బాలగేయాల్లో చోటుచేసుకుంది కంటా పగటి పూట నిద్ర పనులకు చేటని అతివాగుడు మానాలని, భయాన్ని పారద్రోలి భక్తిని రక్తిని పెంచుకొని వినయ విధేయతలతో పెద్దలను గౌరవించి పూజించాలని, చెప్పుడు మాటలు చెరుపు చేస్తాయని, దురలవాట్లకు దూరంగా ఉండాలని, జగతిశాంతిని జాతికి శోభను చేకూర్చేవి నీతినియమాలే అని, నీతినియమాలతో జాతిపేరు నిల

పెట్టాలి - పిల్లలకు ఉద్బోధిస్తూ ఎందరో గేయాల్ని వ్రాశారు తరతరాలుగా వస్తూన్న ప్రజల్లో పాతుకు పోయిన కులమత తత్త్వాల్ని, హెచ్చుతగ్గుల్ని నిర్మూలించి మానవులందరూ ఒక్కటే అన్న జాతిసమైక్యతా భావాన్ని బాలల్లో కలుగజేయడానికి ఇంచుమించు ప్రముఖ బాలగేయ రచయితలందరూ ప్రయత్నించారనడంలో సందేహంలేదు

మతసామరస్యాన్ని బాలబాలికల్లో కల్గించడానికి సమతారావుగారి 'సమతారైలు' అనే ఈబాలగేయంలోని ఆలంకారిక రచన ఎన్నదగింది

" 1. సమత రాజ్య రైలుబండి పోతున్నదీ
సర్వజనుల కిందులో చోటున్నదీ

2. నీతియనే బొగ్గుతినీ నడచునట్టిదీ
న్యాయమనే నీరు త్రాగి సాగునట్టిదీ

3. కులమత భేదాలకిచట చోటు లేదండీ
మనుష్యులైన చాలు బండి ఎక్కవచ్చండీ

4. శ్రమ జీవుల కందరికీ ఆహ్వానమూ
సోమరిపోతుల కిందులో లేదు స్థానమూ
... ... ... .. "

(బాలగేయాలు మూడవ భాగం)

పంచభూతాలవాగే భూమిపైన లభ్యమయ్యే ప్రతివస్తువూ అందరికీ సమానంగా అందేట్లు చూడడం మానవధర్మం సమాజంలో అలాంటి సమానత్వాన్ని సాధించి నప్పుడే అది స్వరాజ్యమవుతుంది. హక్కులు కొందరికి మాత్రమే పరిమితం కాకూడదు. అవి సమిష్టి సంపద ఆ భావనే వక్కలంక లక్ష్మీపతిరావుగారి 'సాంఘిక సమానత్వం' అనే బాలగేయంలో వ్యక్తమవుతుంది

" గాలీ నీరూ అందరివి !
నింగీ నేలా అందరివి !

అందలేవి ! మన అందలేవి !
ఎందఱో ఆకలితో పడి ఉంటే
కొందరు మాత్రమె అన్నం తింటే
తిన్న దరుగుతుందా ?
ఆ తిన్నది అన్నం అవుతుందా ?
శ్రమదానంతో బాటలు వేసి
పల్లెను పట్నం చేసేద్దాం
సమాజమ్ములో అందఱి మధ్యా
సమానత్వమును సాధిద్దాం ”

( బాల భారతి. పుట: 28 )

భాషలోను, భావంలోను, అభిప్రాయాలలోను, ఆచారవ్యవహారాలలోను ప్రాచీనకాలానికి ఇప్పటికి ఎంతో తేడా ఉంది అనాది నుండీ మానవుడు వైజ్ఞానికంగా ఎంతో అభివృద్ధిని సాధించినాడు. ఇంకా సాధించవలసింది ఎంతో ఉంది. ఈనాటి పరిస్థితుల కనుగుణంగా ప్రజల మనసుల్లో కూడా మార్పులు రావాలి ఆ ఉద్దేశంతోనే ప్రగతి సాధనకు అనుకూలమైన బీజాల్ని భావిపౌరులైన బాలల్లో నాటడానికి కొంత మంది రచయితలు ప్రయత్నించారు. ప్రగతి సాధనకు ఐకమత్యం, సర్వమానవ సౌభ్రాతృత్వాలతో బాటు విజ్ఞానం కూడా కావాలి ఇంతవరకు అన్నిరంగాలలోను మానవుడు సాధించిన ప్రగతిని తెలపడమె వైజ్ఞానికాభివృద్ధికి ముఖ్యమైన దోహదం· మానవుని వైజ్ఞానిక ప్రగతిని వక్కలంక లక్ష్మీపతిరావుగారు ' ప్రగతి ' అనే ఈబాల గేయంలో చక్కగా వివరించారు అత్యద్భుతమైన మానవుని విజ్ఞానాన్ని కొనియాడుతూ ఆశ్చర్యాన్ని కూడా వ్యక్తం చేశారు.

“ ఎంత శక్తి కలవాడో - ఈ మానవుడు
ఏమి తపము చేసిపుట్టె - నీ మానవుడు

కొండ గుహలు దొలిచి - శిలాఖండము లందించెను
మధుర కంఠమెత్తి గాన - సుధలను వర్షించెను !
కవితామృత రసము పిండి - భువిని దివిగ జేసెను
ఋషియై అణువణువు నందు - ఈశ్వరునే చూపెను
తీగలతో వార్తలంపు - తీరే కనిపెట్టెను
ఆవిరితో రైలుబండి నట్టే నడిపించెను

... ... ... ... ... ...

ఎక్కడనో పుట్టు శబ్ద మిక్కడ వినగల్గెను
ఎక్కడనో ఉన్నవారి - నిక్కడ కనగల్గెను !
అజుని సృష్టికలంకార మూరా ! నరుడు
ఏమి తపము చేసి పుట్టెనీ మానవుడు ! ! "
(స్వతంత్ర భారతి. పుట : 18)

ప్రబోధాత్మక గేయాలను వ్రాసిన తెలుగు బాలసాహిత్యకారులు తమగేయాల్లో మాతృభక్తి, గురుభక్తి, దైవభక్తి, దేశభక్తి, భూతదయ, విశ్వమానవప్రేమ, జాతి సమైక్యత, మతసామరస్యం మొదలైన భావాల్ని ఆయాగేయాల్లో చిత్రించిన తీరు కొంత ప్రౌఢంగానే ఉన్నట్లు చెప్పాలి. కొన్ని గేయాలు సుదీర్ఘాలు కూడా. తెలుగులో వెలసిన ప్రబోధాత్మక గేయాల్లో పిల్లలకనువైన శైలిలో ఉన్నవి కొన్ని మాత్రమే.

## 4. 8. ఆటపాటలు.

పిల్లల ఆటలు ఎన్నోరకాలు. వాటికి పాటలు కూడా తోడైఉంటాయి. జీవితంలో ఒకభాగమైన ఆ ఆటలు తెలుగు జాతి సంస్కృతిని, సంప్రదాయాలను ప్రతిబింబింపచేస్తాయి. పిల్లలకు ఆనందాన్ని కల్గించే ఆటపాటలు ప్రాచీన కాలం నుండీ మనకు సంక్రమిస్తూనే ఉన్నాయి. అలాంటి ఆటపాటలను మునుపటి ప్రకరణంలో సమగ్రంగా వివరించడమైంది. బాలబాలికల ఆటలకు సంబంధించిన ఆధునిక బాలగేయాలను మాత్రమే ఇక్కడ పరిశీలించడం జరుగుతుంది,

పిల్లలకు ఆటలంటే ఎక్కడలేని ఉత్సాహం. ఆటపాడే పిల్లలకు ఆటంకం కల్గిస్తే నిరుత్సాహ పడిపోతారు. సాయంకాలం బడివదిలిన తర్వాత పిల్లలకు ఆడుకోవడానికి ఎక్కువ అవకాశముంటుంది. అరుబయట ఆడే ఆటలు మన శరీరాలకు ఉల్లాసాన్నికల్గించి బలాన్ని చేకూరుస్తాయనటంలో సందేహంలేదు. అందుకే పిల్లలను ఆడుకోనివ్వకుండా అడ్డుపెట్టే తల్లిదండ్రులు జాతి దాస్యచిహ్నాలనీ, వాళ్ల స్వేచ్ఛను అరికట్టే పెద్దలు ఎడతెగని మూఢతకు నిలయాలని చిలుకూరి లక్ష్మీ నరసింహాచార్యులుగారు 'ఆడుకో పాడుకో' అంటూ బాలల్నుద్దేశించి వ్రాసిన క్రింది గేయంలో వ్యక్తం చేశారు

"ఆడుకో పాడుకో - అబ్బాయినీవు
అడ్డురారెవ్వరూ - అలసినదాక
అబ్బాయి ఆటలకు - అడ్డుపెట్టేటి
తల్లిదండ్రులుజాతి - దాస్యచిహ్నాలు
... ... ... ..."

(బాల. జూన్ 1947. పుట . 11)

పుట్టినప్పటినుంచి బాలల జీవితమంతా ఆటపాటలతో ఆనందంగా గడచి పోతుంది ఆరునెలలు దాటిన తర్వాత శిశువు కూర్చుండ నేర్చినప్పటినుండీ వాళ్లను ఆడిస్తూ పెద్దలు పిల్లలకోసం పాటలు పాడ్తారు. శిశువుల అనుకరణదశ అప్పటినుండి ప్రారంభమవుతుంది పిల్లలను ఆటలాడించడానికి, వారి శారీరక పరిశ్రమకూ పెద్దలు పాడే పాటలు జానపద బాలగేయ సాహిత్యంలో కొల్లలుగా ఉన్నాయి. వాటిని అనుకరిస్తూ ఆధునిక బాలగేయ రచయితలు వ్రాసిన ఆట పాటల్లో పేర్కొనదగినవి చప్పట్ల పాటలూ, ఊగూగు పాటలు మొదలైనవి ఇవి చిన్నపిల్లలకు దేహపరిశ్రమనూ, నిర్వృతినీ కల్గిస్తాయి.

ఏడ్చే చిన్నపిల్లల్ని నవ్వించడానికి, వాళ్ళను ఆడిస్తూ లయాత్మకంగా చప్పట్లు చరుస్తూ తల్లులు పాడడానికి వీలుగా కనుపర్తి వరలక్ష్మమ్మగారు క్రింది పాటను

వ్రాారు "తప్పట్లోయ్ - తాళాలోయ్, దేవుని గుళ్లో బాజాలోయ్" అనే జానపద బాలగేయానికి ఈపాట అనుసరణ.

" కొమ్మపూలు దేవుడికోయ్ - అమ్మ పాలు పాపాయికోయ్
పాటలు భజనలు దేవుడికోయ్ - ఆటలు పాటలు పాపాయికోయ్
తీగల పువ్వులు దేవునికోయ్ - తియ్యని జోలలు పాపాయికోయ్
అందరి మొక్కులు దేవుడికోయ్-అందరిముద్దులు పాపాయికోయ్
(బాల సాహిత్య మంజరి)

అలాగే పిల్లల్ని ముందు వెనుకలకు ఊపుతూ తల్లులుపాడే పాటకు చక్కని ఉదాహరణ - ఏడిద కామేశ్వరరావు గారు వ్రాసిన క్రింది పాట

" ఊగూగు గుఱ్ఱమా - ఊరేగు గుఱ్ఱమా
ఊరంతా తిరుగుతూ - ఊరేగు గుఱ్ఱమా-
రాజుగారి గుఱ్ఱమైతే - రౌతూ రంగు కావాలోయ్
రాముడెక్కే గుఱ్ఱమైతే - రాజు రౌతు కావాలోయ్
... ... ... ... ... ..."
(బాల భారతి)

నాలుగైదేండ్ల వయసునుండి పిల్లల సొంత పాటలు ప్రారంభమవుతాయి. ఆ పాటల్లో సగం పెద్దల కూర్పు మిగిలిన సగం పిల్లల కూర్పు పిల్లల పాటల్లో ఆట పాటల పాలు ఎక్కువ పిల్లల ఆటలకు సంబంధించిన పాటలు చాలా వరకు అర్థ రహితాలే జానపద బాలగేయాల్లోని ఆటపాటలను విభజించినట్లే ఆటలకు సంబంధించిన ఆధునిక బాలగేయాల్ని కూడా మూడు రకాలుగా విభజించవచ్చు

1. అబ్బాయిల ఆటవిడుపు పాటలు
2. అమ్మాయిల ఆటవిడుపు పాటలు
3 ఉభయుల ఆటవిడుపు పాటలు.

కొన్ని సందర్భాల్లో అబ్బాయిలతో కలిసి వాళ్ళఆటల్ని అమ్మాయిలు ఆడడం అలాగే అమ్మాయిల ఆటల్ని అబ్బాయిలు ఆడడం ఉంది.

## 1. అబ్బాయిల ఆటవిడుపు పాటలు.

అబ్బాయిల ఆటపాటల్ని రెండురకాలుగా విభజించవచ్చు. రైలు, సైకిలు మొదలైన వాహనాలను అనుకరిస్తూ ఆడుకొనే ఆటల్లో పాడేపాటలు మొదటి రకానికి చెందినవి. కొందరు కలిసి సామూహికంగా ఆడుకొనే బంతిఆట, చెడుగుడు, గోలీయాట, బొంగరాలఆట మొదలైన వాటికి సంబంధించినవి రెండవ రకం. రెండవరకం ఆటకు సంబంధించిన గేయాలు ఆధునికుల రచనల్లో అసలులేవనే చెప్పాలి. మొదటి రకానికి ఉదాహరణ :

" చకచకా పోతోంది మూడుచక్రాల సైకిల్
ముందూ చెల్లిని కూచోబెట్టీ - వెనకా అక్కని కూచోబెట్టీ
... ... ... ... ...
పోకుగా ఒకసారి వంగీ - తీకుగా తలయెత్తి తొక్కగా ||చక
(బెజి మామయ్య పాటలు)

బాలుర ఆటవస్తువుల్లో ముఖ్యమైన రంగురంగుల గోళీకాయను గిర గిర తిరిగే బొంగరాన్ని, ఎగిరే బంతిని, పక్షిలా ఆకాశంలో విహరిస్తూ పిల్లలకు పరమానందాన్ని చేకూర్చే గాలిపటాన్ని, వర్షాకాలంలో పారేనీళ్లలో వదలి పరమానందంతో ఆడుకొనే కాగితపు పడవను, తాటిబుర్రల బంతిని చాలామంది రచయితలు రకరకాలుగా వర్ణిస్తూ బాలగేయాల్ని వ్రాశారు ఉదాహరణకు : ఇసుకలో గిరగిర తిరిగే బొంగరాన్ని బాలాంత్రపు వెంకటరావుగారు మనోహరమైన భావనతో పద్యరూపంలో అత్యద్భుతంగా వర్ణించారు.

" రింగు రింగున తిరుగు నా బొంగరంబు
ఏమి దియో వ్రాయుచున్నదీ ఇసుకయందు

బడికి పోలేదు - పొత్తంబు పట్టలేదు
ఎటుల వచ్చెనో దీనికి యింత చదువు "

(అఖిల భారత తెలుగు బాలల మహోత్సవ ప్రత్యేక సంచిక)

అలాగే గాలిపటాన్ని తాడి వెంకట కృష్ణారావుగారు క్రింది గేయంలో మనోహరంగా వర్ణించారు.

" చకచక ఎగిరే గాలిపటం - రెపరెపలాడే గాలిపటం
బాలలందరికి పరమానందం - తెచ్చే ముచ్చట గాలిపటం

ముక్కుకు కళ్ళెం కట్టాము - ముద్దుగ తోకను పెట్టాము
రంగు రంగుల గాలిపటం - రాచ కళలగల గాలిపటం

దూరం వదిలితే దూరం పోవును - గారం చేసిన మారం చేయును
మబ్బుల దూరే నిబ్బరమేమో - అల్లరి చేసే అబ్బురమేమో
... ... ... .. ... .. "

(సిరిచుక్క - మొగ్గ పుట : 11)

## 2. అమ్మాయిల ఆటవిడుపు పాటలు.

జానపద సాహిత్యంలో అమ్మాయిల ఆటలకు సంబంధించిన పాటలు చాలా ఉన్నాయి. ఆధునిక బాల సాహిత్యంలో బాలికల ఆటలకు సంబంధించిన పాటలు చాలా తక్కువ. అవి పాడుతూ ఆటల్లోని హావభావాలకు అనుగుణంగా పాడే పాటలకన్నా ఆటలను, ఆటవారిని వర్ణించే గేయాలే ఎక్కువగా కన్పిస్తాయి

### అల్లీ బిల్లీ.

ఆడపిల్లలు ఎవరికి వారే తలమీద చేతులుంచుకొని గుండ్రంగా తిరిగే ఆట ఇది. తెన్నేటి సూరి గారి 'అల్లీ బిల్లీ' గేయం మాతృభాషపై మమకారాన్ని కల్గిస్తూ బాలపాఠకులకు చక్కని ప్రోత్సాహాన్ని అందిస్తుంది.

" అల్లీ బిల్లీ రామన్నా - అంతా ఒకటే భీమన్నా
అల్లీ బిల్లీ రంగప్పా - అంతా ఒకటే భీమప్పా
... ... ... ... ...
బాకులు కట్టేదెవరండీ - బాలకుమారులే లెండి ॥అల్లీ॥"
(నవయుగ జూలై 1947. పుట. 19)

పిల్లలు వర్షంలో తడుస్తూ అల్లీ బిల్లీ తిరుగుతూ సంతోషంతో పాడుకోవ డానికి ఉపయుక్తమైన బాలాంత్రపు రజనీకాంతరావుగారి జేజిమామయ్య పాటల్లోని
" వానా వాన చెల్లప్పా - వాకిలి తిరుగు చెల్లప్పా
ఎండా వేసిన వస్తువులన్నీ - ఇంట్లో పెట్టూ చెల్లప్పా "
అనేపాట జానపదగేయానికి అనుకరణ ప్రాయం.

చిరు చిరు పుల్ల.

ఇద్దరు ఆడపిల్లలు కలిసి ఆడే ఈ ఆట చిరుచిరుపుల్ల, దూదూపుల్ల అనే పేర్లతో అప్రశతంగా వస్తున్నదే. భట్టిప్రోలు కృష్ణమూర్తిగారి క్రిందిగేయం ఆ ఆటకు సంబంధించిందే.

"దూదూపుల్లా డిక్ డిక్ డిల్లా - ఏడీనల్లా గోరిల్లా
తప్పితే గుంజీ సూదిసిరంజీ - ఇదికురవంజీ చింటుంజీ..."
(ఆంధ్రజ్యోతి సచిత్రవార పత్రిక 'బొమ్మరిల్లు' శీర్షిక)

చెమ్మ చెక్క.

ఇద్దరాడపిల్లలు లయాత్మకమైన పాటకు అనుగుణంగా చేతులుతడ్తూ పాడుతూ ఆడే ఆట ఇది ఈ ఆటకు సంబంధించిన క్రిందిపాటను మాల్యశ్రీగారు వ్రాశారు ఈగేయంలో వారు మొగ్గలో ఉన్న తేనెసోనల్ని, పూరేకుల్లో ఉన్న పుప్పొళ్లను లయాత్మకమైన పాటరూపంలో వర్ణించారు స్నేహంలోని విశేషాన్ని ఈసందర్భంలో

చెప్పడం సమంజసంగా ఉంది 'పొత్తులేనినాడు లోకమంతాపాడు అన్నారు. ఈఆట ఆడటానికి కూడా జతకావలికదా! మాల్యశ్రీగారి ఔచిత్యదృష్టి ఈగేయంలో చక్కగా ప్రస్ఫుటమవుతుంది.

"చెమ్మచెక్క చేరెడేసిమొగ్గ - మొగ్గకడుపులోన తీపితేనెసోన

... ... ... ... ...

చెమ్మచెక్క చెలికి చెలికి పొత్తు - పొత్తులేనినాడు లోకమంతపాడు"

(ఆంధ్రజ్యోతి వారపత్రిక 'బొమ్మరిల్లు' శీర్షిక)

రాయప్రోలు సుబ్బారావుగారి ఈ పాటలో చెమ్మచెక్కాటలోని విన్యాసాన్ని విధానాన్ని చూడవచ్చు.

" చెమ్మచెక్క ఆడుదాము - నిమ్మచెట్టు నీడలందు
చక్కని సావాసకత్తెల - పిలిచిరావె వేగిరముగా
గాజులాడ గలగలమని - పరికిణీలు విసిరి తిరుగ
వ్రేళ్ళు వ్రేళ్లు పెలితిబోక - అచ్చు వేసినట్లు కలయ ॥చెమ్మ॥
మొగము మొగము ముచ్చటాడ - కనులు కనులు కవుగలింప
మెడము లెత్తి మెడలుసాచి - అందమంద మతికినట్లు ॥చెమ్మ॥"

(కన్నెపాటలు)

తోకుక్కుడు బిళ్ళ

తొక్కుడు బిళ్ళాటలో గెంతే అమ్మాయి అందచందాల్ని భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు మనోహరంగా వర్ణించారు.

" తుక్ తుక్ తుక్ తుక్ తొక్కుడు బిళ్లో!
తక్ తక్ తక్ తక్ గెంతే పిల్లా!

విరిచీ కట్టిన ఎరుపూ పరికిణీ - పొట్టీచేతుల చుక్కల కప్ప
వయ్యారంగా వాల్జడ కదలా - కాలూ౽ంచుకు గళ్ళనుదాటూ
చిట్టీగాజుల చేతుల గలగల - పట్టీ మువ్వల పదముల గిలగిల
చెమటా చుక్కల చెక్కిలి తళతళ - గెలిచే కన్నుల
కెంపుల మిళమిళ"

(ఆంధ్ర జ్యోతి వారపత్రిక 'బొమ్మరిల్లు' శీర్షిక)

వెన్నెల కుప్పలు.

వెన్నెల రాత్రుల్లో చాలామంది ఆడపిల్లలు చేరి ఆడేఆట ఇది. ఆడపిల్లలంతా ఉద్దీలు వేసుకొని రెండు జట్లుగా విడిపోయి ఒకరి జట్టుకు ఇంకొకరిజట్టు కనిపించనంత దూరం చెరోవైపుకు వెళ్ళిపోతారు చెట్ల నీడల్లోనో ఇండ్ల గోడల ప్రక్కనో, అరుగుల క్రిందనో తొందరగా కన్పించని స్థలాల్లో మట్టితోగాని, ఇసుకతోగాని కుప్పలు పెడతారు. వెన్నెల కుప్పలు వందకు పైగా పెట్టిన తరువాత ఇక చాలనుకున్న జట్టు 'ఎన్నీలో - సన్నాభీ అని కూతలు పెడుతూ ఎదుటి జట్టువైపు పరుగెత్తివస్తారు వారి అరుపులు విన్నవెంటనే ఇటువైపు వారుకూడా కుప్పలు పెట్టడం ఆపేసి అటు వైపు పరుగెడతారు. వెదకి వెదకి ఎదుటి జట్టువారు పెట్టిన కుప్పల్ని చెరిపేస్తారు. మళ్ళీ ఏదో ఒక జట్టువారు చెరపడానికి వెన్నెల కుప్పలు కన్పించనప్పుడు 'ఎన్నీలో- సన్నాభీ' అని అరుస్తూ ఎదుటి జట్టువైపు పరుగెడతారు ఇలా రెండు జట్లూకలిసి పరస్పరం చెరపగా మిగిలిపోయిన వెన్నెల కుప్పల్ని లెక్కపెడతారు. ఏ జట్టు వారివి ఎక్కువ వుంటే వారిది గెలుపు. వెన్నెల కుప్పలాటను పిలిచె క్రింది పాట బాలగోపాల నాయుడుగారి రచన—

" వచ్చింది పున్నమి విరిసింది వెన్నెల - వెన్నెల్లో
కుప్పలు పెడదాము రావోయి
వేలాది కుప్పలు పెడదాము రావోయి -
వీధి వీధిన మనము పెడదాము రావోయి
... ... ... ... "

(వెన్నెల వెలుగులు. పుట : 32)

బొమ్మ రిండ్లు.

బొమరిండ్లు కట్టుకొని లక్కపిడతలతో ఆడుకోవడమంటే ఆడపిల్లలకు మహా ఇష్టం. అలాఆడుకొంటూ ఇంట్లో పెద్దల్ని అనుకరిస్తుంటారు. పెళ్లి పెద్దలుగా వ్యవహరించి బొమ్మల పెళ్లిళ్లుకూడా చేస్తుంటారు అటువంటి ఆటలకు సంబంధించిన పాటలెన్నో గ్రంథస్థమైనాయి వాటిలో పైల కన్నం నాయుడిగారి గేయం ఉదాహరణకు.

"కాసులమ్మ యింటివద్ద - కోలువు కూటమూ
కదలిరండి అక్కలారా - కొలువు చేద్దామూ
... ... ... ... ...

పెళ్ళిపీట లెయ్యారండి - పెళ్ళివార్ని పిలవరండి
పసుపు బట్ట కట్టరండి - నుదుట తిలకముంచరండి
బొమ్మల పెళ్ళిళ్లు చేసి - భోంచేద్దామూ!"

(ఆట - పాట.)

ఈ విధంగా పెద్దల్ని అనుకరిస్తూ పిల్లలు ఆడుకొనే బొమ్మరిల్లు ఆటల్లో తెలుగువాళ్ల సంప్రదాయాలు చోటు చేసుకోవడం పిల్లల పరిశీలనాదృష్టికి ప్రబల నిదర్శనం. బొమ్మల పెళ్లిళ్లు చేయడమేగాక సారె చీరలు పెట్టి పెళ్ళికూతుర్ని అత్తవారింటికి సాగనంపడం కూడ చేస్తుంటారు. ఆవిషయాన్ని తెలియజేసే మానేపల్లి సత్యనారాయణగారి గేయం.

"... ... ... ... ...
లక్కపిడతలు కొన్ని చక్కెరా చిలుకలు
సారెట్టి బొమ్మలకు సాగనంపిస్తుంది

మా పొట్టి పాపాయి పెళ్లిలో పెద్దగా
మురిసి పోతుంటుంది మెరిసి పోతుంటుంది. "
(ఆంధ్రజ్యోతి వారపత్రిక. బొమ్మరిల్లుశీర్షిక)

3. ఉభయుల ఆటవిడుపు పాటలు.

బాల బాలికలు కలిసి ఆడుకొనే ఆటలకు సంబంధించిన పాటలు కూడా జానపద సాహిత్యంలోనే ఎక్కువగా కన్పిస్తాయి. ఆధునిక సాహిత్యంలో ఉభయుల ఆటలకు సంబంధించి చెప్పుకోదగ్గ పాటలేవీ కనిపించవు.

బాల బాలికలు కలసి ఇసుకలో పిచ్చుక గూళ్ళు కట్టి ఆడుకోవటం చూస్తుంటాం ఆ గూళ్ళలో రాత్రిళ్లు పిచ్చుకలు వచ్చి పడుకుంటాయని వాళ్ళ నమ్మకం. అందుకే ఆనందంతో గూళ్ళను కడతారు. దానికి సంబంధించిన పాటలుకూడా కొన్నిఉన్నాయి ఉదాహరణకు : వడ్డి విజయసారథిగారి గేయం

" చెలియల కట్టకు చేరువలో - సంజవేళ సరదాగా
పిల్లలంతా చేరాము - పిచ్చుక గూళ్ళను కట్టాము
... ... ... — ..."
(బాలం గీతాలు)

ఇదే విధంగా బాలబాలికలు కలసి ఉత్సాహంతో పాటలు పాడుకొంటూ ఉయ్యాల లూగుతారు. కొన్నిప్రాంతాల్లో ఈ ఆట బాలికలు మాత్రం ఆడుకొంటారు ఉయ్యాలలూగుతూ పాడే క్రింది పాటలో పైకి క్రిందికి సాగి తూగే ఉయ్యాల ఊపులో భూమ్యాకాశాల్లోని అందచందాల్ని తిలకించ వచ్చని వెలంల్ల సాంబశివరావుగారు తెలిపారు.

" ఉయ్యాల ఊపుతో పైకి పోయ్యాను
నీలికాంతుల మబ్బుచాలు చూశాను

ఉయ్యాల ఊపుతో క్రింది కొచ్చాను
పచ్చ పచ్చనిగడ్డి సొంపుచూశాను
... ... ... ... ...
ఊపరా ఊపరా చిన్ని అబ్బాయి
ఊగవే ఊగవే బుల్లి చెల్లాయి
ఉయ్యాలోయ్ ఉయ్యాల - జంపాలోయ్ జంపాల."
(పాల పాటలు. పుట : 24)

మొత్తంమీద ఆధునిక బాలసాహిత్యంలో ఆటలకు సంబంధించిన పాటల్లో ఆడుతూ పాడుకొనే పాటలకన్నా ఆడుకోవడానికి ఆహ్వాన రూపమైన పాటలే ఎక్కువ పైగా ఆటవస్తువులైన బంతి, బొంగరం, గోళీకాయ, గాలిపటం మొదలైన వాటిని వాటి సహాయంతో ఆడేఆటల తీరుతెన్నుల్ని వర్ణించే గేయాలే చాలా ఉన్నాయి. అవి ఆయావస్తువులతో ఆడుకొనేటప్పుడు పిల్లలు పాడుకోవడానికి అనువైనవికావు. ఆధునికమైన ఆటపాటల్లో కొన్ని బాలజానపద వాఙ్మయంలోని ఆటపాటలకు అనుకరణలు అయినా అట్టి ఆధునికమైన పాటలకన్నా జానపద వాఙ్మయంలోని ఆటపాటలకే దేశంలో ఎక్కువ ఆదరణ. బాలబాలికలకు సంబంధించి బొమ్మరిల్లాటలు, బొమ్మల కొలువులు, బొమ్మల పెళ్ళిళ్లు - మొదలైన ఆటల్ని, వాటి విశేషాల్ని తెల్పేగేయాలే ఆధునిక బాలసాహిత్యంలో ఎక్కువగా ఉన్నాయి.

## 4. 9. పశు పక్ష్యాదుల పాటలు.

పక్షులు, జంతువులు మొదలైన వాటి ఆకారాలు, అరుపులు, చేష్టలు పిల్లల్ని విశేషంగా ఆకర్షించి వినోదాన్ని కల్గిస్తాయి పశుపక్ష్యాదుల్ని పాత్రలుగా చేసికొని వ్రాసిన గేయాల్ని పశు పక్ష్యాదుల పాటలని వర్గీకరించవచ్చు అలాంటి గేయాల్ని ఆధునిక రచయితలు ఎక్కువగా వ్రాసియున్నారు తరచుగా కనిపించే కుక్క, పిల్లి, ఆవుదూడ, మేక మొదలైన సాధు జంతువులు ఒక విధంగా పిల్లల నేస్తాలని చెప్పవచ్చు. అందుకే బాల గేయాల్లో వాటి ప్రసక్తి ఉన్నవే ఎక్కువగా కన్పిస్తాయి.

విశ్వాసంతో తన యజమానిని, ఇంటిని రక్షించుటునిరా కాపాడే సాధుజంతువు కుక్క. పిల్లలు కుక్క పిల్లలతో కలిసి ఆడుకోవటం చూస్తుంటాం. బాల నేస్తమైన కుక్కను, దాని చేష్టల్ని వర్ణించే గేయాలెన్నో ఉన్నాయి ఉదాహరణకు.

" మా చిన్ని కుక్క మా మంచి కుక్క
మా నాన్న తెచ్చారు మేమాడుకుంటాము
చక్కని చుక్క మా చిన్ని కుక్క
పాలబువ్వ తింటుంది - పంచలో బజ్జుంటుంది
పగలు నిద్దరలు తీస్తుంది - రాత్రులు ఇల్లు కాస్తుంది ||మా||
ఇంటిలో ఎవ్వరు ఒంటరిగ ఉన్నా
తోడు తోడుగ ఉంటుంది - తోకాడిస్తూ ||మా||
ఇంటి వాళ్ళను చూస్తె - ఎగిరి గంతేస్తుంది
బయటి వాళ్లను చూస్తె - భవ్ మంటుంది. ||మా||

(బాల సాహిత్య మంజరి)

అలాగే అలపర్తి సుబ్బారావుగారి 'చిట్టి ప్రశ్న' గేయంలో పిల్లిపిల్ల చేష్టలు వర్ణించబడ్డాయి

" అల్లదిగో అల్లదిగో - తెల్ల పిల్లి పిల్లదిగో
మొన్న మొన్న పుట్టినట్టి - బుల్లి పిల్లి పిల్లదిగో
తల్లినొదిలి తిరుగుతుంది - 'పిల్లి మొగ్గ' లేస్తోంది
గుట్టలెక్కి దూకుతోంది - గోడలపై ప్రాకుతోంది
... ... .. ... ... .. "

(ఆంధ్రజ్యోతి వారపత్రిక బొమ్మరిల్లు శీర్షిక)

పిల్లల్ని ఆకర్షించే సాధుజంతు వర్గంలో ఆవుదూడకు అగ్రస్థానం ఉంది. ఆవుదూడకు సంబంధించిన పాటలు చాలా బాలగేయాల్లో ఎక్కువగా కన్పిస్తాయి.

వెంగు వెంగున గంతులువేసే ఆవుదూడ అందచందాల్ని చింతా దీక్షితులు సహజ సుందరంగా వర్ణించారు పిల్లల పరిభాషలో 'తువ్వాయి' అనే పేరుతో వెలువడిన ఆగేయం.

" తువ్వాయి తువ్వాయి ఏమితువ్వాయి
తువ్వాయి తువ్వాయి మంచితువ్వాయి
తువ్వాయి మెడలోన ఏమివున్నాయి
తువ్వాయి మెడలోన మువ్వలున్నాయి
తువ్వాయి కాళ్లల్లో ఏమివున్నాయి
తువ్వాయి కాళ్లల్లోపరుగులున్నాయి
తువ్వాయి నోట్లోన ఏమివున్నాయి
నోట్లోన తెలిపాల నురగలున్నాయి
తువ్వాయి తువ్వాయి ఎవరితువ్వాయి
ఆవుగారి తువ్వాయి అసలు మాతువ్వాయి"

(లక్క పిడతలు)

వేజండ్ల సాంబశివరావుగారు 'తువ్వాయి' గేయంలో ఆవుదూడ చెంగనాల్ని

" అంబా అన్నది తువ్వాయి - అమ్మను చేరెను తువ్వాయి
పాలను త్రాగెను తువ్వాయి - పొట్టనింపుకొనె తువ్వాయి"

(ముద్దు పాటలు)

అంటూ అద్భుతంగా వర్ణించారు

ఆవుదూడలాగే మేకపిల్ల కూడా పిల్లలనేస్తమే అందుకే బుజ్జిమేకకు, చిన్నపాపకు జరిగిన సంభాషణ గేయరూపాన్ని దాల్చింది చిన్న పిల్లలకు అభినయంతో కంఠస్థమయిన ఆగేయం బి వి నరసింహారావుగారి రచన ఆపాట.

" బుజ్జిమేక బుజ్జిమేక ఏడకెళ్లివి ?
రాజుగారి దొడ్డిలోన మేతకెళ్లిని !

రాజుగారి దొడ్డిలోన ఏమిచూస్తివి ?
రాణిగారి పూలచెట్ల సొగసుచూస్తిని !
పూలచెట్లు చూసి నీవు ఊరకుంటివ ?
ఊరకోనక పూలచెట్లు మేసివస్తిని !
మేసివస్తె నిన్ను భటులు ఏమిచేసిరి ?
భటులు వచ్చి నాదు కాలు విరుగగొట్టిరి !”
(పొడుపుపాటలు.)

కోతి సాధు జంతువు కాకపోయినా పిల్లలకు ఆకర్షణీయమైనది. కుప్పి గంతులు వేస్తూ, కొమ్మలపై దాటుతూ అల్లరి చేష్టలతో కిచకిచలాడుతూ తిరుగుతుండే పిల్లలకు పట్టరాని ఆనందం, అల్లరికి మారుపేరు కోతి. అందుకే పిల్లలెక్కువగా అల్లరిచేస్తే 'ఏమిటా కోతి చేష్ట' అనడం లోక వ్యవహారం. కోతి చేష్టల్ని మిరియాల రామకృష్ణ గారు ఈ గేయంలో వర్ణించారు

“ కొమ్మలు విరిగేదాకా ఊగే – కోతులు కోతులు కోతులు
పళ్ళూ కాయలు తింటూ ఎగిరే – కోతులు కోతులు కోతులు
మంచి చెడ్డా ఎఱుగక తిరిగే – కోతులు కోతులు కోతులు
కిచకిచమని ఎక చెక్కాలాడే – కోతులు కోతులు కోతులు
... ... ... ... ”
(బాలాభిరామం పుట : 40.)

రాముడు లంకకు వారధి నిర్మించినప్పుడు ఉడుత సహాయం చేసినట్లు రంగనాథ రామాయణం లోని ఒక కల్పన 'ఉడుతా భక్తి' అనే నానుడి దానినుండి వచ్చిందే. అటువంటి ఉడుత ప్రసక్తితో కూడినగేయాలు తల్లికడుపులో బుల్లి సంచిలో దూర్చుని ఎల్ల ప్రపంచాన్నీ చూసే కంగారును వర్ణించే గేయాలుకూడా ఉన్నాయి.

ఇంట్లో మనుషుల మధ్య అతి సన్నిహితంగా మసలే ఆవు, కుక్క, పిల్లి, మొదలైనవి సాధుజంతువులు. ఎక్కడో ఉండే పులి, సింహం మొదలైనవి క్రూర

జంతువులు వీటిని జంతుప్రదర్శనశాలల్లోనూ, వినోదప్రదర్శనాలలోనూ చూడ్డం తప్ప అంతకుమించి వాటితో సంబంధం ఉండదు అందుకే క్రూర జంతువులకు సంబంధించిన బాలగేయాలు చాలా తక్కువగా ఉన్నాయి. అవికూడా పిల్లలకు అందుబాటులో ఉన్న శైలిలో లేవు

ఆకాశంలో ఎగురుతూ, చెట్లకొమ్మలపై వాలుతూ కిలకిలారావాలతో నవచైతన్యాన్ని కలుగజేస్తాయి పక్షులు. చూడముచ్చట గొలిపే భూమిపైనున్న పక్షులు ఆకాశంలోని చుక్కలకన్నా అందమైనవి. చిలుక, కాకి, కోయిల, పిచ్చుక మొదలైన పక్షుల్ని ప్రతిరోజు చూస్తుంటాం. పక్షుల పాటల్లోకూడా అవె ఎక్కువగా చోటు చేసుకున్నాయి.

కనుపెలుగు వేళ కావుకావుమంటూ అందర్నీ లేపే కాకిస్వరూపాన్ని, స్వభావాన్ని వాటిజీవితాన్ని సమగ్రంగా చాలామందికవులు చిత్రించారు. 'కాకిచేత కబురంపరాదా' అని ఒక జాతీయం ఇంటిదగ్గర చేరి కాకి తెగఅరుస్తుంటే బంధువులొస్తారనే నమ్మకం కూడా మన వాళ్లకుంది ఎన్. బాలగారి ఈ గేయంలో కాకి అరుపులువిని దూరతీరాలలో ఉన్న తమవాళ్లు కబురు పంపినట్లుగా ఊహించిన తీరు వర్ణితమైంది

" కావుకావుమని కాకమ్మ - కబురేదో తెచ్చిందమ్మ
పట్టణంలో ఉన్న పెదమామయ్యా - పట్టుపరికిణీ నాకు తెస్తారా?
చదువుల కెళ్లిన చిన్నన్నయ్యా - చెల్లెలి ముచ్చట తీరుస్తారా?
... ... ... ... ... "

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక బొమ్మరిల్లు శీర్షిక-)

పిల్లలు అరుస్తుంటే 'ఏమిటా కాకిగోల' అని పెద్దలు విసుక్కోవడం చూస్తుంటాం. ఆటలకోసం ఎక్కడెక్కడో తిరిగి ఇల్లుచేరిన పిల్లని 'కాకిలాగా ఎక్కడ తిరిగొచ్చా' వని దండించడం కూడా పరిపాటి. ఆవిషయాలుకూడా గేయాల్లో చోటు చేసుకున్నాయి.

రంగులో, రూపులో కాకికి కోయిలకు అంతతేడా కన్పించదు కాని అరుపులో ఆ రెండిండికీ చాలాభేదం ఉంది కాకి అరుపు కర్ణకఠోరమయితే కోయిలపాట వీనులవిందు ఆరెంటికీ ఉన్న తేడాని తెలియచెప్పే గిడుగు సీతాపతిగారి గేయం.

"కాకీ నలుపే కోయిలనలుపే - కనబడవంతగ రెంటికితేడా
వసంత కాలము రాగానే - బయుబపడునుగా వాటినైజములు
కావుకావుమని అరుచునుకాకీ- కో కో కో యని కూయునుకోయిల"
(బాలానందం.)

"కాకః కృష్ణః పికః కృష్ణః
కోభేదః పికకాకయోః ?
వసన్తకాలే సంప్రాప్తే
కాకః కాకః పికః పికః !!"

అనే ప్రసిద్ధమైన సంస్కృత శ్లోకం పై గేయానికి మూలం

గ్రామల్లో ప్రతీ ఇంట్లోనూ అతి సాధారణంగా కోళ్లను పెంచుతుంటారు. తొలికాము వేళలో కోడిపుంజు తన కూతతో ప్రజల్ని మేల్కొలుపుతుంది అలాగే చిన్న చిన్న కోడిపిల్లల్ని కాకులు, గ్రద్దలు, తన్నుకు పోకుండా కాపాడ్డంలో కోడి పెట్ట ఎంతో జాగ్రత్తగా ఉంటుంది. వీటిని వివరించే కోడి పాటలు కూడా కొన్ని ఉన్నాయి.

పక్షుల్లోకెల్లా అందంగా చూడముచ్చటగా ఉండే రామచిలుకకు పచ్చనిరంగూ ఎర్రని ముక్కూ, తీయని పలుకులూ ఎలావచ్చాయని ప్రశ్నించే క్రింది బాలగేయాన్ని మాల్యశ్రీగారు వ్రాశారు చక్కని భావనలతో చిలుక అందాన్ని, పలుకుల్ని సమన్వయించుకోవడం కూడా ఈ గేయంలో కన్పిస్తుంది

"పచ్చ పచ్చనిరంగు నీకెలాగు వచ్చెను చెప్పవే ?
పసరుటాకుల గుబురులందున మొసలు చుండుటవల్లనా?

ఎఱ్ఱ ఎఱ్ఱని ముక్కు నీకేలాగు వచ్చెను చెప్పవే ?
మిగుల పండిన పండ్లనెప్పుడు పొడిచి తినడం వల్లనా ?
తీయతీయని పలుకు నీకేలాగు వచ్చెను చెప్పవే ?
చిన్నిపాపల చిట్టిమాటలు తరచు వినడం వల్లనా ?"
(ఆంధ్రజ్యోతి వారపత్రిక బొమ్మరిల్లు శీర్షిక)

చెట్ల కొమ్మల నడుమ దాగి ఆకుల్లో ఆకులా కలసిపోయే పచ్చని రామ చిలుకను, రంగులో నలుపైనా మధురమైన కంఠం ఉన్న కోయిలను సాయంకాలం చల్లగాలిలో పచ్చని చేలమీద 'క్రొ క్రొ క్రో' అని అరుస్తూ సాగిపోయే పిట్టల్ని ఇండ్లలో గోడపై ఉండే అద్దంపై కూర్చొని అందులో కనిపించే తన ప్రతి బింబాన్ని ముక్కుతో పొడిచే బూడిదరంగు పిచ్చుకల్ని, ఆకాశంలో మేఘాలు అలుముకొన్నప్పుడు ఆనందంతో పురివిప్పి నాట్యంచేసే నెమలిని - వాటి చేష్టల్ని బాలగేయ రచయితలు చాలామంచి వర్ణించారు ఉదాహరణకు ఎగిరే పిట్టల్ని వర్ణిస్తూ ఓలేటి రామకృష్ణ వ్రాసిన గేయం

" ముడిచి పెట్టిన రెక్కలసందున - ముందు గాలులనింపుతూ
ఎగిరె పిట్టలు ! ఎగిరె పిట్టలు !
ముక్కులూపుతు కాళ్లుచాపుతు - ఎక్కడైనా తిండి వెదుకుచు
ఎగిరె పిట్టలు ! ఎగిరెపిట్టలు !
... ... .. ... ... ..."
(ఆంధ్ర జ్యోతి వారపత్రిక. బొమ్మరిల్లు శీర్షిక)

పడగెత్తి ఆడే పాము, మెల్లగా నడిచే నత్త, అక్వేరియంలో బంధించబడిన చేప పిల్ల, చిమ్మ చీకటిలో మినుకు మినుకుమంటూ మెరిసే మిణుగురు, ఇండ్లలో గూళ్ళు కట్టి బాజాపెట్టే సాలె పురుగు, మొదలైనవన్నీ బాలగేయాల్లో చోటుచేసుకున్నాయి. ఉదాహరణకు బాలసుబ్బయ్య నత్తనడకను వర్ణిస్తూ వ్రాసిన గేయం.

" మెల్ల మెల్లగా నడచునువత్త
మెల్ల మెల్లగా ఏలనడచునో
నత్త వీపుపై ఉన్నది గుల్ల
గుల్ల మొత్తము నత్తకు ఇల్లు
ఇంటి సంతను మోస్తూపోతే
మెల్ల మెల్లగా నడవదె నత్త ? "

(బడిగంట. పుట : 13.)

జంతువుల్లో కుక్క, పిల్లి, తుహ్వాయి, మేక మొదలైన పెంపుడు జంతువులకు సంబంధించిన మాటలే అధికంగా కన్పిస్తాయి పక్షుల్లోకూడా ఇండ్ల పరిసరాలకు, గ్రామ ప్రాంతాలకు సంబంధించిన కోడి, కాకి, కోయిల, నెమలి, పిట్ట, పిచ్చుక చిలుక మొదలైన వాటికి సంబంధించిన పాటలు ప్రధానంగా ఉన్నాయి. ఈ పాటలు చాలా వరకు చిన్నవి. పశుపక్ష్యాదుల అరుపులు కూతలు అనుకరించినట్టి ధ్వన్యనుకరణ పదాలు కూడా ఈ పాటల్లో ప్రయుక్తాలై ఉన్నాయి. అలాంటి రచన పిల్లలకు ఆకర్షణీయం కూడా.

సత్తిరాజు కృష్ణారావుగారు వ్రాసిన 'బంగారు కథలు – పక్షిపాటలు' లో కోడి చిలుక, బాతు, కోకిల, నెమలి, పిచ్చుక, కాకి వీటికి సంబంధించిన ఏడు పాటలున్నాయి. పక్షులకు మనుషులకు మధ్య ఉన్న సంబంధాన్ని కొన్ని గేయాల్లో చక్కగా సమన్వయించి సంభాషణా రూపంతో వ్రాసిన విలక్షణ రచన అది ఉదాహరణకు : నెమలి పాట

" నల్లని మబ్బులు - మెల్లగ వచ్చి-దాగిన వేళ
చల్లని గాలిలో - సంతసపడుచు
పురిలో ఆడెడి - దెవరన్నా
నల్లని కాంతుల - నెమలే చెల్లీ."

(బంగారుకథలు – పక్షిపాటలు.)

## 4. 10. పండుగల పాటలు.

తెలుగు వాళ్లు ఉత్సాహంతో జరుపుకొనే పండుగలు, ఇతర ఉత్సవాలకు సంబంధించిన ఆధునిక బాలగేయాలను పండుగ పాటలనే వర్గం క్రింద చెప్పవచ్చును. ఎల్లోరా, అలపర్తి వెంకట సుబ్బారావుగార్లు ప్రత్యేకంగా పిల్లలకోసం పండుగలకు సంబంధించిన గేయాల్ని వ్రాసి పుస్తకరూపంలో ప్రకటించారు. తెలుగు పత్రికల్లో ఆయా పండుగల సందర్భాల్లో వెలువడే ప్రత్యేక సంచికల్లోకూడా పండుగల పాటలు ప్రకటిత మయ్యాయి.

ఉగాది పాటలు.

ఉగాది ఆంధ్రులకు ముఖ్యమైన పండుగ తెలుగు వాళ్ళకదీ సంవత్సరాది పండుగ. కొత్త చివుళ్లతో ఫల పుష్పాదులతో ప్రకృతి అంతా కనువిందు కల్గించే వసంత ఋతువులో ఈ పండుగ వస్తుంది పాత సంవత్సరానికి భరతవాక్యంచెప్పి క్రొత్త సంవత్సరానికి నాంది పలికే ఉగాది వేడుకల్ని వర్ణించే ఆధునిక బాలగేయాలు కోకొల్లలు.

తెలుగు పిల్లలు ఉగాదికి స్వాగతం చెప్తూ పాడే క్రింది పాటను న్యాయపతి రాఘవరావుగారు వ్రాశారు

" స్వాగతముూ ! స్వాగతముూ ! - ఉగాది నీకిదే స్వాగతము
తెలుగు పిల్లలము క్షేమను జూపుచు
పాడుచు పిలిచే స్వాగతముూ..... "

(బాలగేయమాల)

అలపర్తి వేంకట సుబ్బారావుగారు (పండుగల పాటలు) అన్నాజీ శర్మగారు, (బాలి ఏప్రియల్ 1957) మిరియాల రామకృష్ణ (రంగు రంగుల దీపాలు) మొదలైనవాళ్లు ఉగాది రాకను వర్ణిస్తూ బాలగేయాల్ని వ్రాశారు.

ఈ పండుగ భోజనంలో ఉగాది పచ్చడి ప్రత్యేకించి చాలా ముఖ్యమైనది. షడ్రుచులతో కూడిన ఉగాది పచ్చడి ప్రాశస్త్యాన్ని ప్రస్తుతిస్తూ వెంకట్రామయ్యగారి క్రింది గేయాన్ని వ్రాశారు

" పండ్లు పులిసే చింతపండు - వగరు పుట్టే వేపపూవు
వాగరుమామిడి పిందెతోడను - క్రొత్త బెల్లము కొంతకలిపి
క్రొత్తసంవత్సరపు వేళను - ఆరగించుట యందు చాలా
అర్థమున్నది బాలకా !
వేరు వేరు మతములున్నా - వేష భాషలు వేరుపడినా
జాతి కొక్కొక నీతియున్నా - భరతపుత్రుల యాశయంబున
భావభేదము లేదటంచును

... ... ... ... ... ...

భిన్నభిన్నా రుచులకల్గిన - చిన్న పానీయంబుచాటును
అర్థమెరిగీ దాని నీవు - ఆరగింపుము బాలకా"

—బాలమిత్ర

" కష్టసుఖాలను సమానరీతిన - భావించుట మనకర్తవ్యం
తీపీ చేదూ ఉగాదిపచ్చడి - తినుటలో యిదేరహస్యం"
(బాల ఏప్రిల్ 1947 పుట : 8.)

అంటూ బాబ్జీగారు కూడా ఉగాది పచ్చడి తినడంలోని రహస్యాన్ని తెలిపారు.

తలంటి స్నానంచేసి కొత్తబట్టలు కట్టుకొని ఉత్సాహంతో ఉగాది పండుగ జరుపుకుంటారు పిల్లలు. సంవత్సరాదినాడు పంచాంగ శ్రవణం చేయడం కూడా ఆంధ్రుల ఆచారం. కొత్తల్లుడు పెళ్ళయిన సంవత్సరం ముఖ్యమైన పండుగలకు అత్తగారింటికి రావడం కూడా మనవాళ్ళ ఆనవాయితీ. అలా పండక్కి వచ్చిన బావగారిని వరసైన మరదళ్లు ఆట పట్టించడం కూడా ఆ పండుగ కార్యక్రమాల్లో ఒక భాగమని చెప్పవచ్చు. జయరావుగారి క్రింది గేయంలో ఉగాది పండుగనాడు బావా మరదళ్ళ మధ్య జరిగే సరస సంభాషణ గోచరిస్తుంది

" చిట్టి మరదల చిట్టి మరదల ఎక్కడికి కెళతావు ?
గున్న అంటుమావులున్న తోటకెళతాను
చిట్టి మరదల చిట్టి మరదల ఏమి తెస్తావు ?
మంచి మంచి మామిడి కాయలు ఏరి తెస్తాను
చిట్టి మరదల చిట్టి మరదల ఏమి చేస్తావు ?
వస్తూ ఉన్న ఉగాదికి పచ్చడి చేస్తాను. "

(బాల మార్చి 1947 పుట : 9)

2. శ్రీరామ నవమి పాటలు.

ఉగాది తర్వాత వచ్చే పండుగ యిది విష్ణువు అవతారమైన శ్రీరామచంద్రుని పుట్టినరోజు పండుగ. చైత్ర శుక్ల పౌర్ణమినాడు ఈ పండుగ జరుపుకుంటారు. ఉగాది నుండి నవమిదాకా శ్రీరామ నవరాత్రులు వేడుకతో జరుపుతారు. సీతారాము లకు పెళ్లి జరిపిస్తారు సీతారాముల విగ్రహాలను పల్లకీలో ఊరేగిస్తారు వేడుకలను వర్ణిస్తూ అలపర్తి వెంకట సుబ్బారావుగారు వ్రాసినదీ క్రింది గేయం.

" చిన్నారి పాపాయి - శ్రీరామనవమి
విచ్చేసినది నేడు - వేడుకలుచూడు
ఈనవమినాడెయిల - జనియించినాడు
సీతామనోహరుడు - శ్రీరామవిభుడు
సీతమ్మతల్లికీ - శ్రీరామునకును
తలలపైబోశారు - తల్బ్రాలుజనులు
బుట్టెడూ వడపప్పు - పెట్టిరందరికీ
పానకం బిందెడూ - పంచిరందరికి
... ... ... ... ... "

(పండుగల పాటలు. పుట : 2.)

### 3. కృష్ణాష్టమి పాటలు.

విష్ణుమూర్తి దశావతారాల్లో కృష్ణావతారం ఎనిమిదవది. శ్రావణ బహుళ అష్టమినాడు రోహిణీ నక్షత్రంలో రాత్రి కృష్ణుడు అవతరించాడు. అందుచే అష్టమినాడు పగలంతా ఉపవాసం చేసి సాయంకాలం కృష్ణునికి పూజలు జరపడం ఆచారం. కృష్ణలీలలకు చిహ్నంగా ఆ దినం ఉట్లతిరణాలు వేడుకతో జరుపుతారు. కృష్ణునికి, గోవులకు సన్నిహిత సంబంధముంది. గోవులను కాచే కృష్ణునకు గోపాలుడు అనే సార్థకనామధేయ మేర్పడింది. అందుకే కృష్ణాష్టమి రోజు గోవులను కూడా పూజిస్తారు.

ఎల్లోరాగారి క్రిందిపాటలో కృష్ణుని చేష్టలన్నీ చక్కగా వర్ణింపబడ్డాయి. కృష్ణాష్టమినాడు ఉట్టి ప్రసక్తి కూడా ఈపాటలో కన్పిస్తుంది.

"నల్లని వాడమ్మ - ఆచిన్నికృష్ణయ్య
అందుకోబోతేను - అందరాడమ్మ
... ... ... ...
కాళీయమర్ధనం - చేసినాడమ్మ
వేణునాదపువిద్య - నేర్చినాడమ్మ
... ... ... ... ...
ఉట్టిపై వెన్నను - కృష్ణయ్య తీసేను
ఉట్టిలో టెంకాయ - మీరు కొట్టండి
ఉల్లాస మొప్పంగ ఉట్టికెగరండయ్య
ఉట్టిలో టెంకాయ ఎగిరి కొట్టండయ్య
కొట్టి తినరండయ్య కొబ్బరి బెల్లాలు
ఉట్టి అదిగో ! వేగము పరికి రారండి."

(పండుగల పాటలు - కథలు)

### 4. నాగుల పంచమి - నాగుల చవితి పాటలు.

మన దేశంలో నాగులను పూజించటం అనే ఆచారం చాలా ప్రాచీనకాలంనుంచి ఉంది. శ్రావణ శుద్ధ పంచమినాడు నాగపంచమని, కార్తీక శుద్ధ చవితినాడు నాగుల

చవితిని జరుపుకుంటారు. ఆ రోజుల్లో తెలుగు వాళ్ళు నాగ విగ్రహాలను పూజించి పుట్టలో పాలుపోసి ప్రదక్షిణాలు చేస్తారు. పాములు వర్షం కురిపించి పంటల్ని అభి వృద్ధి పరుస్తాయని, పుత్ర సంతానాన్ని కలుగ జేస్తాయని మనవాళ్ళ నమ్మకం. శ్రావణ మాసంలో ఎక్కువ వర్షాలవల్ల పాములు పుట్టనుండి వెలుపలికి వస్తాయి. అలాంటి సమయంలో ఎవర్నీ కాటెయవద్దని పాముకు విన్నవించేస్తూ ఈ పూజలు చేస్తారని కూడా అంటారు. అలాంటి నాగ పంచమికి చెందిన ఈ పాట కవుల ఆంజనేయ శర్మగారి రచన

" పుట్టలో మెత్తని పట్టు పరుపుల పైన
నిద్దురాబోయేటి ముద్దు నాగన్నా
... ... ... ... ...
పసితనము చేతమూ పాపలేనాడైనా
నీ పుట్ట దరిచేరి నిన్ను వేధింపంగ
కన్నుమింటూ నీవు బుసకొట్టుతూ వచ్చి
కసి బూని పసివాణ్ణి కాటేయబోకు "

(భావి పౌరులు పుట : 36)

5. వినాయక చవితి పాటలు.

పిల్లలకు, పెద్దలకు ఇష్టమైన పండుగ వినాయక చవితి. గణపతి, వినాయక విఘ్నేశ్వర, మూషిక వాహన, ఏకదంత, లంబోదర, శూర్పకర్ణ, మొదలైన పేర్లు ఉన్న ఈ బొజ్జదేవుని పండుగ ప్రతిసంవత్సరం భాద్రపద శుద్ధ చవితినాడు వస్తుంది. దీనికి గణేశ చతుర్థి అని కూడా పేరు. విఘ్నాల శాంతికి వినాయకుని పూజించడం హిందువుల ఆచారం.

" గణపతి పండుగ వచ్చినదీ - ముదమగు పండుగ వచ్చినదీ
విద్యలదేవుని పండుగరా - మన బొజ్జ దేముని పండుగరా. "

(బాల. సెప్టెంబరు. 1957. పుట: 5)

అంటూ పిల్లలు ఈపండుగను ఉత్సాహంలో జరుపుకుంటారు. వినాయకుని పూజించే తీరుతెన్నులు, అర్పించే ఫలపుష్పాదులు ప్రకటించటంగాక వినాయక చవితి రోజు చంద్రుని చూసిన వారికి నీలాపనిందలు ఏర్పడతాయని, శమంతకోపాఖ్యానాన్ని వింటే ఆదోషం తొలగి పోతుందని పురాణాల్లో చెప్పబడిన అంశాలు కూడా బాల గేయాల్లో చోటుచేసుకున్నాయి

**6. విజయదశమి పాటలు.**

బడిపిల్లలకు విజయదశమి పండుగ పరమానంద భరితం. ఆశ్వయుజ శుద్ధ దశమి నాడు ఈ పండుగ వస్తుంది. దీన్ని దసరా అని కూడా పిలుస్తారు. ఈ పండుగను 'విజయ దశమి' అని పేరు రావటానికి ఎన్నో కారణాలున్నాయి. విజయ దశమి శ్రీరాముని విజయం నుంచి ప్రారంభ మయిందని కొందరు, అర్జునుని (విజయుని) విజయంనుంచి ప్రారంభమైందని కొందరు భావిస్తున్నట్లు తెలుస్తున్నది.[1] అలవర్తి వెంకట సుబ్బారావుగారి క్రింది పాటలోను ఆ విషయం స్పష్టమవుతుంది

"... ... ... ... ...
కురు వీరులతో బోరి - గోవులను కొని తెచ్చి
నట్టి వీరార్జునుని - అందరూ స్మరియింప
కోతులాడించుచూ - కుంకుములు చల్లుతూ
చిటికెలో కిష్కింధ - ఇటకొచ్చెననిపించ
అల రావణునిజంపి - నట్టి శ్రీరామునీ
పట్టాభిషేకమ్ము - ప్రతివారు తలపోయ
... ... ... ... ..."

(పండుగలపాటలు. పుట 7)

ఈ పండుగనాడు పిల్లలంతా చేరి పంతులుతో కలిసి ఉత్సాహంతో పాటలు పాడుకొంటూ ఇల్లిల్లూ తిరిగి కానుకలు స్వీకరిస్తారు. ఊరి పొలిమేరలోఉన్న జమ్మి చెట్టు దగ్గరికి వెళ్ళి పూజలు చేస్తారు. అటువంటి విజయ దశమి వేడుకలను వర్ణిస్తూ వ్రాసిన గేయాల్లో ఉదాహరణకు, దాశరథిగారి గేయం

1. ప్రతాప రెడ్డి, సురవరం. హిందువుల పండుగలు

" పంతులు గారికి కట్నాలు - బడి పిల్లలకు పుట్నాలు
... ... ... ... ... ...
రంగు రంగుల జండాలు - ఒక్కొరి కొక్కరు దండాలు
జమ్మి చెట్టుకు పోదాము - జమ్మి పూజలు చేదాము
పిండి వంటలు తిందాము - ఎన్నో కథలు విందాము "
(బాలల గేయాలు పుట . 30)

శమీ వృక్షానికి పూజలు జరిపే సంప్రదాయాన్ననుసరించి అర్జునుని పరంగా ఈ పండుగ జరుపుకుంటారనే భావం వ్యక్తమవుతుంది

ఆడపిల్లలు అమితోత్సాహంతో బొమ్మల కొలువులు పెట్టి పేరంటాళ్ళకు పసుపు కుంకుమ లివ్వడం దసరా పండుగలోని మరో ప్రత్యేకత

7. అట్లతద్ది పాటలు.

ఆశ్వయుజ బహుళ తదియనాడు వచ్చే అట్లతద్ద పండుగను ప్రత్యేకించి తెలంగాణా ప్రాంతంవాళ్ళు ఎక్కువగా చేస్తారు. అట్లతద్దిని వర్ణిస్తూ ఎల్లోరాగారు వ్రాసిన బాల గేయమీ క్రిందిది

" అట్లతద్దోయ్ ఆరట్లోయ్ - రారండోయ్ లేవండోయ్
... ... .. ... ..
పెద్దా చిన్నా భేదం లేక - ఆడామగా తేడా లేక
నేలనుతన్ని నింగిని చూడ - ఊయల లూగను రారండి !
... ... ... ... ... "
( పండుగల పాటలు - కథలు )

8 దీపావళి పాటలు.

- ప్రతిసంవత్సరం ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు దీపావళిపండుగ చేస్తారు. దీనికే నరకచతుర్దశి అని మరోకపేరు. నరకాసురుని మరణాన్ని పురస్కరించుకొని

ప్రజలందరూ సంతోషంగా జరుపుకొనే పండుగ ఇది. ఆనాడు సత్యభామ బాణ ప్రయోగంచేసి నరకాసురుణ్ని చంపితే ఈనాడు బాణసంచాలు పేల్చి సంతోషాన్ని వ్యక్తం చేస్తున్నారు దీపావళి పండుగలో దీపాల్ని అలంకరించడంలోను, టపాకాయలు కాల్చడంలోను పిల్లల హుషారు ఎక్కువగా ఉంటుంది కాబట్టి దీనిని బాలల పండుగగానే భావిస్తారు అందుకే బలరామాచార్యులుగారు

"దీపావళి పండుగ - పాపాయిల పండుగ
టపటపాల చిటపటాల - టపాకాయల పండుగ"
(బాలల బొమ్మల బాలగేయాలు. పుట: 27)

అన్నారు దీపావళి వేడుకల్ని, టపాకాయల కోలాహలాన్ని వర్ణిస్తూ చాలామంది బాలగేయాల్ని వ్రాసి ఉన్నారు ఉదాహరణకు ఓలేటి శివరామకృష్ణగారి గేయం.

"మెరుపులు మంటలు వరుసదీపాలు - ఎర్రని పచ్చని మతాబాలు
రివ్వునలేచే రవ్వల చువ్వాలు - బుస్సు బుస్సుమను చిచ్చుబుడ్డీలు
చిట పట ఢాం ఢాం చక్రపటాకులు - ఢణేల్ ఢణేలను గోడ పటాసులు
కాలుస్తాం మేం వేలుస్తాం - దీపావళి మేం పాటిస్తాం."
(బాల. నవంబరు 1946 పుట: 18.)

అతి తెలివితో చురుగ్గా ఉన్న పిల్లల్ని సిసింద్రలనడం చూస్తుంటాం. ఆభావాన్ని వ్యక్తంచేసే దీపావళి గేయం.

"నాపేరు సిసింద్రీ - ఏ చోటా దీపావళి కొస్తాను నేను
... ... ... ...
నా ఒళ్ళు మండితే నేనుండలేను
సర్రునా మీపైకి ఉరకబోతాను

నా చుఱుకు దనమునకు సాటియే లేదు
చుఱుకుగల బాలలే - ముందుకొస్తారు.
చుఱుకు గల బాలలే - చిరు సిసింద్రీలు."

(బాలగేయమాల)

## 9. సంక్రాంతి పాటలు.

దక్షిణ ప్రాంతీయులకు ప్రముఖమైన పండుగ సంక్రాంతి ముఖ్యంగా మూడురోజుల పండుగ ఇది కొన్నిచోట్ల నాలుగురోజులు చేస్తారు మొదటి దినం భోగి. రెండవరోజు సంక్రాంతి మూడవనాడు కనుమ సంక్రాంతిని మకర సంక్రమణం అని, పెద్దపండుగ అనికూడా పిలుస్తారు పండిన పంటలు ఇంటికి వచ్చి కళకళలాడే శుభదినాల్లో జరుపుకొనే పండుగ ఇది భోగిమంటలు వెయడం లోను, ముఖ్యంగా పిల్లలు ఇంటి ముంగిళ్లను ముగ్గులతో నింపి గొబ్బెమ్మలను అలంకరించడంలోను, గొబ్బిపాటలు పాడటంలోను, మగపిల్లలు - కనుమనాడు పశువులను అలంకరించటంలోను ఉత్సాహంతో పాల్గొంటారు సంక్రాంతి సంబరాలను చిత్రించే గేయాల్లో ఆ పండుగ రాకను వర్ణించే ఈగేయం ఎల్లోరాగారి రచన

"వచ్చిందయ్యో వచ్చింది - ఉల్లాసంగా సంక్రాంతి
తెచ్చిందయ్యో తెచ్చింది - తెలుగు వాకిట సుఖశాంతి
గణగణ గంటల నాదంతో - గలగల గజ్జెల రావంతో
కిలకిల కిలకిల నవ్వులతో - గరిసెలు నిండగ రాసులతో ॥వ॥
డూ డూ డూ డూ వెంకన్నా - గంగిరెద్దులా బసవన్నా
తూ తూ తూ తూ పాటలతో - కిన్నెర సన్నాయిపాటలతో ॥తె॥

(పండుగల పాటలు - కథలు)

సంక్రాంతిలో భోగిపండుగనాడు పేరంటాళ్లను పిలిచి చిన్నపిల్లలకు భోగిపళ్ళు పోస్తారు ఆవేడుకను వర్ణిస్తూ బాలాంత్రపు రజనీ కాంతరావుగారు వ్రాసిన బాలగేయం.

" చిట్టీ చిట్టీ రేగి పళ్ళూ - చిట్టీ తలపై భోగి పళ్ళూ
ఎంతో చక్కని భోగి పళ్ళూ - ఎర్రా ఎర్రని రేగిపళ్ళూ
ఘల్లూ ఘల్లున దమ్మిడీలు - జల్లుగ అల్లోనే రేడిపళ్ళు
తళ తళ తళ తళ లాడిపోతూ - తలపై ఎన్నో దొర్లిపోతాయ్.
(జేజి మామయ్య పాటలు)

సంక్రాంతి రోజుల్లో ఆడపిల్లలు ఇల్లిల్లు తిరిగి లయాత్మకంగా చేతులు తడ్తూ గొబ్బిపాటలు పాడుతూ గొబ్బెమ్మల్ని పూజిస్తారు. జానపద బాలగేయ వాఙ్మయంలో గొబ్బి పాటలు చాలా ఉన్నాయి వాటిని అనుకరిస్తూ ఆధునికులు కూడా గొబ్బి పాటలు వ్రాశారు. ఉదాహరణకు : కప్పల ఆంజనేయశర్మగారి గొబ్బిపాట.

" గోపాల కృష్ణుడే - గోపీ విలోలుడే !
గోపికల్లార మనము - గొబ్బివేదాము రారె ॥గోపి॥

రాధా విలాసుడే - రమణీ కుమారుడే
మాపాలీ దేవుడే - మమ్మేలు వాడే ! ॥గో॥ "
( బావిపాటలు. )

10. శివరాత్రి పాటలు.

ప్రతి సంవత్సరం మాఘ మాసంలో కృష్ణ చతుర్దశినాడు శివరాత్రి పండుగ వస్తుంది. ఇది శైవులకు చాలా ముఖ్యమైన పండుగ. ఆ రోజు శివభక్తులు ఉపవాస ముండి జాగరణ చేస్తారు అలాచేస్తే పాపవిమోచనం జరిగి మోక్షప్రాప్తి కల్గుతుందని వాళ్ళ నమ్మకం. శివరాత్రి రోజు శైవాలయాల్లో పెద్ద ఎత్తున ఉత్సవాలు జరుగుతాయి. అలాంటి ఉత్సవాలకు వెళ్ళిరావడాన్ని అలపర్తి వెంకట సుబ్బారావు ఈ గేయంలో వర్ణించారు.

" మహా శివరాత్రి యిదే వచ్చెనీ రోజు
ఆహా! యీ తిరణాల అంటేనే మోజు

ప్రభ యొకటి గట్టించిన బండిపై బెట్టాను
రెండు పొట్టేళ్ళనా బండికీ కట్టాను
'చేదుకో కోటయ్య చేదుకో' అని అంటు
ఉరుకు పరుగులతోడ తిరణాల కెళ్ళాను
గుళ్ళో దేవుని జూచి చిల్లి కాసీ వేసి
కోరికలు తీర్చమని మరీ మరీ మొక్కాను
చెంగు చెంగున వెళ్ళి రంగులా రాట్నంబు
ఎక్కి తిరిగాను నేనెంతో వుల్లాసంగ
తాతయ్యకని తీపి తాయమ్మ కొన్నాను
శివపార్వతుల బొమ్మ చెల్లెలికి కొన్నాను
... ... ... ...
రథ మెళ్ళి పోయాక ప్రభబండి కట్టుకొని
చిమ్మ చీకటిలోన చేరాను యింటికి."

('పండుగల పాటలు' పుట 18)

## 11. కాముని పండుగ పాటలు.

ఉత్తరాది వాళ్ళు జరుపుకొనే ముఖ్యమైన పండుగ కాముని పండుగ. ఇది ఫాల్గునమాసంలో వస్తుంది. దీనికే 'హోళి' అని, వసంతోత్సవమనీ, మదనోత్సవమనీ, డోలికోత్సవమనీ, వ్యవహార నామాలు ఈవసంతోత్సవాన్ని మనదేశంలో ప్రాచీన కాలం నుండి జరుపుకొంటున్నట్లు తెలుస్తున్నది. కొండవీటిని పరిపాలించిన రెడ్డిరాజుల కాలంనుండి దీనికి కొత్త అందం, అపూర్వమైన శోభ వచ్చింది. చిన్నా పెద్దలందరూ కలిసి వసంతాలాడి సరససల్లాపాలతో సరదాగా గడిపే పండుగ ఇది. ఈపండుగ వేడుకలను గంగరాజు సుశీలాదేవిగారు క్రింది బాలగేయంలో వర్ణించారు,

"హోళీ పండగో - హోళీ పండగో
హోళీ హోళీ రంగేళీ - జోరుపండగో

పిన్నా పెద్దా అంతా వసంతాల తానమాడి
వరసలేక వావిలేక సరసాలాడే పండగ
రంగులతో ఒకరినొకరు - సింగారించే పండగ
వింత వింత వేషాలతో - వీధులలో పిల్లలంత
అంతులేని సరదాతో - అల్లరిచేసే పండగ."
(చిట్టిముత్యాలు. పుట : 22)

## 12. స్వాతంత్ర్యదినోత్సవ గేయాలు.

1947 లో ఆగష్టు 15న భారతదేశానికి స్వాతంత్ర్యంవచ్చింది. భారతదేశ ప్రజలకు బానిసత్వంతొలగి స్వేచ్ఛ చేకూరిన పర్వదినమది. స్వరాజ్యాన్ని సంపాదించడానికి దీక్షతో కృషిచేసిన మహాత్మాగాంధికి ఆరోజు ప్రజలంతా భక్తితో అంజలి ఘటిస్తారు విద్యాలయాల్లోను, ఇతర సంస్థల్లోనూ అందరూకలసి స్వాతంత్ర్యదినోత్సవాలను జరుపుకుంటారు జాతీయపతాకాన్ని ఎగురవేసి భక్తి పారవశ్యంతో దేశభక్తి గీతాలను ఆలాపిస్తారు. అలాంటి వేడుకల్ని చిత్రించే దేశభక్తి గేయాలెన్నో ఉన్నాయి. ఉదాహరణకు :

" అదిగో ! మనజెండా - అల్లదిగో ! మనజెండా !
దేశభక్తులెగరేసిన జెండా ! - తీయని కలపండించిన జెండా !
బానిస బ్రతుకులముసిరిన చీకటి - పటాపంచలుగ చేసిన జెండా
విశ్వశాంతి సందేశము జగతికి - వినిపించినదిది మన జెండా
... ... ... ... ... "
(బాలభారతి పుట : 67.)

## 13. గాంధీ జయంతి గేయాలు.

జాతిపిత గాంధీ మహాత్ముని జీవితాన్ని, అతని గుణగణాల్ని, కార్యదీక్షను, దేశసేవను కీర్తిస్తూ వ్రాసిన బాలగేయాలు చాలా ఉన్నాయి. స్వాతంత్ర్య సమరంలో అవిరామంగా పోరాడిన మహనీయుడు గాంధి అటువంటి మహనీయుడైన గాంధీ

పుట్టినరోజు భారతీయులందరికి పండుగరోజు అందుకే అక్టోబరు రెండున భారతీయులు గాంధీ జయంతిని జరుపుకుంటారు గాంధీ గొప్పతనాన్ని చాటే పాటల్ని పాడి ఆనందాన్ని వ్యక్తం చేస్తారు ఉదాహరణకు : ఆదర్శమూర్తి అయిన గాంధీ చరిత్రను, చిత్రించిన పురాణపండ కామేశ్వరరావుగారి గేయం.

> " వచ్చింది నేడొచ్చింది - అక్టోబరు రెండొచ్చింది
> ఆంధ్రబాలలకు ఆనందమిచ్చు - అక్టోబరు రెండొచ్చింది
> బోరుబందరున పుట్టిన బాలుని - పుట్టినరోజు వచ్చింది
> ... ... ... ... ...
> పారతంత్ర్యమును పారద్రోలిన
> అహింసామూర్తి వెలసినరోజు ॥వ॥
> కలలోనైనా కల్లలాడని - కలియుగ పుణ్యుడు కలిగినరోజు.
> ... ... ... ... ... "
>
> ( బాలగేయాలు పుట. ౭౪. )

**14.** బాలల దినోత్సవ గేయాలు.

చాచా నెహ్రూ జన్మించిన దినం నవంబరు పదునాల్గవ తేదీ అతనికి పిల్లలంటె చెప్పలేనంత ప్రేమ అందుకే నెహ్రూ జన్మదినోత్సవం భారతీయులకు బాలల దినోత్సవమయింది బాలల పండుగకు కారకుడైన చాచా నెహ్రూకు అతని పుట్టిన రోజుకు పురస్కరించుకొని పిల్లలంతా

> " బాలలపండుగ నేడే నవంబర్ పదునాల్గుకు జేజేలు
> నెహ్రూ చాచా ! నీజన్మదినం నీకివె మా జేజేలు! ॥బాల॥
> ... ... ... ... ...
>
> ( జేజి మామయ్య పాటలు. )

అంటూ జేజేలు పలుకుతారు

వెక్కలంక లక్ష్మీపతిరావుగారు 'బాలల విలాపం' అనే ఈగేయంలో నెహ్రూజీ మరణాన్ని తలచుకొని బాలలు స్మరించి చెప్పిన మాటలు వినబడుతాయి.

" బాలకులారా! బాలికలారా! - పూలమాలికలిలు తెచ్చారా?
చాచానెహ్రూ పుట్టినరోజుని - సరదాగా ఇటు వచ్చారా
"చాచా యేడీ కనబడడే" యని-జాలిచూపులను చూస్తున్నారా
కనబడడిక మన చాచా రాడని - కంటనీరు పెడుతున్నారా?
... ... ... ... ... "

(స్వాతంత్ర్య భారతి పు: 42)

## 15. ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ గేయాలు.

నవంబర్ ఒకటి ఆంధ్రప్రదేశ్ అవతరించినరోజు. ఆంధ్రులకది పేరురోజు తెలంగాణా, ఆంధ్ర అంటూ విభేదాలు లేక తెలుగువాళ్లంతా ఒక్కటైనరోజు అందుకే ఆనందంగా ఇలా పాటలెన్నో పాడుకొంటారు

" ఎన్నాళ్లకు విన్నాము ఎన్నాళ్ళకు కన్నాము
కన్నతల్లి సంతసించ అన్నదమ్ములొకటైరని
తెలంగాణ ఆంధ్రయనెడి - తేడాలను విడిచిపుచ్చి
'ఆంధ్రప్రదేశ్' నెలకొల్పగ-ఆంధ్రులంత ఒకటైరని ॥ఎ॥
ఆంధ్రులంతవొకేబాట - ఆంధ్రులంత వొకేమాట
నడవాలని, నుడవాలని - దృఢ నిశ్చయులైనారని ॥ఎ॥
... ... ... ... "

(పండుగల పాటలు. పుట: 10)

పైపరిశీలనను బట్టి ఆధునిక బాలగేయ రచయితలు వ్రాసిన పండుగల పాటలు రెండు రకాలని చెప్పవచ్చు.

1. చాలాకాలంగా హిందువులు జరుపుకొనే ఉగాది, దీపావళి, సంక్రాంతి, వినాయక చవితి ...... మొదలైన పండుగలకి సంబంధించినవి

2. స్వాతంత్ర్యయోధులైన గాంధీ, నెహ్రూ మొదలైన వారికి, జాతీయమైన స్వాతంత్ర్యాది ఉత్సవాలకు సంబంధించినవి. మొదటి రకానికి సంబంధించిన గేయాల్లో సాధారణంగా వర్ణన ప్రధానం. రెండవ రకానికి సంబంధించిన గేయాల్లో ప్రబోధం ప్రధానం.

## 4. 11. నవ్వులాట పాటలు.

ఇతరుల్ని ఎగతాళి చేసి ఏడిపించి అందరూ కలసి ఉల్లాసంగా నవ్వుకోవడానికి ఉపకరించే పాటలే నవ్వులాట పాటలు. వినోద ప్రధానమైన అవి జానపద సాహిత్యంలో లాగే ఆధునిక సాహిత్యంలోనూ రెండు రకాలుగా కనిపిస్తాయి. బాలలు తమలో తాము గేలిచేసుకోవడానికి ఉపకరించేవి మొదటివి పిల్లలు తమతోటి వాళ్ళనే గాక తమకన్నా పెద్దవాళ్ళను కూడా పరిహసిస్తుంటారు. తాతనో, అవ్వనో, బడిపంతులునో, బావనో – గేలి చేస్తూ పాడేవి రెండవరకానికి చెందినవి.

న్యాయపతి రాఘవరావు గారి 'కాయలు – పిక్కలు' అనే క్రింది గేయంలో తల్లితండ్రుల చేతనో ఉపాధ్యాయుని చేతనో దెబ్బలు తిన్న పిల్లల్ని గేలి చేస్తూ తోటి బాలలు వినోదించడం కన్పిస్తుంది.

" కాయలు కాయలు తిన్నారయ్యా! -ఏమికాయలు తిన్నారయ్యా?
గట్టిఅల్లరి చేసే పిల్లలు - మొట్టికాయలు తిన్నారయ్యా ॥
పిక్కలు పిక్కలు తిన్నారయ్యా !-ఏమిపిక్కలు తిన్నారయ్యా॥
ఇంటిలోని అల్లరి పిల్లలు-శొంఠి పిక్కలు తిన్నారయ్యా ॥
పాశం పాశం తిన్నారయ్యా! - ఏమీ పాశం తిన్నారయ్యా ?
గోడూ చేసే పిల్లలూ - తొడ పాయసంబు తిన్నారయ్యా॥ "
( బాలగేయమాల. )

చెల్లెల్ని అక్కా, అన్నా ఎగతాళి చేస్తూ పాడే క్రింది పాట వెజెండ్ల సాంబ శివ రావుగారి రచన

“ చిట్టి పొట్టి చెల్లెలా! - చిట్టి ఎలుక నేస్తమా !
వేరు సెనగ పప్పులన్ని - ఎట్లు మాయమయ్యెనే ?
చిట్టి నీకు వంతుఎంత - చిట్టి ఎలుక వంతు ఏంత ? ”

(ముద్దపాటలు.)

ఇంటికొచ్చిన బావగారిని మరదళ్లు ఆటపట్టించడం తెలుగువారిలో సంప్రదాయ సిద్ధంగా వస్తున్న ఒకఆచారమంటే అతిశయోక్తి కాదు. బావ వరసవుతున్న అత్త కొడుకునుగాని, అక్కకొడుకునుగాని ముప్పుతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్ళు త్రాగిస్తారు పిల్లలు. బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారి ఈగేయంలో ఇంటికొచ్చిన బావగారిని సత్కరించడానికి మరదళ్ళు ఆలోచించే తీరు, స్వాగతం చేసేవిధానం హాస్యరసభరితం.

“ బావవచ్చాడోయ్ బావవచ్చాడు !
బందరు మిఠాయి పట్టుకొచ్చాడు,
మిడిమేళమును జేసి తోడపాశమెట్టి
జిల్లేడు దండలూ మెళ్లో వేద్దామా
బుగ్గల బూరెలూ వండి పెడదామా ?
జుట్టుకు పూలనూ చుట్టిమూడదామా
పారటాకులు దెచ్చి పైగప్పుదామా
మామిడాకులు దెచ్చి విసుర్లిద్దామా
చల్లల్లి మంచావ తెల్లదుప్పటివేసి
కురచి మనబావకూ గరుపుపేద్దామా ! ”

(చిరుగంటలు)

ఇలా పిల్లలుచేసే అవకతవక సత్కారాలను, ఎగతాళికి పాత్రులైన బావగార్ల తిప్పలను వర్ణించే పాటలెన్నో ఉన్నాయి నాగపోలు వెంకట అప్పారావుగారి గేయంలో మరదలు పిల్ల అంకెల గోడీతో బావగార్ని పరిహాసం చేసిన తీరుచూడండి.

" బలే బలే బావగారు బయలు దేరారా ?
హేటు బూటు సూటంతా బనాయించేరా ?
ఓడిపోయిన కోడిపుంజు ఒకటికావాలా ?
ఎండి పోయిన బెండకాయలు రెండుకావాలా ?
... ... ... ... "

— బాల జనవరి 1950

అన్నయ్యగారు (న్యాయపతిరాఘవరావు) వ్రాసిన 'చిట్టిమరదలు – పొట్టిబావ' అనే బాలగేయంలో పండక్కివచ్చిన బావతో మరదలు పరాచికాలాడిన తీరు, బావగారు మరదలికిచ్చిన సమాధానం సంభాషణా ధోరణిలో సాగింది

" చి. మ : పొట్టిబావా ; పొట్టిబావా ! –
పండక్కి వచ్చావా పొట్టిబావా ;
గుర్రమెక్కి వచ్చావ పొట్టిబావా ! –
గాడిదెక్కి వచ్చావ పొట్టిబావా .

పొ. బా : చిట్టిమరదలా చిట్టిమరదలా ! –
పండక్కి వచ్చానే చిట్టిమరదలా ;
గాడిదెక్కిరాలేదు చిట్టిమరదలా ! –
గుర్రమెక్కి రాలేదు చిట్టిమరదలా !
రైలెక్కి వచ్చాను చిట్టిమరదలా ! –
కారెక్కి వచ్చాను చిట్టిమరదలా !

చి. మ : పొట్టిబావా ! పొట్టిబావా ! -
టిక్కెట్టు కొన్నావా పొట్టిబావ !
పరుపుచుట్టులోను దూరి పొట్టిబావా ! -
వెరపులేక వచ్చావ పొట్టిబావ !

పొ. బా : చిట్టిమరదలా ! చిట్టిమరదలా ! -
టిక్కెట్టు కొన్నానె చిట్టిమరదలా !
ఫస్టుక్లాసులోను నేను చిట్టిమరదలా ! -
బెస్టుగాను వచ్చాను చిట్టిమరదలా !
... ... ... ... ..."

(బాల ఏప్రిల్ 1947. పుట : 10)

గండిరాజులగారి 'పొట్టిబావ పెళ్లి' లో మరదలు బావగారి పెళ్లిని గేలిచేసే విధానం చమత్కారంగా ఉంది.

"పరుగు పరుగునువచ్చి మాపొట్టిబావ-పెళ్లిచేయమని పోరుపెట్టాడు
పిల్లెమ్మ వచ్చింది పిల్లనిచ్చింది - పీతమ్మవచ్చింది పీట వేసింది
కుక్కమ్మ వచ్చింది కూర్చోబెట్టింది ... ... ... ....
కప్పమ్మ వచ్చింది డప్పుకొట్టింది - పేనమ్మవచ్చింది పెళ్ళిచేసింది
ఎంత ఆశ్చర్యమో చూడండి మీరు -
పొట్టిబావా పెళ్ళి ఇట్లు అయింది."

(బాల డిసెంబరు 1946. పుట : 11)

చేట్రోలు సుబ్రహ్మణ్యశర్మగారి 'పడిలేల బావ' అనే ఈ గేయంలో కట్నం తీసుకున్న బావగారిని మరదలు అన్యాపదేశంగా హేళన చెయ్యడం కన్పిస్తుంది.

" బాహాయ్ బావా - నీమాట - నీఆట - నీనూటు - నీబూటు
పదివేలోయ్ బావా - పరువున్న బావా !

అక్కయ్య అమ్మ - పిలుపెట్టినారోయ్ -
బావయ్యరావోయ్ - ఫలహారమిందోయి. "
(బాల సెప్టెంబరు 1946 పుట : 67)

ఎన్ని కష్టాలువచ్చినా, ఎంత పేదవాళ్ళైనా ఉన్నంతలో అత్తమామలు అల్లుడికిచ్చేసే మర్యాదకు లోటుండదు కనుపర్తి వరలక్ష్మమ్మగారి క్రింది బాలగేయంలో మరదలు బావగారిని వ్యంగ్యంగా పేలమాడడంచూడవచ్చు

" మేనత్త కొమరుడా మేలైనబావ
మానాన్నఅల్లుడా మంచిసుత్రాడ.
పండక్కు వచ్చావు దండగేముంది
పండుగైనాదాక ఉండిపోబావ !
సిసలైన భోజనము చేయనూవచ్చు
పసగల తాంబూలము వేయనూవచ్చు
సరిగంచు బట్టలు కట్టనూవచ్చు
అక్కతో ముచ్చట్లు ఆడనూవచ్చు ॥పం॥
కలవు కాలంబంచు కంగారుపడకు
అప్పంది నన్నాళ్లు ముప్పేమిలేదు
అల్లుడి మర్యాద కడ్డేమిలేదు
చక్కగా నడవళ్ల జరుపుకోవచ్చు ॥పం॥"
(బాలసాహిత్య మంజరి.)

అయ్యగారి సాంబశివరావుగారు వ్రాసిన 'బావకుహారతి బాలగేయంలో అక్కాచెల్లెలు హారతిపడ్తూ మరదలు చేసిన హాస్యంమాడండి

" గుల్ల చెంబు చేతబట్టి - గుంటనీళ్లు స్నానంచేసిన
గుణవంతుని బావగారికి - గుద్దులమంగళం

చుక్కవంటి అక్కయ్యకు - శుభమంగళం
... ... ... ..."
చొక్కాలేమో తొడిగారంట - పోజులేమో చేసేరంట
వీధిలో బావగారు - చాకలిదాంతో నవ్వేరంట ॥సు॥"
(బాల డిసెంబరు 1919)

అందమైన బావగారూ! అంటూనే మరదలు బావగారి ఒక్కో అవయవానికి అవిటితనాన్ని అంటగట్టి హాస్యమాడటం అలపర్తివెంకట సుబ్బారావుగారి 'బావ కవిత్వం' అనే ఈ గేయంలో చూడవచ్చు

"బావ చూడ మన్మథుడు - అవనియందు అందమందు
పొట్టియని తలంచకుండా - చట్టిముక్కు ఎంచకుంటె
బొగ్గు రంగుఅనకుంటే - గొగ్గిపళ్లు కనకుంటే
బొజ్జ పెరిగి లేకుంటే - బొల్లిపెదవి కాకుంటే
ఒంటికన్ను చూడకుంటె - కుంటికాలుఆడకుంటె
చేట చెవులు కాకుంటె - చెయ్యి అపుడు లేకుంటే
నెరసిన తలరంగేస్తే - ఒరిగిన మెడ సరిజేస్తే
నడ్డి కొంత లేకుంటే - నత్తిసుంతరాకుంటే"
(బాయం. పు: 30)

ఏ వి రంగయ్యగారి 'ఇద్దరి మామలు' గేయంలో చందమామను - తన మామను సామ్యం చెప్తూ మేనమామను మేలమాడటం కన్పిస్తుంది

" ఉన్నారమ్మా! మామలు - ఎన్నగ నాకిద్దరూ
మింటిపైన ఒక్కరూమా - ఇంటిలోన వేరొకరూ.
మింటిపైని మామ పాలమీగడ వలెనున్నాడు.
ఇంటిలోని మామ నల్లరేగడి వలెనున్నాడు.

మింటిపైన మామకు - మిల మిల చుక్కలతో చెలిమి.
ఇంటిలోని మామకు - ఎడ నెడ చిక్కులతో చెలిమి
... ... .. ... ..."

(డి.మైల)

ఇల్లరికపు అల్లుడంటే అందరికీ చులకనే. అల్లునికి అత్తవారింట్లో రాచ మర్యాదలు జరుగుతాయి. కాని ఇల్లరికపుటల్లునికి జరిగే మర్యాదలు ఇలా ఉంటాయంటాడు సరసంహాస్యప్రియుడు

"అత్తమామల పూజ బత్తితో చేస్తాడు
ఇల్లరికము వచ్చిన - అల్లుడయ్యా
చింకి పాతిచ్చినా - చీదరించక కట్టు ॥ఇల్ల॥
మూడు చెక్కలకూడు - మారుపలుకక తినును ॥ఇల్ల॥
కసువూడ్చి పనిచేసి - పసిపాత్రలను తోము ॥ఇల్ల॥
పెండ్లాము ఆజ్ఞలను - ప్రతితో పాలించు ॥ఇల్ల॥
పల్లేరు పరుపుపై - పవ్వళించును తాను ॥ఇల్ల॥

(ప్రియదర్శి గేయాలు)

జానపదగేయాల్లోనేగాక ఆధునిక రచయితలు వ్రాసిన వాటిలో కూడా తాతగారిని గేలిచేసే పాటలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు: మలయశ్రీగారి గేయం

"పెళ్ళి చేసుకుంటవ అంటే - పిల్లను ఎవరిస్తారన్నాడు
పళ్ళులేవి మా తాతయ్యా! - తెల్లని జుట్టు తాతయ్యా!
పిల్లను తెస్తాం అని వెళ్ళి - పిల్లని తీసుకొనివస్తే
పెళ్ళాం ముసలమ్మను జూచీ - పిల్లని పొమ్మని అన్నాడు

కొత్త పెళ్ళము కావాలనెను - కోరుచున్నది తాతగారికి
ఒళ్ళు ముడతల తాతగారికి - కళ్ళు మసక మాతాతగారికి
పెళ్ళి పిల్ల పడుచుది యిదిగో - అని పిల్లిపిల్లను తీసుకున స్త్రీమి
తెల్లబోయె మాతాతయ్య - పక్కికిలించెను తాతమ్మ॥ "
(రంగం పిల్లలు పుట : 21)

అవ్వాతాతలతో ఆనందంగా, హాయిగా, సంబరంగా, సరదాగా కాలక్షేపం చేస్తారు పిల్లలు. పిల్లల ఆనందం కోసం లేని ఉత్సాహం తెచ్చుకుంటారు ముసలివాళ్లు పళ్ళూరాలిపోయి, జుట్టుతెల్లబడి ఒళ్ళు ముడతలుబడి, కళ్ళు మసక బారిన తాతగారు వింతచచ్చినా పులుపుచావని రీతిలో నడచుకుంటె ఆపిల్లలు తాతగారిని ఆటపట్టించె తీరు పై గేయంలో వ్యక్తమయింది. తాతగారిని హాస్యం చేస్తుంటే అవ్వగారు పక్కికిలించక ఏంచేస్తారు ? మొత్తంమీద పిల్లల్లో పిల్లలుగా కలిసిపోయే గుణం ముసలివాళ్లలో కన్పిస్తుంది అందుకే వాళ్లను వృద్ధ బాలలనడం

ఎడమొగం పెడమొగం పెట్టుకున్న అమ్మానాన్నల నుద్దేశించి పిల్లలుపాడే క్రిందిపాట పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి రచన ఇలాంటి పాటలు పిల్లలనోట వినగానే తల్లిదండ్రుల కోపతాపాలు కూడా ఎగిరి పోవడం ఖాయం

" అమ్మా నాన్నా - అతుకుల బొంతా
చిట్టూ బుట్టూ - కస్సూ బుస్సూ
అమ్మది తూర్పు - నాన్నది పడమర
అమ్మ దగ్గరి కెడితే - అట్లుతిరగేసూ
అయ్య దగ్గరి కెడితే - కట్ట విరగేసూ. "
(బాలభారతి)

ఇలాగే ఆచారాలతో మూఢనమ్మకాలతో వారం, వర్జ్యం అని విసిగించే అయ్యవార్ని, అడిగిన ప్రశ్నకు జవాబుచెప్పలేకని విద్యార్థుల్ని కొట్టే బడిపంతుల్ని, రకరకాల వ్యక్తుల్ని ఎగతాళిచేస్తూ పాడేపాటలు కూడా ఉన్నాయి.

అలపర్తి వెంకట సుబ్బారావుగారు 'మావూరివారు' అనే చిన్న గ్రంథాన్ని వ్రాశారు. ఒక గ్రామంలో నివసించే ఇరవైరకాల వృత్తులవారిని ఒక్కొక్కరిని గేలిచేస్తూ వ్రాసిన వ్యంగ్యరచన అది. ఆ నాలుగు పాదాల చక్కని చిక్కని ఆ గేయాలను [illegible] వారా తోడైనాయి. ఉదాహరణకు కొన్ని

__మునసబు__

ముఖ్యులు వీరు - మునసబు గారు !
తగవులు పెంచు - తలలను త్రుంచు ॥

( పుట : 4 )

__సర్పంచి__

సర్పంచి గారు - దర్పం గలారు !
ఓట్లప్పుడె వీరు - మాట్లాడుతారు ॥

( పుట : 6. )

__వస్తాదు__

వస్తాదు మస్తాను - కుస్తీకి పైల్వాను
జడవ డెవ్వరికి - జడియు బీబీకి

( పుట : 11 )

__నాటు వైద్యుడు__

నాటు వైద్యుడు - మోటూ పని మొండుడు !
పథ్యంబు లావు - తథ్యంబు చావు ॥

( పుట . 12. )

బ డి పం తు లు

వీధి బడిపంతులు - వీరాంజనేయులు !
చెప్పటం - నాస్తి రొప్పటం జాస్తి ॥
( పుట : 21. )

ఎల్. ఐ సి. ఏజెంటు

ఎల్. ఐ. సి ఏజెంటు - ఎప్పుడు వెన్నంటు
చేస్తే భీమా అంటూ - చస్తే లాభం అంటూ ॥
( పుట : 23 )
( మాపూరివారి (చిత్రగీతాలు) )

నవ్వులాట పాటల్లో వరసైన బావ, వదిన, అవ్వ, తాత మొదలైన వాళ్ళ పరంగాఉన్న పాటలు ప్రత్యక్షంగా వాళ్ళ సమక్షంలో పాడేవి. అలాకాక పరోక్షంగా పాడుకొనే వ్యంగ్య పూరితమైన గేయాలు కొన్ని ఉన్నాయి నలుగురు కలిసినప్పుడు ఒక వ్యక్తిని గురించి పరోక్షంగా మాటలాడుకొని నవ్వుకోవడం మానవ నైజం. 'మా పూరివారు' లో ఉన్నగేయాలన్నీ అలాంటివే. మొత్తంమీద నవ్వులాట పాటల్లో బావా మరదళ్ళకు సంబంధించిన పాటలే ఎక్కువగా ఉన్నాయి. జానపద గేయాల్లో కూడా అవే ఎక్కువ. తెలుగువాళ్ళ గృహ జీవితానికి సంబంధించిన సన్నివేశాల్లో పరిహాసానికి అనువైన పాత్ర బావ జానపద గేయాల్లో వదినను పరిహసిస్తూ పాడే పాటలు కూడా చాలా ఉన్నాయి కాని ఆధునిక బాలగేయాల్లో అలాంటి గేయాలు మృగ్యం.

## 4. 12. ప్రకృతి పాటలు.

ఆకాశం, చంద్రుడు, వెన్నెల, చుక్కలు, మబ్బులు, సముద్రం, కెరటాలు, చెట్లు, కొండలు అందర్నీ ఆకర్షించే మనోహరమైన ప్రకృతి దృశ్యాలు. వాటి సౌంద

ర్యాన్ని వర్ణిస్తూ వ్రాసిన ప్రకృతి పాటలు ఆయా ఋతువుల్లో కాలాల్లో ప్రకృతిలో జరిగే వింత మార్పుల్ని చిత్రించే బాల గేయాలను కూడా ఈ వర్గం క్రిందనే చేర్చి పరిశీలించడం జరిగింది

క్షణ క్షణానికి వింత అందాన్ని సంతరించుకొనే ఆకాశాన్ని' దాన్ని ఆశ్ర యించుకొని ఉండే సూర్య చంద్రుల్ని చుక్కల్ని పిల్లలు ప్రతిరోజూ చూస్తూ అమితమైన ఆనందానుభూతుల్ని అనుభవిస్తుంటారు ఆధునిక బాలగేయ రచయితలు ప్రకృతి సౌందర్యాన్ని తనివితీరా వర్ణించి యున్నారు.

ఆకాశం :

మిరియాల రామకృష్ణగారు ఆకాశాన్ని వర్ణిస్తూ వ్రాసిన ఈపాటలోని భాష మాధుర్యం గమనించదగింది

"ఆకాశానికి అల్లుడు - అల్లడుగో చందమామ
ఆకాశానికి పిల్లలు - అల్లదుగో తారకలు
ఆకాశం రాజుగారి - అంబారీ చూశారా
అదిగో ఆమబ్బులపై - అందమైన మెఱుపు లే !
ఆకాశం కోటలోన - అందమైన గడియారం
పొద్దున్నే తిరిగి తిరిగి - పోవు సూర్యభగవానుడు !
ఆకాశం రాజ్యానికి - అరుదరుమరి రోజాకు
విమానాలు ఎగిరి ఇపుడు - వింతలు కనిపెడుతున్నవి"

(బాలాభిరామం పుట : 22)

పై గేయంలో ఆకాశాన్ని రాజుగా, చుక్కల్ని ఆకాశరాజు పిల్లలుగా చంద్రుని అల్లునిగా పూహించారు మెల్ల మెల్లగా సాగిపోయే మబ్బుల్ని ఆకాశరాజుగారి అంబారీగా, సూర్యుని ఆకాశకోటలోని గడియారంగా ఊహించడం రచయిత భావనా శక్తికి తార్కాణం ప్రాచీనకాలంలో ఇప్పటిలాగ కాలాన్ని తెలుసుకోవడానికి

గడియారాలు లేవు. రకరకాల సాధనాలతో కాలమానాన్ని కొలిచేవారు. వాటిలో సూర్య గడియారం ఒకటి. అలాంటి సూర్యుణ్ణి ఆకాశరాజుగారి కోటలోని అందమైన గడియారంగా ఊహించడంలోని ఔచిత్య శోభ గమనించదగింది.

చందమామ :

చందమామను చక్కగా వర్ణించే శాస్త్రి గారి బాల గేయమిది.

" అలరు తెల్లని కిరణములతో అవతరించే చందమామ
నల్ల నల్లని కారుచీకటి వెళ్లగొట్టు చందమామ
పాలు త్రాగే పిల్లవాళ్లకు చాలనేస్తం చందమామ
ఆటలాడే కుర్రవాళ్లకు హాయిగొలిపే చందమామ
వేడుకలరే చుక్కగుంపుకు రేడుచక్కని చందమామ
దిగంతాలకు వెలుగునిచ్చే దివ్యదీపం చందమామ."

(ఆంధ్ర జ్యోతి వారపత్రిక.)

చందమామ రాగానే కారుచీకటి పారిపోతుంది. పాలుత్రాగే పిల్లవాళ్ళకు చందమామ నేస్తమనడం సామాన్యం. వెన్నెల వెలుగుల్లో ఆడుకొనే పిల్లలకు హాయి నివ్వడం అంతకన్నా నిజం. దిగంతాలకు వెలుగునిచ్చే చందమామ దివ్య దీపంకాక మరేమవుతుంది ? పిల్లలకు ఆనందాన్ని కుతూహలాన్ని జిజ్ఞాసను కల్గించే చంద మామను గురించి వివరించే బాలగేయాలెన్నో ఉన్నాయి. పిల్లలకు చంద్రుడు 'మామ' ఎలా అవుతాడని సందేహం వస్తుంది. లక్ష్మీదేవి సర్వమానవ కోటికి తల్లి. పాల సముద్రంలో లక్ష్మీదేవి, చంద్రుడు ఒకేసారి పుట్టినట్లు కథ. తల్లి అయిన లక్ష్మీ దేవికి చంద్రుడు సోదరుడు కాబట్టి మామ అవుతాడని అందువల్ల చంద్రునికి 'చంద మామ' అనే పేరు ఏర్పడిందని చెప్తారు. అలపర్తి వెంకట సుబ్బారావుగారు వ్రాసిన 'ఎవరి మామ' అనే బాలగేయంలో పై విషయం సుస్పష్టం. తల్లీ కూతుళ్ళ సంభా షణా రూపంలో నడచిన గేయమిది. అజ్ఞానులైన ఇద్దరు పిల్లలు చందమామ తన మామనీ అందుకే తనవెంట వస్తుంటాడని పరస్పరం పోట్లాడుకొని పందెంకట్టుకుం

టాడు వాళ్ళలో ఒక అమ్మాయి తమ పందెం విషయం తల్లికి వివరించి చందమామ ఎవరిమామో చెప్పమంటుంది.

" తల్లియగును కద లక్ష్మి అందరికి
తమ్ముడగును మన చంద్రుడామెకు
అందుచేతనే చంద్రుడందరికి
అవుతాడమ్మ మామయ్య వరుస "

అని తల్లి సమాధానం.

అమావాస్యనాడు అగుపించని చందమామ క్రమంగా కొద్ది కొద్దిగా పెరుగుతూ పౌర్ణమినాటికి పూర్ణాకృతిని పొంది క్రమంగా తగ్గుతూవచ్చి మరల అమావాస్య నాటికి అసలు కనిపించదు. చంద్రుడిలా పెరుగుతూ తరుగుతూ ఉండడానికి పురాణాల్లో చెప్పిన కథ ఇది. "చంద్రుడు దేవతలకు అమృతాన్ని సరఫరా చేసే ఆసామి శుక్ల పక్షంలో అతడు అమృతాన్ని తయారు చేస్తాడు కృష్ణ పక్షంలో దేవతలు ఆ అమృతాన్ని పానం చేస్తారు శుక్లపక్షంలో అతడు దినదినమూ అమృతాన్ని దాచుస్తాడు. కాబట్టే అతడు దినక్రమాన్ని తేజస్వి అవుతూ ఉంటాడు పూర్ణిమ నాడు అమృతభాండం నిండారుతుంది మరునాటినుండి దేవతలు, పితరులు ఆఅమృతం పానం చేయడం ఆరంభిస్తారు దినక్రమాన్ని చంద్రుని కాంతి తగ్గిపోతుంది. అమావాస్య నాటికి అమృతం అంతా ఆరగింపు ఐపోతుంది. మరునాటి నుండి చంద్రుడు తిరిగి అమృతాన్ని తయారు చేయడానికి ప్రారంభిస్తాడు"[1] చంద్రుని పెరుగుదల తరుగుదలను గూర్చిన ప్రశంస బాల గేయాల్లో కూడా కన్పిస్తుంది. ఉదాహరణకు :

" అమాసనుంచీ అదేమొగానీ క్రమంగ పెరిగీ పోతాడు
పున్నమనాటికి పూర్తిగ పెరిగి దినాము మళ్ళీదిగుతాడు..."

(బాల. ఆగష్టు 1946 పుట: 95)

---

1. పురాణాల్లో చంద్రుడు. ఆంధ్రభూమి. డిసెంబరు 1941.

వెక్కలంక లక్ష్మీపతిరావుగారి 'చందమామ' అనే క్రింది గేయంలో కొంత వరకు పిల్లల మనస్తత్వ చిత్రణ గోచరిస్తుంది. చంద్రుని మచ్చను ఆటల్లో పడినప్పుడు దెబ్బతగిలినట్లు అనుకోవడం, దృష్టి దోషంవల్ల చందమామ చిక్కిపోతున్నట్లు ఊహించడం, అమావాస్యనాడు అసలు కన్పించని చందమామను బూచివాళ్ళు దోచుకున్నట్లుగా, తిరిగి క్రమంగా పెరుగుతూ కన్పించే చంద్రుని బూచివాళ్లనుంచి తప్పించుకోవడానికి అమ్మదగ్గర దాక్కున్నట్లుగా ఊహించడం బాలల పరిధిలోని భావనలు.

" నన్ను చూసి ఎందుకో నవ్వుతాడు చంద్రుడు
అసలు నిదురపోకుండా ఆపుకొనే చంద్రుడు
... ... ... ...
అందమైన ముఖంమీద ఆగాయం ఏమిటి ?
ఆటలలో పడినప్పుడు అంత దెబ్బతగిలిందా ?
ముద్దబంతిలా బొద్దుగా ముద్దులొలుకబోస్తాడు
దృష్టిదోషమో ఏమో దినదినమూ చిక్కుతాడు !
తేనెపట్టులా జాబిల్లి తీయనివాడంటారు
అందుకనే బూచివాళ్లు అలా దోచుకుంటారు !
చీకటిలో బూచివాడు వాకిట పొంచుంటాడని
అమ్మదగ్గరుంటాడె అమవస నాడగుపించడు !

(స్వతంత్రభారతి. పుట. 6.)

చందమామలో నీడలా కన్పించే మచ్చను గూర్చి కుందేలని, జింకపిల్లని, ముసలి అవ్వనూలు వడకుతుందని - ఇలా రకరకాల కల్పితకథలున్నాయి.

" చక్కని చందురు బింబముపైన - చెవుల పిల్లి ఒకటున్నదిగా
మాసము దినములకొక పక్షము - చెవుల పిల్లి మనకగపడునా"

(బాల సెప్టెంబరు 1946 పుట. 18)

" నూలు వడికే ముసలి అవ్వయో - తేలిగెంతే లేడిపిల్లయో
మాంమాం నీలోమచ్చ రహస్యం-ఏమోమాతో ఎరుగచెప్పవా"
(జేజిమామయ్య పాటలు)

మొదటైన గేయాల్లో పైవిషయ ప్రశంస కన్పిస్తుంది

తన పుట్టు పెద్ద అయిన వినాయకుని చూచి చంద్రుడు నవ్వినందుకు పార్వతికి కోపంవచ్చి వినాయకచవితినాడు చంద్రుని చూచినవారికి నీలాపనిందలు వస్తాయని శాపమిచ్చినట్లు ఒక పురాణగాథ చంద్రుడు దక్షుని కుమార్తెలయిన ఇరవైఏడుమంది దారల్ని పెళ్లిచేసుకొని వాళ్ళలో రోహిణిపట్ల విశేషమైన అనురాగాన్ని చూపుతూ, తక్కినవాళ్ళను నిరాకరించడంవల్ల దక్షుడు కోపించి చంద్రుని క్షయరోగ పీడితుడవమని శాపమిచ్చినట్లు మరో పురాణగాథ పురాణాల్లో చంద్రుని పరంగా ఉన్న ఈరెండు శాపాల ప్రశంస కూడా బాలగేయాల్లో కన్పిస్తుంది ఉదాహరణకు : శ్రీపాద లక్ష్మీనారాయణ మూర్తి గారి గేయం

... ... ... ... ...

" నీ ఓషధులకు నిధివని - నీవొక క్షయరోగివనీ
ఏవో అర్థంకానివి - భావములుదయించు మాకు "
( గృహలక్ష్మి. మె 1931. పుట : 219 )

'సోమన్నా ' అనే పేరుతో చందమామకు ఆహ్వాన రూపమైన క్రిందిగేయం దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రిగారి రచన.

" అన్నారావోయి ! సోమన్నారావోయి! నీ
కన్నతల్లి - చంకనెక్కి చిన్నిపాపడా ! ...... "
( అనసూయ. జూలై - ఆగష్టు సంచిక 1919. )

వెదకాలంనాటి పవిత్రలతను సోమలత అని పేరుంది అది శుక్లపక్షంలో ఒక్కొక్క క్రొత్త ఆకును తొడుగుతూ పెరుగుతుందనీ అంటారు. శుక్లపక్షంలో

చంద్రుడు కూడా రోజు రోజుకు పెరుగుతుంటాడు ఆ కారణంగా చంద్రునికి సోముడని కూడా పేరు.

" ఆకాశం పందిరిలో - అందమైన మల్లెపూలు
అవిగవిగో ! అవిగవిగో అందరు చూస్తున్నారా !
చందమామ అల్లరిగా - చల్లిన చల్లని బియ్యం ॥అవి॥
రాత్రి పిల్ల నిద్దురలో వ్రాసిన తెనుగక్షరాలు ॥అవి॥
చంద్రునిపై దేవేంద్రుడు చల్లిన అక్షతలేమో ॥అవి॥
( బాలా భి. రామకృష్ణ. పుట : 20 )

చంద్రుని పరంగా ఉన్న పాటల్లోని భావాలు, పదప్రయోగాలు బాలల భాషకు, మనస్తత్వానికి దూరంగా కనిపిస్తాయి. పెద్దల కవిత్వంలో ఉండే భావమాధుర్యం, కల్పనా చాతుర్యం, అలంకార ప్రయోగం బాలలకోసం వ్రాసిన గేయాలపై ప్రభావాన్ని చూపటం గమనించవచ్చు అలాంటివే సూర్యుని పరంగా ఉన్న గేయాలు కూడా

## సూర్యుడు

వక్కలంక లక్ష్మీపతిరావుగారు తూర్పు నుండి పడమరకు వెళ్తూ ఆకాశంలో కన్పించే సూర్యుణ్ణి ఒకదిక్కులేని దేశదిమ్మరిగా భావిస్తారు

" ఉదయం తూరుపు రాత్రి పడమరా
ఒక దిక్కంటూ ఏముంది
దిక్కూ మొక్కూ లేని సూర్యుడు
దేశదిమ్మరై పోయాడు !"
(బాలభారతి పుట : 13-17.)

## ఇంద్రధనుస్సు

ఆకాశంలో సూర్యుడు ఏడురంగుల గుర్రాన్నెక్కి ప్రయాణం చేస్తుంటాడనీ, ఇంద్రుడు ఏడురంగుల ధనుస్సును పట్టుకుంటాడనీ - రంగుల హరి విల్లును గూర్చిన కల్పితకథలు. ఆ కల్పనలు బాలగేయాల్లోనూ కన్పిస్తాయి.

" ఏడుగుర్రాలు - ఆహా, ఏడుగుర్రాలు
ఒకటీ - రెండూ - మూడూ - నాల్గు
ఐదూ - ఆరూ ఏడూ కలిసే - ఏడుగుర్రాలు
ఏడురంగుల గుర్రాలు - ఎంతో చక్కని గుర్రాలు
చల్ చల్ చల్ చల్ చల్ చల్ చల్ చల్
పరుగిడు గుర్రాలు - ఆహా రంగుల గుర్రాలు"
నే రేడు రంగుల గుర్రం - నీలివర్ణపు నవ్వేగుర్రం
... ... ... ... "
ఏడురంగుల గుర్రాలెక్కి - పరుగిడిపోదామా
ఇంద్రుని చాపము అవుదామా-బాటలో రంగులు వేద్దామా"

(బాలగేయమాల)

ఆకాశంలో ఇంద్రధనుస్సు వెలిస్తే తప్పక వర్షం వస్తుంది ఏట్లువెలిస్తే కురుస్తున్న వానజల్లులు ఆగిపోతాయి కూడా. మింటికీ మంటికీ ఒకటిగా నిలిచి భూమి ఆకాశాల మధ్య వంతెనగా నిలచిన హరివిల్లును

" వానరాకడ విల్లు వానపోకడ విల్లు
విలువల్లు గల విల్లు సొగసులకు పుట్టిల్లు"

అంటూ సమతారావు గారు చమత్కరించారు.

" ఇంద్ర జాలంబనుచు హరివిల్ల దేయనుచు
కట్టు కథ లెన్నెన్నొ పుట్టుకొని వచ్చాయి
ఇంద్ర జాలము కాదు కాదోయి హరివిల్లు
సూర్యుడు కిరణాల ఘన గారడీ విల్లు ॥ "

అంటూ హరివిల్లు ఏర్పడే విధానాన్ని కూడా బాలగేయంలో వివరించారు.

( బాలగేయాలు (మూడవభాగం) పుట . 47. )

మబ్బులు.

మిరియాల రామ కృష్ణగారు నల్లమబ్బుల్ని, చీకటిని అద్భుతంగా వర్ణించారు. ప్రబంధ కవులలో కన్పించే వర్ణనావైచిత్రి పిల్లగేయాల్లోనూ కన్పిస్తుంది జాబిల్లిని నబ్బుబిళ్ళతోను, తెల్లమబ్బుల్ని వెన్నముద్దలతోను పోల్చి వర్ణించిన ఆగేయాల్లోని చమత్కారం గమనించదగింది

" నల్లని ఓ మబ్బులారా ! - ఎలిగిన మీాబట్టలన్ని
జాబిల్లిపై ఉతికి ఇప్పుడు - చాకిరేవు పెట్టరా ?
నబ్బులాంటి జాబిల్లిని - చల్లగ మీారరుగదీసి
మీాబట్టల నుతికి కొండ - మీాద ఆరవేస్తారా ! "

( బాలాభిరామం పుట · 10. )

పౌర్ణమి నాటి నుంచి క్రమక్రమంగా క్షీణిస్తూ వచ్చే చంద్రుని అరుగుతున్న నబ్బు ఏళ్ళతో పోల్చడం అందమైన కల్పన అలాగే కొండలపై ఆకాశం మీద తేలి యాడే మబ్బుల్ని ఆరవేసిన బట్టలుగా వూహించడం అద్భుతం

ఉదాత్తమైన వర్ణనలతోబాటు బాలల మనోభావాలుకూడా కొన్నిగేయాల్లో వ్యక్త మవుతాయి చిన్నపిల్లలు ఏడుస్తున్నప్పుడు చీకటిని చూపెట్టి ' బూచాడొస్తున్నాడ' ని భయపెట్టడం, ఆభయంతో చంటి పిల్లలు కిక్కురుమనకుండా కళ్ళుమూసు కోవడం చూస్తుంటాం. అలాంటి పిల్లలు పెరిగే కొద్దే వాళ్లలో ఆభయం పోతుంది చివరికి

" ఎండలారి పోవుదాక - ఎక్కడ దాక్కుంటాడే
నీవే ఒక బూచివంట - నిజమేనా చీకటీ
... ... ... ... ... "

( రంగురంగుల రత్నదీపాలు. )

అంటూ ఆ చీకటితోనే మంతనాలు చేసే సాహసం పిల్లలకు వస్తుంది.

సముద్రం.

బాలగేయాల్లో సముద్ర వర్ణన గేయాలు తక్కువే. ఉరుకులు పరుగులతో విరామం లేకుండా ఎగిసిపడే అలలతో కను చూపుమేరా కన్పించే సముద్రాన్ని చూచే భాగ్యం కూడా ఎక్కువమందికి మాత్రం పరిమితం. సముద్రాన్ని గూర్చి కోటయ్యగారు వ్రాసిన గేయం :

" అబ్బాయి ఎప్పుడైన - చూశావా సముద్రాన్ని
కనుచూపు వరకు - కనబడును నీళ్ళు !
... ... ... ...
ఈసముద్రములోనే - వెలలేని రత్నాలు
ఈసముద్రములోనే - విలువైన ముత్యాలు
ఇందులోనే పండు - ఉప్పు మనకందరకు
ఉప్పులేని కూర - చప్పగా ఉంటుంది. "
( బాల. సెప్టెంబరు, 1946 పుట : 43 )

ఏటి ఒడ్డున పిల్లలు ఇసుకలో పిచ్చుక గూళ్ళు, బొమ్మరిండ్లు కట్టుకొని ఆడుకొంటారు అలాంటి ఏటి ఒడ్డును మాల్యశ్రీ గారు

" చిట్టి చిట్టి పాపలంత - పొట్టి పొట్టి బొమ్మరిండ్లు
కట్టి ఆటలాడు కొనే - ఏటి ఒడ్డు ఏటి ఒడ్డు "

అంటూ వర్ణించారు.

ఎండ మావులు

నిగనిగలాడే ఎండలో దూరానికి ఎండమావులు నీళ్ళునిండిన చెరువులా ? ఎగిసిపడుతున్న కెరటాలా ? అన్న భ్రమను కల్గిస్తాయి అలాంటి ఎండమావుల్ని వర్ణిస్తూ చెరుమళ్ల కామేశ్వరరావుగారు పిల్లలకోసం వ్రాసిన గేయమిది

" ఎంత పెద్ద చెరువో ఎన్నడూ చూడలేదు
అంత పెద్ద చెరువుందని ఎవ్వరూ చెప్పలేదు
... ... ... ... ...
చిన్న నీటికెరటాలు ఎన్నెన్నొ ఉన్నై
ఇంత ఎండలోను ఎంత నీరమ్మా !
... ... ... ...
ఇక్కడ కనబడ్డ చెరువేదీ - ఇక్కడ ఉండిన పరదేదీ
ఇక్కడ నిలిచిన నీరేదీ
నీరు కావమ్మోయి - ఎండమావులు ఇవన్నీను."

(మిణుగురు పురు.సం. పుట : 10)

పచ్చికబయళ్లు :

పచ్చని రంగుతో కలకలలాడే పచ్చికబయళ్ళు ఎంతో అందంగా ఉంటాయి. ఉదయం పూట అవి మంచు బిందువులతో నిండి కన్నులవిందు చేస్తాయి. సూర్య కిరణాలు సోకి ముత్యాల్లా మెరుస్తుంటాయి. అలాంటి గడ్డిపరక అందాన్ని నార్ల చిరంజీవి క్రిందిగేయంలో మనోహరంగా వర్ణించారు

" పచ్చవన్నె మేలిముసుగుకప్పుకున్నదీ
మంచునీటి ముత్తెములను కట్టుకున్నదీ
లేత ఎండపైడి వెలుగు తాకుచున్నదీ
పాతబడని పచ్చదనము నింపుకొన్నదీ
బాటసారి పాదమంటి పల్కరించెదీ
ఏటిగాలి పిల్లలతో ఆటలాడెనే
... ... ... ... ... "

(ఆటపాటలు.)

అ డ వి.

అడవి కూడా సృష్టిలోని ఒక భాగమె నీడను, గాలిని, రంగు రంగుల పూలను, రకరకాల పండ్లను, దివ్యమైన ఔషధాలను ఇచ్చే ఎన్నో రకాల చెట్లకు పుట్టి నిల్లు పక్షులకు, జంతువులకు నిలయము. వాగులకు వంకలకు విహారభూమి అలాంటి అడవి అందాన్ని వర్ణించిన మాల్యశ్రీగారి బాల గేయం

" చల్లని నీడలు పరిచేదీ - మెల్లగ గాలులు విసిరేదీ
ఎంతో చక్కని అడవిఇదీ - ఎంతో చక్కని అడవి ఇదీ
... ... ... ... ...
లేళ్లు గంతులు వేసేదీ - ఎడ్లు పరుగులు తీసేదీ
ఎంతో చక్కని అడవి ఇదీ - ఎంతో చక్కని అడవి ఇదీ "
( ఆంధ్ర జ్యోతి సచిత్ర వారపత్రిక 'బొమ్మరిల్లు' శీర్షిక )

ఋ తు వు లు.

" పూల పల్లకి నెక్కిపోతూ - నేలపైదిగె చైత్రమాసం
మొగ్గలన్నీ మొగం విప్పీ - ముద్దు ముద్దుగ నవ్వుకున్నై
నల్ల నల్లని తుమ్మెలతో - చల్లగాలులు ఆడుకున్నై
ఎండబండిని ఎక్కిపోతూ - ఇచట ఆగెను జ్యేష్ఠమాసం
వేడిగాలులు క్రక్కుకుంటూ- వెళ్ళిపోతున్నాయి ఎండలు
వేషమంతా విప్పివేస్తూ - వేగిపోతున్నాయి గుండెలు
సంబరంగా అంబరంపై - శ్రావణం దిగి వచ్చి నిలిచెను
నల్ల మొగములు వేసిమబ్బులు - జల్లుతున్నై వానచినుకులు
పచ్చదుప్పటి కప్పుకుంటూ - పండుకున్నై చేలగట్లులు.
... ... ... ... ... "
( బాలాభిరామం. )

అంటూ మిరియాల రామకృష్ణగారు ఆరుఋతువులలోని ప్రకృతి శోభను ఉదాత్తమైన భావాలలో వర్ణించారు. ఋతువు లన్నింటిలోను వసంతఋతువుకొక ప్రత్యేక స్థానముంది ప్రకృతి మనోహరంగా అందాల్ని సంతరించుకొనే ఈకాలంలో చెట్లన్ని పచ్చని ఆకులతో, రంగురంగుల పూలతో కన్నులవిందుచేస్తే, పక్షుల కిలకిలలు, కోయిల, కుహూ కుహూ నాదాలు వీనులవిందు చేస్తాయి అందుకే కవుల కావ్యాల్లో వసంతఋతువు ప్రత్యేకతను సంతరించుకొంది అలాంటి వసంత ఋతువును వర్ణిస్తూ ఎజండ్ల సాంబశివరావుగారు వ్రాసిన ఈగేయం అభినయానికి అనుకూలంగా చక్కని శబ్దశిల్పంతో కూడి ఉంది

" ఝుమ్మని తుమ్మెద వీణను మీటె — ఝం... ఝం...
సరిగమ పదనిస కోకిల పాడె — కో... కో...
తధికిట, ధిమికిట ఆడెను నెమలి..............."
(పాలపాటలు పుట : 13.)

సంవత్సరంలో ఎండ, వాన, చలి - ఈమూడు కాలాల్లో ఏదోఒకటి తప్పక ఉంటుంది మలయశ్రీగారు ఈ మూడూ లేని కాలమేదో కనుగొమ్మని బాలల్ని ఉద్దేశించి ఈగేయాన్ని వ్రాశారు.

" ఎండ కాస్తుందమ్మ ఎండ కాస్తుంది
ఎండకు జగమంత మండి పోతుంది
వాన కొడుతుందమ్మ వాన కొడుతుంది
వానకు నేలంత బురద ఔతుంది
చలిపెడుతుందమ్మ చలిపెడుతుంది
గజగజ లోకమ్మె వణకి పోతుంది
ఎండ వాన చలి ఏదిలేనట్టి
కాలమేదో నీవె కనుగొమ్మచిట్టి ! "
(రంగులపిట్టలు పుట : 32.)

భగ్గున మండే ఎండలు చిరాకు కల్గిస్తాయి. అయినా ఇష్టమైన పండ్లు విశేషంగా లభించడమేగాక, వేసవి సెలవులు ఇస్తారు కాబట్టి పిల్లలకు ఎండాకాలం ఎంతో ఆనందాన్నిస్తుంది. అటువంటి ఎండా కాలంలోని విశేషాలను వర్ణిస్తూ క్రింది గేయాన్ని వ్రాశారు.

" ఎండా కాలం భగ్గున మండే కాలం
గుబ గుబ గుబ గుబ గుబ గుబ లాడే ఎండాకాలం
బొట బొట బొట బొట చెమటలు కారే ఎండాకాలం
చిట చిట చిటపట చికాకు పరచే ఎండాకాలం
... ... .. ... ...
మామిడి పండ్లు పండేటి ఎండాకాలం
పనస తొనలను ప్రీతిగ ఇచ్చే ఎండాకాలం. "

( బాలగేయమాల )

ఉరుములతో మెరుపులతో కుంభవృష్టిలో కూడిన వర్షాకాలాన్ని కూడా వర్ణిస్తూ వారీ గేయాన్ని వ్రాశారు.

" చిట పట చిట పట చినుకులు కురియా
బొట బొట బొట బొట ధారలు కారా
చూరుల వెంబడి ధారలు కారా
బాలల కెంతో ఆనందం. "

( బడిగంట )

చూరుల వెంబడి కారే వర్షపు నీటిని చేతుల్లో నింపుకొని కేరింతలు కొడ్తూ ఒకరిపై నొకరు చల్లుకుంటూ ఉత్సాహంగా ఆడుకుంటారు పిల్లలు. జల జల పారే నీటి కాలువలలో కాగితపు పడవల్ని వదిలి అవి నీళ్ళల్లో తేలుతూ వెళుతుంటె వీళ్ళు ఆనంద సాగరంలో మునిగి పోతారు. అందుకే

" మరల మరల రావాలీ రంగుల హరివిల్లు
మరల మరల రావాలీ జడివానల జల్లూ. "
( నండూరి రామమోహనరావు హరివిల్లు పుట . 34 )

అనేకోయసంగారు ఏదైనా మితంగా ఉన్నప్పుడే అందం ఆనందం వర్షం హర్షాన్నిచ్చినా, పైరులకు బలాన్ని చేకూర్చి ఎక్కువ పంటనిచ్చినా అతివృష్టి అయితే నష్టానికే దారి తీస్తుంది అతివృష్టి వల్ల కల్గే అనర్థాలను వర్ణిస్తూ సత్తిరాజు కృష్ణారావు గారు 'పెద్దవాన' అనే గేయాన్ని వ్రాశారు

" వానలు కురిసెను - వాగులు పొంగెను
పంటలు పోయెను - పల్లెలు మునిగెను - అకటకటా !
పాడీపంటా - పాడైపోయెను
కూడూగుడ్డా - కరువైపోయెను - అకటకటా ! "
(బంగారు కథలు – హాహాయిహాటలు )

" వేసవి కాలంలో ఎండకి వేగిపోయాను
వర్షాలెప్పుడు దిగుతాయో !
వర్షాకాలంలో వానకి వణికి పోయాను
చలిగాలెప్పుడు తిరుగుతుందో ?
శీతాకాలంలో చలికి బిగిసిపోయాను
ఎండలు ఎప్పుడు కాస్తాయో ? "
(మిణుగురుపురుగు పుట : 27)

జేకుమళ్ల కామేశ్వరరావుగారు వ్రాసిన ఆ గేయంలో వివిధ కాలాల్లోని వాతావరణ మార్పులకు విసిగిపోయిన జనం రాబోయే కాలాలను ఊహించుకొని ఎదురుచూడ్డం కన్పిస్తుంది మార్పును కోరుకొనే మానవ సహజమైన మనస్తత్వం ఈ గేయంలో వ్యక్తమవుతుంది

ఏ భాషా కవిత్వంలో అయినా ప్రకృతి వర్ణనలకు ప్రాధాన్యముంటుంది. ప్రాచీన తెలుగుకావ్య ప్రబంధాది కర్తలుకూడా తమరచనల్లో ప్రకృతి వర్ణనలకు ప్రాధాన్యమిచ్చారు. ఆధునిక తెలుగు బాలగేయ రచయితలు కూడా పిల్లల మనస్సుకు, దృష్టికి, ఆలోచనలకు అనుగుణమైన పద్ధతిలో ప్రకృతిని ఎన్నో విధాలుగా పాటలరూపంలో అభివర్ణించారు. ఖగోళపరమైన వర్ణనలలో చంద్రునిపరమైన పాటలెక్కువ వాటిలో పౌరాణికమైన కథలు, నమ్మకాలు, కవిసమయాలు, చోటు చేసుకున్న గేయాలుకూడా ఉన్నాయి మానవుడు చంద్రమండలంపైన అడుగుపెట్టిన తర్వాత చంద్రుని గురించిన బాలగేయాలు కొన్ని వెలువడ్డాయి. వాటిని వైజ్ఞానిక గేయాల క్రింద పరిశీలించడం జరిగింది.

కొందరు బాలగేయ రచయితలు (రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి, వక్కలంక లక్ష్మీపతిరావు, మిరియాల రామకృష్ణ మొదలయిన వారు) ఉదాత్తమైన భావశిల్పాన్ని తమ బాలగేయాల్లో ప్రదర్శించి ఉన్నారు

ఋతు వర్ణనలు ప్రత్యేక కావ్యరూపంగా సంస్కృతాది భారతీయ భాషల్లో రచించబడి ఉన్నాయి. ఆధునిక తెలుగు కవులు కూడా కొందరు ఋతువర్ణనలు చేసి ఉన్నారు. బాలలకు అనువైన పద్ధతిలో భిన్న ఋతువులను, ఆయా ఋతువులలోని వాతావరణ విశేషాలను గేయరూపంలో న్యాయపతి రాఘవరావు గారు, మిరియాల రామకృష్ణ, సండూరి రామమోహనరావు మొదలైన వాళ్ళు వ్రాయడం ఎన్నదగిన విశేషం. బాలలకోసం వ్రాసినా కొన్ని గేయాల్లో రచయితల వయసుకు తగిన పాండిత్య ప్రతిభ ప్రస్ఫుటమవడం గమనించదగ్గ విషయం అయినా అలాంటి గేయాలు పిల్లల్లో కల్పనా చాతుర్యాన్ని, ఊహాశక్తిని పెంపొందిస్తాయనడంలో సందేహం లేదు

## 4. 1. 3. వైజ్ఞానిక విషయగేయాలు.

ఆధునిక విజ్ఞానం మానవమేధస్సును ఆకాశంలోకి అలవికాని వేగంతో ప్రసరింప జేస్తున్న ఈరోజుల్లో మానవుడు తనచుట్టూ ఉన్న పరిసరాల్నే గాక విశాల

విశ్వాన్ని కూడా అరచేత పట్టాలని ప్రయత్నించే ఈతరుణంలో ప్రకృతి విశ్వ రూపాన్ని పిల్లలకు పరిచయం చేయడం చాలా అవసరం. విజ్ఞాన విషయాలు బాల బాలికలకేగాక పెద్దలకు కూడా చాలామందికి అపరిచితం. ఎంత సులభభాషలో వ్రాసినా విజ్ఞాన శాస్త్ర గ్రంథాల్లోని విషయాలు, సాంకేతికపదాలు పిల్లలకు అర్థంకాక పోవడంతో అవి వారికి రుచించవు. వైజ్ఞానిక విషయాలను గేయాల రూపంలో ఆకర్షణీయమైన చిత్రాలతో బోధిస్తే అవి వారికి కొంతవరకు ఆసక్తికరం కాగలవు. శాస్త్ర విజ్ఞాన విషయాలను చాలా లోతుగా వివరించ కూడదు. వీలయినంతవరకు స్థూలంగా, సహేతుకంగా బోధించాలి. ప్రశ్నోత్తర రూపంలో అయితే క్లిష్టమైన విషయాలు కూడా సులభంగా పట్టుబడతాయి. పైగా వాళ్ళ మనస్సులకు ఉల్లాసాన్ని కల్గిస్తాయి. ఆధునిక బాల సాహిత్యంలో విజ్ఞానానికి సంబంధించిన బాలగేయాలు కొన్ని ఉన్నాయి. అలాంటి గేయాల స్థూలపరిశీలన ఈవిభాగంలోని విషయం.

విశాలమైన ఈ ప్రపంచంలో అనంతమైన అంశాలెన్నో ఉన్నాయి. వాటిలో తెలిసిన విషయాలు చాలా తక్కువ. తెలుసుకోవలసిన విషయాలు ఎక్కువ.

> " విశ్వమంతా విద్యాలయము తమ్ముడా
> మనమంతా విద్యార్థులము చెల్లెలా
> నేర్చిన కొలదీ నేర్వగ వచ్చును
> ప్రకృతియే ఒక పెద్దబాలశిక్ష. "
>
> ( బాలభారతి )

అన్న ఏడిద కామేశ్వరరావుగారి మాటలు గమనించదగినవి. భూలోకం ఒక విజ్ఞాన భాండం. జీవిత పర్యంతం కృషిచేసినా తెలుసుకోవలసిన అంశాలెన్నో మిగిలి పోతుంటాయి.

సృష్టికి సంబంధించి, జరిగిపోయిన జరుగుతున్న కాలాలకు సంబంధించి ఎన్నో సందేహాలొస్తుంటాయి. సందేహాలను తీర్చుకోవడానికి సామాన్యంగా ఇతరుల

నాశ్రయించడం సహజం. విజ్ఞాన విషయ సంబంధమైన గేయాలు చాలావరకు ప్రశ్నోత్తర రూపంలో వెలువడటానికి అదే కారణం కావచ్చు

పిల్లలది పరిశీలనాత్మక విజ్ఞానం అప్పుడే ఎదుగుతున్న పిల్లల చిన్ని బుర్రల్లో ఎన్నో సందేహాలు పుట్టుకొస్తాయి వాళ్ళకు కలిగే సందేహాలను ఇంట్లో తల్లిదండ్రులు ( పెద్దలు ) బడిలో గురువులు తీరుస్తుంటారు బాలగేయాలు కూడా తల్లీకొడుకుల, గురుశిష్యుల సంభాషణా రూపంలో ఉన్నాయి ఉదాహరణకు :

" కొడుకు : అమ్మా ! నీ వెరుగుదువట - అయ్యవారు జెప్పిరి
అన్ని నిన్ను అడిగినన్ను - అరయ మంచు తెల్పిరి
దేశమంటె ఏమిటే - దివిగ జేయు టెవ్వరే ?
అమ్మనాకు తెలపవే - అర్థమరయ జెప్పవే ?

తల్లి : దేశమన్న మనుజులూ - దీప్తి గూర్చువారలూ
దివిని భువిగ జేయగల్గు - ధీరులురా వారలూ !

కొడుకు : సూర్య చంద్రులెవ్వరే - చుక్కలన్న వేమిటే
చక్కగాను అమ్మనాకు - ఒక్కమారు చెప్పవే !

అమ్మ : సూర్య చంద్రులన్ననూ - చుక్కలెన్న యున్నను
భూమివలెను గ్రహములని - బుధులు నుడివి నారురా.
... .. ... .. .. "

( ఊయెల (బాలగేయ సంకలనం) )

ఈ గేయంలో గురువు పిల్లల్ని ప్రశ్నించి వాళ్ల జ్ఞానాన్ని పరీక్షించే విధానం వినోదభరితం

" మేష్టారు : గాలులు రెండూ కలసికొని
నీళ్లుగ మారును ఏమిటని ?

పిల్లలు : ఔను, ఉదజనీ, ఆమ్లజనీ
కలసి నీళ్లుగ ఔనండీ

మేష్టారు : నీళ్లలోనే నిప్పుంటుందని
మీ రెప్పుడైనా విన్నారా ?

పిల్లలు : కడలి కడుపులో నిప్పుంటుందని
తెలుగు మేష్టారన్నారు
అది బడబాగ్ని అనిచెప్పారు.
... ... ... "

(స్వాతంత్ర్య భారతి పుట : 10.

సూర్యచంద్రుల్ని దేవతలుగా వర్ణించడం మన పురాణాల్లో కన్పిస్తుంది. అలా చెప్పే కల్పితకథలు కూడా ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. కానీ శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి చెందుతున్న ఈ రోజుల్లో అలాంటి నమ్మకాలు క్రమంగా సడలి పోతున్నాయి. జీవాధారమైన సూర్యుణ్ణి అతి ప్రాచీన కాలంలోనే ఆర్యులు ప్రత్యక్ష దైవంగా భావించి పూజించారు. అసలు సూర్యుని మించిన దైవమే లేదని వాళ్ల నమ్మకం. జీవకోటికి ప్రాణదాత అయిన సూర్యుడు వైజ్ఞానిక యుగంలోకూడా దైవంతో సమానమే అన్న భావాన్ని వసంతరావు వెంకటరావుగారు వ్యక్తం చేశారు. (బాల, డిసెంబరు 1950. పుట : 16) సూర్యుడు ప్రాణికోటికి జీవాధారమేగాక వెలుగు, వేడి, కాలాన్నిచ్చే గొప్ప ఉపకారికూడా. సూర్యుడు గోళమనీ నక్షత్రాలు మాపుకు చిన్నవైనా సూర్యగోళంకన్నా పెద్దవని అవణంగారు 'సూర్యగోళము' అనే గేయంలో చెప్పారు. (పూలపిండెలు) సూర్యోదయంతో వెలుగు ప్రసరించి సూర్యాస్త మయంతో చీకటి అలుముకుంటుంది దీనికి కారణం పిల్లలు ఊహించలేరు. కాని సందేహాలు పుట్టగొడుగుల్లా వాళ్ల బుర్రల్లో పుట్టుకొస్తాయి

" అంతా చీకటి అంతా చీకటి - కారణమేమిటి అన్నయ్యా ?
వెలుగూ వేడీ ఇచ్చే సూర్యుడు- పడమట కుంగెను తమ్ముయ్యా!!

లోకమంతా ఈనిమిషాన - చీకటిమయమా అన్నయ్యా !!
కానేకాదు ఈనిమిషాన - పగలొకటున్నది తమ్మయ్యా !!
అక్కడ చీకటి ఇక్కడపగలు - కారణమేమిటి అన్నయ్యా ?
మనముండే ఈభూమి గుండ్రంగా - ఉండుటయేనోయ్
తమ్మయ్యా ! !
... ... ... .. ... "

(పాలపాటలు పుట. 25)

అంటూ అన్నాదమ్ముల సంభాషణ రూపంలో ై జెంట్ల సాంబశివరావుగారు వ్రాసిన గేయంలో సూర్యుని వెడి, కాంతి ఒక దేసమాత్రమె ఉంటుందని సూర్యుని మూలం గానే రాత్రింబవళ్ళు ఏర్పడుతున్నాయని వివరించబడింది

ఆకాశంలోని చంద్రుని పిల్లలనేస్తంగా భావించి తల్లులు పిల్లల్ని ఆడిస్తూ అన్నంపెడ్తూ చందమామను రమ్మని పిలవడం అటుంచి చంద్రలోకానికే ప్రయాణాలు సాగిస్తున్నారు రజనీకాంతరావుగారి ' జేజి మామయ్య ' అనే బాలగేయంలో ' సూర్యుడొస్తే తెల్లవారేతావె? ' అని ప్రశ్నించే పిల్లలకు చందమామ చెప్పినట్లుగ ఉన్న సమాధానం విజ్ఞానదాయకంగా ఉంది. సూర్య చంద్రులు, నక్షత్రాలు మొదలైన గోళాలకు సంబంధించిన విషయాల్ని ఈగేయంలో చక్కగా వ్యక్తం చేయడం జరిగింది

" చుక్కలన్నీ కూడ సూర్యుళ్ళే - సూర్యుడు కూడా ఒక చుక్కే
నేనూ భూమీ సూర్యుడు కూడా - నింగిని తేలే గోళాలం ! "

( జేజి మామయ్య పాటలు )

అంటూ చందమామ పిల్లలకు చెప్పినట్లుగా ఉన్న పైగేయంలో పాలవెల్లితో పన్నెండు రాసుల తేలే చక్కాలు గోళాలే అని, సూర్యుడిచ్చే వేడి, యెంత చంద్రునిపైబడి వెన్నెలవుతుందని, సూర్యుడిచ్చే పగటి వెల్తుర్లో చంద్రుని వెలుగు వెలవేలా పోతుందని, భూమి తనచుట్టుతాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరగడంవల్ల రాత్రింబవళ్ళు,

తిథులూ, పక్షాలు, నెలలూ, సంవత్సరాలూ ఏర్పడుతున్నాయని చంద్రునిలో కన్పించే నల్లని మచ్చలు కొండబిలాలు, గుహలేనని కథల్లోలాగా అవ్వగాని, లేడిగాని కాదని చెప్పబడింది.

సమతారావుగారు 'మామతో ఒక మాట' అనే బాలగేయాన్ని రష్యావాళ్ల మొదటి స్పుత్నిక్‌ను ప్రయోగించినపుడు ప్రాంసన్లు చెప్పుతున్నారు అంతకుముందు చందమామను గూర్చి ప్రచారంలో ఉన్న కథల్ని వర్ణిస్తూ, ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞులు కనుగొన్న విషయాలను ఏకరువుపెడ్తూ ముందు ముందు భూలోకవాసులతో ఎలా మసలుకోవాలో పిల్లలు చందమామను హెచ్చరించినట్లుగ ఆ బాలగేయం వర్ణితం.

" రావోయి రావోయి ఓ చందమామ
రాకుంటివా మేమె రాగలము మామా

అందాలు చిందుచూ ఆనంద మొసగుచూ
మబ్బుల్ల చాటునే దోబూచు లాడుచూ
అందకుండా మమ్ము ఆడించు తుంటావు
మోమాటమున కైన మామాట కొనవు

ఎన్నాళ్ళు లేవోయి ఓ చందమామా !
వద్దన్న వస్తాములే ముద్దు మామా !

పాలసంద్రాన నువు ప్రభవించినావనుచు
పాలాక్షునకు నీవు జడలోని పువ్వనుచు
దక్ష ప్రజాపతికి ముద్దుల్లుడవనుచు
ఎన్నెన్నొ గాథలను విన్నాము నిను గూర్చి

ఒకసారి పలకవోయ్ ఓ చందమామా !
నిజమెంతొ తెలపవోయ్ మాచందమామా !

... ... ... ...

ఈనాటి నరుడంటె ఏమిటనుకుంటివో
పరమాణు శక్తిగల అసమాన బలశాలి
ప్రకృతినె శాసించు పరశివు డొక్కొకడు
దివికి నిచ్చెనవేయు ధీశాలి ప్రతియొకడు
చూచావు గదటోయి స్పుత్నిక్కు మామా!
కన్నావుగద మాదు రాకెట్టు మామా!
వెండి బంగారాలు రకరకపులోహాలు
కొండలకు కొండలే దండిగా గలవటే!
అనుభవించెడివారు అచ్చోట కరువటే!
ఉన్నాము కోట్లాది ఉర్విపై దిగులేల?
అల్లుళ్ళమేమేము నత్తుములె మామా!
అనుభవింతుము నీసొత్తంత మామా!

... ... ...”

(బాలగేయాలు. మూడవభాగం పుట : 49-52)

సూర్యచంద్రగ్రహణా లేర్పడే విధానం, వర్షం కురిసే విధానం మొదలైన విషయాలెన్నో బాలగేయాల్లో చోటుచేసుకున్నాయి.

ఆధునిక విజ్ఞానంలో ఇతోధికంగా పెంపొందుతున్న భావాలను, భారతీయుల అభిప్రాయాలకు అనుగుణంగా ఉన్నవాటిని వివరిస్తూ వసంతరావు వెంకటరావుగారు ‘విశ్వరహస్యము’ (సాహితీసమితి ప్రచురణ 1947) అనే గ్రంథాన్ని వ్రాశారు. పెద్దలతోబాటు బాలబాలికలుకూడా అర్థం చేసుకోవటానికి వీలుగా ఉన్న శైలిలో గేయరూపంలో వ్రాయబడిన గ్రంథమది. మూలపదార్థాల విశేషాలు, విద్యుత్తు, విద్యుత్తు ఖండాల లక్షణాలు, శరీరవిషయాలు, విశ్వంలో మానవుని పరిణామం, భౌతికశక్తుల ప్రధానలక్షణాలు మొదలైన విజ్ఞాన విషయాలు విశ్వరహస్యంలో వివరించబడ్డాయి.

" వింత వింతగానున్న వస్తువుల-అంతస్తత్వం బొకటండీ
చూచినదంతా యథార్థముగమది - దోచుటతప్పని సమ్మండి॥
గట్టిబండలూ మెత్తని దూది - చట్టునపారే నీరూగాలీ
వేరులక్షణములు చూపినగానీ - సారములో నొకటే నండి
... ... ... ... "

(విశ్వరహస్యము.)

అంటూ విజ్ఞానవిషయాలను సులభశైలిలో బోధించడానికి వెంకటరావుగారు ప్రయత్నించారు. ఇలాగే కవిరావుగారు 'విశ్వరూపము' ( పుస్తక ప్రపంచం. నవంబరు 1966 పుట : 28 ) అనే ఒకబాలగేయంలో హిందూదేశం ఆసియా ఖండంలోనిదని, దానికి మూడు ప్రక్కలా సముద్రం, ఒకవైపు భూమి ఉండడంవల్ల ద్వీపకల్పమంటారని, అక్షాంశ రేఖాంశాలను గురించి 'గ్లోబు' ద్వారా వివరించారు.

ప్రకృతిలోని సత్యాలను తెలుసుకోవడమే కాదు. వస్తువాహనాదుల్ని తయారు చేయడం కూడా విజ్ఞానంలో ఒక భాగమే. అలాంటి దృక్పథాన్ని, ఆలోచనల్ని పిల్లల్లో కల్గించడానికి కొంతమంది కృషి చేశారు. ఉదాహరణకు :

" గాలిపటము గాలిలోన - ఎగురవేయు బాలుడా !
గాలిపటము లాగుననే - గంతులేయు బాలుడా !

విమానాల నిర్మాణము - విశదంబుగ ఎరుగవా
విశాలాంధ్ర దేశమందు - విన్యాసము జేయవా ?
... ... ... ... ... "

( పాలపాటలు. పుట : 23. )

అదేవిధంగా

" జ్ఞానేంద్రియముల కన్నుముఖ్యము
శరీరమందు గుండెముఖ్యము
గాలి ముఖ్యమూ, నీరుముఖ్యమూ
ఆహారం నిద్ర అన్నియు ముఖ్యం "

( సిరిచుక్క మొగ్గ. )

అంటూ తాడివెంకట కృష్ణారావుగారి లాంటి వాళ్ళు శారీరక విజ్ఞానాన్ని పిల్లలకు తెలియజెప్పడానికి ప్రయత్నించారు

విజ్ఞాన విషయాలను వివరించడానికి వచనరచనే ముఖ్యసాధనం. అయినా ఆధునిక బాలగేయ రచయితలు కొందరు విజ్ఞాన విషయాలను గేయాలరూపంలో బాలలకు అందించి ఉన్నారు. విజ్ఞాన సంబంధమైన ప్రాథమిక విషయాలను, విశేషాలను సామాన్యులకు తెలుగులో అందచేసిన వాళ్లలో చెప్పదగ్గవారు వసంతరావు వెంకటరావుగారు. "విజ్ఞాన ప్రచారానికి గద్యపద్య గేయాలలో దేనినైనా ఉపయోగించవచ్చు. భారతీయ మనస్సును గేయం అధికంగా ఆకర్షిస్తుంది ఉత్కృష్టమైన తత్వవేదాంతాలు గేయరూపాన విరివిగా ప్రచారంలోవున్నాయి."[1] అన్న వెంకటరావుగారు క్లిష్టమైన శాస్త్రవిజ్ఞాన విషయాలను గేయరూపంలో అందించడానికి ప్రయత్నించి కొంతవరకు కృతకృత్యులయినారనే చెప్పాలి వారు చిన్నపిల్లలకు కూడ విజ్ఞాన విషయాలను గేయరూపంలో అందించి ఉన్నారు. విజ్ఞాన శాస్త్రం బహుముఖమైంది అనంతమైంది కూడా కానీ తెలుగులో వచ్చిన వైజ్ఞానిక బాలగేయాల్లో ఆకాశవర్గానికి చెందిన సూర్యచంద్రాదులకు సంబంధించిన గేయాలు ఎక్కువగా ఉన్నాయి భౌతిక, రసాయనికాది శాస్త్రాలకు సంబంధించిన బాలగేయాలు చాలాతక్కువ వైజ్ఞానిక విషయ సంబంధమైన ఈ బాలగేయాల్లో శాస్త్రపరిభాషను పరిహరించి పొడి పొడి వాక్యాలను, సరళమైన శైలిని తెలుగు రచయితలు పాటించి ఉన్నారు.

## 4. 14. కథా గేయాలు.

కథలు, కబుర్లు బాలబాలికల్ని బాగా అలరించి వాళ్ళహృదయాల్లో ఆనందోత్సాహాల్ని కల్గింపజేస్తాయి కథనం ఉన్న గేయాలు కథాగేయాలు. సులభశైలిలో బాలబాలికలనుద్దేశించి వ్రాసిన సుదీర్ఘాలైన కథాగేయాలు ఆధునిక బాలసాహిత్యంలో చాలా ఉన్నాయి. వాటిని ముఖ్యంగా ఆరు రకాలుగా వర్గీకరించవచ్చు.

---

1. తొలిపలుకు. విశ్వరహస్యము సాహితీసమితి. 1947.

1. పౌరాణికాలు
2. నీతి బోధకాలు.
3. యుక్తిప్రధానాలు.
4. రసాత్మకాలు.
5. భక్తిప్రధానాలు
6. స్థలపురాణాలు

## 1 పౌరాణికాలు.

భారతం, భాగవతం, రామాయణం మొదలైన పురాణాల్లోని కథల్ని, సన్ని వేశాలను తీసుకొని వ్రాయబడ్డ కథాగేయాలు కొన్ని ఉన్నాయి. విస్తృతమైన పురాణ గాథలు బాలకథాగేయాల్లో సంక్షిప్తంగా రూపొందడం గమనించదగ్గ విషయం. ఉదాహరణకు : పద్దెనిమిది పర్వాల మహాభారతకథ కథనాత్మకంగా ఒక చిన్న గేయంలో ఇమిడి పోవడం చూడండి రచయిత పురాణపండ కామేశ్వరరావుగారు.

" పంచమ వేదం మహాభారతం -
ఈ వంచకులందరికొక గుణపాఠం ॥పం॥
ధృతరాష్ట్రునకు పుట్టిరి నూర్గురు -
దుర్మార్గులు నౌ కౌరవులు
పాండురాజునకు పుట్టిరేదుగురు -
ప్రతిభాశాలురు పాండవులు ॥పం॥
పాండవాగ్రజుని మాయ జూదమున -
పలుమోసములతో ఓడించి
సభలో ద్రౌపది కొంగును లాగియు -
చావునుగోరిరి కౌరవులు ... ॥పం॥

... ... ... ... ...

నీతినెంచి ఆయుద్ధమునందు -
విజేతలైరి పాండవులు
కుటిల బుద్ధితో కురుక్షేత్రమున -
కూలిరి అందరు కౌరవులు ॥పం॥
సత్యము, ధర్మము, శాంతిని భువిలో -
స్థాపించిరి ఆపాండవులు
కుచ్చితమున తమకున్నది చాలక -
చచ్చిరి నూర్గురు కౌరవులు ... ॥పం॥ "

పంచమ వేదమైన మహాభారతంలోని ముఖ్యమైన అంశాలు మాత్రమే ఈగేయంలో చోటుచేసుకున్నాయి కౌరవులు పాండవుల్ని అన్యాయంగా లక్క-యింటిలో పెట్టడం, ధర్మరాజుని మాయజూదంలో ఓడించి పాండవుల్ని అరణ్యవాసానికి పంపడం సత్యాన్ని, ధర్మాన్ని న్యాయాన్ని నమ్ముకున్న పాండవులు హరి సహాయంతో అన్ని కష్టాల్ని ఎదుర్కొని కురుక్షేత్రయుద్ధంలో విజయాన్ని సంపాదించడం ఇందులో వర్ణితమైన కథ.

పురాణ ప్రధానమైన కథలే గాక ఆయాకథల్లోఉన్న కొన్ని పాత్రలకు సంబంధించిన కథలు సన్నివేశాలు, ఉపకథలు కూడా గేయరూపంలో వచ్చాయి ఉదాహరణకు అలపర్తి వెంకట సుబ్బారావుగారి ఏకలవ్యునికథ ఏకలవ్యుడు ఆటవిక వీరుడు, ఆడితప్పని ఘనుడు, తన శిష్యునిగా స్వీకరించడానికి నిరాకరించిన ద్రోణాచార్యుల వారినే గురుదేవులుగా ఆరాధించి అస్త్రవిద్యలో ఆరితేరినమేటి విలుకాడు. గురుదక్షిణగా ద్రోణునికి తనబొటన వ్రేలినిచ్చిన త్యాగి నాగరికుడైన ద్రోణుడు అనాగరికుడు, శిష్యప్రాయుడు అయిన ఏకలవ్యునికి చేసిన ద్రోహాన్ని చక్కని కథనంతో వ్యక్తం చేశారు

" హస్తినా పురంబు దరిని అడవి ప్రాంతము
అనాగరిక బోయ జనుల కాల వాలము

మాయ మర్మ మెరుంగరా బోయ వీరుల
నాగరిక జనమ్ము కన్న న్యాయమూర్తులు !! "

అంటూ ఏకలవ్యుని కథను ప్రారంభించి చివర ఏకలవ్యుడిచ్చిన గురుదక్షిణవల్ల సంభ వించిన మార్పుల్ని —

" మాట దప్పక గురువుగారికి - బొటన వ్రేల్ కోసిచ్చినందున
ఏకలవ్యుని అస్త్రనైపుణి - ఇట్టె నశియించెన్
మాట దప్పక గురువుగారికి - బొటన వ్రేల్ కోసిచ్చినందున
తల్లిదండ్రుల ఊహలన్నియు - తల్లక్రిందయ్యేన్
పక్షపాతపు బుద్ధితో గురు - దక్షిణంటూ ద్రోణుడివ్విధి
ఏకలవ్యుని జీవితంబున - చీకటులు చిమ్మెన్ !!

( ఏకలవ్యుడు )

అంటూ స్వార్థానికి బలైపోయిన ఏకలవ్యునికి కలిగిన నష్టాన్ని తెలియజేస్తూ —

" అర్జునుడు విలువిద్యలో ఘనుడనుచు అందరుపొగడుచుందురు
కాని నాకిల ఏకలవ్యుడె - ఘనుడు అనిపించెన్ !!"

అని రచయిత చివరతన అభిప్రాయాన్ని వ్యక్తం జేశారు పాత్రల స్వభావాల్ని శక్తియుక్తుల్ని ఏవిధంగా అర్థంచేసుకోవాలో దీనివల్ల పిల్లలకు తెలిసివస్తుంది.

నారదుని శాపంవల్ల నారాయణుడు భూమిపై రావణుడుగా అవతరించాడని పురాణకథ.

" ఒక్కనాడు నారదుండు - చక్కగాను వేషమేసి
మక్కువతో భూమిమీద - టక్కుగాను తిరుగుచుండె

నారాయణు డానాడె - నారముని పరిహసింప
దివ్యమైన భవనంబున - కన్యనొక్కదాని నుంచె"
(బాలగేయాలు)

అంటూ గేయరూపంలో వాల్మీకి రామాయణానికి మూలమైన నారద శాపవృత్తాంతాన్ని పురాణ పండ కామేశ్వరరావుగారు వివరించారు భవనానికి వెళ్ళిన నారదునికి తార లాగా మెరిసిపోతున్న కన్యను చూడగానే మనసు చలించడం, వీణను మీటి పాటపాడి వనితను పెండ్లాడమనడం, హరినితప్ప మరెవ్వరినీ పెండ్లాడనని అవనిత తన నిర్ణయాన్ని చెప్పడం, నారదుడు హరివేదుస్తులు ధరించి హరిరూపంతో ఆమెకు కనిపించడం హరి అనుకొని ఆమె పూలహారాన్ని కపట హరి కంఠంలో అలంకరించగానే నారదుడు కోతిరూపంతో ఆమెకు కనిపించి ఆమెచే అవమానింపబడడం చివరకు హరి చేసిన మోసాన్ని గ్రహించి నారదుడు హరిని శపించడం అందులోని కథ. నారదుడు హరికి ఘోరశాపమిచ్చిన కారణంగా నారాయణుడు రామావతారమెత్తి సీతను కోల్పోవడం జరిగిందని ఆకథ వివరిస్తుంది.

ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు ఉత్పలమాల, కుమారసంభవము మొదలైన గేయకథా కావ్యాల్ని వ్రాశారు 'ఉత్పలమాల'లో గంగావతరణము, క్షీరసాగరమథనము, శమంతకమణి, 'కుమారసంభవము' లో దక్షయజ్ఞము. పార్వతీ కల్యాణము, కుమారసంభవము అనె శీర్షికలతో శివపురాణపరమైన కథా గేయాలున్నాయి. అవన్నీ బాలబాలికలకు అర్థమయ్యే సులభశైలిలో కథనాత్మకంగా వ్రాయబడిన గేయరచనలు ఉదాహరణకు : చక్కని కథా కథన శైలిలో సాగిన వారి గంగావతరణ కథలో కొంతభాగం

" సగరు డనెడి మహారాజు - చాల గొప్ప బలవంతుడు
అతని ఇద్దరు భార్యలు - అరవై వేల కుమారులు
ఆరాజొక అశ్వమేధ - యాగమ్మును చేయదలచి

గుఱ్ఱమ్మును పూజచేసి - కొడుకులతో సాగనంపె
కదము త్రొక్కి నురుగు గ్రక్కి - కాళ్ళనెంట దుమ్ము రేగి
అఱ్ఱుసాచి ఆ గుఱ్ఱము - అడ్డులేక పరుగెత్తెను.
... ... ... ... ..."

(ఉత్పలమాల)

కపిల ఆంజనేయులు (దక్షయజ్ఞం), సంసారి రామమోహనరావు (కాళిదాసు జీవిత సంగ్రహాన్ని వ్రాయడానికి కారణమైన కథ 'హరిపిల్లి' సంపుటి) మొదలైన వాళ్లు పురాణ సంబంధమైన కథా గేయాల్ని పిల్లలకు అందించారు. ఆదర్శ ప్రాయులైన పురాణ పురుషుల జీవిత విశేషాలను తీసుకొని కొంతమంది గేయరచనలు చేశారు అవి ఈ ప్రకరణంలో (4.1వ విభాగం) సోదాహరణంగా కొంతవరకు చర్చించబడుతుంది.

## 2. నీతి బోధకాలు.

భావిపౌరులైన బాలల్ని సక్రమ పద్ధతిలో తీర్చిదిద్ది సంస్కారవంతులుగా రూపొందించడానికి నీతి ప్రధానమైన రచనలు తోడ్పడతాయి. చిన్న పిల్లలు భావిపౌరులనుకుంటే బాల్యదశకు ఎంతో ప్రాముఖ్యం కనబడుతుంది. అందుకే ఈదశలో భావిజీవితానికి ఉపయోగకరమైంది, విజ్ఞాన దాయకమైంది అయిన ప్రాతిపదికను ఏర్పరచాలి. ఈ ఆలోచన ఇప్పటిదికాదు. ఇంచుమించు మానవుని పుట్టుక ప్రారంభమైనప్పటి నుండి పిల్లల భావిజీవితానికి కావలసిన ప్రాతిపదికను ఏర్పరచడానికి పెద్దలు మార్గాల్ని అన్వేషిస్తూ వచ్చారు. చిన్నపిల్లల్ని దగ్గర కూర్చుండబెట్టుకొని వాళ్ళకు నీతులూ, సూక్తులూ చెప్తూ ఆ మార్గాన్ని అనుసరిస్తుండే వాళ్ళు, కేవలం నీతులు చెప్పడానికని పిలిస్తే పిల్లలు దగ్గరికి రారు. ఆ చెప్పే విషయాలు వాళ్ళకి ఆసక్తికరంగా ఉండాలి. అందుకని నీతుల్ని కథల్లో, పాటల్లో ఇమిడ్చి చెప్పేవాళ్ళు. అలాంటి వాటిలో నీతి కథనం, గేయరూపం ఉన్నదే నీతికథాగేయాలు. వాటిలో పశుపక్ష్యాదులతో కూడిన పాత్రలెక్కువ. ఈరూపంలో ఉన్న రచనలు

పిల్లలకు ఆసక్తిదాయకంగా ఉండడమేగాక వాటిలోని విషయాలు వాళ్ళ హృదయాలపై శాశ్వత ముద్రల్ని వేస్తాయి. నీతి బోధకాలైన కథాగేయాల్ని వ్రాసిన వాళ్ళలో ఏటుకూరి వెంకటనరసయ్య, నార్ల చిరంజీవి, కవిరావు, అన్నాపంతుల చిరంజీవశాస్త్రి, వి ఎ. నరసింహారావు, వల్లభనేని కాశీ విశ్వనాథం, సంపూరి రామమోహనరావు, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, సమతారావు, చింతా హనుమంతరావు మొదలైన వాళ్ళున్నారు.

> " ఎలుకతోడపిల్లి యొకటి - చెలిమిచేసి వింతగాను
> మంచిమాట లాడిదాని - పంచ చేరెనూ. "
>
> (బాలానందం)

చిక్కని శైలితో ఇలా సాగిన ఈ గేయం బాలసాహిత్యోద్ధరణకు మూలపురుషులైన గిడుగు సీతాపతిగారు వ్రాసినది 'ఎలుకా-పిల్లి' అనే శీర్షికతో ఉన్న ఆగేయంలో దుష్టుల మాయమాటలకు మోసపోరాదనే నీతి వ్యక్తమవుతుంది 1909 ప్రాంతంలో 'వివేకవతి' పత్రికలో ప్రచురించబడ్డ ఆగేయం తర్వాత సీతాపతిగారి 'బాలానందం' సంపుటిలో చేర్చబడింది.

బాలల నీతికథాగేయాల్లో ఇంచుమించు అన్నీ ప్రాచీనాలైన పంచతంత్ర కథలకు అనుకరణ ప్రాయాలే మానవ మనస్తత్వాన్ని పశుపక్ష్యాదులకు ఆపాదించి వాటిద్వారా నీతిబోధ చేయించడం ఈ కథల్లోని ప్రధానాంశం. నీతి ప్రధానాలైన కథల్ని పిల్లల కర్థమయ్యే చక్కని సులభశైలిలో అందించడానికి చేసిన ప్రయత్నం ఈగేయాల్లో ప్రస్ఫుటమవుతుంది. ఉదాహరణకు: చీటికి మాటికి కయ్యాలు తెచ్చుకోక స్నేహభావంతో పనులుసాధించుకోవాలని పిల్లలకు బోధించే కథాగేయం చూడండి ఈగేయరచయిత బి వి నరసింహారావుగారు.

> " ముసురు వాన రాతికి - ముసలి అవ్వగుడిసెలో
> రొట్టెముక్క పంపకమ్ము - గుట్టుగాను చేసుకొనక
> పిల్లికూనలంట రెండు - పెద్దకీచులాడెనంట

కోపమొచ్చి అవ్వ అంత - చీపురొకటి చేతబూని
వీపు పిట్ల చావమోది - పాపమనక బైటికంపె
తెల్లవార్లు వానతడిసి - పిల్లులయ్యొ వగచి వస్సె
బుద్ధిలేక తగవులాడి - ఇద్దరికిని శాస్తి జరిగె
ఇంక ముందు ఎన్నడిట్టి - ఇంగితంబు లేని పనిని
బ్రతికినంత కాలమందు - బాబు చేయమనుకొన్నవి
తెల్లవారి అవ్వ తలుపు - తెరచినంత కిక్కురనక
పిల్లికూన లేమొ మెల్ల - మెల్లగాను గుడిసె దూరె

ఇది కథ 'కాన బాలలార మీరు - కయ్యమెపుడు ఆడవలదు' అని రచయిత పిల్లలకు చివర సందేశ మిచ్చారు.

గొప్పవాళ్ళనే గర్వం పనికి రాదని బి. వి. నరసింహారావుగారు 'కొండ - ఎలుక గేయంలో తెలియజెప్పారు.

"పెద్దకొండ గర్వముతో - చిన్న ఎలుక జూచి నవ్వె
నాదు ప్రక్క నీదు రూపు - నలుసు నసము నిజముగాను
అన్న మాట విని ఎలుక - అలుక కులుక కంది తిరిగి
ఎందుకంత గర్వమయ్యా - ఎవరి గొప్ప వారి కుంది
... ... ... ... ...
అన్ని చెట్లు పెంచుచున్న - ఆవగింజ కొరకగలవె?
ఎందుకంత గర్వమయ్యా - ఎవరి గొప్ప వారి కుంది
తెలివి మాలి అన్న తప్పు - తెలిసి ఊరుకుంది కొండ
కాన బాలలార మీకు గర్వమెపుడు కూడ దర్ర."

(బాలకోకిల)

బహాయితో చేతగాని పనులను పూనుకుంటే నవ్వులపాలు కాక తప్పదు ఈ అభిప్రాయాన్ని శ్రీశ్రీగారు 'కప్ప వైద్యుడు' (బాల సెప్టెంబరు 1949) అనే గేయంలో వ్యక్తపరచారు. లేనిదానికోసం తాపత్రయ పడక ఉన్నదానితో తృప్తి పడడం మంచిదని బోధిస్తూ గోపురం మామయ్య 'సంక్రాంతి విందు' (పిల్లల గేయ కథలు) అనే గేయకథను వ్రాశారు. జంతువులను పాత్రలుగా తీసుకొని అల్లబడ్డ వినోద ప్రధానమైన కథాగేయమది ఉన్నదాంతో తృప్తిపడ్డమే కాదు ఆ ఉన్న దాన్ని సద్వినియోగ పరచాలి లోభితనం మంచిదికాదు కష్టపడి ఆర్జించిన సంపాదనను అనుభవించకపోతే అది పరుల పాలవుతుందే కాని వెంటరాదు లోభంతో ఇచ్చిన మాటను కూడా నిలబెట్టుకోని ఒక దురాశాపరునికి జరిగిన శాస్తిని పిల్లలకు తెలిపే కె సభాగారి 'నిలువుదోపిడి' కథాగేయం చూడండి

" హోటలుకు యజమాని మేటివర్తకు డొకడు
కోటికే పడగెత్తు గొప్పకోరికతో
ఏడు కొండల వాని కెక్కి వెళ్ళెదను
వెంకటేశ్వరునిట్లు వేడుకొన్నాడు
మనుమడు లెక్కువ వచ్చి మంచి బేరము సాగి
లక్ష రూపాయలు లాభ మొందిన చాలు
నిలువు దోపిడి యిత్తు నీలాలు యిత్తు
ఇలు తీర్థమే వచ్చి కొలచి వెళ్ళెదను "

అని మొక్కు కున్నాడు లాభాలను సంపాదించిన తర్వాత కొండకు వెళ్ళి

" ఏడు కొండలవాని కేల ధన మివ్వాలి
ఇచ్చినది దేవుడే ఎవరిది డబ్బు ... "

అని తలనీలాలు కట్టుగుడ్డలు మాత్రం ఇచ్చి ఇంటికి తిరిగి వస్తాడు, దొంగలు ఇంటినే కొల్లగొట్టి వెళ్ళడం చూసి నెత్తి నోరూ బాదుకొంటాడు అక్రమంగా సంపాదించిన

డబ్బు ఏదో ఒక రూపంలో అందకుండా పోతుందన్న విషయాన్ని ఈగేయం ద్వారా రచయిత వ్యక్తపరచారు

ఎవరు త్రవ్విన గోతిలో వాళ్లే పడతారన్నది ఒక నీతి సూత్రం. దాన్ని ఆధారంగా తీసుకొని మూర్ఖుడు ముందు వెనకాలోచించక తానుతీసుకున్న గోతిలో తానే పడిచచ్చునని కమ్మి వెంకటేశ్వరరావుగారు (పాటలు – పాటకథలు) భగత్కుమారగారు గేయకథల్ని వ్రాశారు గోపురం మామయ్యంగారు 'పక్షము లేనివతి' (పిల్లల గేయకథలు) అనే కథాగేయంలో అవ్వాబువ్వా రెండూ కావాలనుకొని అన్నిట్లోను తలదూర్చితె రెంటికీ చెడతారనే నీతిని తెలిపారు అలాగే మహాత్ముల త్యాగఫలితంవల్ల జాతిస్వేచ్ఛను దొరికేదొరుతుందని దీమిలను ద్రష్టాంతంగా తీసుకొని కవిరావుగారు 'త్యాగము' (గేయకథలు) అనే కథాగేయాన్ని వ్రాశారు

**3. యుక్తి ప్రధానాలు.**

సమయ స్ఫూర్తితో సమస్యలను పరిష్కరించు కోవడానికి యుక్తి సాధనం. యుక్తి ఉంటే ఎంతటి కష్టాలనైనా సునాయాసంగా ఎదుర్కొనవచ్చు. అలాంటి భావాన్ని వ్యక్తం చేసేవె యుక్తి కథాగేయాలు

యుక్తిలో, సమయస్ఫూర్తిలో పేరుపొందిన తిమ్మరుసు, బీర్బల్, తెనాలి రామకృష్ణుడు మొదలైన వాళ్ల కథయు సర్వజనాకర్షములు.

అలపర్తి వెంకట సుబ్బారావుగారు తిమ్మరుసు యుక్తిని గేయరూపంలో చిత్రించిన తీరు చూడండి.

" బుద్ధి బలమును జూపి యీా పెద్ద గీత
చెరపకుండగ చిన్నది చేయమనిన
పెద్ద గీతకు మించిన పెద్దగీత
గీసి యయ్యది చిన్నది చేసినాడు,
చాపపై మధ్యలో నొక చాకు నుంచి

చాప ద్రొక్కకుండగనే యాచాకు దెచ్చి
యిచ్చువారికి బహుమతి నిత్తుమనగ
చాపచుట్టును పోయి యాచాకు దీసికొని
తిరిగి చాపను పరచు కొనుచు వచ్చె.
తెలివి నింపి పంపు తిమ్మరుసా యని
కూజ నొకటి పంప రాజుగారు
కూజలోన బెంచి గుమ్మడికాయను
పంపినాడు తెలివి నింపి తనుచు. ”

( బాలానందం )

యుక్తి కథల్లో తెలుగు పిల్లలు మొదట వినేవి కాకి - కూజ, కాకి - నక్క మొదలైన కథలు కాకి - కూజ కథలో దాహంతో ఉన్న కాకి అందకుండా కూజా అడుగున ఉన్న నీళ్ళను యుక్తితో గులకరాళ్ళను వేసి పైకి ఉబికేట్లు చేసికొని త్రాగుతుంది. అలాగే కాకి - నక్క కథలో నక్క యుక్తితో కాకి నోట్లోని వడను కాజేస్తుంది. ఈకథల్ని గేయరూపంలో చాలామంది వ్రాశారు ( పైల కన్నం నాయుడు ఆట - పాట. బాలగేయాలు, ) కాకి - నక్క కథ ఆధారంగా శ్రీనివాస కాశ్యపగారు ‘ కథ అడ్డం తిప్పిన కాకి కథ ’ ( తెలుగు పాపాయి ’ అనే శీర్షికతో గేయరూపంలో వ్రాశారు నక్క జిత్తులను కాకి యుక్తితో తప్పించు కోవడం ఈకథలోని ప్రధానాంశం. నక్క కాకిని పాటపాడమనగానే నోట్లో ఉన్న రొట్టె ముక్కను కాళ్ల క్రింద పెట్టుకొని పాడుతుంది నక్క పాచిక పారకపోవడంతో మరో ఎత్తువేసి కాకి కాళ్ళ క్రింద నోరూరించే రొట్టెముక్కను చూసి పొగడ్తలతో కాకిని మురిపించి ఆడమని అడుగుతుంది కాకి మళ్ళీ రొట్టెముక్కను నోట్లో పెట్టుకొని ఆడుతుంది. చివరకు నక్క పాటపాడుతూ ఆడమంటే- కాకి రొట్టెముక్కను గుటుక్కున మ్రింగి పాడుతూ ఆడుతుంది నక్క జిత్తులు తలక్రిందులు కావడంతో నిరాశతో వెళ్లిపోతుంది. ఇలాంటి యుక్తి ప్రధానమైన కథలు పిల్లల్లో ఆసక్తినే గాక, ఆలోచనా శక్తిని కూడా పెంచుతాయనడంలో సందేహం లేదు.

చింతా హనుమంతరావుగారి 'బాలగేయాలు' 'చిత్రకథాగేయమాల' మొదలైన గేయకథల సంపుటాలలో నీతి యుక్తి ప్రధానాలైన కథలున్నాయి వారు ప్రచారంలో ఉన్న పిట్టకథలను తీసుకొని చిన్న చిన్న గేయాలుగా వ్రాశారు. ఉదాహరణకు. 'శెట్టిగారియుక్తి'.

"టోపీల వర్తకుడొకడు - తాపీగా తట్టలనిండా
ఓపిగ్గా ఎండల్లో - టోపీతో పయనించే ॥టో॥
చల్లంగ చెట్టుక్రింద - మెల్లంగ తట్టలుదించి
విశ్రాంతిగ కూర్చొనే - చల్లగాలికి పండుకొనే
చెట్టుమీద కోతులు జూచి - పెట్టుకొనిన టోపీనిచూచి
చట్టునదిగి టోపీలన్నీ - పెట్టుకొనిన చెట్టెక్కే ॥టో॥
నిదురలేచి వర్తకుడపుడు - ఎదురునున్న బుట్టలచూచి
ఎంతో చింతాక్రాంతుడై ఎట్టులబోయె కనిపెట్టి
నెత్తినున్న టోపీనపుడు - ఎత్తినేల కొట్టంగా
కోతులన్నీ పారేసే - వర్తకుడవి ఏరేసే
యుక్తితోడ ఏదైనా - శక్తితోడ సాధించు ॥టో॥

(చిత్ర కథాగేయమాల పుట 11)

దొంగ పాలవుతున్న మనవడి బంగారు కడియాన్ని తాత యుక్తితో సంపాదించుకొన్న తీరును కమ్మిశెట్టి వెంకటేశ్వరరావుగారు 'తాతయ్యయుక్తి' (చందమామ పాటలు - పాటకథలు) లో తెలిపారు ఉపాయంతో ఎలాంటి అపాయాలనైనా తప్పించుకోవచ్చని (విశాలాంధ్ర 27-9-59) తెలివితో జీవితాన్ని సుఖమయం చేసుకోవచ్చని (పాపాయి పాటలు) యుక్తి కథలు చాటుతాయి

4. రసాత్మకాలు.

హాస్యము,కరుణ, అద్భుతరసాలతో కూడిన కథాగేయాలు కూడా కొన్ని ఉన్నాయి.

అన్నా పంతుల చిరంజీవిశాస్త్రిగారి గడుసుసాక్ష్యం, తెలివిగల లంపటులు, ఇద్దరి పెండ్లాలముద్దు (బాలగేయములు - కథలు) మొదలైన కథాగేయాల్ని వ్రాశారు. వీటిల్ని కడుపుబ్బనవ్వించే హాస్యకథలని ఉదాహరణకు 'గడుసు సాక్ష్యం' కథ:

" జంకు గొంకులు లేని - పెంకి వాడొక్కడు
ఒక్కనాడంతటను - ఒక కోర్టునకును
సాక్ష్య మివ్వగ తాను - చకచక పోవగ
న్యాయస్థానము నందు - న్యాయాధిపతియు
నిజముగ తెలుప్పుము - నీకెన్నో యేడన్న
మాయమర్మము లేదు - నాయెడ యింతేని
నాయేఁడు లిరువది - న్యాయమ్ముగాను
అనగ ప్లీడరిట్లు - అనియె వానితో
రెండేండ్ల క్రిందట నుండి ఇరువది యంటు
చెప్పినావప్పుడు - ఇప్పుడంతేనా ?
' ఔను సార్ ' అంతేను - అప్పుడొకమాట
ఇప్పుడొక మాటను - చెప్పు వాడను కాను
తప్పును సేయక - ఎప్పుడొక మాటె
అని ప్లీడరంతట - ఆనంద మొందె "

సోమసుందర శర్మగారి ఆలోచన - ఆనాపన (బాల జనవరి 1959, పుట 18) భమిడి మర్తి వెంకట నరసింగరావుగారి గాడిదపుసత (బాలానందం) రవిగారి లేచిపోయిన సేవం, లెక్కలవాడు, గండం, బక్కవాడు - వన్నాడు (బాల గేయాలు) వల్లభనేని కాశీ విశ్వనాథంగారి చెవుల ఉపయోగం (బాల అక్టోబరు. 1953 పుట. 57) న్యాయపతి రాఘవరావుగారి చలికాడి కథ (బాల. జనవరి. 1951 పుట. 30) మొదలైన కథాగేయాలు హాస్యప్రధానములైనవి సుఖమెరిగిన సుకుమారులు చిన్న కష్టాన్నైనా ఓప్పుకోలేరనే భావాన్ని న్యాయపతి రాఘవరావుగారు గేయరూపంలో వినోదాత్మకంగా చిత్రించిన తీరు శిల్ప సుందరంగా ఉన్నది

" అనగా అనగా ఉన్నాడొకడు - అతనిపేరే చలిగాడు !
పుట్టించయ్యా వాడికి బుద్ధి - బుద్ధికాదది, దుర్బుద్ధి
ఎవరి మీదనైనావాలి - వాణ్ణి గజగజ వణికించాలి
చలి చలి చలి అని వాడనాలి - పక పక పక అని నేనవ్వాలి
అనుకొంటూ బయలుదేరాడు - తెగ తుళ్ళుకుంటూ చలిగాడు
పొలిమేరలోగల ఒకరైతు - వాడే అందరిలోకి బైతు
వాడినే పట్టాలి - చలితో వణగ్గొట్టాలి
అని రయిను మీదికురికాడు - ఒళ్ళంతా తెగకొరికాడు
కాని ఆ రైతు ఎంత బైతైన - వణకడు కాసింతైన
ఛీ ఛీ ఇదిక వద్దు - పోయెద ఇంకొక చోటికి
... ... ... ... "

(బాల జనవరి 1951 పుట. 30)

అనుకుంటూ చలిగాడు ఇంజన్ డ్రైవరుపైనా, కసరత్తు చేసే అబ్బాయి పైనా వాలి ఓడిపోతాడు. చివరకు సుకుమారి అయిన రాకుమారి దుప్పట్లోదూరి 'వణ వణ' వణికిస్తాడు. కాయకష్టం చేసే వాళ్ళను కష్టాలు ఏమీ చేయలేవు, ఐశ్వర్యంలో తులతూగే భాగ్యవంతులు చిన్న కష్టానికే చలించి పోతారని ఈ గేయం ద్వారా రాఘవరావుగారు తెలియజెప్పారు. విషయం కంటే కూడా కథ చెప్పే తీరులో వినోదం సత్కృష్టమై ఉంది. అభినయంతో ఈకథ చెప్తే పిల్లలు ఆనందంగా నవ్వుతారు.

బాలల కథాగేయాల్లో సానుభూతికి పాత్రమైన కరుణరసాత్మక గేయాలు కూడా ఉన్నాయి. గురజాడ అప్పారావుగారి పూర్ణమ్మ కథ అలాంటిదే. సమాజంలోని మనుష్యుల్లో పెరుగుపోతున్న స్వార్థచింతనను, ఆ స్వార్థానికి బలైపోతున్న అమాయకులను గూర్చి పెద్దలకే గాక భావి పౌరులకు కూడా ఆగేయంలో తెలియజేశారు.

" తీయని మనసుల బాలల్లారా !
పాటల తేలే పాపల్లారా
ఇపుడే పూచిన పూవుల్లారా
చెబుతా నొకకథ మీకిపుడు "

అంటూ నార్ల చిరంజీవిగారు 'ఎర్రగులాబి' కథను చెప్పారు. ఆ కథ - గేయం.

" తెల్ల గులాబీ తోటొకటున్నది
తోటకు నడుమా గుబురొకటున్నది
గుబురు లోపలా గూడు కట్టెనొక
పాటల రాణి బుల్ బుల్
గులాబి రేకుల జారే తేనెలు
పూల వాసనల తెమ్మెరలు
మంచి మంచి పాటలు స్నేహితులా
పాటల రాణి బుల్ బుల్
పన్నెం డేడుల బాలుడొకడా
తోటకు రోజూ వస్తాడు
హాయిగ తీయని పాట లెన్నెన్నో
తా పరవశుడై పాడేను
... ... ... ..."

పాటలంటే ప్రాణమిచ్చే బుల్ బుల్ అతన్ని ప్రాణమిత్రునిగా భావిస్తుంది. చివరకు అతనికోసం ప్రాణత్యాగం చేస్తుంది. నెచ్చెలి కోరిన ఎర్రగులాబి దొరకక ఏడుస్తున్న బాలునితో పాటలుపాడే షరతుపై ఎర్రగులాబిని తెచ్చిస్తాననంటుంది బుల్ బుల్. తెల్లగులాబి చెట్టును చేరి గులాబి ముల్లును గట్టిగా తనగుండెకు గ్రుచ్చి, ఉన్న శక్తింతో తెల్లగులాబిని రక్తపుష్పమై విచ్చునట్లు చేస్తుంది. ఇంత త్యాగాన్ని చూపించిన ఆ బుల్‌బుల్ చివరకు తనకోసం ఒక్క కన్నీటిచుక్కైనా కార్చని మిత్రుని

ముందుకు వస్తుంది. అన్ని లోకాలూ సంచరిస్తూ చివరకు భూలోకానికి వచ్చి జీవ రాసులన్నిటిలో గొప్ప ఏదని ప్రకృతిమాత నడుగుతుంది ఆమె జలచరమైన చేప నడుగ మంటుంది అది తనకంటే భూజల చరమైన తాబేలు నడగమంటుంది చివ రకు కోతిద్వారా మానవుడు గొప్పవాడని తెలుసుకొంటుంది. మానవుని చేరి అతని గొప్పతనమేమిటో చెప్ప మంటుంది. మనిషికి జ్ఞానాన్ని ప్రసాదించే మెదడుందనీ, ఆ జ్ఞానంవల్ల మంచీచెడ్డా తెలుసుకొని జీవించడమేగాక చుట్టూఉన్న ప్రకృతిని తన కనుకూలంగా మార్చుకొని జీవితాన్ని సుఖమయం చేసుకుంటాడని స్పష్టంగా వివరిస్తాడు మానవుడు. ఇలా మహోన్నతమైన మానవచరిత్రను పిల్లలకు ఆసక్తి కరమైన అద్భుత సన్నివేశాలతో పూర్చారు మనూనాగారు.

## 5. స్థల పురాణాలు.

నీతి, యుక్తిదాయకాలైన కథలేగాక స్థల చరిత్రలు కూడా బాలగేయాల్లో చోటుచేసుకున్నాయి ఉదాహరణకు : బాపట్ల ప్రశస్తిని వర్ణిస్తూ కనుపర్తి వరలక్ష్మమ్మ గారు వ్రాసిన గేయం.

" బాపట్ల నగరం చూడరా బాబూ
బాపట్ల గొప్ప పాడరా బాబు
తియ్యని నీరు చల్లనిగాలి
ఊరిలో వారు కదలనే కదలరు
చోళరాజుల దేశంను చూడు
దేవళంలో వున్న దేవుని చూడు
భావనారాయణ స్వామి అంటూ
బాపట్లకే ఆసామిరా బాబు
... ... ... .. "

(బాలసాహిత్యం మనూనా)

అంటూ బాపట్లలోని దేవాలయాలు, వాటి ప్రసిద్ధి, ఆ ఊరిలోజరిగే సాహిత్య గోష్ఠులు, కళాశాలలు, సముద్రం గ్రామసేవికుల శిక్షణ శిబిరం, స్త్రీహితైషిణీ మండలి... మొదలైన వాటి గురించి సవిస్తరంగా ఈగేయకథలో వివరించారు

## 6 భక్తిప్రధానాలు.

భగవంతునిపై భక్తిగల పాత్రలచుట్టూ అల్లబడిన కథాగేయాలు కొన్ని ఉన్నాయి ఈకథల్లోనూ పశుపక్ష్యాదుల పాత్రలున్నాయి ఉదాహరణకు : చింతా బాలం భొట్లుగారు వ్రాసిన ‘ జంట పక్షుల ’ కథాగేయం.

“ నిర్మలంబగు ఆకాశమున - నిత్యమల్లె తోటొకటున్నది
తోటదగ్గరను సరసొకటున్నది - సరసు ఒడ్డున వృక్షము
లోపల వుండెను పిట్టల జంటొకటి
అతి సౌఖ్యముతో ఆనందముతో - కాపురముండెను ఆ రెండున్
దగ్గర వుండే దేవళంబులో - దేవుని కొలిచెడి వారెండున్
పూజలు కాయలు తెచ్చి ఉదయమే-పూజలు సలిపే వారెండున్
జంట పక్షుల భక్తిని చూచి -తోటి పక్షులు నవ్వేడివి
నవ్విన హేళన గావించినను - ఈశుని భక్తితో కొలిచేవి
ఈశుడు పక్షుల భక్తికి మెచ్చి - ఇచ్చెనెన్నియో వరములను
ఈమార్గంబున శివుని గొల్చుచూ- కాలము గడిపెడి వారెండున్
శివరాత్రనియెడు ఈశుని పండుగ - వేగమె వచ్చెను ఒకనాడు

... ... ... ... ...

ఈశుని పూలతో పూజించుటకై ఈశుని చేరెను పూజారి
దేవుని ఒడిలో మైమరచుండిన - పిట్టల జూచెను పూజారి
పిట్టల జంటను చూచినంతనే - వచ్చెను కోపము పూజారయ్యకు
కోపము తోటి కర్రపుచ్చుకొని - పక్షుల కొట్టెను పూజారి

ఏమాశ్చర్యము ! ఏమాశ్చర్యము ! జంట పక్షులు లేవాయె !
కొట్టిన దెబ్బలు శివునకు తగిలెను - భక్తుల కాచెను శివుడంతన్."
( బాల ఫిబ్రవరి 1947. పుట 50 )

కథాగేయాల్లో నీతిబోధకాలెక్కువ స్థలచరిత్రకు సంబంధించినవి, భక్తి పరమైనవి చాలాతక్కువ. పౌరాణికాలు, నీతి, యుక్తి ప్రధానాలైన గేయాలే పుస్తకాల రూపంలో కూడా వెలువడ్డాయి.

## 4. 15. జీవిత కథాగేయాలు.

మహాపురుషుల జీవితచరిత్రలు అందరికీ ఆదర్శ ప్రాయాలు బాలబాలికల భవిష్యజ్జీవితాలను సక్రమమార్గంలో నడిపించడానికి, కర్తవ్యాన్ని బోధించి వాళ్లలో కార్యశూరత్వాన్ని పెంచడానికి, దేశభక్తులుగా, త్యాగశీలురుగా వాళ్లను రూపొందించ డానికి మహనీయుల జీవితచరిత్రలు మార్గదర్శకాలవుతాయి ధ్రువుడు, ప్రహ్లాదుడు మొదలైన పౌరాణిక బాలదైవ భక్తుల చరిత్రలు, బుద్ధుని లాంటి మత ప్రవక్తల కథలు, శివాజీ, ప్రతాపరుద్రుడు, ఝాన్సీరాణి లాంటి చరిత్ర ప్రసిద్ధి కెక్కిన వీరుల చరిత్రలు, విశ్వకవి రవీంద్రుడు, కిందుకూరి, గురజాడ మొదలైన కవీంద్రుల గాథలు, గాంధీ, నెహ్రూ, బోసు, ప్రకాశంపంతుల్లాంటి దేశనాయకుల చరిత్రలు పిల్లలకు మార్గదర్శకాలు అందుకే వాళ్ల జీవితచరిత్రాన్ని, గొప్ప వ్యక్తిత్వాన్ని, సాధించిన ఘనకార్యాలను చాటుతూ గేయాల్ని వ్రాశారు అవికొన్ని ప్రశ్నోత్తరరూపంలో సంగ్రహంగాను, కొన్ని స్మృతి చిహ్నంగా కీర్తనల రూపంలోను, కొన్ని సందేశాత్మకంగాను, కొన్ని పొగడ్తల ధోరణిలోను, కొన్ని సంగ్రహ కథలుగాను ఉన్నాయి.

గురుశిష్యుల ప్రశ్నోత్తర రూపంలో వ్రాయబడ్డ క్రింది బాలగేయంలో పురాణపండ కామేశ్వరరావుగారు బాలభక్తులైన ధ్రువ, ప్రహ్లాదుల దైవభక్తిని. ఏకలవ్యుని గురుభక్తిని విశదపరచారు.

గురువు : " ఆదికాలము నందు - ఆది విష్ణువు గూర్చి
పసితనము నందున - తప మాచరించేను

అత డెవరో మరినాకు చెప్పగలవా ?
అతనిలా నేనుండ గలవా ?

శిష్యుడు : గురువర్య అతడిని - ధ్రువుడని అంటారు
కరుణున్నచో మీరు - అతనిలా చేయండి
అడగండి గురువర్య మరియొక ప్రశ్న

గురువు : తండ్రి తిట్టినగాని - గురుడు కొట్టిన గాని
హరిభక్తి వీడని - పరమ భాగవతుండు ॥అత॥

శిష్యుడు . ప్రహ్లాదుడని ప్రజలు - కొనియాడుతారతని
ఆహ్లాదముగ నేను - అతనిలా వుంటాను ॥అడగండి॥

గురువు : విలువిద్య నేర్పనని - గురుడు ద్రోణుడు పల్క-
సాధించె అతనినే - గురువుగా భావించి ॥అత॥

శిష్యుడు : ఏకలవ్యుడు - ఏకైక సాధకుడు
అతనిలా నేనుండ గలను
అందుకు మీకరుణ వుండవలెను.
... ... ... "

(బాలగేయాలు పుట: 3)

ఐశ్వర్యాన్ని పరిత్యజించి, తానుపొందిన జ్ఞానాన్ని అనేకులకు ప్రసాదించి, సత్యాహింసల్ని చాటిచెప్పిన మహనీయుడు బుద్ధుడు.

" అమృత కలశమ్మోయి నీదు హృదయమ్ము
అనుపమానమ్మోయి నీదు చరితమ్ము
మగువ మాయా దేవి నోముల పంట !
మానవ జగతిలో నీకెవరు జంట !
... ... ... .. "

(అందాల పాప పుట 20)

అంటూ త్యాగశీలుడైన బుద్ధ దేవుని చరిత్రను మధురాంతకం రాజారాంగారు ' దివ్య స్మృతి ' గేయంలో కీర్తించారు

అభిమన్యుడు, బాలచంద్రుడు, శివాజీలాంటి వాళ్ళు అసమాన సాహస వంతులు. అలాంటి వాళ్ల అడుగు జాడల్లో నడచి ధైర్యసాహసాలను ప్రదర్శించాలని పిల్లలకు వాళ్ల సాహసగాథల్ని పెద్దలుచెబుతుంటారు ఉదాహరణకు వీరశివాజీ విజయగాథను, బాజీ త్యాగాన్ని కొనియాడుతూ వ్రాసిన కె సభాగారి గేయం

" వర్షం జోరున కురుస్తున్నది - వాగులు పొంగి ప్రవహిస్తున్నవి
చీకటి దయ్యం నర్తిస్తున్నది - చెట్లూ గుట్టలు కలసిపోయినవి
పన్హాల్ కోటకు చుట్టూసేనలు-పదాతి దళములు అశ్వికదళములు
మొగలాయీల సేనలువేలు - ముట్టడించిన ప్రమాదక్షణములు
కోటతలుపులను తీసెశివాజీ - కొదమ సింగమై దుమికెను బాజీ
ఒక రొక్కరే మరాఠివీరులు - చిక్కక క్రిందికి దిగివచ్చారు.
... ... .. ... ... ... ...
శివాజి సాధించిన స్వాతంత్ర్యం - చెప్పనెందుకది బాజీత్యాగం
నాటికి నేటికి మనగుణపాఠం - నవభారతమున శోకసందేశం."

ఆంగ్లేయుల పాలనలో అస్తిత్వాన్ని కోల్పోయిన హైందవులను మేల్కొల్పిన మహావిజ్ఞాని వివేకానందుడు యువజనతకు ప్రియ బాంధవుడతడు.

" బలమే జీవనమనుచును - బలహీనత మరణమనుచు
భారతీయ యువ జనులకు - బలము నుపాసింప నేర్పె.
... ... ... ... "

(గుమ్మటాలు. పుట . 5)

అంటూ వడ్డి విజయసారథిగారు వివేకానందుని కార్యశీలతను కొనియాడారు.

'జనగణమన' అనే జాతీయ గీతాన్ని వ్రాసి ప్రజల్లో సామరస్య సాధనకు కృషిచేసిన మనీషి విశ్వకవి రవీంద్రుడు. అతని జీవితగాథను వర్ణిస్తూ సమతారావుగారు

"సంపన్నుల ఇంట బుట్టి - విలాసాల మధ్య పెరిగి
తన ధనమును తన ప్రతిభను - జాతి సంపదగ మార్చెను
మహాభోగి మహాత్యాగి - ఎవరోహో ! ఎవరోహో !
అతడే మన రవీంద్రుడు - భారతీయ కవి చంద్రుడు"
(బాలగేయాలు ఐదవభాగం. పుట : 9)

అంటూ కీర్తించారు. శాంతి నికేతనాన్ని స్థాపించి సకల దేశాలకు శాంతిసందేశాన్ని అందించిన శాంతి ప్రియుడు రవీంద్రుడు. దేశ దాస్య విమోచనాన్ని ఆశించిన ప్రగతిశీలి ఇంటినే బడిగా, ప్రకృతినే గురువుగా భావించి జ్ఞానాన్ని సముపార్జించు కొన్న విజ్ఞాని ప్రకృతి శోభకు పరవశించి పదమల్లిన కవీంద్రుడు. గీతాంజలి కావ్యాన్ని వ్రాసి నోబెల్ బహుమానాన్నందుకొని భారత జాతినంతటిని సంబరంలో పరవశింపచేసిన పుణ్యపురుషుడు అందుకే ఆయన అందరికీ గురుదేవుడు అలాంటి రవీంద్రుని చరిత్రను చాటుతూ వ్రాసిన గేయాలు చాలా ఉన్నాయి. (బలరామాచార్య బాలల బొమ్మల బాలగేయాలు. పుట : 36 ; తాడి వెంకట కృష్ణారావు. సిరిమల్లె మొగ్గ. పుట : 60)

వీరేశలింగంగారు రచనల్ని చేయడమే గాక, మూఢవిశ్వాసాలను పోగొట్టి, వెర్రివిశ్వాసాల వెక్కిరింతకి, పరిశీలనా శక్తిని పంచి పెట్టి స్త్రీవిద్యను ప్రోత్సహించి, వాళ్ళ ముక్తికై పోరాడిన సంఘసంస్కర్త విజ్ఞానవేత్త, ఆదర్శమూర్తి అయిన వారి జీవితం పిల్లలకు మేల్కొలుపు. తెలుగు దేశానికి, భాషకు అపారమైన సేవ చేసిన కందుకూరి వీరేశలింగం పంతులుగారిని —

"వీరేశలింగమా జోహారు నీకు
నీ జీవితం ఎపుడు మేల్కొలుపు మాకు

తెలుగు భాషకు నీవు చేసినసేవ
తెలుగు జాతికి తెచ్చె వెలలేని చేవ"
(బాలగేయాలు 3వ భాగం పుట : 29)

అని సమతారావుగారు కీర్తించారు

వీరేశలింగం లాగే తెలుగు ప్రజల అభ్యుదయం కోసం పాటుపడిన మరో సంఘసంస్కర్త గురజాడ. "దేశమంటే మట్టికాదోయ్ - దేశమంటే మనుషులోయ్" అని చాటిచెప్పిన ప్రజాకవి నవయుగవైతాళికుడాయన తేనెలొలికే తెలుగు పలుకులను మరింత మధురాతిమధురంగా కూర్చి నవ్యకవితా మార్గాన్ని చూపిన ఆదర్శవాది అందుకే అతని జీవితం ఆదర్శప్రాయం అతని బోధనలు అనుసరించ దగినవి (వేజెండ్ల సాంబశివరావు ప్రజాకవి గురజాడ, పాలపాటలు పుట . 10; సమతారావు బాలగేయాలు మూడవ భాగం పుట 32)

సర్వమానవాళి సౌభాగ్యం కోసం, దేశసంరక్షణ కోసం స్వార్థరహితంగా, నిర్విరామంగా పోరాడిన దేశనాయకుల చరిత్రలు, వాళ్ళు సాధించిన ఘనకార్యాలు కూడా గేయరూపాలు దాల్చాయి విశ్వవిఖ్యాతిగాంచిన గాంధిని గూర్చి తెలియని వారు అరుదు భారతదేశం ఇంగ్లీషువాళ్ళ చేతుల్లో చిక్కుకొని ఉండగా అహింసా దీక్షతో ఎన్నోకష్టాలుపడి దేశదాస్య శృంఖలాలను తెంచిన పూజ్యబాపూజీ చరిత్రను చాటే బాలగేయాలు చాలా వచ్చాయి సత్యాహింసలే శాంతిమార్గమని జగతికి వెలుగును చూపించిన మహాత్ముడతడు అందుకే అతని ఆశయాలనూ, ఆదేశాలనూ వివరిస్తూ వాటిని ఆచరించి అతనిపేరు నిలపడానికి ప్రయత్నించాలంటూ నార్ల చిరంజీవిగారు పిల్లల్నుద్దేశించి ఈగేయాన్ని వ్రాశారు

" చిన్న పిల్లలన్న ముద్దు- గాంధి తాతకూ - మనగాంధి తాతకూ
కులములన్ని కలిపి మనకు-దారిచూపెనూ- మేలుదారి చూపెనూ
కదురు తిప్పి నూలుతీసి - బట్టలిచ్చెనూ - కట్టు బట్టలిచ్చెనూ
పాటు కొలది ఫలితమనెడి- నీతి నేర్పెనూ- తాను చేసి చూపెనూ
... ... .. ... ... "

(ఆటపాటలు)

అంతటి మహనీయుడు కనుకనే మనము అతని నిత్యం స్మరించుకొంటున్నాం. అతని జయంతి సందర్భంగా వేడుకలు జరుపుకొంటున్నాం అతనికి జేజేలు పలుకు తున్నాం  అతని జీవితాన్ని ఆదర్శంగా తీసుకొంటున్నాం. ఆయనను గురించి కవిత్వం వ్రాసుకొంటున్నాం  యస్. నారాయణగారు గాంధి చరిత్రను ఈ గేయంలో చక్కగా వ్యక్తపరిచారు

“ మన గాంధి తాతయ్య మహామంచి తాత
పిల్లలంటే కడు ప్రీతితో చూచు
భారత భూమికీ బహు దొడ్డ నేత
పోరు బందరు నందు పుట్టి నాడండి
బారిష్టరు చదువుకు పరదేశమేగ
చదువులు కాగానే స్వదేశ మొచ్చె
పరదేశ మందలి భారతప్రజలు
బహు విధముల పొందు బాధలన్ చూచి
దక్షిణాఫ్రికాకు తగుమార్పు తెచ్చె
మన దేశమందెన్నో మార్పులన్ తెచ్చె
.. ... ... ... ... ”

(బాల అక్టోబరు 1950. పుట: 4)

గాంధి అహింసావాదాన్ని అనుసరించడానికి ఒక కారణముంది  అతడు చిన్నప్పుడే హింసచేయనని ప్రతిజ్ఞ చేశాడు  ఆ కథనే లక్కన మల్లికార్జునుడు గేయరూపంలో వ్రాశారు. ఆ గేయం :

“ గాంధీ తాత ! తన చిన్న తనమ్మున
మాంసపు ముక్కను తిన్నాడు
... ... ... ...
ఒక్క మాటు తా - ఒక్కమాటే

గాంధీ మాంసము ముట్టాడు
పాపం అతని కడుపులో
ఆ రాత్రంతా ఆ మేక అరుపులే
వినిపించినవి - మేక రూపమే
కన్పించినది - గాంధి మనస్సు
కలవర పడిపోయె, కలవర పడిపోయె
... ... ... "

(బాలానందం. పుట 22)

" ఖద్దరు దోవతి కండువానిమ్మా- అమ్మా నేను గాంధినౌతా
మిత్రుల నడుమను ప్రీతితో నుండి- రఘుపతి రాఘవ పాడెదను
గడియారమును నడుముకు కట్టి- నడిచెద పెండలకడ షికారుకు
మేక పాలనే త్రాగెదను - ఏకుల రాట్నము త్రిప్పెదను
పల్లెటూరిలో నివసించీ నే - కల్ల మాటలను పాండ్రోలెదన్
అంటరాని తనమన్నది నేను - మంట గలిపెదను పూనికతో. "

(బాల అక్టోబరు 1950)

హేమాద్రి సత్యనారాయణరావు గారు వ్రాసిన పైగేయంలో గాంధీజీ వేష భాషలను, చేష్టలను, పద్ధతులను, ఆశయాలను అనుకరించడానికి చెసే ప్రయత్నం కన్పిస్తుంది తానే మహాత్ముడుగా మురిసిపోతూ తల్లితొ పిల్లవాడు చెప్పినట్లుగా వ్రాతమైన ఈ గేయంలో పిల్లల మనస్తత్వం వ్యక్తమవుతున్నది

గాంధీ జయంతి సందర్భంగా పాడుకోవడానికి అనువైన గేయాలు కొన్ని ఉన్నాయి ఉదాహరణకు.

" మాగాంధి తాతయ్యా - పుట్టిన దినమున
పువ్వుల వానల్లు - కొల్లగా కురిసేను

చిన్నారి మాతాత - వెన్నెల నవ్వుల్లో
సన్నని కాంతుల్లు - తిన్నంగ మెరిసేయి
మా గాంధితాతకు - మల్లెల్ల దండల్లు
మా బాల జేజేలు - మంగళారతులు "
(బాల. సెప్టెంబరు 1946. పుట : 9)

గాంధీతర్వాత పిల్లలకు పూజనీయుడు, ఆదర్శ ప్రాయుడు అయిన దేశ నాయకుడు నెహ్రూ అతనికి పిల్లలంటే చాలా ఇష్టం. వాళ్లదృష్టిలో అతడు 'చాచా నెహ్రూ' నెహ్రూ జన్మదినం బాలలకు ఉత్సవదినం (నవంబరు, 14) గులాబీ లంటేకూడా నెహ్రూకు చాలా ఇష్టం ఎఱ్ఱగులాబీలకు, చాచా నెహ్రూకు ఉన్న అను బంధాన్ని వక్కలంక లక్ష్మీపతిరావుగారు ఈ గేయంలో వివరించారు.

" సుందర భారత నందన వనిలో
అందము చిందిన ఎఱ్ఱ గులాబీ !
మోతీ లాలుని వలపు తోటలో
పూచిన పూవే ఎఱ్ఱ గులాబీ !

ఎవరో తెలుసా ?
ఎవరో తెలుసా ?
అతడే మన జవహర్లాల్ నెహ్రూ
అతడే మన చాచా నెహ్రూ.

ఎఱ్ఱగులాబీ చాచా నెహ్రూ
కేమిటి సంబంధం ?
ఇతరుల కెవరికి అర్థము కానిది
ఇద్దరికీ గల అనుబంధం.

శ్రీమంతుడుగా పుట్టి పెరిగినా
చెఱసాలలో కుమిలాడు
స్వతంత్ర భారతి తొలిప్రధానియై
శాంతి దూతయై వెలిగాడు !

ఎఱ్ఱకోటపై ఎఱ్ఱ గులాబీ
ఎల నవ్వులు విరబూసింది
ఎఱ్ఱకోటపై జాతిపతాకం
ఎగురు చుండగా మురిసింది.

... ... ..."
(స్వతంత్ర భారతి పుట. 40)

నెహ్రూ జన్మదినోత్సవం పిల్లలకు పండుగ దినం కాబట్టి నెహ్రూను గురించిన గేయాలు, పాటలు కొన్ని పండుగల పాటలు విభాగంలో (బాలల దినోత్సవ గేయాలు) పేర్కొనబడ్డాయి

స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని భారతమాతకోసం తనసర్వస్వాన్ని సమర్పించిన వీరుడు బోసుబాబు కారాగారాలలో ఎన్నో కష్టాలను అనుభవించాడు భారత జాతి యువతలో వెలుగులు నింపాడు అలాంటి బోసుబాబు చరిత్రను వడ్డి విజయసారథిగారు ఈ గేయంలో బాలలకోసం చిత్రించారు

" బోసుబాబు పేరువిన్న - పొంగి పోవు నీదేశం
జాతి కొరకు బోసుబాబు - సమర్పించె సర్వస్వం
సీమ చదువు చదివినను - స్వేచ్ఛ చంపుకోలేదు
దేశాంతర మేగినను - దీక్ష విడిచి పెట్టలేదు
మాతృదేశ సేవలోన - మారువేషము ధరించె
కారాగారాలలోన - కష్టములను అనుభవించె

శత్రుదేశ విరోధితన - మిత్రుడగు నటంచునెరిగి
జర్మనీ, జపాను వారి - సాయమ్మును స్వీకరించె
సామ్రాజ్యము నెలకొల్పెను - స్వాతంత్ర్యము పాదుకొల్పె
భరతజాతి యువతలోన - వెలుగునింపి నిలచిపోయె."
(గుమ్మటాలు పుట : 8)

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి గుండెదిటవు, మనో నిబ్బరము ఆదర్శప్రాయమైనవి. తెలుగు జాతికి వెలుగు బాటను చూపిన వాళ్లలో ప్రముఖుడితడు అందుకే అతనిని కీర్తిస్తూ న్యాయపతి రాఘవరావుగారు ఈగేయాన్ని వ్రాశారు.

" జోహార్లు జోహార్లు ఓ ఆంధ్రకేసరీ
బాలల్ల జోహార్లు అందుకోవయ్యా
పిన్నవయసులో ఎన్నొ - కష్టాలకోర్చి
ఉన్నత విద్యను - అభ్యసించావు
బారిష్టరీచేసి - ప్రాక్టీసుమానేసి
స్వాతంత్ర్య సమరమున జేరనురికావురా ॥జో॥
... ... ... ... ...
(బాల గేయమాల)

విశాలాంధ్ర రాష్ట్రంకోసం అసువులర్పించిన అమరజీవి పొట్టిశ్రీరాములు, ఆంగ్లేయులను గడగడలాడించిన వీరవనిత ఝాన్సీ రాణిలాంటి వాళ్లెందరో ఉన్నారు. దేశీయులేగాక ఆదర్శప్రాయులైన విదేశీయుల గాథలు కూడా కొన్ని తెలుగు బాలసాహిత్యంలో చోటు చేసుకున్నాయి చైనా రాజధాని నగరమైన పెకింగులో ఆంగ్‌మిన్ అనే అందమైన బాలుడుండే వాడు. అతడు చాలా బీదవాడు. చదువుకోవడానికి దీపం, వ్రాసుకోవడానికి కాగితం కూడా లేనిస్థితి అతనిది అయినా ధైర్యాన్ని కోల్పోక చదువు కొనసాగిస్తూ అన్ని క్లాసుల్లోను ఉత్తీర్ణుడవుతూ వచ్చాడు.

శ్రీమంతుడుగా పుట్టి పెరిగినా
చెఱసాలలో కుమిలాడు
స్వతంత్ర భారతి తొలి ప్రధానియై
శాంతి దూతయై వెలిగాడు !

ఎఱ్ఱకోటపై ఎఱ్ఱ గులాబీ
ఎల నవ్వులు విరబూసింది
ఎఱ్ఱకోటపై జాతిపతాకం
ఎగురు చుండగా మురిసింది.

... ... ..."

( స్వతంత్ర భారతి పుట : 10 )

నెహ్రూ జన్మదినోత్సవం పిల్లలకు పండుగ దినం కాబట్టి నెహ్రూను గురించిన గేయాలు, పాటలు కొన్ని పండుగల పాటలు విభాగంలో ( బాలల దినోత్సవ గేయాలు ) పేర్కొనబడ్డాయి

స్వాతంత్ర్య పోరాటంలో ప్రాణాన్ని భారతమాతకోసం తనసర్వస్వాన్ని సమర్పించిన దీపడు బోసుబాబు కారాగారాలకు వెళ్లి కష్టాలను అనుభవించాడు భారతజాతి యువతలో వెలుగులు నింపాడు అలాంటి బోసుబాబు చరిత్రను వడ్డి విజయసారధిగారు ఈ గేయంతో బాలలకోసం చిత్రించారు

" బోసుబాబు పేరువిన్న - పొంగి పోవు నీదేశం
జాతి కొరకు బోసుబాబు - సమర్పించె సర్వస్వం

నీవు చదువు చదివినను - స్వేచ్ఛ చంపుకోలేదు
దేశాంతర మేగినను - దీక్షవిడిచి పెట్టలేదు

మాతృదేశ సేవలోన - మారువేషమును ధరించె
కారాగారాలలోన - కష్టములను అనుభవించె

శత్రుదేశ విరోధితన - మిత్రుడగు నటంచునెరిగి
జర్మనీ, జపాను వారి - సాయమ్మును స్వీకరించె
సామ్రాజ్యము నెలకొల్పెను - స్వాతంత్ర్యము పాదుకొల్పె
భరతజాతి యువతలోన - వెలుగునింపి నిలచిపోయె."

(గుమ్మటాలు. పుట : 3)

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి గుండెదిటవు, మనోనిబ్బరము ఆదర్శప్రాయమైనవి. తెలుగు జాతికి వెలుగు బాటను చూపిన వాళ్లలో ప్రముఖుడితడు అందుకే అతనిని కీర్తిస్తూ న్యాయపతి రాఘవరావుగారు ఈగేయాన్ని వ్రాశారు

" జోహార్లు జోహార్లు ఓ ఆంధ్రకేసరీ
బాలల్ల జోహార్లు అందుకోవయ్యా
పిన్నవయసులో ఎన్నొ - కష్టాలకోర్చి
ఉన్నత విద్యను - అభ్యసించావు
బారిష్టరీచేసి - ప్రాక్టీసుమానేసి
స్వాతంత్ర్య సమరమున జేరనురికావురా ॥జో॥
... ... ... ... ... "

(బాల గేయమాల)

విశాలాంధ్ర రాష్ట్రంకోసం అసువులర్పించిన అమరజీవి పొట్టిశ్రీరాములు, ఆంగ్లేయులను గడగడలాడించిన వీరవనిత ఝాన్సీ రాణివంటి వాళ్లెందరో ఉన్నారు దేశీయులేగాక ఆదర్శప్రాయులైన విదేశీయుల గాథలు కూడా కొన్ని తెలుగు బాలసాహిత్యంలో చోటు చేసుకున్నాయి. చైనా రాజధాని నగరమైన పెకింగులో ఆంగ్‌మిన్ అనే అందమైన బాలుడుండే వాడు అతడు చాలా బిదవాడు చదువుకోవడానికి దీపం, వ్రాసుకోవడానికి కాగితం కూడా లేనిస్థితి అతనిది అయినా ధైర్యాన్ని కోల్పోక చదువు కొనసాగిస్తూ అన్ని క్లాసుల్లోను ఉత్తీర్ణుడవుతూ వచ్చాడ.

పెద్దపరీక్షలకు ముందు పేపరుకు పైసాకూడా లేకపోగా సముద్ర తీరంలో ఇసుకలో వుల్లతో లెక్కలన్నీ నేర్చుకొని పరీక్ష వ్రాసి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు చివరకు ఆ దేశానికే ప్రధానమంత్రి అయ్యాడు. ఇలాంటి వాళ్ళ జీవిత గాథలు పిల్లలకు ఆదర్శప్రాయాలనడంలో సందేహంలేదు. పేదపిల్లలకు ఆత్మ స్థైర్యాన్ని, విశ్వాసాన్ని కల్గిస్తాయనడంలో అనుమానంలేదు అందుకే ఆంగ్‌మిన్ గాథను 'ప్రజల ప్రధాని' అనే గేయంలో 'హర' గారు చక్కగా వివరించారు

"తూరుపునున్నది చైనాదేశం - మారుపులెన్నో బాలలకోసం
చేస్తున్నది అచట ప్రభుత్వం - అక్కడి బాలల కథలతి చిత్రం
రాజులు ఏలే రాజ్యంలో - రాజధాని నగరం పెకింగులో
ఆంగ్ మిన్ అనే అందమైన ఒక- చక్కని బాలుడు వుండేవాడు
తెలివి తేటలలో వాడే బెస్టు- క్లాసులో మార్కులు వాడివెఫస్టు
అక్కడి పిల్లల అందరి ముందర ఆంగ్‌మిన్ మాత్రం అతిబీద.
... ... ... ... ..."

(బాల. మార్చి 1954. పుట : 61 )

రష్యాలో వాక్‌టిక్ అనే ఊరులోని 'రోచిక్ వాషినిష్కో' అనే అబ్బాయి కథ కూడా అద్భుతమైంది. జర్మన్లు రష్యాపై దండెత్తిరాగా వాళ్లను ఎదిరించడం కోసం సైన్యంలో చేరి చివరికి ప్రాణాలర్పించిన బాలవీరుడతడు. రోచిక్ వాషినిష్కో బాంబులు చేసే ఫ్యాక్టరీలో పనిచేసేవాడు, జిల్లాసైనిక దళాధికారి స్టాలిన్‌గ్రాడ్ యుద్ధరంగానికి చేతిబాంబులు పంపమంటాడు. బాంబులు పేర్చిన లారీతోపాటు రోచిక్ వెళ్తాడు అలా వెళ్లేలారీని జర్మన్‌వాడు పొదలమాటు నుండి చూచి వెంటబడతాడు. మిషన్ గన్నెక్కుపెట్టుకొని ధణ ధణ వెంటబడివచ్చే టాంకును రోచిక్ చూస్తాడు. ఉపాయంతో లారీలోని కొన్ని బాంబులను నడుమును కట్టుకొని లారీని సమీపిస్తున్న టాంకుకు అడ్డంపడి లారీ సురక్షితంగా యుద్ధరంగానికి చేరుకొనేట్లు చేస్తాడు అలాంటి రోచిక్ వాషినిష్కో వీరగాథను రావూరి గోవిందాచారి గారు క్రింది విధంగా గానం చేశారు.

" బుల్లి బుల్లి తమ్ముళ్ళూ - చిట్టి చిట్టి చెల్లెళ్లూ!
కమ్మని కథనే చెబుతాను - అల్లరి మానీ వింటారా ?
రష్యా దేశము లోపాలా - "వాక్ టిక్" అనే వూరున్నాది
ఆవూళ్ళోనే వున్నాడు - వీరుడు రోచిక్ వాసినిస్కో -
చక్కని రష్యాదేశమును - కాజేద్దామను కోరికతో
కూరులు దొంగలు జర్మన్లు - రష్యాపైన పడ్డారు -
పంటలు మంటలో కలిపారు - పశువుల తెగనరికేశారు
రైళ్ళను నాశం చేశారు - యిళ్ళకు నిప్పంటించారూ -
రోచిక్ అన్నా నాన్నాలు - జర్మన్లను ఎదిరించుటకు
రష్యాను రక్షించుటకు - సైనిక దళములో చేరారు.
... ... ... ... .. "

(నవయుగ నవంబరు 1947 పుట. 20)

భారతదేశం ఆంగ్లేయుల చేతుల్లో చిక్కుకున్నప్పుడు వ్రాయబడిన గేయమిది పిల్లల్లో దేశభక్తిని కలిగించి స్వాతంత్ర్యపోరాటంలో పిల్లలు కూడా చేయూత నివ్వడానికి పురికొల్పుతూ రావూరిగారు ఈగేయాన్ని వ్రాసి ఉంటారు రోచిక్ సాహసాన్ని, అతని త్యాగబుద్ధి వల్ల కలిగిన ఫలితాన్ని ఈవిధంగా వర్ణించారు

" ధామ్మని బాంబులు పేలాయి - 'రోచిక్' ముక్కలు అయ్యాడు,
టాంకు దుమ్ములో కలిసింది - లాకీ 'బిరబిర' పోయింకి
స్టాలిన్ గ్రాడ్ రంగంబునకు - చేతి బాంబులే అందాయి
జర్మన్లేనక్కు మళ్ళారు - రెడార్మి విజయం పొందింది "

ఇలా ఆదర్శప్రాయులైన దేశీయ, విదేశీయ మహనీయులను కీర్తిస్తూ బాలబాలికలను ఉత్తేజ పరచడానికి కొంతమంది గేయాలు వ్రాశారు వాటిని ఈవిభాగంలో స్థూలంగా పరిశీలించడమైంది మహాపురుషుల జీవిత సంబంధమైన ఈగేయాలు

వాళ్ళ పూర్తిజీవితాన్ని చిత్రించవు వాళ్లుచేసిన ఘనకార్యాలు, సాధించిన ఫలితాలు, అందువల్ల తెలుసుకోదగిన ఆదర్శాలు ఇవి ఇందులో ప్రధాన విషయాలు జాతిపిత అయిన గాంధీకి సంబంధించిన గేయాలు, దేశనేత అయిన నెహ్రూ పరమైన గేయాలు కొల్లలుగా ఉన్నాయి పోతన, శివాజీ, గాంధీ లాంటి మనీషియుల జీవితాంశాలు బుర్రకథల రూపంలో కూడా వ్రాయబడ్డాయి

## 4. 16. బాలల బుర్రకథలు.

ఆంధ్ర జాతికి అతిప్రధానమైన జానపద కళారూపం బుర్రకథ అందులో జానపదుల సంగీతం, నృత్యం, నాటకం – ఈ మూడింటి మేలుకలయికను చూడవచ్చు. సామాన్య జనుల్లో సాంఘిక, రాజకీయ చైతన్యాన్ని కల్గించడంలో దానికదేసాటి దానికున్న ప్రాముఖ్యాన్ని గుర్తించి పిల్లలు ప్రదర్శించడానికి, పాడడానికి వీలుగా బాలగేయరచయితలు కొన్ని బుర్రకథల్ని వ్రాశారు అవి చిన్నవిగాను, సులభశైలిలోను ఉన్నాయి

బమ్మెర పోతనామాత్యుని జీవితకథను చింతాహనుమంతరావుగారు బుర్రకథా రూపంలో వ్రాసి 1962 లో ప్రచురించారు

> " వినరా ఆంధ్రుడ పోతన్న కథనూ వీనులలరనేడూ
> బమ్మెర పోతనా మాత్యుని కథనూ బాగుగవినరయ్యా
> పరమ పవిత్రంబైన చరిత్రము పట్టుదవినరయ్యా
> కేసన మంత్రికి లక్కమ్మ కితడు వాసిగ జన్మించె
> ... ... ... ... "

అంటూ ఆ కథను ప్రారంభించారు మధ్య మధ్యలో హాస్యాన్ని చొప్పించి వినేవాళ్లకు ఆసక్తికరంగా సన్నివేశ కల్పన చేశారు

బాలసాహిత్య రచయితలుగా సుప్రసిద్ధులైన కవుల ఆంజనేయశర్మగారు వీరశివాజీ (1970) బాలానందం (1974) అనే రెండు బుర్రకథల్ని వ్రాశారు.

శివాజీ జీవితంలోని ప్రధాన ఘట్టాల్ని - బాలశివాజీకి తల్లి బోధించిన నీతులు, గురుదేవులైన దాదాజీదగ్గర విద్యాభ్యాసం, రామదాసస్వామి దగ్గర హిందూమత ధర్మరక్షణకు దీక్ష, మొగలాయిల మోసానికి ప్రతీకారం, ఛత్రపతి శివాజీగా పట్టాభిషేకం మొదలైన వీరోచిత ఘట్టాల్ని చక్కని శైలిలో ఆవేశజనకంగా చిత్రించిన రచన వీరశివాజీ ఉదాహరణకు: శివాజి మొగలు దర్బారు చేరినపుడు జరిగిన సంఘటనను చిత్రించిన తీరు చూడండి.

కథకుడు : [భళానోయి బాయి తమ్ముడా సై
మేలు భళానోయి దాదానా]

"ఔరంగజేబు ప్రభువురా ॥సై॥
అంత శివాజిని చూచెరా ॥సై॥
గౌరవమును తా మరచెరా ॥సై॥
కుట్ర చేయ తల పెట్టెరా ॥సై॥
భటులనూ పిలిపించెరా ।సై॥
బంది ఖానాలో వుంచెరా ।భళా ।
శివాజి ధైర్యము వీడక ॥సై॥
బంధ విముక్తిని పొందగ ।సై।
సూక్ష్మ బుద్ధిని మరువక ।సై।
యోచన లెన్నో చేసెరా ।సై।
భటులను మచ్చిక చేసెరా ।సై।
నమ్మకమ్ము కల్గించెరా ।సై।
ఫలహారమ్ముల బుట్టలో ।సై।
దాగొని బయటకు వచ్చెరా ।భళా। "

(వీరశివాజీ. పుట : 14. 15)

శర్మగారు పిల్లల కోసం సృష్టించిన మరో చక్కని బుర్రకథ బాలానందం. పిల్లల ఆసక్తిని, అభిరుచిని వినోదకార్యక్రమాల ద్వారా పెంపొందించవచ్చన్నది వారి అభిప్రాయము ఆ తలంపుతోనే నవంబరు 1957లో అనకాపల్లిలో 'రామా బాలా నంద సంఘం' అనే పిల్లల విజ్ఞాన వినోద కేంద్రాన్ని స్థాపించారు. బాలానంద సంఘాల ఆవశ్యకతను గుర్తించిన వారీయన. అందుకే అలాంటి సంఘస్థాపనకు దోహదప్రాయంగా బాలానందం బుర్రకథను వ్రాశారు బాలానంద సంఘస్థాపన మొట్టమొదట 1939లో జరిగింది అదే న్యాయపతి దంపతులు మద్రాసులో స్థాపించిన ఆంధ్రబాలానంద సంఘం. దాని తర్వాత బాల సంఘాలు తెలుగుదేశమంతటా వెలశాయి. ఈవిషయాలన్నిటినీ ఆ బుర్రకథలో శర్మగారు పొందు పరచారు. బాల సంఘాల్ని స్థాపించే విధానం, కార్యక్రమాలను నిర్వహించే తీరు మొదలైన అంశాలను కూడా ఆ కథలో చొప్పించారు. చివరకు తాను స్థాపించిన రామ బాలానందం చేపట్టిన కార్యక్రమాలను కూడా ఇలా వివరించారు.

> " బాల బాలికల అభ్యుదయానికి బాటలు వేయుచును
> ఆటల, పాటల, నాటకమ్ముల పోటీలను జరిపి
> ఐకమత్యము బాలల్లోన అలవడ చేయుచును
> బాల సాహితికి శోధనచేసి బాల ప్రగతి కోరి
> పుస్తకమ్ముల ప్రచురణ చేసి పిల్లల కందించి
> రామా బాలానందం సంఘము రాణమీరార నిలిచె. "
>
> ( పుట : 10, 11 )

ఇలాంటి సంఘాల స్థాపన కోసం ఆ సంఘాల చరిత్రను బుర్రకథ ద్వారా వినిపించిన శర్మగారు చివర పెద్దలను, పిల్లలను ఉద్దేశించి ఇలా విన్నవించారు.

" నేటి బాలలే రేపటి పౌరులు - మేటిసూక్తి యిదివినరండి !
బాలల సత్పౌరులుగా జేయ - బాలసంఘముల నడపండి !!

పెద్దలందరూ నడుం బిగించి - పిన్నల వృద్ధిని కోరండి !
బజ్జలు అండగ నిలబడి ఏటిని - ఓర్పుతో చక్కగ నడపండి !
భారతదేశం బాగుపడుటకు - బాలలె ముందుకు రావాలి !
ఇదియే సత్యము మదిలోనమ్మి - ఇలలో నిత్యం చాటండి ! ! "

## 4. 17. నృత్య గేయనాటికలు.

ప్రదర్శనా యోగ్యమైన, సంభాషణా రూపమైన, సంగీతాత్మకమైన గేయాలు నృత్యనాటికలు వచన రూపంలో ఉన్న నాటికలకు, గేయనాటికలకు కొంచెం భేదముంది వచన నాటికలలో సంభాషణలు ఆయా పాత్రధారులు స్వయంగా ఉచ్చరించి రంగస్థలంపై అభినయిస్తారు గేయనాటికలలో గాయనీగాయకులు తెరవెనుక సంభాషణా రూపంలో ఉన్న గేయాలను అభినయానికనుగుణంగా, లయాత్మకంగా పాడి పాత్రలను పోషిస్తారు వేషధారులు ఆపాటల కనుగుణంగా నృత్యం చేస్తూ భావాభినయం చేస్తారు.

నాటికలు, నాట్యాలు అందర్నీ అలరించే శ్రవ్య దృశ్య రూపమైన కళలు. అలాంటి కళలపట్ల అభిమానాన్ని, అభినివేశాన్ని కల్గించాలనే ఉద్దేశంతో కొందరు ప్రదర్శన యోగ్యమైన నృత్య గేయనాటికలను వ్రాశారు అవి విలక్షణమైనవి. వాటిలో కథ, గేయం, సంగీతం, నృత్యం – ఒకదాని కొకటి ఒరుసుకొని సలక్షణమైన కళాస్వరూపంగా పొంగి ప్రవహిస్తాయి వాటిని ప్రదర్శించే పిల్లలకు సంగీతం, నాట్యం, హావభావ ప్రకటన – ఇవన్నీ అలవడతాయి అవి వినోదాన్నేకాదు, విజ్ఞానాన్ని కూడా అందిస్తాయి

తెలుగులో ప్రత్యేకంగా పిల్లల కోసం వ్రాసిన నాటికలు తక్కువ వాటిలో గేయనాటికలు మరీతక్కువ పిల్లల కనువైన భాషలో, శైలిలో వెలువడ్డ గేయ నాటికలను వ్రేళ్ల మీద లెక్కపెట్టవచ్చు ఆకాశవాణిలో పిల్లల కార్యక్రమాలు ప్రారంభ మైన తర్వాత గేయనాటికలు కొన్ని ప్రసారం చేయబడ్డాయి. హైదరాబాదు ఆంధ్ర

బాలానంద సంఘం, విజయవాడలోని బాలభారతి గేయనాటికల ప్రసారానికి, ప్రదర్శనకు అవకాశమిచ్చి అలాంటి నాటికలు వెలువడ్డానికి కొంతవరకు తోడ్పడ్డాయి.

కొన్ని గేయకథలను న్యాయపతి రాఘవరావుగారు నృత్యగేయ నాటికలుగా రూపొందించి బాలానందసంఘం పిల్లలచేత రంగస్థలంపై ప్రదర్శింపజేశారు. వాటిలో చెప్పుకోదగ్గవి కుండలూ - తాడేలూ, చిలుకమ్మ పెళ్ళి, ఎలుకమ్మ పెళ్ళి, బొమ్మలపెళ్ళి, ఈగా - సాలీడు మొదలైనవి. భావలో, భావంలో, రాగంలో, గానంలో మెలకువ తెలిగిన బాలాంత్రపు రజనీకాంతరావుగారు బాలలకోసం 'మూలస్తంభాలు' అనే నృత్యసంగీత నాటికను వ్రాశారు. ఆకాశవాణిలో ప్రసారం చేయబడి, రంగస్థలంపై ప్రదర్శించబడి అందరిమన్ననలను అందుకొన్న నాటికది. ఉదాహరణకు - వినూత్నమైన ఆ నాటికలోని కొన్ని ఘట్టాలు.

" పౌర జీవితా రంభాలు
రేపటి మూలస్తంభాలు
పిల్లలు నేడై పౌరులు రేపౌ
సంఘపు మూలస్తంభాలు "

అభినవకుమార్ అనే విద్యార్థికీ పంతులుకు మధ్య ఈ సంభాషణ జరుగుతుంది.

" పంతులు : శాశ్వతమై సత్యమై-ఈ విశ్వగతికే మూలమై
ఈశ్వరుండనిజ్ఞాను లెరిగిన-ఏకశక్తికి వందనం"

అని ప్రార్థనా బోధ చేస్తారు.

" అభినవకుమార్ : పంతులుగారూ! మీకిదిగోను సలాము
వద్దు వద్దు మా బుద్ధి కిలాటి ములాము
ఎరుగని ఈశ్వరుడెవరో ఎలానమ్మడం ?
పెరుగుతున్న విజ్ఞానం ఎలామరవడం ?

పంతులు : తర తరాల సత్యాన్వేషణ గమ్యము
పెరిగే విజ్ఞాన పరుల కెల్ల మాన్యము
దైవభక్తి సమభక్తుల కలదు సామ్యము
వినయ వివేచనలు లేని విద్య శూన్యము

అభినవకుమార్ : పంతులుగారూ మీకిదిగోను సలాము
వద్దు వద్దు మాబుద్ధి కిలాటి మలాము
ప్రశ్నించే తర్కబుద్ధి ప్రగతిధర్మము
విద్యార్థుల విజ్ఞానమ్మెరుగు మర్మము."

పిల్లల ప్రగతికి పంతులుగారే మూలమనే భావం క్రింది వాక్యాల్లో వ్యక్త మవుతుంది

" ఎటువైపు ఎటువైపు ప్రసరించునో పంతులుచూపు
అటువైపె అటువైపె పయనింతురు పిల్లలు రేపు......"

చివర కాన్వొకేషన్. కుడి ఎడమల కాన్వొకేషన్ దుస్తులు ధరించి పట్టభద్రులు, బారులు తీరి నిలబడతారు తామంటే తాము గొప్పని వాదించుకొంటారు. చివర ప్రిన్సిపాల్ వాళ్లమధ్య నిలబడి ఇలా తీర్పునిస్తాడు.

" ఓటుహక్కు లభియించేవరకూ
చదువులు నేర్చే విద్యార్థులకూ
కుడి ఎడమలతో కూడదు జోక్యం
క్రమశిక్షణతో చదువే ముఖ్యం.
... ... ... ...
విద్యాలయ సరిహద్దుల నడుమ
విద్యలు గరిపే ఒజ్జలకెల్ల

సర్వ సమ్మతాంగములే పాఠం
శీల వంతమౌ నడతయె ముఖ్యం. "

విద్యార్థులందరూ " ఇదియే భరతవాక్యం " అంటారు అన్నెట్లోన తలదూర్చి తప్పుదోవలు పడుతున్న విద్యార్థులకు ఈ నాటిక చక్కని సందేశాన్నందిస్తుందని అనడంలో సందేహం లేదు.

గోపురం మామయ్యగారు రామాయణ కథ నాధారంగా చేసుకొని 'శబరి' ( పిల్లల గేయ కథలు ) అనే భక్తి ప్రధానమైన గీతికానాటికను వ్రాశారు.

పురాణపండ కామేశ్వరరావుగారి 'రాధా - కృష్ణ' ( బాలగేయాలు పుట : 76-81 ) అనే గేయనాటిక నృత్యప్రధానమైనదే. యమునా నదీ తీరంలో ఆలమందలు వెణుగానం వింటూ మేత మేస్తుండగా గోపాలుడు పొన్నచెట్టుపై కూర్చొని వేణుగానా లాపం గావిస్తుంటాడు యమునా నదికి నీళ్లకోసం వచ్చిన రాధ, గోపికలు మనసును హరించే ఆ వేణుగానాన్ని వింటూ వివశులై చిన్నికృష్ణుని పిలుస్తూ గానం చేస్తారు రాధామాధవుల రాసలీలను చిత్రించే గేయమిది.

బి. వి. నరసింహారావుగారి 'ప్రియ దర్శి' ( ప్రియదర్శి గేయాలు ) నృత. నాటిక చారిత్రకమైనది అశోకుడు ఉత్తరదేశాన్ని జయించి సైన్యంతో దక్షిణదేశంపై దండెత్తివస్తాడు ఒక పూరి గుడిసెలో ఒక ముసలి తల్లి, ఆమెకొడుకు మధ్య జరిగే సంభాషణ వింటాడు. మాతృసేవకోసం తల్లిని ఒప్పించి సమరభూమికి వెళ్లి ప్రాణా లర్పిస్తాడా వీరుడు పుత్రశోకంతో విలపించే ఆ ముసలి తల్లి ఆవేదనను చూసి అశోక చక్రవర్తి సత్యాహింసలను చేపట్టి బౌద్ధ భిక్షువుగా మారి ప్రేమ మార్గాన్ని, శాంతిమార్గాన్ని అనుసరిస్తాడు ఇది ప్రియదర్శి నాటికలోని కథాంశం.

సంగీతం, నృత్యం, హావభావ ప్రకటనకు అనుగుణంగా ఏడిద కామేశ్వరరావు గారు బాలల నృత్యగేయ నాటికలను వ్రాసి 1976లో 'ఒప్పుల కుప్ప' పేరుతో ప్రకటించారు. వాటిలో ఒప్పులకుప్ప, విశాల భారతి, పంటలచ్చి నృత్య ప్రధానమైన నాటికలు. ఆవు - పులి, విశ్వవిద్యాలయం భావాభినయం ప్రధానంగా రూపొందినవి.

ఇవి ఆకాశవాణిలో ప్రసారం చేయబడి, విజయవాడ 'బాలభారతి' బాల విద్యాలయం పిల్లలచే ప్రదర్శించబడి ఎక్కువ ప్రచారాన్ని పొందాయి. శ్రీకృష్ణుని రాసక్రీడలను వర్ణిస్తూ వ్రాసిన నృత్యగేయనాటిక ఒప్పులకుప్ప ఇది భావానికి, అభినయానికి, నృత్యానికి ఆలంబనగా మధ్యమావతి రాగ ఫణితిలో పాడించి ఆడించిన నృత్యగీతం. పిల్లలు సులభంగా ప్రదర్శించడానికి వీలుగా ఆటపాటల శైలిలో మలచబడిన చక్కని రచన ఉదాహరణకు.

" 1వ భామ : ఒప్పుల కుప్ప వయారి భామా !
వన్నెల చిన్నెల చిన్నారి భామా
- నిలు నిలు నిలు నీలాల రేవదిగో -
నీలాల రేవు కాడ - నల్ల కృష్ణుడున్నాడు
నీలాల నాడబోవ - కిల కిల నవ్వాడే —— ||ఒ||

2వ భామ : సంపెంగ మొగ్గ సన్నజాజి మొగ్గ
ముత్యాల ముచ్చెలుక ముగ్ధవే భామా
... ... ... ... "

'విశాలభారతి' లో భారతదేశంలోని పలుప్రాంతాలకు ప్రతినిధులుగా బాలలు పలు ప్రాంతీయ వస్త్ర ఆహార్యాలంకరణలతో నృత్యం చేస్తూ అందరమూ ఒకటే అని ప్రబోధించడం వర్ణితమైంది సువిశాలమైన మన భారతదేశం ఎన్నో మతాలకు, భాషలకు, సంస్కృతీవికాసానికి, విజ్ఞానానికి నెలవై భిన్నత్వంలో ఏకత్వాన్ని రూపొందించి అపురూపమైన ఒక జనజీవన ప్రస్థానాన్ని రూపొందించిందనే భావం ఈ నాటికలో వ్యక్తమవుతుంది. భూమిలో గింజనాటింది మొదలు ఆ పంటపండి ఇంటికి వచ్చేవరకు ప్రవర్తిల్లే పలుఘట్టాలను సూచించే రూపకం పంటలచ్చి (ఒప్పుల కుప్ప పుట : 39-46) భావాభినయ ప్రధానమైన 'ఆవు-పులి' గేయనాటిక కరుణరస భరితం, సత్యవచనా ప్రబోధం అయిన అనంతామాత్యుని 'ఆవు-పులి' పద్యకావ్యానికి అనుసరణ 'విశ్వవిద్యాలయం' నృత్యగీతంలో అనంతమైన ఈ విశాల విశ్వాన్ని

దాని మహాద్భుత లక్షణాన్ని దిజ్మాత్రంగా వివరించారు. వాలి జీహాకల్పానికిది ఒక కళోపహారం.

బాలాంత్రపు రజనీకాంతరావుగారు అభినయానికే అనుగుణంగా 'రోలు – మద్దిల' గేయం వ్రాశారు. అవి పరస్పరం స్వీయ బాధలను తెలియజేసుకొనే తీరు వినోదాత్మకంగా చిత్రితమైంది.

"రోలుపోయి మద్దెలతో మొరపెట్టుకున్నట్టు" అని ఒక సామెత. ఆ సామెతకిది చక్కని నాటక చిత్రణ.

" రోలు : ఓహో మద్దిలయ్యా – ఓ మద్దిలయ్యా విన్నావయ్యా
అహోరాత్రములందు – నా బాధ సుంత విన్నావయ్యా
సువ్విసువ్వి ......

మద్దిల : ఓరోల ఓ జోల విన్నాములే నీదు గోల
నా బాధ నీకేమి తెలుసులే వెర్రిగోల ఓ జోల ఓరోల ...

రోలు : వడ్లు దంచితేనూ – గుడ్లుమిటకరిస్తా మద్దిలా
పప్పూ దంచితేనూ – పక్కలు చురుకౌను మద్దిలా
... ... సువ్వి
పసుపూ దంచితేనూ – పరవళ్ళు దొక్కుతా మద్దిలా
ఊకా దంచితేనూ – శోకామే నాపని మద్దిలా ... సువ్వి

మద్దిల : ఒకప్రక్క దంపుడేనిది – ఇరుప్రక్కల బాదుడు నాకు
॥నా బాధ॥
తకధిమి తకఝణు తళాంగు తఝణ
తడికుడి డికుడిగుడు తళాంగుతోం
ధిమితి ధిమిత ఝం ఝం ధిం ధిం డిమిత

తర్ఘు తధిం తళాంగు మంటూ యిరు
ప్రక్కలా బాదుడు నాకు - ఒక ప్రక్క దంపుడే నీకు.

కో॥లు తెలికా పిండి దంపా - ఉలికులికి పడతానో మద్దిలా
ఉలవల్లు దంచితే - కళవళ పడతా నో మద్దిలా
చిట్టూ దంచితేను - చిడి ముడి పడతా నో మద్దిలా
అడ్డమైనవి దంపీ - హైరాణ పెడతారు మద్దిలా —
సువ్వి.

మద్దెల : గ్రామాల్లో గుడిమేళాల్లో, గుడిలో హరికథ తాళాల్లో
రాము భజన సమ్మేళాల్లో - గానసభల్లో రాష్ట్రసభల్లో
రాజధానిలో రచ్చ సభలో
ద్రిగుడ్త ద్రిగుడ్త ద్రిగుడ్త ద్రిగుడ్త తరికిట
తళాంగు తోం తళాంగుతోం తోం తకధిత్తళాంగు
ధిమితోంత
ద్రిగుడు ధిత్తళాంగు ద్రిగుడు ధింత॥ఒక॥ "
(జేజిమామయ్య పాటలు)

## 4. 18. పొడుపు కథలు.

బాలలకు వినోదంతోబాటు మెదడుకు పనికల్పించేవి పొడుపు కథలు బుద్ధి వికాసం పొందుతున్న దశలో ఇవి ఎక్కువగా ఆకర్షిస్తాయి జానపదుల్లో ప్రచారంలో ఉన్న పలురకాల పొడుపుకథల్ని గూర్చి మూడవ ప్రకరణంలో చర్చించడం జరిగింది. ఆధునికులు కొందరు పొడుపుకథల రూపంతో గేయాల్ని వ్రాశారు అవి ఇప్పటి పరిస్థితుల కనుగుణంగా, పిల్లలకు పరిచయమైన వస్తుసంచయంతో కూడుకొని ఉన్నాయి కాని గేయరూపమైన ఈ పొడుపుకథల్లో విడుపుకూడా కన్పిస్తుంది ఉదాహరణకు : బాలాంత్రపు రజనీకాంతరావుగారి గేయం:

" వంకర టింకర వో వో వో వో - వాని తమ్ముడు ఆ ఆ ఆ ఆ
నల్లాగుడ్లా మియా యా యా - నాలుగు కాళ్ళమే మేమేమే
॥వం॥

వప్పా సరకుల తిండీ హెచ్చి - పిప్పిలిబస్తా కడుపూనొచ్చి
కొంకరపోయిన నాలుక వుంటే - కొరుక్కు తింటే చురుక్కు
మంటూ ॥వం॥

మాటల్లోనూ ఘాటును చేస్చి - మందపు అకలి మాడేశ్శొంతీ
భావంలోనూ కారంకూర్చి - నోరూరించే తల్లే అల్లం.
తుబుకు తుమ్మే జలదోషంలో - కంటూ ముక్కూ జడివానల్లో
గొంతూసంతా పెగలకపోతే - నసాళ మంటే మసాల మిరియం
॥వం॥

నవ్వ్వారాకా ఏడుపురాకా - నాలుగు దిక్కుల చూపులుపోకా
గిలిగింతలకే కదలని డొక్కా - కలిగిన మనిషీ మె మ్మె మ్మె కా
॥వం॥

(జేజిమామయ్య పాటలు)

పొడుపు కథల్లో గూఢార్థ ద్యోతకమైనవే గాక వర్ణనాత్మక మైనవీ ఉన్నాయి. చెరుకుమిల్లి భాస్కరరావుగారి ఈగేయం అలాంటిదే.

" ఎంతో అందంగా ఉంటుంది
అందని పండు - ఆకాశంలో

చల్లని కిరణం - మెల్లని చూపూ
పండు వెన్నెలా - పాలవెల్లులు

పూర్ణిమ నాటికి - పూటవుతుంది
అమవస నాటికి - అసలే లేదు

ముచ్చట గొలిపే - మోహన భస్మం
మీాద జల్లితే - మొద్దు నిద్దరే

ఆ పండేమిటి - పాపా చెప్పుకో
'చందమామ' అని - చెప్పేస్తా!"

(బాల. ఫిబ్రవరి. 1947 పుట : 23)

ఎల్లోరా గారు సూర్యగోళాన్ని పొడుపుకథా రూపంలో ఇలా వర్ణించారు.

"నన్ను చూ_స్తే చీకటి పోవునంటాడు
నన్ను చూడగ నీరు ఇంకునంటాడు

నాచుట్టుతా భూమి తిరుగునంటాడు
నాకేడు గుర్రాల స్వారి అంటాడు.

... ... ... ... ..."

(విశాలాంధ్ర. ఆదివారం. 11. 11. 56)

జంగా సుబ్బయ్యగారు 'నేనెవరు?' అనే శీర్షికతో పది పొడుపు కథలను గేయ రూపంలో వ్రాశారు. బాలపత్రిక 1949 జనవరి సంచికలో ప్రచురించ బడ్డాయి. ఉదాహరణకు :

"నాలుగు కాళ్ళ జంతువును
గడ్డినిశనగల ఉలవలను
గారాబముతో తిను చుందున్
నేనును జనులను మోయుదును
బండ్లను కూడా లాగుదును

వేగములో మరి వస్తే
గెలవగ లేరు ఎవ్వరుగా - నేనెవరు?"

(జవాబు : గుర్రము)

గంగరాజు సుశీలాదేవిగారి ఈ గేయంలో ప్రశ్నోత్తర రూపంలో 'కర్మఫలం' అనే శీర్షికతో పొడుపుకథలు వర్ణితమైనాయి.

" ... ... ... ... ...
పాపకాని పాపయెవరో చూస్తారా మీరు ?
ఆపాపతో నేస్తానికి వస్తారా మీరు ?
పాపకాని పాపలోనే చూస్తాము మేము
ఆపాపయె మా కంటికి ప్రియమగు నేస్తం !
కులముకాని కులము ఒకటి పూర్వముండేది
గుడి కాని గుడి ఒకటి నేడు ఉన్నది.
కులము కాని కులమునాడు గురుకులమే కాదా
గుడి కాని గుడి నేడు మా బడియె కాదా
ఆగుడిలో దైవము మాగురువే కాదా
... ... ... ... "

(చిట్టిముత్యాలు. పుట : 23)

అలపర్తి వెంకట సుబ్బారావుగారి 'పొడుపు విడుపు' అనే గేయం

" నన్నిటి దంతాలున్నవి నాకూ! - కానీ ఏనుగును కానమ్మా !!
కుచ్చుతోక నాకున్నది చక్కగ - కానీ నక్కను కానమ్మా !!
చారుగ వీపున చారలువున్నవి! - కానీ పామును కానమ్మా !!
చేసితి సాయము శ్రీరామునికూ' - కానీ కోతిని కానమ్మా !!

ఇప్పుడు నీవు చెప్పుము పాపా! - ఇంతకు నేననలెవ్వరినో ?
చెప్పలేనిచో విప్పెద పొడుపూ! - 'ఉడుతను' నేనూ 'హయాత్'
అనకు "

(సిమ్మతౌనలు. పుట . 11)

తెలుగు బాలసాహిత్యాన్ని ఇతివృత్త దృష్ట్యా ఇంతవరకు ఎవ్వరూ వర్గీకరించ లేదు ఉన్న వర్గీకరణలు ప్రక్రియా భేదానికి సంబంధించినవి. ఈ ప్రకరణంలో ఆధునిక తెలుగు బాలగేయ వాఙ్మయాన్ని ఇతివృత్తాన్ని, ప్రక్రియా భేదాన్ని దృష్టిలో పెట్టుకొని అష్టాదశ వర్గాలుగా విభజించి పరిశీలించడమైంది ఇవి కొంతవరకు అతి వ్యాప్తి, అవ్యాప్తి దోషాలకు పాల్పడ లేదనె చెప్పాలి ఈ పద్దెనిమిది వర్గాలలో కొన్ని రచయితలను ఎక్కువగా ఆకర్షించినట్లు కన్పిస్తాయి. అలాంటి వాటికి సంబం ధించిన గేయాలు పుష్కలంగా వెలువడ్డాయి ఉదాహరణకు . బాలల ప్రశంసాత్మక గేయాలు, విద్యావిషయిక గేయాలు, ప్రబోధాత్మక గేయాలు, ప్రకృతి పాటలు, కథా గెయాలు మొదలైనవి మరి కొన్ని వర్గాలను సంబంధించిన గేయాలు అతి స్వల్పం ఉదాహరణకు : లాలిపాటలు, బాలల బుర్ర కథలు, నృత్యగేయ నాటికలు మొదలైనవి.

---

# 5. భాషా ఛందోలంకారాలు

## 5. 1. బాలభాషా పదాలు.

ప్రతిభాషా సమాజంలోను పిల్లలతో వ్యవహరించడానికి పరిమితమైన పదాలు కొన్ని ఉంటాయి. వాటిని పెద్దలు తమలోతాము వ్యవహరించేటప్పుడు ప్రయోగించరు మాటలు నేర్చేదశలో పిల్లలు ఉచ్చరించడానికి అనువుగా పెద్దలు కల్పించి వాడే ముచ్చటైన మాటలవి. వాటిలో కొన్ని పిల్లల తొక్కుపల్కుల నుండి కూడ పుట్టి ఉండవచ్చు ఆ పదాల వ్యవహారం ఐదారేళ్ల వరకే పరిమితం ఆ తర్వాత పిల్లలు కూడా వాటికి పర్యాయంగా పెద్దల వ్యవహారంలోని మాటల్నే వాడుతారు. చిన్ననాటి వ్యవహారానికే పరిమితమైన అలాంటి పదాలను బాలభాషాపదాలు **(Baby words)** అనవచ్చు. అవి ప్రతిభాషలోను కొన్ని కన్పిస్తాయి. బాలభాషా పదాలు సాధారణంగా నిర్మాణంలో సరళంగా సులభోచ్చారణతో శ్రావ్యంగా ఉంటాయి. ఉదాహరణకు : తెలుగులో అన్నానికి 'బువ్వ', దేవుడికి 'జేజి' పడుకో అనడానికి 'బచ్చో' మొదలైన మాటలు బాలభాషా పదాలు బాల్యంలో తొలిదశలోని పిల్లలతో లేదా పిల్లలు తమలోతాము వీటిని ప్రయోగిస్తే ముచ్చట రెండోదశలో వీటి ప్రయోగన్ని కొనసాగిస్తే పరిహాసాస్పదం అవుతుంది తొలిదశలోని బాలలను ఉద్దేశించిన తెలుగు బాలగేయ సాహిత్యంలో బాలభాషా పదాలు కొన్ని చోటుచేసుకొని ఉన్నాయి. వాటిని ప్రయోగ పూర్వకంగా క్రింద ప్రదర్శించడమైంది

**అప్పచి = తినుబండారం, పిండివంట.**

" గొప్పలు నీవయ్యా అన్నయ్యా
అప్పచ్చి నీదేర తమ్మయ్యా ! " (చిరుగంటలు.)

" అమ్మ అప్పచ్చి
కమ్మ నప్పచ్చి
కోరి తెచ్చాను
చేరి తిందాము ! "

(గోరుముద్దలు.)

జాబిలి = చందమామ.

" కల కల జాబిలి నవ్వేను
కిల కిల కలువలు విరిసేనూ "

( పసిడి మనసుల పాలపాటలు. )

తిమ్మన్న = కోతి.

" నాన్న యిచ్చినపండు నాచేతిపండు
లాగి కొన్నా పండు ఆగకే తింటూ
తన నోటిలో వున్న దవడ సంచులలో
దాచుకొని తిమ్మన్న నెమరు వేస్తోంది. "

( జేజి మామయ్య పాటలు. )

తువ్వ / తువ్వాయి = ఆవుదూడ.

" పాడావు కన్నట్టి
పాపాయి తువ్వా
నువ్వూ నేనూ కలిసి
నేస్తముందామె. "

( ఆంధ్రజ్యోతి వారపత్రిక. 'బొమ్మరిలు.' శీర్షిక. )

"తువ్వాయి మెళ్ళోన
మువ్వాయి ఉంది
మువ్వాయి ఎంతెంతో
ముద్దవ్వుతోంది"

(పాలబడి పాటలు)

దాయి = చందమామ.

"దాయి దాయి అంటె దగ్గరకెరాక
ఆకాశ వీధుల్లో షికార్లు కొడుతూ
నీలాల నింగిలో నిలవక పోతుంటె
ఆడేది యెటులమ్మ అక్కయ్య నేను
అందని పొందని ఆమామ తోను."

(బాలసాహిత్యమంజరి.)

దోబూచి = దొంగ.

" ... ... ... ...
వెన్నెల గాదు వెన్నల దొంగ
దొంగ గాదు దోబూచి కృష్ణుడు."

(బాల సాహిత్య మంజరి)

బజ్జోను / బచ్చోను = పడుకోను.

"చందమామను జూచి బజ్జుంటానే
పండు వెన్నెల జూచి బజ్జుంటానే."

(ముద్దుపాటలు)

" పాల బువ్వ తింటుంది
పంచలో బచ్చుంటుంది. "

( బాల సాహిత్య మంజరి. )

బన్ని Bunny = బొమ్మ.

" బన్ని అంటె తెలుస
బన్ని అంటె బొమ్మ
కొత్త కొత్త బొమ్మ
మెత్త మెత్త బొమ్మ "

( పాలబడి పాటలు. )

బుజ్జి = చిన్న.

" బొట్టు పెట్టెలో బంగరు పాపను
పెట్టి అమ్మకు ఎవరిచ్చారో
బోసీ నవ్వుల బుజ్జీ పాపను
చూసీ అంతా మురిసేవారే. "

(జేజిమామయ్య పాటలు.)

బుల్లి = చిన్న.

" కంగారు కోక పిల్లుంది
తల్లి కడుపులో
బుల్లి సంచిలో
మెల్లన కూచొని
ఎల్ల ప్రపంచం చూస్తుంది. "

(బాలగేయమాల)

బుల్లి కిటుడు = చిన్ని కృష్ణుడు.

" అక్కా అన్నా అసూయ చెందగ
అమ్మమ్మ నన్ను బుల్లి కిటుడన
అందరు జేరి ఆహా అనగా
పిల్లన గ్రోవిని నేను ఊదుతా ! "

(పిల్లన గ్రోవి.)

బువ్వ = అన్నం.

" పాలు బువ్వ తింటుంది
పంచలో బజ్జుంటుంది
పగలు నిద్దుర తీస్తుంది
రాత్రులు యిల్లు కాస్తుంది. "

(బాలసాహిత్య మంజరి.)

బూచాడు / బూచివాడు = దొంగ.

" సూర్యు డొచ్చాడు
వెలుగు తెచ్చాడు
చీకటిని బూచాడు
ఎత్తు కెళ్ళాడు "

(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 'బొమ్మరిల్లు' శీర్షిక

చీకటిలో బూచివాడు
వాకిట పొంచుంటాడని
అమ్మ దగ్గ రుంటాడా
అమవస నాడగు పించడు. "

(స్వతంత్రభారతి)

ఈ విధమైన బాలభాషా పదాలు తెలుగులో చాలా ఉన్నాయి ఉదాహరణకు : లాల (నీళ్లు) ఉజ్జు (చుక్క), బూచి (పురుగు), మొదలైనవి. వీటిలో మాండలిక భేదాలుకూడా ఉన్నాయి ఉదాహరణకు : రాయల సీమలో చీలి (పిల్లి), బజి (మజ్జిగ), కక్క (సంకటి), చీపె (మాంసం) పాపె (పాలు), బాయి (మేక), బోబు (కోడి), జాంజి (ఊయల), జిజ్జిపో (నిద్రపో)మొదలైనవి. తొలిదశలోని పిల్లలకు సంబంధించిన గేయాల్లో నిజానికి బాలభాషా పదాల ప్రయోగం తక్కువె అని చెప్పాలి. బన్ని **(Bunny)** అనె ఇంగ్లీషు పదం తెలుగు బాలభాషాపదాల్లో కన్పించే ఒక అన్యదేశ్యం.

## 5. 2. ఛందస్సు.

కవిత్వానికి ఛందస్సు వ్యక్తావ్యక్తంగా ఉండదగిన లక్షణం. అది వ్యక్తం కానంతవరకు దాని ఉనికి లేదనే అనుకుంటాం కవిత్వానికి రసభావాలు మాత్రమె గాక శ్రుతిరంజకత్వానికి ఛందస్సు అవసరం. ఛందస్సు లయకు పుత్రస్థానీయం ఒక అపురూపమైన అనుభూతిద్వారా ఆవేశం పొందిన రచయితహార్పే పదాలలోను. వాక్యాలలోను అసంకల్పితంగా ఒక 'తూగు' సిద్ధిస్తుంది లయ, ఛందస్సు అనేవి కేవలం పదవాక్యగత విషయాలేగాని భావ సంబంధులు కావు కేవలం వచనంలో వ్రాసినా ఒక కవి పొందిన అనుభూతి తప్పనిసరిగా లయాత్మకంగానే వ్యక్తమవుతుంది.

రచనలో ఇన్నేసి అక్షరాలుంటే ఒకపాదం అనిగాని, మాత్రల దళాలు ఇన్ని ఉండే ఒకపాదం అనిగాని, గేయంలో ఇన్నిపాదాలు ఉండాలి అనిగాని గేయ ఛందస్సు నిర్ణయించదు గేయాల్లో ఒక్కొక్కసారి వాక్యాలు ఖండికలుగ సాగుతాయి. పాడుకొంటె ఒక్కొక్కసారి తాళానికి ఒదుగుతాయి సాధారణంగా లయాన్వితమైన ఏ రచన అయినా చదువుతున్నపుడు మనః శ్రవణేంద్రియాలకు సుఖానుభూతి కల్గుతుంది

బాలగేయ రచనలన్నింటిలో ఏదోఒక ఛందశ్శిల్పం ఉంటుందె బి రామరాజు గారు తన 'తెలుగు జానపద గేయసాహిత్యము' అనే పరిశోధన గ్రంథంలో గేయాల లోని మాత్రలకు సంబంధించి చెప్పిన అభిప్రాయ సారాంశమిది. పద్యపాదాలు

గణాలతో, కూర్చబడినట్లే గేయాల చరణాలు ఆవృత్తాలతో కూర్చబడుతాయి. ఒక చరణంలోని ఆవృత్తాలన్నీకాల ప్రమాణంలో సమానంగా ఉంటాయి. ఒక ఆవృత్తంలోని మొత్తం మాత్రల సంఖ్య నిర్ణీతమే అయినా వాటి గురులఘువుల క్రమం ఒక్కటి కానక్కరలేదు. పద్యగణాల్లో గురులఘువులకు చంద్రవంకలను, నిలువు గీతలను సంకేతాలుగా వాడినట్లే గేయ ఆవృత్తాలలోని మాత్రలకు 'తకకిట' అనే అక్షరాలు సంకేతాలు. ఈ నాలుగక్షరాల్లో ఒక్కొక్కటి ఏకమాత్రా కాలాన్నే సూచిస్తాయి గేయ గీతిలో రెండేసి మాత్రల కూడిక స్ఫురించినప్పుడు 'తక' అనిగాని 'కిట' అనిగాని సూచిస్తారు మూడేసి మాత్రల ఛేరికకు 'తకిట' అని మూడక్షరాలతో సూచన మూడు మాత్రల కాలంలో ఉచ్చరించే అక్షరం ప్లుతం. ప్లుతాన్ని గుర్తించడానికి ప్రత్యేకంగా అక్షరసంకేతంలేదు. ఉచ్చారణనుబట్టి ప్లుతాన్ని నిర్ణయిస్తారు గేయాల్లో ప్లుతాలేగాకుండ నాలుగు మాత్రల కాలంలో ఉచ్చరించబడే కాకపాదం కూడా ఉంది ప్లుతానికి 'U|' అనే సంజ్ఞను కాకపాదానికి 'ს|' అనే సంజ్ఞను రాజగోపాల నాయుడుగారు గుర్తించి ఉన్నారు [1]

ప్రతి లయలు ఛందోమూలములు ఏకప్రమాణం గల మాత్రల నడకలయ. ఈలయ చదువరులను తనవెంట ఈడ్చుకొనిపోతూ అలౌకికంగా కావ్యరసాన్ని అనుభవించడానికి ఎంతోసహాయపడ్తుంది ఇది త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణగతుల్లో ఉంటుంది మూడు మాత్రల గణాలతో నడిచేది త్ర్యస్రగతి. నాలుగు మాత్రలతో నడిచేది చతురస్రగతి. ఐదుమాత్రల ఆవృత్తాల నడక ఖండగతి. ఏడుమాత్రల ఆవృత్తాలకూడిక మిశ్రగతి, తొమ్మిది మాత్రల గణాల నడకను సంకీర్ణ గతి అంటారు

బాలగేయాలు అధికంగా గతి ప్రధానాలు అందువల్ల బాలగేయం పైగతుల్లో ఏదో ఒక గతికి చెంది ఉండి తీరాలి రగడలు కూడ ఈ గతుల నాధారంగా చేసుకొని ఏర్పడినవి. కాబట్టి ఆధునికమైన అనేక బాలగేయ ఛందస్సులు జానపద బాలగేయాల లాగే రగడలలో అంతర్భవిస్తాయి అందువల్ల లాక్షణికులు ప్రతిపా

1. పాటలలో ఛందస్సు, పుట : 20.

దించిన రగడలను ప్రాతిపదికలుగా గ్రహించి తదను గుణంగా ఆధునిక బాలగేయ చ్ఛందస్సులను పరిశీలించడం యుక్తం. రగడలలో కొంది భేదాలచే ఏర్పడిన గేయచ్ఛందస్సులను రగడ భేదాలుగానే వర్గీకరించడం సమంజసం

రగడల్లో అంతర్భూతాలు కాదగిన ఆధునిక బాలగేయ చ్ఛందస్సులను గురించి కొన్ని సామాన్య లక్షణాలను చెప్పుకోవలసిఉంటుంది. రగడలు అనియత పాదాలుగా ఉపయోగించబడినా ఎన్ని పాదాలైనా బేసిసంఖ్యలోగాక సరి సంఖ్యలో ఉంటాయి. రెండేసి పాదాలకు ప్రాస ఉపయోగించడమే అందుకు కారణం. బాలగేయ చ్ఛందస్సులో యతి కంటె ప్రాస మరింత అనియతం అందువల్ల బాలగేయాల్లో పాదాలు సరిసంఖ్యలో ఉండాలన్న నియమంలేదు బేసిసంఖ్య పాదాలతో కూడా కొన్ని ఉండవచ్చు యతి ప్రాసల విషయం కూడా అంతే కొన్ని గేయాల్లో యతిప్రాసలు రెండూకూడా పాటించబడవచ్చు కొన్నిట్లో లేకపోవచ్చు కొన్ని గేయాల్లోయతి, కొన్నిట్లో ప్రాస, కొన్నిట్లో ప్రాసయతి కూడా ఉండవచ్చు. ముత్యాల సరాల్లో ఉన్నట్లు కొన్ని గేయాల్లో పాదాద్యక్షరయతికూడా పాటించవచ్చు.

ఆధునిక బాలగేయాల్లో పాదానికి నాల్గేసి గణాలుండడం నియతం కాదు ఒకటి, రెండు, మూడు, నాల్గు గణాలతో కూడా ఒక్కొక్క పాదం ఉండవచ్చు అయితే పాదానికి నాల్గేసి, రెండేసి గణాలుండడం ఎక్కువగా కన్పిస్తుంది అంటె పూర్ణపాదాలు, అర్ధపాదాలు ఉండే రచనలే ఎక్కువగా కన్పిస్తాయి. మొత్తంమీద తెలుగు బాలగేయాల్లో నాల్గు విధాలైన పాదాలతో భిన్నరకాలైన రగడలు కొన్ని కన్పిస్తాయి. భావవ్యక్తీకరణలో ఒక విధమైన సొగసునో, నడకలో ఒక విధమైన వేగాన్నో సాధించడానికి నాల్గు విధాల రగడలు బాలగేయ కర్తలు ప్రయోగించారని చెప్పవచ్చు

1. త్ర్యస్ర గతిలో నడిచే బాలగేయాలు.

1. " కొండ మీద వెండి గిన్నె
కొక్కి రాజు కాలు విరిగె "

( తెలంగాణా పల్లెపాటలు )

2. " అంత గొప్ప భావ మైతె
అందు కోసు మాకు శక్తి
లేదు బాబు అంటు బెంచి
మీద కూరు చుండె కర్ర "
( ఆవూ - హరిశ్చంద్ర )

3. " ఒక్క గ్రామ మందు కలదు
ఒక్క దైన ముదుస లమ్మ
తాను పెంచు కోడి పుంజు
తెల్ల వారు జాము కూయు. '
( చింతా హనుమంతరావు బాలగేయాలు )

పైన పేర్కొన్న మూడు బాలగేయాల్లో పాదానికి 'మూడు మాత్రల గణాలు నాలుగున్నాయి. పాదానికి నాల్గేసి చొప్పున మూడు మాత్రల గణాలుండడం హయ ప్రచార రగడ లక్షణం. కాబట్టి పైగేయాల్లో హయప్రచార రగడ లక్షణాలున్నాయని చెప్పవచ్చు

1. " ధిమిత ధిమిత
ఏమి ధిమిత
పసుపు ధిమిత
ఏమి పసుపు
ఛాయ పసుపు. "
( మధుర కవితలు పుట. 84. )

" రండు - రండు !
పండు - పండు !

ఏమి – పండు ?
నిమ్మ – పండు! "

(సమతారావు. బాలగేయాలు.)

పై గేయాల్లో మూడు మాత్రల గణాలు రెండేసి మాత్రమే ఉన్నాయి కాబట్టి అవి హయప్రచార అర్ధరగడ గేయాలవుతాయి.

1 " చిక్కు– చిక్కు– పుల్ల
చింత కాయ పుల్ల
... ... ...
గుచ్చు గుచ్చు పుల్ల
గువ్వ పిట్ట నల్ల. "

( స్వీయ సేకరణ )

2. " నడచి నడచి రావె !
నంది వర్ధ నీవె !!
పడవ యెక్కి– రావె !
పారి జాత వీావె !! "

( తాయం. )

పై గేయాల్లో ప్రతి పాదంలోను ఉన్నవి మూడు త్రిమాత్రా గణాలు ఇవి హయ ప్రచార త్రిగుణ రగడలవుతాయి

ఈవిధంగా మూడు మాత్రల గణాలను కూర్చడం హయ ప్రచార తగడ లక్షణం కొన్ని సందర్భాల్లో అదనంగా పాదాంతంలో ఒకటి రెండక్షరాలు మిగలటం సంభవిస్తుంది అట్టివి వివృత రగడ అవుతాయి ఉదాహరణకు :

1. " నాకు ఉంది బొంగరం
రింగు రింగు బొంగరం
వద్దు వద్దు సంగరం
వద్దు శోక సాగరం "

( సమతారావు. బాలగేయాలు )

2. " మల్లె పువ్వు తెల్లన
మబ్బు కొనలు తెల్లన
... ... ...
పంచ దార తియ్యన
పుట్ట తేనె తియ్యన "

( ఆంధ్ర జ్యోతి సచిత్ర వారపత్రిక బొమ్మరిల్లు శీర్షిక. )

త్ర్యస్రగతిలో నడిచె కొన్ని బాలగేయాలను మాత్రా సంఖ్యగా మార్చి చెప్పితే ఆటవెలది లక్షణాలున్నట్లు గుర్తించవచ్చు ఉదాహరణకు :

" ఉగ్గు పాల నుండి ఊయ లలో నుండి
అమ్మ పాట పాడి నట్టి భాష
తేనె వంటి విందు పీను లకును విందు
దేశ భాషలందు తెలుగు లెస్స. "

( బాలాభిరామం. )

త్ర్యస్ర గతిలో నడిచే క్రింది బాలగేయంలో ఉత్సాహ లక్షణాన్ని సమన్వయించడానికి వీలుంది.

" గాలి బాల కింత కమ్మ నైన వాస నెందు కు ?
పూల బాల లంద రితో నాడి వచ్చి నందు కు ?

గాలి బాల పూల వాస నెవరి కిచ్చే టందు కు?
పూల వంటి మనసు గల్ల బాల లకిదు నందు కు. "
(సమతారావు. బాలగేయాలు.)

పాదాంతంలో గల హ్రస్వాక్షరాన్ని దీర్ఘంగా పలకడం గేయ ధర్మం. ఉత్సాహంతో పాదానికి 7 సూర్యగణాలపై ఒక గురువు ఉంటుంది. దీన్ని త్రిమాత్రాకములైన 7 గణాలకు పైన ఒక గురువుకూడితే ఉత్సాహపాద మవుతుందని మాత్రా సంఖ్యగా మార్చి చెప్పవచ్చు ఇలా చెప్తే త్రిమాత్రాకములైన నాలిగేసి గణాలు పాదానికి గల హయప్రచార రగడకు రెట్టింపయిన తురగ వల్గన రగడ అవుతుంది.

పై పరిశీలనను బట్టి త్ర్యస్ర గతిలో నడిచే బాలగేయాలన్నిటిని హయప్రచార రగడ భేదాలుగా నిర్ణయింపవచ్చు.

2. చతురస్ర గతిలో నడిచే బాల గేయాలు.

1. " చుక్కల నడుమా చక్కని చంద్రుడు
బాలల మధ్యా పండిత నెహ్రూ
అందరు మెచ్చే సుందర మూర్తీ
అందరు ముచ్చట పొందే కీర్తీ "
(సిరిచుక్క మొగ్గ.)

2. " బడిలో బాలల గురువే దైవము
గుడిలో కదలని బొమ్మే దైవము "
(ఊయల)

ఈ గేయాల్లో ప్రతి పాదంలోను నాలుగు మాత్రల గణాలు నాలుగున్నాయి. అలా ఉండడం మధురగతి రగడ లక్షణం.

ఈ క్రిందిగేయాల్లో పాదానికి నాలుగు మాత్రల గణాలు రెండే ఉన్నాయి. వాటిని మధురగతి అర్ధరగడ లక్షణాలుగా పేర్కొనవచ్చు

1. " దాహం తీర్చే
చల్లని నీరూ
నోరూ రించే
కొబ్బరి కోరూ."

(చిట్టి ముత్యాలు.)

2. " జీతం చాలని
కొలువది దండుగ
పాఠం చెప్పని
పంతులు దండుగ. "

(సమితారావు బాలగేయాలు.)

ఈ గేయంలో మూడేసి చతుర్మాత్రా గణాలున్నాయి. దీన్ని మధురగతి త్రిగణరగడ ఛాయ కల్గిన గేయమనవచ్చు

" పెద్దలు చెప్పే సుద్దులు
శ్రద్ధగ వినుము ప్రొద్దులు
చదువూ రానీ మొద్దులు
కదలగ లేనీ యెద్దులు. "

(తాయం.)

చతురస్రగతిలో నడిచే కొన్ని గేయపాదాల్లో, అదనంగా పాదాంతంలో ఒకటి రెండక్షరాలు మిగిలి పోతుంటాయి. వాటిని మధురగతి వివృత రగడలు అంటాను. ఉదాహరణకు :

1. " ఊగూ ఊగూ గంగెద్దా
   ఉగ్గూ పాలే గంగెద్దా
   (తెలంగాణా పల్లెపాటలు.)

2. " ఆటాపాటా ఆనందం
   చదువూ సామూ సంతోషం. "
   (సమతారావు బాలగేయాలు.)

చతురస్ర గతిలో నడిచే ఈ క్రింది బాలగేయంలో అల్పాక్కర ఛాయ ద్యోతకమవుతుంది.

" కోతికి వాలం ఒకటేగా
మనిషికి కన్నులు రెండేగా
జడలో పాయలు మూడేగా
పశువుకు కాళ్లవి నాల్గేగా. "
(సమతారావు బాలగేయాలు )

అల్పాక్కర పాదంలో వరుసగా రెండు ఇంద్రగణాలు ఒక చంద్రగణ ముంటుంది ఇంద్రగణాల్లో నాలుగు మాత్రల గణాలను స్వీకరించినప్పుడే పై గేయం అల్పాక్కర లక్షణానికి లొంగుతుంది.

మొత్తానికి చతురస్రగతిలో నడిచే బాలగేయాలన్నిటికి మధురగతి రగడలుగానో లేదా దాని భేదాలుగానో పరిగణించవచ్చు.

## 3. ఖండగతిలో నడిచే బాలగేయాలు.

ఐదేసి మాత్రల నడక ఖండగతి.

1. " అందాలు చిందుచూ ఆనంద మొసగుచూ
మబ్బుల్ల చాటునే దోబూచు లాడుచూ
అందరుం డామమ్మ ఆడించు తుంటావు
మోమాట మున్నకైన మామాట కౌనవవు.

(సమతారావు. బాలగేయాలు. మూడవభాగం.)

2. " ఆహ్లాదకరమైన అందమా చిత్రాలు
చిత్రకా రకులిచట చిత్రించి నారురా
జగతిలో నీతికై జ్ఞానధను లీవిభువిని
వేదాల బోధలను వినిపించి నారురా. "

(గుమ్మటాలు)

పాదానికి ఐదేసి మాత్రల గణాలు నాలుగుండడం ద్విరదగతి పూర్ణరగడ లక్షణం కాబట్టి పై గేయాల్లో ఆ ఛాయ లున్నాయనవచ్చు

ఈ క్రింది గేయంలో పాదానికి ఐదేసి మాత్రల గణాలు రెండే ఉన్నాయి. దీనిని ద్విరదగతి అర్థరగడ లక్షణాలున్న గేయంగా పరిగణించవచ్చు.

" ఆయింట ఈయింట
చిరుజంట చిరుపంట
ఆటల్లు పాటల్లు
చిరుమాట చిరుపలుకు. "

(బాలగీతి.)

బాలగేయాల్లో ద్విరదగతి త్రిగణరగడ లక్షణాలున్న గేయాలుకూడా ఉన్నాయి. అంటే పాదానికి ఐదేసి మాత్రల గణాలు మూడు ఉన్నాయి. ఉదాహరణకు :

" బాజాలు రానాన్న బాజాలు
బాజాలు వచ్చాయి బాజాలు
అమ్మనీ పిలవరా బాజాలు
నాన్ననీ పిలవరా బాజాలు. "

(లక్కపిడతలు)

పాదానికి ఐదేసి మాత్రల గణాల్ని నిలపడం ద్విరదగతి రగడ లక్షణం. పాదాంతంలో ఐదేసి మాత్రలకంటె తక్కువగల అక్షరాలు కొన్ని మిగిలి పోతుంటాయి అలాంటివి వివృతాలు. ద్విపద లక్షణాలతో కూడిన క్రింది బాలగేయంలో ద్విరదగతి వివృత రగడ లక్షణాలను గుర్తించవచ్చు.

" మోచేతి పద్మమ్ము పట్టేటి వేళ
ఆవుల్లు లేగల్లు వచ్చేటి వేళ "

(ఇల్లిందల సరస్వతీదేవి. పిల్లలుపాటలు)

ఖండగతిలో నడిచే బాలగేయాల్లో అసమ పాదాంతోకూడి అసమ రగడ లక్షణాలున్న గేయాలు కూడ కన్పిస్తాయి ఉదాహరణకు :

" ముత్యాలు తెచ్చినీ ముందుపో యిస్తాను
ఏమి చే - స్తావు నీ
వేమిచే స్తావు. "

(బాలాభిరామం)

క్రింది రెండు గేయాలు కిరిసీసానికి చక్కని ఉదాహరణలు : సీసపద్యం నరి పాదాల్లోని గణవిన్యాసానికి ప్రాధాన్యమిచ్చి నాలుగు పాదాల్ని రచిస్తే కిరిసీసమవు తుంది. సాధారణంగా కిరిసీసంలో పంచ మాత్రా గణాలే ప్రయోగించబడుతుంటాయి.

1. " పీనులకు విం(దైన విఖ్యాత కావ్యాలు
రసమయ మ్ముగకవులు రచియించి నారురా
మధురమై జగతినే మరపించు గాథలను
భావభరి తముగాను (వాసియు న్నారురా. "
( గుమ్మటాలు )

2. " ఆదికవి వాల్మీకి నడిగివ త్తమురండి
పుట్టలో పలనతడు పుట్టినాడ టమున్న
రామకథ తెలిసికొని రావాలి పోదాము
సీతకథ నంతటిని చెవులార (గోలాలి. "
( బాలాభిరామం. )

బాలగేయాలను మొదట (వాయడానికి పూనుకొన్న వాళ్ళు పద్యరచనల్లో నిష్ణాతులైన కవులు కావడంవల్ల ఈ ఖండగతి అ(పయత్నంగా వాళ్లకు అలవడిందని చెప్పవచ్చు. ఖండగతిలో గేయాలను (వాసినవాళ్లు పాదసంఖ్యలో, మా(తానియ మాల్లో స్వాతం(త్ర్యాన్ని పాటించినట్లు తెలుస్తుంది

ఖండగతిలో నడచిన ఈ (కింది గేయాల్లో ద్విపద లక్షణాలను గు ర్తించవచ్చు. పాదంలో వరుసగా మూడిం(ద గణాలు, ఒక సూర్యగణం ఉండడం ద్విపదలక్షణం అయితే ద్విపద గణాల్లోని ఇం(దగణాలు పంచమా(తకములయినప్పుడే అది సాధ్య మవుతుంది సరిసంఖ్య అనియత పాదలక్షణం కూడా ద్విపదకు అన్వయిస్తుంది.

1. " చెప్పమ్మ ఏమాను పీడునా కనిశ
చెప్పావు తమ్ముడా తాడనుచు నీవు
దరిచేరి కూర్చోనీ తమ్ముడా అనగ
చిరుపాద ములతోడ తన్నాడు నన్ను. "
( పిల్లన(గోవి. )

2 " మాతోట లోకోటి మొక్కలున్నాయి.
కోటికో ట్లను మించి పూవులున్నాయి
పూవుల న్నిటమంచి తావులున్నాయి
తావిలో కమునించు గాలులున్నాయి. "
( చిట్టిముత్యాలు )

4. రూపక తాళగతిలో నడిచే బాలగేయాలు.

ఆరు మాత్రల గణాల నడకతో కూడిన బాలగేయాలు కూడ ఉన్నాయి గిడుగు సీతాపతిగారు ఆరుమాత్రల గణాలనడకను రూపకతాళగతిగా పేర్కొన్నారు 1 రూపకతాళగతిలో నడిచిన క్రింది బాలగేయంలో ఆరుమాత్రల గణాలు నాలుగు కన్పిస్తాయి.

" సాటిలేని ప్రేమతో నిను వక్షానికి హత్తుకొనుచు
బొజ్జనిండ పాలుగుడిపి సాకినవా రెవ్వరోయి
వచ్చిరాని మాటలతో వగలమారి వేషాలతో
వింతవింత ప్రశ్నలతో వింతగవిసి గించిన సరి. "
( పాపల్లారా ! పాటలు – పాటకథలు. )

క్రింది గేయంలో ఆరుమాత్రల గణాలు రెండున్నాయి.

" మేమంతా బాలకులం
మాదంతా ఓకేకులం "

( సిరిచుక్కమొగ్గ )

5. మిశ్రగతిలో నడిచే బాలగేయాలు.

" నాల్గు దిక్కుల చిట్ట చివరకు
నడచి చూస్తే ఏమిటుందును

చూచి రావాలన్న కోరిక
లేచె నామది నొక్కరోజున! "

(రంగు రంగుల రత్నదీపాలు.)

ముత్యాల సరం లక్షణాలతో ఉన్న ఈగేయంలో ప్రతిపాదంలోను ఏడుమాత్ర లున్న గణాలు రెండేసి ఉన్నాయి హరిణగతి రగడలో పాదానికి ఏడుమాత్రల గణాలు నాల్గుంటాయి. ఈగేయంలో హరిణగతి అర్ధరగడ లక్షణం ద్యోతకమవు తుంది ఈఏడు మాత్రలనేవి 3 + 4 లేదా 4 + 3 గా ఉండవచ్చు.

పై పరిశీలనను బట్టి ఆధునిక బాలగేయాలు కాల మాత్రా సంఖ్యను బట్టి చూస్తే వాలవరకు త్య్రస్రగతి (మూడు మాత్రల ఆవృత్తి) చతురస్రగతి (నాల్గు మాత్రల ఆవృత్తి) ఖండగతి (ఐదు మాత్రల ఆవృత్తి) లో నడచు నట్టివె. మిశ్రగతి (ఏడు మాత్రల ఆవృత్తి), సంకీర్ణగతి (తొమ్మిది మాత్రల ఆవృత్తి) లో నడిచే బాలగేయాలు చాలా తక్కువగా కన్పిస్తాయని చెప్పవచ్చు

## 5. 3. అలంకారాలు.

ఛందస్సు నడకను ఆశ్రయిస్తే అలంకారం భావాన్ని ఆశ్రయిస్తుంది. అన్య భాషా ఛందోరీతులతో పోల్చిచూస్తే తెలుగు ఛందస్సులో విలక్షణంగా ఉన్నది. యతి ప్రాసల నియమం ఈ యతిప్రాసలు తెలుగు కవితకు ఒక విశేషాలంకారం. తెలుగు ఛందస్సులో సహజంగా ఇమిడిఉన్న సంగీతాన్ని ఇవి సువ్యక్తం చేస్తాయి. 'అలంకరించేది అలంకారం' అనే అర్థం కాకుండా ఉద్దిష్ట విషయానికి వివరణ నిచ్చేదిగా అలంకారం ప్రసిద్ధమైంది. శిల్ప దృష్ట్యా శబ్దాలంకారాల్లో బాలగేయ రచయి లకు అను ప్రాసలపై ఎక్కువ మోజున్నట్లు తెలుస్తుంది కొంతమంది అంత్య ప్రాసలతో బాలబాలికలను ఉక్కిరి బిక్కిరి చేయగ మరికొందరు యతి, ఆద్యంతా ప్రాసల ననుసరించి బాలగేయాలను వ్రాస్తూ దశ ప్రాధాన్యం గల ఛందస్సుగా భ్రమింప చేశారు ఉదాహరణకు :

" తత్తిం బిత్తిం - తగడా బిత్తిం
ఏకో జిల్లా - ఎలగా పండు
మామిడి ముట్టె - మల్లె రాకు
కీర కాయి - బీర కాయి. "

(స్వీయ సేకరణ)

పై గేయంలో మొదటి మూడు పాదాల్లో యతి నాల్గవ పాదంలో ప్రాసయతి పాటించబడింది

" మా చిన్ని పాపాయి మంచి పాపాయి
అల్లరులు చేయక ఆడు కొంటుంది
మొండి పట్టూపట్టి మూల కూర్చోదు
ప్రొద్దున్న బడిలోకి పోక మానాడు. "

(బాల. ఫిబ్రవరి 1947.)

ఈగేయంలో ఆదియతి పాటించబడింది ఇది తాళలయానుగుణంగా శబ్ద రూపం చెడకుండా పాటగా పాడడానికి వీలు కల్గిస్తున్నది

సామాన్యంగా నియత మాత్రలుండే పాదాలలో మధ్య విరిగేచోట పూర్వభాగం నుండి ఉత్తర భాగానికి మారేచోట ఈయతి పాడడంలో అధిక ప్రయోజనాన్ని కలిగి ఉంటుంది పద విచ్ఛేదం పొందడం సంగీతం దృష్ట్యా పాడడానికి వీలైన పద్ధతి తాళ లయానుగుణంగా శబ్దం పూర్తికావడం జరిగినచో శబ్దరూపం చెడకుండా పాట సాగుతుంది

పాద మధ్యంలో యతిని పాటించినప్పుడు పాద ప్రథమాక్షరమేదో దానినే ఉపయోగించడం అత్యంత ప్రాచీనమైన సంప్రదాయం. బాల జానపదగేయాల్లో అధికంగా ఈపద్ధతి కన్పిస్తుంది. ఉదాహరణకు :

1. " పొడుస్తూ బాలుడు - పొన్న పువ్వూ చాయ
2. " గోల కొండ పంపించి - గోటు రవికలు తెప్పించి
కుమ్మరాళ్ళింటికి పంపించి - కుమ్మరి మట్టి తెప్పించి."
( 1, 2. నవ్వులు - పువ్వులు. )

బాలగేయాల్లో యతి నియమమున్న కొన్ని గేయ పాదాలలో పాదాదిలోని అక్షరానికి సమానమైన (మైత్రి ఉన్న) మరొక అక్షరాన్ని ఉపయోగించడం కన్పిస్తుంది ఉదాహరణకు :

" దబ్బున వచ్చెను - దసరా పండుగ
బాల లందరు - భక్తితో కూడ! "
(బాల సెప్టెంబరు 1946 )

తెలుగు బాలగేయాల్లో ఏయే గణాద్యక్షరాలకు యతి కుదురుతుందో పరిశీలించవచ్చు.

1. 1, 4 గణాల ఆద్యక్షరాలకు యతిమైత్రి. ఉదాహరణకు :
" గోడమీద బొమ్మ గొలుసూల బొమ్మ
వచ్చి పొయ్యేవారికి వడ్డించే బొమ్మ. "
( పి. రాజగోపాలనాయుడు పిల్లలపాటలు )

2. 1, 3 గణాద్యక్షరాలకు యతిమైత్రి ఉదాహరణకు :
" సంజ దీవికి - చక్కని జే జే
గుడి దీపానికి - గుప్పెడు జే జే. " ( సేలయేరు )

3. పాదంలోని అన్ని గణాల ఆద్యక్షరాలకు యతిమైత్రి ఉదాహరణకు :
వానా వానా వల్లప్పా
చేతులు చాచూ చల్లప్పా
తిరుగూ తిరుగూ తిమ్మప్పా ' (స్వీయ సేకరణ)

4. పాదంలోని మొదటి రెండు గణాల ఆద్యక్షరాలకు యతి కూర్పు. ఉదాహరణకు:

"కాకీ కాకీ కడుదూరం
నీకూ నాకూ పెనువైరం"

ఈ గేయంలో మొదటి పాదం లోని రెండు గణాల ఆద్యక్షరాలకు యతి రెండవ పాదంలో మొదటి రెండు గణాల ద్వితీయాక్షరాలకు ప్రాసయతి కూర్చబడింది

5. 1, 2, 3. గణాలకు యతి మైత్రి. ఉదాహరణకు :

"మా పాప మామల్లు మత్స్యావతారం
వరసైన బావల్లు వరహావతారం
బంగైన బంధువు బలభద్రావతారం
నట్టింట నాయత్త నరసింహావతారం"

(సెలయేరు)

బాల గేయాల్లో కనిపించే పై ఐదు లక్షణాలు తమిళ లాక్షణికులు ఛందో గ్రంథాలలో పేర్కొన్న 'మెంనై' విభాగాలకు చెందినవని చెప్పవచ్చు.

బాల గేయాల్లో ప్రాస యతి కూడ పాటించబడింది. ఉదాహరణకు :

"చిట పట చిట పట మెటికలు విరుచుచు
చిటికలు వేయుము బొటిమన వేలా."

(నవ్వులు – పువ్వులు)

ఇష్టప్రకారం ఒక హల్లును పునరావృత్తం చేస్తూ రచిస్తే అనుప్రాస అవుతుంది. అలాంటి అనుప్రాసతో కూడిన బాలగేయాలు చాలా ఉన్నాయి కాని బాల గేయాలు పొడి పొడి మాటలతో పొట్టి పొట్టి పాదాలతో ఉంటాయి. కాబట్టి దీర్ఘ వాక్యంలోలాగ వృత్త్యనుప్రాస ఉండటం కుదరదు అనుప్రాసకు ఉదాహరణ :

1. "బడిలో అడుగిడి అలజడి చేయక."

(బడిగంట)

2. " చదువు రాని మొద్దు
వద్దు మనకు వద్దు
కదల లేని ఎద్దు
వద్దు రైతు కొద్దు. " (పమతారావు. బాలగేయాలు.)

అన్ని పాదాల్లోను అంతంలో ఒకే అక్షరాన్ని కూర్చడం అంత్యప్రాస లక్షణం. అది పాదాల్లోని తుదిగణాల లేక అక్షరాల మైత్రికి సంబంధించినది-ఉదాహరణకు :

1. " పిల్లికి ఎలుక
పాపకి పలక
పంతులకి పిలక
మాతికి గిలక " (బాల సెప్టెంబరు 1946.

2. " చీకటాయ పెూక్క
చివరకు ఒక్క
బెల్లం ముక్క
పెడతా పక్క. " (తాయం)

బాలగేయాల్లో ఆద్యంత ప్రాసలు రెండూ ఉన్న గేయాలు కూడ కొన్ని కన్పిస్తాయి. ఉదాహరణకు :

" గుట్టపై నొక చెట్టు
చెట్టుపై నొక పిట్ట
పిట్ట గూడును కట్టు
కట్టి గ్రుడ్లను పెట్టు " బాలబడి పాటలు,

ప్రతిపాదంలోను రెండు మూడు అక్షరాలు ప్రాసగా పాటిస్తే అది ద్విప్రాస. ఈ క్రింది గేయం ద్విప్రాసకు చక్కని ఉదాహరణ.

" వెన్నెల రాయని రాజ్యంలో
వన్నెల చుక్కలు చూద్దామా
కన్నెల తళుకులు కందామా
వన్నెల కుప్పలు వేద్దామా "

(బడి గంట)

ప్రతి పాదంలోను రెండు మూడు నాలుగక్షరాలు ప్రాసగా ఉంటే అది త్రిప్రాస అవుతుంది ఉదాహరణకు :

" చెట్టులన్ని కాయలిచ్చు
గుట్టలన్ని రాళ్ళనిచ్చు "

(పాలబడి పాటలు)

పై గేయంలో త్రిప్రాసతోబాటు అంత్యప్రాస కూడా పాటించబడింది

తెలుగు బాలగేయాల్లో శబ్దాలంకార తుల్యమైన రచనల్లో ధ్వన్యనుకరణ పదాల ప్రయోగం గమనార్హమైంది తెలుగు భాషా నిర్మాణంలో భావపుష్టికి అనువైనవి ధ్వన్యనుకరణ పదాలు అవి స్థూలంగా రెండు రకాలు 1 ఆమ్రేడిత రూపాలు. ఉదాహరణకు : గణ గణ, కల కల, సల సల, బుడ బుడ మొదలైనవి. 2 'మను' తో వచ్చే ఏక పదాలు ఉదాహరణకు : బుర్రుమను, తుర్రుమను, బుస్సుమను, కస్సుమను మొదలైనవి. ఆధునిక బాలగేయ రచయితలు తెలుగులోని ఈ భాషా లక్షణాల్ని తమ రచనల్లో చక్కగా ఉపయోగించుకొని ఉన్నారు. ఉదాహరణకు :

1. " చక చక ఎగిరే గాలిపటం
రెప రెప లాడే గాలిపటం. " (సిరిచుక్క మొగ్గ)

2. " తళ తళ మెఱుపులు మెఱయంగా
ఫెళ ఫెళ ఉఱుములు ఉఱుమంగా
గల గల ఆకులు కదలంగా
జల జల చినుకులు కురియంగా
వడ వడ వడగలు రాలంగా
ధడ ధడ పిడుగులు జారంగా. "

(బాల ఆగస్టు)

3. " జర్రు మంటు జారిపోవు బురదనేల కాలు
బుర్రు మంటు పరుగుతీయు రోడ్డుమీద కారు
చుర్రు మంటు కాలుతుంది చేతికంట నిప్పు
కిర్రు మంటు వాగుతుంది తాత కాలి చెప్పు. "

(సమతారావు. బాలగేయాలు)

4. " తుర్రు మన్నది - పిట్ట
బుర్రు మన్నది - కారు
చర్రు మన్నది - దెబ్బ
చుర్రు మన్నది - నిప్పు
కర్రు మన్నది - కుక్క
కిర్రు మన్నది - చెప్పు. " (పాలబడి పాటలు)

ఒక్కటు ప్రాచీనులు చెప్పిన అలంకార భేదాలు శబ్దార్థాల నాశ్రయించినవి నూటికిపైగా ఉన్నా ఆధునిక బాలగేయాల్లో ఎక్కువగా శబ్దాలంకారాలు మాత్రమే కన్పిస్తాయి. వాటిలోను వృత్త్యను ప్రాస అధికం. శిల్ప ప్రియులైన ఆధునిక బాల గేయ రచయితలు కొందరు అర్థాలంకారాల్లో ఉపమ, రూపకం, స్వభావోక్తి, దృష్టాం తాలంకారాలను మాత్రం స్వల్పంగా ప్రయోగించారు. ఉపమకు ఉదాహరణ

" గాలి లోన పిట్ట వోలె
తేలి పోవ సాగెను!
నీటి లోన చేప వలెనె
నిలిచి యీద నేర్చెను ! "

( స్వతంత్ర భారతి )

రూపకానికి ఉదాహరణ :

" చుక్కల దృక్కులతో నిను
చూచెద ఆకసము నుండి
కోరెదను చంద్ర కిరణమునై
హృదయాబ్జముపై వ్రాలెద. "

( నెలవంక. )

స్వభావోక్తికి ఉదాహరణ :

" వీడేనమ్మా కృష్ణమ్మా
వీడే వీడే కృష్ణమ్మా
కాళ్ళకు గజ్జెలు చూడండి
మెల్లో గంటలు చూడండి
మెళ్ళో హారము చూడండి
తల్లో పింఛము చూడండి
వీడేనమ్మా కృష్ణమ్మా
వీడే అల్లరి కృష్ణమ్మ
... ... ... "

(లక్ష్మీపిడతలు)

దృష్టాంతాలంకారానికి ఉదాహరణ

" సత్యం నిత్యం పలుకుట మేలు
అబద్ధాలు అసలాడ కూడదు
హరిశ్చంద్రుడు అసత్యమాడక
శాశ్వత కీర్తిని పొందాడు. "

( సిరి చుక్క మొగ్గ )

ఈ ప్రకరణంలో బాల గేయాలకు సంబంధించిన భావ పదజాల స్వరూపం ఛందో లక్షణాలు, అలంకారాది విశేషాలు సకృత్తుగా చర్చించడం జరిగింది నిజానికి ఈ అంశాలు ప్రత్యేక సిద్ధాంత వ్యాసాలకు స్వీకరించదగినవి గ్రంథ విస్తర భీతి వల్ల స్థూల పరిశీలనకే పరిమితం చేసుకోవలసి వచ్చింది. బాల సాహిత్య సంబంధమైన కథలు, నాటికలు, నవలికలు మొదలైనవి కూడా విపుల పరిశోధనార్హమైన విషయాలు

---

# అనుబంధం

## బాల సాహిత్య వికాసానికి తోడ్పడిన రచయితలు - వారి రచనలు

ఎంతోమంది సాహితీవేత్తల కృషి ఫలితంగా ఆధునికయుగంలో బాల సాహిత్యం ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది. ప్రౌఢసాహిత్య తత్వానికి భిన్నమైన బాలసాహిత్యరచనలు చేయడమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకున్న రచయితలు ఈ యుగంలో కొందరున్నారు. అటువంటి వాళ్ళ రచనలకు సంబంధించిన వివరాలు కొన్ని రెండవ ప్రకరణంలో (బాల సాహిత్య వికాసచరిత్ర. పుటలు 37-52) ఇవ్వబడ్డాయి. వాళ్ళేగాక ఎందరో రచయితలు పలు ప్రక్రియల్లో వైవిధ్య భరితమైన రచనలెన్నో అందించి ఉన్నారు. వాటికి సంబంధించిన వివరాలు కొన్ని ఈ క్రింద ఇవ్వబడ్డాయి.

## 1. గేయాలు

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ వివరాలు |
|---|---|---|
| మిక్కిలినేని భగవంతరావు | విద్యార్థుల వీరగేయాలు | 1947. |
| శ్రీనివాస కాశ్యప | తెలుగు పాపాయి | 1954. |
| లవణం | పూవ పిందెలు | 1954. |
| ఎల్లోరా | పాపాయి పాటలు | 1955. |
| ,, | పండుగల పాటలు | 1959. |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| అన్నాపంతుల చిరంజీవశాస్త్రి | బాలగేయములు–కథలు | 1955 |
| "రవి" | బాలగేయాలు | 1955 |
| బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి | చిరుగంటలు | 1955. |
| పి రాజగోపాల నాయుడు | వెన్నెలవెలుగులు | 1961 |
| బి. యస్ శాస్త్రి | పాపాయిపతకం | 1963 |
| దాశరథి | బాలలగేయాలు | 1966 |
| చింతా హనుమంతరావు | బాలగేయాలు | 1966.(ఇవి Pictorial stories గా ఇంగ్లీషులోకి Sachitra-kahania గా హిందీ లోకి అనువదించ-బడ్డాయి) |
| ,, | చిత్రకథా గేయమాల | 1974 |
| చల్లా రాధాకృష్ణశర్మ | వానకురిసింది | 1967 |
| ,, | చందమామ | 1971 |
| కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు | చందమామపాటలు–పాటకథలు | 1969 |
| చలవాది హనుమంతరావు | బాలగీతి | 1969 |
| తాడి వెంకట కృష్ణారావు | సిరిచుక్క–మొగ్గ | 1973 |
| మలయశ్రీ | రంగులపిట్టలు | 1974 |
| కొత్త వెంకట గోవిందరావు | బాలగీతాలు | — |
| బలరామాచార్య | బాలల బొమ్మల బాలగేయాలు | — |
| గంగరాజు సుశీలాదేవి | చిట్టిముత్యాలు | — |
| జి రాఘవమ్మ | గేయకథావళి | — |
| కసుపర్తి వరలక్ష్మమ్మ | బాలసాహిత్యమంజరి | అముద్రితం |
| న్యాయపతి రాఘవరావు | బాలగేయమాల | ,, |
| కోగిర జైసీతారాం | మేం పిల్లలం | ,, |
| ,, | అక్కా–చెల్లెళ్ళం–అన్నాతమ్ముళ్ళం | ,, |

ఆధునిక బాలసాహిత్యంలో గేయాలేగాక గేయకథలు కూడా వెలువడ్డాయి. గురజాడ అప్పారావుగారి పూర్ణమ్మకథ మొట్ట మొదటి బాలగేయకథ అని చెప్పవచ్చు. వారి తర్వాత గిడుగు సీతాపతి, నార్ల చిరంజీవి, శ్రీనివాసకాశ్యప, బి వి. నరసింహారావు, వేజంత సాంబశివరావు, ఏటుకూరి వెంకటనరసయ్య, కవిరావు, రవి, ఉమాపంతులు, ఎల్లోరా, అడ్డుమిల్లి, కె సభా, వల్లభనేని కాశీవిశ్వనాధం, సత్తిరాజు కృష్ణారావు, నండూరి రామమోహనరావు, న్యాపతి? రావుల వెంకటసుబ్బారావు, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, సమతారావు, పైలం కన్నయ్యనాయుడు చింతాహనుమంతరావు, శ్రీ శ్రీ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మధురాంతకం రాజారాం, సోమంచి సూర్యనారాయణశర్మ, పురాణపండ కామేశ్వరరావు మొదలైన వాళ్లు పిల్లలకు నీతిని, యుక్తిని, హాస్యాన్ని వినోదాన్ని మేళవిస్తూ మేధాశక్తిని పెంపొందింపజేసే కథాగేయాల్ని వ్రాశారు. ప్రాచీన తెలుగు కావ్యాల్లోని కథలను ఆధారంగా చేసుకొని గేయకథల్ని వ్రాసిన వాళ్లలో ముఖ్యులు ఉత్పలసత్యనారాయణ (చూడు పుట : 40) కిప్పల ఆంజనేయశర్మ (పుట 42) గార్లు.

## 2. కథలు.

తెలుగు బాలసాహిత్యంలో గేయకథలకన్నా వచనకథలే ఎక్కువ. సాధారణంగా పిల్లలకు ఉద్దేశించిన వచనరూపకథల్లో నీతిబోధ ప్రధానం. వాటిలో రచయిత పరిశీలనాదృష్టి, బాలల మనస్తత్వ పరిజ్ఞానం, కథాకథనంలోని నేర్పు వ్యక్తమవుతాయి తెలుగులో బాల కథా రచయిత లనేకులు పత్రికలలో ప్రతి యేడు కథలు సహస్రాధికంగా వెలువడుతున్నాయి బాలకథా రచయితల సాహిత్యసేవను పేర్కొనడం లేదా ప్రచురితమైన బాలకథలన్నిటిని సమీక్షించడం మరొక సిద్ధాంత వ్యాసానికి అనువైన విషయమవుతుంది అయినా బాలసాహిత్య స్వరూప అవగాహనకు బాలల కథల్ని స్థూలంగా వర్గీకరించి ఆయా వర్గాల్లో ముఖ్యులైన బాలకథా రచయితల్ని వారి రచనల్ని పేర్కొనడం అనుచితంకాదు.

## నీతి కథలు.

భారతీయ సంస్కృతికి, సాంప్రదాయానికి సంబంధించిన నీతుల్ని, ధర్మాల్ని బాలబాలికలు తెలుసుకొని పాటించవలసిన పద్ధతిని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో బోధించడమే తెలుగులో వెలసిన బాల నీతికథల్లో ప్రధాన విషయం. పెద్దల యెడ భక్తి, దైవపూజాఫలము, ఐకమత్యమె మహాబలము, పేరాశ పనికిరాదు, పోరునష్టము పొందులాభము మొదలైన లౌకిక అలౌకిక సూక్తుల్ని దృష్టిలో పెట్టుకొని అల్లిన కథలు తెలుగులో కొల్లలుగా ఉన్నాయి ఉదాహరణకు కొన్ని.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| వేంకట పార్వతీశ కవులు | నీతి కథావళి (1, 4, 5,వ భాగాలు | 1927, 1940, 1939 |
| కనుపర్తి వరలక్ష్మమ్మ | బాలనీతి. కథావళి | 1930 |
| పూతలపట్టు శ్రీరాములురెడ్డి | సుజ్ఞాన బోధిని (మూడు భాగాలు) | 1931 |
| యస్. భూషణం | దురాశగల కోమటి | 1937 |
| మధునాపంతుల సత్యనారాయణ | నీతికథా జ్యోతి | 1947 |
| వెంకటరత్నము | నీతిబోధిని (మూడుభాగాలు) | 1949 |
| యం. వేంకటరత్నము<br>యం. గురునాధశర్మ | నీతిబోధిని (మూడు భాగాలు) | 1949 |
| బాల కృష్ణమూర్తి | చిట్టి నీతికథలు | 19-9 |
| గిడుగు వెంకటసీతాపతి | రాయల నీతికథలు (మూడుభాగాలు) | 1950-1953 |
| ఏటుకూరి వెంకట నరసయ్య<br>పిశిపాటి కృష్ణమూర్తి | గాథావళి | 1950 |
| కాంచనపల్లి కనకాంబ | చక్కని కథలు (మూడుభాగాలు) | 1952 |
| పుట్టపర్తి నారాయణాచార్యులు | రాయల నీతికథలు (ఆరుభాగాలు) | 1953 |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| ఆర్. బి. సత్యనారాయణ<br>ఆర్. సూర్యనారాయణ మూర్తి | నీతి కథలు (2, 3, 4, తరగతులకు) | 1954, 1955 |
| బలభద్ర పాత్రుని కృష్ణారావు | బాలకథామంజరి | 1954 |
| టి కృష్ణమూర్తి | బాల కథావళి (2 భాగాలు) | 1951 |
| కొడవటిగంటి కుటుంబరావు | కథలు | —— |
| భమిడిపాటి కామేశ్వరరావు | ఈసపు కథలు | 1957 |
| కె శాంత | పిల్లల కథలు | 1959 |
| అనుముల వెంకటశేషకవి | నీతి కథానిధి | —— |
| ,, | పిల్లల నీతికథలు | 1960 |
| అజంతా | నీతి కథలు | 1060 |
| ఎస్ కె వెంకటాచార్య | తోడు దొంగలు | 1930 |
| ,, | ద్రాక్ష తోట | 1930 |
| ,, | ద్రోహ ఫలితము | 1960 |
| ,, | నిజస్వరూపము | 1960 |
| ఓసమళ్ళ కామేశ్వరరావు | విడుస్తున్న పువ్వులు | 1961 |
| ,, | బంగారు బాలలు | 1961 |
| ,, | పాలబుగ్గలు | 1961 |
| ,, | తాతలనాటి కథలు | 1961 |
| ఉదయశంకర్ | ఆశా-దురాశ | 1961 |

పురాణ కథలు.

మన జాతి సంస్కృతికి దర్పణాలైన భారత రామాయణ భాగవతాది గ్రంథాల్లోని ఉపాఖ్యానాలు, ఇతర ప్రబంధాది కావ్యాల్లోని విషయాలు సుబోధకమైన వచనంలో సంగ్రహ కథారూపంలో వెలువడ్డాయి కానీ (పిల్లల) ఇతర కథలతో పోల్చిచూస్తే అవి సుదీర్ఘమైనవె. ఉదాహరణకు కొన్ని.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| వావిలికొలను సుబ్బారావు (1863–1939) | భారత రామాయణాలు (వచనంలో) | — |
| కలగర అన్నపూర్ణాదేవి | సీతా రాముడు (బాలరామాయణము) | 1920 |
| నాళం అప్పల నరసింహం | సీతాదేవి | 19[illegible] |
| మునిమాణిక్యం నరసింహారావు | బాలకుశలవచరిత్ర | 1953 |
| ,, | బాలధ్రువచరిత్ర | ,, |
| బలభద్రపాత్రుని కృష్ణారావు | ప్రహ్లాద విజయము | 1954 |
| నతిపెల్లి విశ్వనాథశాస్త్రి | పంచకన్యలు | 1955 |
| పొగంటి బాపిసీడు | పిల్లలబొమ్మల భారతము | 1956 |
| వంటు కృష్ణమూర్తి | [illegible]తము | ,, |
| అమతకల అన్నపూర్ణాదేవి | పిల్లల భారత గీతములు | ,, |
| ,, | అనసూయాదేవి | 1957 |
| ,, | దమయంతి (సచిత్ర పురాణగాథలు) | 1957 |
| ,, | సతీ సావిత్రి | ,, |
| ,, | శకుంతల | 1959 |
| లింగా నాగభూషణంగుప్త | బాలల బొమ్మల జైమిని భారతము | 195[illegible] |
| ,, | బాలలబొమ్మల ఉత్తర రామాయణము | 1959 |
| ,, | బాలలబొమ్మల హితోపదేశకథలు (4 భాగాలు) | 1959, 1960 |
| ఉప్పల కోటయ్యచౌదరి | ధర్మాంజలి | 1959 |
| సి. విశ్వనాథము | శంకర్స్ బొమ్మల హితోపదేశకథలు (4 భా | 1959 |
| దాశరథి, సి. నారాయణరెడ్డి | పిల్లల బొమ్మల భారతం | — |
| | పిల్లల బొమ్మల భాగవతం | — |
| | పిల్లల బొమ్మల రామాయణం | — |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ వివరాలు |
|---|---|---|
| చప్పగంతుల వేమ కరరావు | భారత వీరులు | 1950 |
| ఉభయశ్రీ | ప్రవరుడు | 1959 |
| ఉదయశంకర్ | మన కథలు | 19[illegible]0 |
| ప్రసాద సుబ్రహ్మణ్యశాస్త్రి | బాల రామాయణం | — |
| వల్లమూడి గోపాలకృష్ణ | కిరీటి | — |
| ,, | సుదర్శనుడు | — |

అద్భుత కథలు.

బాల బాలికల్ని ఎక్కువగా ఆకర్షించేవి అద్భుత కథలు. వీటిలో అవాస్తవికత మాంత్రికశక్తి ప్రసరణ భయానక అద్భుత సంఘటనలు ప్రధానం. తెలుగులో వచ్చిన అద్భుత కథల్లో అనువాదాలు, అనుకరణలు ఎక్కువ. ఇంచుమించు అద్భుత కథలన్నీ జానపద కథలకు అనుకరణలే. అద్భుత కథల్ని వ్రాసిన వాళ్లలో వంగూరి సుబ్బారావుగారు ప్రథములనవచ్చు

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| వెంగూరి సుబ్బారావు | అరేబియన్ నైట్సు కథలు | 1915 |
| సందసవనం శ్రీకృష్ణమూర్తి | పాతాళలోకంలో | 1949 |
| చింతా దీక్షితులు | బంగారు పిలక | — |
| ,, | లీలా సుందరి | 1949 |
| వి. దుర్గాప్రసాదరావు | అల్లీ బిల్లీ లోకంలో అమ్మాయి కథ | 1951 |
| జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి | అరేబియన్ నైట్సు కథలు (ఆరు భాగాలు) | 1952 |
| రఘునాథ్ | మహేంద్ర మణి | 1953 |

ఇవేగాక న్యాయపతి రాఘవరావుగారు పొట్టి బావ - చిట్టిమరదలు, కొంటె కిష్టయ్య పాత్రల ద్వారా (బాల పత్రికలో) అందించిన హాస్యం మరపురానిది అలాగే ముళ్లపూడి వెంకటరమణగారు 'బుడుగు' అనే పాత్రను సృష్టించి బాపుబొమ్మలతో ఆ పేరుతోనే (2 భాగాలు) ప్రకటించిన పుస్తకం బాలల హాస్య కథల్లో అపూర్వమైంది.

## చారిత్రక కథలు.

గత చరిత్రలో జరిగిన కొన్ని ముఖ్య సన్నివేశాలను, వీరుల సాహసాలను ఆధారంగా చేసుకొని కొంతమంది కథలల్లారు. వాస్తవిక విషయాలకు కొన్ని కల్పనలను జోడించి మలచబడిన కథలివి. వాటిలో కల్పన ఉన్నా ప్రధానంగా చరిత్ర ప్రసిద్ధమైన సంఘటనల ద్వారా అల్లబడిన కథలు కనుక వాటిని చారిత్రక కథలనే పిలవవచ్చు మొత్తం మీద ఈ కథల్లో మిగిలిన కథల్లోలాగ కల్పనలకు ప్రాధాన్య ముండదు మూడవ దశలోని బాలలకివి ఆకర్షణీయాలు

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| మహావాది వెంకటరత్నము | పన్నాటి కథలు | 1933 |
| వేపాల పిచ్చయ్యశాస్త్రి<br>పి. సుబ్రహ్మణ్యాచార్యులు | దేశభక్తి | 1950 |
| వారణాసి గంగాధరశాస్త్రి | స్వయంప్రతిష్ఠ | 1951 |
| పుట్టపర్తి నారాయణాచార్యులు | పాదవిజయము | 1952 |
| ,, | విజయాంధ్రులు | 1955 |
| న్యాయపతి రాఘవరావు | బాల కథలు | 1952 |
| బి. రాధాకృష్ణమూర్తి | కథావళి | 1954 |
| బిరుదురాజు రామరాజు | దేశింగురాజు | 1954 |
| ,, | బలుమూరు కొండ | — |
| ,, | సర్వాయి పాపడు | — |
| ,, | బొబ్బిలి రాజు | — |
| ,, | సదాశివరెడ్డి | — |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| బుజ్జాయి | రసపుత్రవీరుడు రంజిత | 1955 |
| దువ్వూరి శేషగిరిరావు | పిల్లల చారిత్రక వీరగాథలు | 1955 |
| శ్రీనివాస సోదరులు | తెలుగు వెలుగు | 1956 |
| యామిజాల పద్మనాభస్వామి | శ్రీకృష్ణదేవరాయులు | 1956 |
| తల్లావజ్ఝల కృత్తివాసతీర్థులు | నాయకురాలు | 1957 |
| స్వయంపాకుల ఆదిశేషయ్య | మణిమంజరి | 1958 |
| కౌట సోదర కవులు | విశ్వనాధనాయకుడు | 1960 |
| రత్నాకరం అనంతాచార్యులు | కళింగదేశ కథలు (2భాగాలు) | 1960 |

మతసంబంధమైన కథలు.

మత ప్రవక్తల జీవిత చరిత్రలు సంగ్రహంగా సుబోధకమైన శైలిలో కొన్ని వెలువడ్డాయి. వాటిలో బౌద్ధమత పరమైనవే ఎక్కువ.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| క్రిష్టియన్ లిటరేచర్ సొసైటి | ఆనంద సీమ | 1939 |
| ,, | బాల కథలు | 1947 |
| బాలాంత్రపు సత్యనారాయణరావు | సిద్ధార్థుడు | 1942 |
| కాంచనపల్లి కనకాంబ | గౌతమబుద్ధ చరిత్రము | 1949 |
| జి. రంగారావు | కారుణ్యమూర్తి బుద్ధదేవునికథలు | 1956 |
| సుమేధ విమలాక్షి | మహాయాన గౌతమబుద్ధ | 1958 |
| అడ్సుమిల్లి పూర్ణ | పిల్లల జాతక కథలు | ,, |
| కంభంపాటి రామగోపాల కృష్ణమూర్తి | ఆత్మబలి | 1959 |
| వేమల కామేశ్వరరావు | బొమ్మల గౌతమబుద్ధుడు | 1959 |
| బిళ్ళ అప్పారావు | మహాత్ముడు గౌతముడు | 1960 |
| జంధ్యాల పాపయ్యశాస్త్రి | అహింసా జ్యోతి | ,, |

## ఇతర కథలు.

బాలసాహిత్యంలో విశేష ప్రచారాన్ని పొందిన కథలు కొన్ని ఉన్నాయి. అవి పిల్లల్ని అలరించే చక్కని శైలిలో, వాళ్ళ చిన్ని బుర్రలకు ఆనందాన్ని అందించే అంశాలతో వెలువడ్డ కథలివి ఉదాహరణకు కొన్ని

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| శ్రీపాద సుబ్రహ్మణ్యం | చిన్న కథలు (8 సంపుటలు) | 1941 |
| దిగవల్లి వెంకటశివరావు | కథలు–గాథలు (4 భాగాలు) | 1944,45,46,47 |
| ఇల్లిందల సరస్వతీదేవి | పండుగ బహుమానము | 1949 |
| వావిలికొలను సుబ్బారావు | ఆర్యకథానిధి | 1950 |
| ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి | హనుమచ్ఛాస్త్రి కథలు | —— |
| ,, | విజయదశమి | 1951 |
| ముద్దులూరు రామకృష్ణ | ముద్దు బిడ్డలు | 1954 |
| ,, | నాన్న కోసం | ,, |
| వి. యన్. శర్మ | చదువుకున్న పిల్ల | 1955 |
| ,, | బాలానంద కథలు | 1957 |
| చింతా దీక్షితులు | ఎన్నో చేస్తాను | 1955 |
| ,, | లీలా సుందరి | —— |
| ,, | శంపాలత | 1955 |
| ,, | సూరి–సీతి–వెంకి | ,, |
| మునిమాణిక్యం నరసింహారావు | గాలి పిల్లలు | 1956 |
| విద్వాన్ విశ్వం | చందమామ చెప్పిన కథలు | ,, |
| ,, | సత్తు సిపాయి | ,, |
| విద్వాన్. విశ్వం<br>కె సభా | బాలానంద కథలు | 1957 |
| పాలంకి వెంకట్రామచంద్రమూర్తి | పండుగ బట్టలు | 1956 |
| ,, | దొంగలున్నారు జాగ్రత్త | ,, |
| వి. యన్. శర్మ | ఆరు హంసల కథలు | 1957 |
| విద్వాన్ విశ్వం | కుందేలు పిల్ల | 1956 |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| అలపర్తి వెంకటసుబ్బారావు | గాలిపటం | 1956 |
| ,, | చిట్టి కథలు | ,, |
| ,, | అడుక్కునే అబ్బాయి | 1957 |
| ,, | ఇందిర అలుకమానింది | ,, |
| ,, | బహుమతి | — |
| ఆరుద్ర | నే చెప్పానుగా | 1958 |
| ఇల్లిందల సరస్వతీదేవి | మూడుపిల్లి కూనలు | ,, |
| అడవి బాపిరాజు | అంజలి | ,, |
| ,, | తరంగిణి | ,, |
| చిన్నము హనుమయ్య చౌదరి | పిల్లల కథలు (2 భాగాలు) | 1959 |
| ,, | బంగారు తీగలు | ,, |
| సత్తిరాజు రాజ్యలక్ష్మి | బంగారు కథలు (8 భాగాలు) | ,, |
| వావిలాల సోమయాజులు | కదంబము | 1960 |
| కె యస్ శర్మ | బాలకథా రత్నమాల 8. భా. | 1961 |
| నార్ల చిరంజీవి | కర్రా చెప్పులు | — |
| ,, | నీతి కథానిధి | — |
| ,, | మామ కథలు | — |
| వేమూళ్ల కామేశ్వరరావు | పాల బుగ్గలు | 1961 |
| ,, | బంగారు బాలలు | ,, |
| ,, | విడుస్తూన్న పువ్వులు | ,, |
| కొడవటిగంటి కుటుంబరావు | కథలు | — |
| నండూరి విఠల్‌బాబు | అదృష్ట వంతుడు | — |
| ,, | చిత్రమైన శిల్పము | — |
| ,, | భలే సంగీతం | — |
| ,, | మూడు కథలగాథ | — |

# 3. నవలలు.

ఆధునిక యుగంలో అధికసంఖ్యను ఆక్రమించిన సాహిత్య ప్రక్రియ నవల తెలుగులో తొలిసారిగా కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి (18౹3 – 1౹40) 'నవల' అనే పదాన్ని వాడారు. ఈ యుగంలో బాలలకోసం ప్రత్యేకించి ఎన్నోరకాలైన నవలలు చిన్నవి పెద్దవి వెలువడుతున్నాయి పిల్లల నవలల గురించి కె సభాగారు ఇలా అన్నారు "పెద్దలు చదివె నవలల్లో ఎన్నోసమస్యలు చిత్రించవచ్చు, అది సులభం, ఎందుకంటే ఆ నవలకు కథావస్తువు పుష్కలంగా లభిస్తుంది అమ్మాయి అబ్బాయితో ఆది మధ్యాంతాలను అమితోల్లాసంగా చిత్రించుకోవచ్చు. పిల్లల నవల రచనావిధానమే వెరు. ఇక్కడ బాధ్యతలు కూడా ఎక్కువ దృష్టివెరు, దృక్పథం వెరు అందుచేత ఇక్కడ కథావస్తువులు కూడా వెరైపోతాయి" (బాలల మహాసభల ప్రత్యేక సంచిక 1977 పుట 258) అందుకే పిల్లల నవలల్లో ఎక్కువగా పిల్లలే ప్రధాన పాత్రలుగా కన్పిస్తారు వారి మనస్తత్వాలకు అనుగుణంగానే వారి చిత్త ప్రవృత్తులు చిత్రించబడతాయి ఇతివృత్త వైవిధ్యాన్నిబట్టి అలాంటి నవలల్ని చారిత్రక సాంఘికాది వర్గాలుగా విభజించవచ్చు

-సాంఘిక నవలలు.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ వివరాలు |
|---|---|---|
| ఉన్మాది | ఉన్మాదిని | 1949 |
| బద్దెపూడి రాధకృష్ణమూర్తి | వసంతము | 1954 |
| కె సభా | చంద్రం | 1954 |
| ,, | సూర్యం | — |
| ,, | కవీ–గాయకుడు | — |
| ,, | బడిపంతులు | — |
| ,, | పావురాలు | |
| కొమ్మూరి వేణుగోపాలరావు | పిల్లదొంగ | |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| రావి కొండలరావు | దాసు | 1955 |
| చింతా దీక్షితులు | గోపీమోహిని | 1955 |
| ముద్దంశెట్టి హనుమంతరావు | వాసుచదువు | 1955 |
| కనకమేడల వెంకటేశ్వరరావు | అన్నదమ్ములు | 1955 |
| వల్లభనేని | గుణసుందరి | 1956 |
| నార్ల చిరంజీవి | మందారబాల | 1956 |
| ,, | పెసూ—పెసరచేను | 1958 |
| ,, | [illegible]గాయకుడు | 1955 |
| మట్టెగుంట రాధాకృష్ణ | బడిపిల్లలు | 1953 |
| ,, | విమాన వీరుడు | 1958 |
| హేలంకి వెంకట్రామచంద్రమూర్తి | చిలుకప్ప | 1957 |
| ఎల్లోరా | చంద్రవదన చాకచక్యం | 1957 |
| ఎస్ కె వెంకటాచార్యులు | వేటగాడు | 1958 |
| బలివాడ కాంతారావు | బూచీ | 1959 |
| వి యస్. గిరి | స్నేహితులు | 1959 |
| విశ్వనాథ సత్యనారాయణ | పరీక్ష | 1959 |
| వావిలాల సోమయాజులు | నాలంద | 1959 |
| "రవి" | సాహస గోపి | — |
| ,, | స్థిరంలేని జీవితం | — |
| మెక్కాలి సుందరరావు | మంచి స్నేహితులు | 1961 |
| ఉదయశంకర్ | లోర్నాడూన్ | 1961 |
| ఉమామహేశ్వర్ | రాధిక | 1961 |
| అంతటి నరసింహం | కోటవీరన్న సాహసం | 1961 |
| ,, | మంత్రాలరామన్న మొండితనం | 1961 |
| ,, | ఉదయగిరి పోలన్న ధైర్యం | 1961 |
| ,, | కవిగారి బాల్యం | 1937 |
| మల్లాది అవధాని | పారిపోయిన పిల్లవాడు | 1962 |
| అరవింద (వి యస్ మణి) | ప్రేమమంత్రం | 1973 |

## తెలుగు బాలగేయ సాహిత్యం

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| చొక్కాపు వెంకటరమణ | అల్లరి సూర్యం | 1975 |
| పాలంకి వెంకటరామచంద్రమూర్తి | బంగారు తల్లి | 1975 |
| ధనం | అమ్మకావాలి | 1975 |
| యుగంధర్ | టింకూ సాహసాలు | 1979 |

## చారిత్రక నవలలు :

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| వారణాసి గంగాధరశాస్త్రి | స్వయం ప్రతిష్ఠ | 1951 |
| పిలకా గణపతిశాస్త్రి | అశోకవర్ధనుడు | 1952 |
| కోడూరు కుటుంబరావు | చిత్రలేఖ | 1952 |
| ధూళిపాళ్ళ వెంకటసుబ్రహ్మణ్యము | కళింగసేన | 1952 |
| ప్రతాప రామకోటయ్య | వీరస్వర్గము | 1953 |
| జిరెడ్డి చెన్నారెడ్డి | దక్షిణతార | 1954 |
| జిరెడ్డి బాలచెన్నారెడ్డి | కలము-ఖడ్గము (కృష్ణదేవరాయచరిత్ర) | 1954 |
| దేవరకొండ చిన్నికృష్ణశర్మ | వాసంతిక | 1953 |
| నాదెళ్ళ కృష్ణమూర్తి | నేతాజి పాల్కర్ | — |
| చేతపూడి వెంకట శివరావు | అమరసింహుడు | 1956 |
| యస్. వి. యస్. సోమయాజులు | మక్కాంబ | — |
| తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి | నాయకురాలు | 1957 |
| వెదుల కామేశ్వరరావు | రుద్రమదేవి | 1960 |
| బట్టిశార్వరి (వాసిలి రామకృష్ణశర్మ) | నాగార్జున | ,, |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| దంటిపల్లి వెంకటసుబ్బశాస్త్రి | వీరకంకణము | 1960 |
| కాణిపాకం లింగన్న | శాంతిచక్రం | 1970 |
| పాలంకి వెంకట రామచంద్ర మూర్తి | బంగారుతల్లి | 1975 |
| కొండూరి నరసింహరాణి | స్వాతంత్ర్య జ్యోతి | — |

అద్భుత నవలలు :

దేవతలు, రాక్షసులు, మాంత్రికులు మొదలైన పాత్రలతో విచిత్ర విషయాలతో కూడుకున్న నవలలివి. ఈనాడు బాల ప్రచురణలు పేరుతో వందలాదిగా అద్భుత నవలలు వెలువడుతున్నాయి.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| గుండిమెడ వెంకటసుబ్బారావు | హంసద్వీపం | 1951 |
| శ్రీవాత్సవ | జగ్గారు జాదిలి | — |
| నోరి నరసింహశాస్త్రి | కర్పూరద్వీపయాత్ర | 1954 |
| చక్రపాణి | విచిత్రకవలలు | 1955 |
| వి వి రాధారమణగుప్త | బాలమాంత్రికుడు | ,, |
| రాపూరి భరద్వాజ | రతనాలలోయ | 1956 |
| ,, | పరకాయ ప్రవేశం | ,, |
| ,, | మాయలోకం | 1957 |
| ,, | బంగారు లేడి | ,, |
| ,, | సముద్ర వీరుడు | ,, |
| మట్టెగుంట రాధాకృష్ణ | విమాన వీరుడు | 1959 |
| దిగవల్లి శేషగిరిరావు | విచిత్ర లోకము | 1961 |
| వారణాసి సత్యనారాయణమూర్తి | అల్లరిగోపి అద్భుతయాత్ర | ,, |
| కె. రాజేశ్వరరావు | చిట్టిరాజు—గూని గుజ్జం | 1975 |

పశు పక్ష్యాది పాత్రలు గల నవలలు :

నవలా లక్షణాలతో పక్షులకు, జంతువులకు, మానవ జీవన విధాన్ని అపాదించి వ్రాసినవి.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| వారన్ | మిడిమేలపు మేకపిల్ల | 1941 |
| వి. యన్ శర్మ | కుందేలు పిల్ల | 1960 |
| పాలంకి వెంకటరామ చంద్రమూర్తి | చిరుకప్ప | — |
| పాకూరి ప్రసన్నం | సుఖిభవ | 1931 |
| యమ్. షిరోజను | ఉడుయ ఉడుతా హలాత్ | — |

అనువాద నవలలు.

ఇంగ్లీషు, బెంగాలీ ఇతర దక్షిణ దేశ భాషలనుండి పిల్లల నవలల్ని కొంత మంది తెలుగులోకి అనువదించి వున్నారు పిల్లల నవలల్లో అనువాదాలే ఎక్కువని చెప్పవచ్చు.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది | మూలం |
|---|---|---|---|
| వి. దుర్గాప్రసాదరావు | అల్లీ బిల్లీలోకంలో-అమ్మాయి కథ | 1951 | లూ ఎూ కెరల్ Alice in wonder land |
| — | రామూభవిష్యత్తు | — | షెర్లీలీసీ అరోరా What the Raman |
| బద్దెపూడి రాధాకృష్ణ | చిట్టితల్లి | 1955 | చార్లెస్ డికెన్స్ నవల |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది | మూలం |
|---|---|---|---|
| ఎస్. కె. వెంకటాచార్యులు | అంకుల్ టామ్స్ కేబిన్ | 1955 | హెచ్. బి. స్టోవ్ వ్రాసినది |
| ,, | కష్టజీవులు | 1953 | విక్టర్ హ్యూగో (ఫ్రెంచి) |
| ,, | ఆమె | 1957 | గోర్కీ స్మిత్ |
| ,, | ఆశా సౌధములు | 1957 | చార్లెస్ డికెన్స్ |
| ,, | ఆలివరు ట్విస్టు | 1957 | ,, |
| కె. రమేశ్ | ఇందిర | 1957 | బంకించంద్ర (బెంగాలీ) |
| బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు | ఎర్రగుర్రపుపిల్ల | 1957 | జాన్ స్టెయిన్ బెక్ The red pony |
| పొదిశెట్టి నాగేశ్వరరావు | టాంబ్రౌన్ | 1958 | తామస్ హ్యూగో Tom brown school days |
| నాయని సుబ్బారావు | నిధిద్వీపము | — | రాబర్ట్ లూయీ స్టీవెన్సన్ Treasure Island |
| ఎస్. కె. వెంకటాచార్యులు | బంగారు దీవి | 1959 | ,, |
| అద్దేపల్లి వివేకానందదేవి | రాజా—అడవిఎనుము | 1959 | R. K. Narayan Raja and the Bison |
| ,, | భయాన్ని పార ద్రోలే భక్తి విశ్వాసాలు | 1967 | వెయొ లెట్ సెర్వోస్సెక్ Faith that drives out fear |
| బూచిన కామరాజు | జింకపిల్ల | 1968 | మార్జోరీ కిన్నన్ రాలింగ్స్ The yearling |
| మహేశ్ | మనిషికెంతభూమి కావాలి? | — | టాల్‌స్టాయ్ How much land a man requires |
| — | టామ్ సాయర్ | ఆంధ్ర పత్రిక సీరియల్ | మార్క్ ట్వేన్ టామ్ సాయర్ |

# 4. నాటికలు

మూడు దశాబ్దాలుగా తెలుగులో బాలల కోసం నాటికలు సృష్టించబడు తున్నాయి. కేవలం చదివి ఆనందించే పఠనీయ నాటికలేగాక శ్రవణ యోగ్యాలైన రేడియో నాటికలు, దృశ్య ప్రధానాలైన రంగస్థల నాటికలు, టెలివిజన్ నాటికలు వెలువడ్డాయి.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేదీ |
|---|---|---|
| భమిడిపాటి కామేశ్వరరావు | ఇప్పుడు | 1927 |
| ,, | మధ్యముడు | — |
| జంధ్యాల పాపయ్యశాస్త్రి | కరుణామయి | 1959 |
| ,, | బంగారు పద్మం | — |
| ఆచార్య ఆత్రేయ | ప్రగతి | 1949 |
| ,, | కాపలావాని దీపం | 1949 |
| ,, | ఎవరు దొంగ | 1951 |
| తెన్నేటి సూరి | గొర్రె కాడ | — |
| నార్ల చిరంజీవి | పిల్లల నాటికలు | 1954 |
| ఇల్లిందల సరస్వతీదేవి | బాల వీరులు | 1954 |
| కృష్ణకవి | వెన్నముద్దలు (2 భాగాలు) | — |
| కె సభా | పరీక్షా ఫలితాలు | 1957 |
| ,, | ఏటిగట్టున | 1957 |
| శ్రీవాత్సవ | రాజుగారి రామచిలుక | 1957 |
| అన్నపర్తి సీతారామాంజనేయులు | నారద సంచారం | 1968 |
| ,, | చేతవెన్నముద్ద | 1969 |
| ,, | గంగిరెద్దు | 1972 |
| ,, | ప్రోగ్రెస్ కార్డు | 1973 |
| ,, | కర్తవ్యం | — |
| ,, | పృథ్వీరాజు | — |

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేదీ |
|---|---|---|
| అన్నపర్తిసీతారామాంజనేయులు | అంతా ఒక్కటే | — |
| ,, | సంస్కృత బోధిని | — |
| పిళ్ళా సుబ్బారావు | గోపీ కోపం | — |
| ,, | ధర్మశీల | — |
| నండూరి సుబ్బారావు | పన్నా | — |
| పిడిద కామేశ్వరరావు | పౌరాణిక నాటికలు | — |
| ,, | హాస్య నాటికలు | — |
| మద్దిపట్ల వెంకట్రావు | పసుడు దొంగకాడు | 1967 |
| గొమంచి రామం | నాయనమ్మ నల్లమందు | 1967 |
| కనుపర్తి వరలక్ష్మమ్మ | పిల్లల నాటికలు | 1970 |
| యామర్తి గోపాలరావు | బడి తనిఖీ | 1970 |
| ఓ యన్ శాస్త్రి | రెండు నాటికలు | 1970 |
| ఉన్నవ సేతుమాధవరావు | సున్నారాయుళ్ళ సంఘం | 1973 |
| భీమరెడ్డి మధుసూధనరెడ్డి | నాలుగు నాటికలు | — |
| బి పూర్ణచంద్రరావు | పాలిష్ భయ్యా | 1973 |
| సంక్రాంతిపాటి వెంకటరమణ | నేటి విద్యార్థి | — |
| కోడూరి లీలావతి | బాలచంద్రిక | — |
| జె బాపురెడ్డి | సాగరసౌధం | — |

పిల్లలకు ప్రదర్శన యోగ్యమైన నాటికలు వ్రాసినవాళ్ళలో ప్రముఖులు న్యాయపతి రాఘవరావుగారు 1939 లో ప్రారంభించిన రేడియో కార్యక్రమాల నిర్వహణకోసం వారెన్నో నాటికలు వ్రాశారు 1945 న స్థాపించిన బాలపత్రికలో ఎన్నో నాటికల్ని ప్రచురిస్తూ వచ్చారు. రేడియో కార్యక్రమాలలో వాటిని పిల్లల చేత ప్రసారం చేయించడమే గాక బాలానందసంఘం పిల్లల ద్వారా రంగస్థలంపై ప్రదర్శింప జేశారు. పిల్లలకోసం అలాంటి నాటికలు వ్రాసిన వారెంకా ఎందరో ఉన్నారు.

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| న్యాయపతి రాఘవరావు | బాల హాస్యనాటికలు | --- |
| ,, | బాల పౌరాణిక నాటికలు | 1951 |
| ,, | చిట్టినాటికలు | --- |
| ,, | గమ్మత్తు నాటికలు | 1952 |
| ,, | మూడు పెళ్ళిళ్ళు | 1970 |
| ,, | మడతకర్చీ (ది ఎన్ చాన్ టెడ్ షర్ట్ అనే గేయకథ ఆధారం) | ---- |

(ఈ నాటికలలో బూరెల మూకుడు, జబ్బు కుదిరింది, శ్రావణ భాద్రపదాలు, పిల్లి మెడలో గంట, గ్రాంధిక శాస్త్రి, సింద్రిల్లా, సుహ్వా-సేనా, పొట్టిబావ-చిట్టిమరదలు, మొదలైన రేడియో నాటికలు ప్రఖ్యాతి వహించాయి)

ఇంకా దాశరథి, నారాయణరెడ్డి, బి. వి నరసింహారావు, పైడిపాటి సుబ్బరామ శాస్త్రి, కె లలిత, మధురాంతకం రాజారావు లాంటి వాళ్లెందరో బాలలకోసం నాటికలు వ్రాశారు

## 5. వైజ్ఞానిక బాలసాహిత్య రచనలు.

ఈ స్పూత్నిక్ హైడ్రోజను బాంబు యుగంలో పిల్లలు తెలుసుకోవలసిన వైజ్ఞానిక విషయాలెన్నో ఉన్నాయి ఆకాశంలో, భూమి మీదా, సముద్రం అడుగున ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి పిల్లలు చిన్నతనం నుండీ తెలుసుకోదగిన ఆరోగ్య సంబంధమైన అంశాలు కూడా ఎన్నో ఉన్నాయి ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్ని కథలుగా, గాథలుగా, పదాలుగా, పాటలుగా వినోదాన్ని మేళవించి వివరించే రచనలెన్నో వెలువడుతున్నాయి నేటూరి శివరామశాస్త్రిగారు అలాంటి కథల్ని వ్రాసి మొదట బాల పత్రికలో ప్రకటించారు అవి 1969లో బాలవిజ్ఞాన కథలు పేరుతో పుస్తకంగా వెలువడింది అలాంటి

| రచయిత పేరు | పుస్తకం పేరు | ప్రచురణ తేది |
|---|---|---|
| వసంతరావు వెంకటరావు | విశ్వరహస్యము | 1947 |
| ,, | ఎలక్ట్రాను ఆత్మకథ | 1953 |
| ,, | విజ్ఞాన విశేషాలు (7సంపుటాలు) | 1958 |
| వెమరాజు భానుమూర్తి | సైన్సుకథ (నిఖాయేల్ అనే రష్యన్ గ్రంథకర్త వ్రాసిన కెమికల్ ఎలిమెంట్స్ ఆధారంగా) | 1951 |
| ,, | టెలిఫోను కథ | 1952 |
| ,, | రైలు కథ | 1952 |
| ,, | జీవవికాసము | 1953 |
| ,, | ప్రాణి కోటి | 1957 |
| ,, | అవీ-ఇవీ | 1957 |
| ,, | విశ్వాంతరాళము | 1957 |
| వెమరాజు భానుమూర్తి | భూమి | 1957 |
| ,, | కడలి కథ (సముద్రపువింతలు) | 1957 |
| ,, | మానవుడు(మానవపరిణామం) | 1957 |
| ,, | సుందరప్రకృతి (వృక్షశాస్త్రాన్ని తెలిపేది) | 1957 |
| ,, | వాతావరణం | 1957 |
| ,, | విద్యుచ్ఛక్తి | 1959 |
| ఆకురాతి చలమయ్య | విజ్ఞాన కథలు | 1951 |
| బాలన్నయ్య, బాలక్కయ్య | బాల కథలు | —— |
| రాచమల్లు రామచంద్రారెడ్డి | చంద్రమండలము-శశిరేఖ | 1958 |
| కోట సోదరకవులు | సత్యం | 1960 |
| ,, | శివం | 1960 |
| ,, | సుందరం | 1960 |